చందా సం॥ కు రూ. ౩.　　　　విడిసంచిక అ. ౮.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౯. Vol - 9 | రౌద్రిసంవత్సరము. చైత్ర వైశాఖ మాసములు. | సంచిక ౧.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి: ౧౯౨౦.

# విషయసూచిక.

శ్రీరస్తు.

రౌద్రినామసంవత్సరము - చైత్రవైశాఖములు.

# ఆంధ్రసాహిత్యపరిషన్నవమవార్షికసభావృత్తాంతము.

శ్రీ రౌద్రినామసంవత్సర చైత్రశుద్ధ పూర్ణిమాస్థిరవాసరము మొదలుగ మూఁడుదినములు (ఆ 1920 ఏప్రిల్ 3, 4, 5 తేదులందు) బెజవాడలో రామమోహనధర్మపుస్తకభాండాగారమునందుఁ బరిషన్నవమవార్షికసభ సమావేశమై మహావైభవమున జరగినది. ఆసభకు తెనాలి సంస్కృతకళాశాలాధ్యక్షులు వ్యాకరణాచార్య బ్రహ్మశ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగా రగ్రాసనాధిష్ఠాతలుగా నుండిరి. ఆంధ్రదేశమునం దన్నిమండలములనుండియు నాంధ్రేతరమండలములు కొన్నిటినుండియుఁగూడ సభ్యు లనేకులు విచ్చేసిరి. వారిలోఁ గొందఱినామము లీక్రిందఁ గననగును.

1. బ్రహ్మశ్రీ వ్యాకరణాచార్య నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, సభాధ్యక్షులు, తెనాలి.
2. కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు ఎమ్.ఏ., చెన్నపురి.
3. జయంతి రామయ్యపంతులుగారు బి.ఏ., బి.ఎల్., ముక్తీశ్వరము.
4. మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము.
5. రావుసాహేబు, వఝలసూరి కృష్ణశాస్త్రిగారు బి.ఏ., చెన్నపురి.
6. సి. ఆర్. కృష్ణమాచారిగారు బి.ఏ., చెన్నపురి.
7. త్రిపురాణ వేంకటసూర్యప్రసాదరావుగారు, సిద్ధాంతము, గంజాము.
8. మానవల్లి రామకృష్ణకవిగారు ఎం.ఏ., చెన్నపురి.
9. బుఱ్ఱా శేషగిరిరావుగారు ఎం.ఏ., విజయనగరము.
10. రాజకార్యప్రసక్త బి. రామకృష్ణారావుగారు బి.ఏ., మైసూరు.
11. టి. ఏ. మురుగేశంపిళ్లెగారు, మధుర.
12. చింతలపల్లి నరసింహశాస్త్రిగారు, బల్లారి.
13. ఆ. రంగస్వామిసరస్వతిఅయ్యంగారు బి.ఏ., చెన్నపురి.
14. ఎల్లాపంతుల జగన్నాథముగారు బి.ఏ., పర్లాకిమిడి.
15. తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు, పిఠాపురము.

16. నాగపూఁడి కుప్పుస్వామయ్యగారు బి.ఏ., తిరుపతి.
17. గునుపాటి యానాదిరెడ్డిగారు, నెల్లూరు.
18. ఒంకుమళ్ల అచ్యుతరావుగారు బి.ఏ., నెల్లూరు.
19. పాటిబండ వేంకటరమణయ్యపంతులుగారు, బెజవాడ.
20. దినవహి హనుమంతరావుగారు, ,,
21. పెద్దిభట్ల వీరయ్యపంతులుగారు బి.ఏ., బి.ఎల్., ,,
22. దాసు విష్ణురావుగారు బి.ఏ., బి.ఎల్., ,,
23. వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం.ఏ., ,,
24. నందిరాజు చలపతిరావుగారు, ఏలూరు.
25. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఎం.ఏ., చీరాల.

బెజవాడపురవాసులశేషమును గృష్ణామండలమువారనేకులును దయచేసిరి. సభకై వచ్చినవారి కెల్లరకును గుబేరపుష్పకముంబోలు, అరండల్‌సత్త్రమునందు బసలును భోజనములు నేర్పఱుపఁబడినవి. గతసంవత్సరములందుకంటె నీవత్సరమున సభ మూఁడునాళ్లుజరుగుట యొకవిశేషము.

ప్రథమదినమున (ది ౩-వ యేప్రిల్ శనివారము ఉదయమున) బ్ర॥ చిలకలపూఁడి వేంకటశాస్త్రిగారు సంస్కృతశ్లోకములతో రాగయుక్తముగ దైవప్రార్థనము జరపినపిదప, నాహ్వానసంఘాధ్యక్షు లగు బ్రహ్మశ్రీ పాటిబండ వేంకటరమణయ్యపంతులుగారు మధురోపన్యాసముతో సభ్యులకు స్వాగత మొసంగిరి. జంధ్యాల శివన్నశాస్త్రిగారును మైనంపాటి హనుమంతరావుగారును స్వాగతపద్యములం జదివిరి.

బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులుగా రగ్రాసనాధిపత్యము వహింపనుపపాదింపఁగా, బ్ర॥ అయ్యదేవర కాళేశ్వరరావుగారు బలపఱిచినయనంతరము సమ్మాననసంఘాధ్యక్షులచేఁ బుష్పమాలాలంకృతులై సుబ్రహ్మణ్యశాస్త్రిలవారధ్యక్షపదవి కంగీకరించి హృదయంగమముగ నుచితోపోద్ఘాతముతోఁ బ్రారంభోపన్యాసముం గావించిరి. ఆయుదయమున స్వాగతోపన్యాసమును, అధ్యక్షోపన్యాసము నైనవెనుక నవకాశముండుటచే బేతపూఁడి భగవంతరావుగారు సంగీతవిషయకోపన్యాసముం గావించిరి. ఒంకుమళ్ల అచ్యుతరావుగారు "కళాపూర్ణోదయము - దాని యంతరార్థకథలు" నను వ్యాసముం జదివిరి.

మధ్యాహ్నము ౩ గంటలకు మరల సభ ప్రారంభ మయ్యెను. సమ్మాన

సంఘకార్యదర్శులలో నొక రగు పెద్దిభట్ల వీరయ్యపంతులుగారు "కార్యాంతరములచే సభకు రాఁజాలమైతి" మని పలువురు వ్రాసిన యుత్తరములను దంత్రీవార్తలను జదివిరి. తరువాత కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు ఎం.ఏ., గారు "ద్రావిడభాషలలోని యుత్తమపురుషవాచక సర్వనామ" మనువ్యాసమును జదివిరి. రాజకార్యప్రసక్త బెంగుళూరి రామకృష్ణరావు బి.ఏ.,గారు "కర్ణాటకరాజ్యములోని యాంధ్రుల" గుఱించి యుపన్యసించిరి. వేమూరి శివస్వామిశాస్త్రిగా రాధునికాంధ్రభాషాభివృద్ధినిగూర్చియు వఝల చినసీతారామస్వామిశాస్త్రిగా రాంధ్రచ్ఛందస్సునుగుఱించియు మల్లాది విశ్వనాథశర్మగారు భరతాచార్యప్రతిపాదితనాట్యపద్ధతింగూర్చియు నుపన్యాసోపేతముగ వ్యాసములం జదివిరి.

రెండవనాఁటి (ది 4 యేప్రిల్ 1920 ఆదివారము) యుదయమున బ్రహ్మశ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు మహాభారతములోని రహస్యచరిత మనువిషయ ముపన్యసించిరి. బ్ర॥ బుఱ్ఱా శేషగిరిరావు ఎం.ఏ.,గారు, బెజవాడ కనకదుర్గాంకితములైనపద్యములతో సంగ్రహరూపమునఁ బాఠభేదవిమర్శనముం గావించిరి. తెనాలి సంస్కృతపాఠశాలాసాహిత్యోపాధ్యాయులు నుదిగొండ నాగలింగశాస్త్రిగారు పద్యరూపమున నాంధ్రభాషాప్రశంస గావించిరి. బళ్లారి, మునిసిపల్ హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులు చింతలపల్లి నరసింహశాస్త్రిగారు "ప్రకృత మార్యులు గలరా" యనువిషయముం దెలుపువ్యాసముం జదివిరి. మధ్యాహ్నము బ్ర॥ కడియాల వేంకటశాస్త్రిగారిపురాణకాలక్షేప మైనతర్వాత శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ప్రాకృతభాషోత్పత్తినిగుఱించియు, జంధ్యాల వేంకటప్పయ్యశర్మగా రాంధ్రసారస్వతముంగూర్చియు, మైనంపాటి హనుమంతరావుగారు రుద్రకవింగూర్చియుఁ బ్రశంసించిరి.

మూఁడవనాఁడు (ది 5 యేప్రిల్ 1920 సోమవారము) ప్రొద్దున అరండల్ సత్రమునందుఁ బరిషత్కార్యనిర్వాహకసభ జరగినది. అందు, రౌద్రిసంవత్సరమునఁ బరిషత్తున కాయవ్యయములు మదింపుచేయఁబడినవి. తంజావూరు శర్ఫోజీమహారాజ సరస్వతీపుస్తకభాండాగారమువారు పంపిన ప్రార్థనపత్రము ననుసరించి యాగ్రంథభాండాగారమున నున్న యాంధ్రగ్రంథభాగమునం గల పుస్తకముల వివరణపట్టిక నచ్చువేయించుటకు వారికిఁ బరిషద్ధనమునుండి 116 రూపాయ లిచ్చుటకును జందాలమూలకముగా నాంధ్రభాషాభిమానులగు మహాశయులవలన మఱికొంతధనము సేకరించి యామొత్తమును బంపుటకును

దీర్మానింపఁబడియెను. శ్రీశ్రీతుని రాణీగారు పరిషత్తునకుఁ బ్రథమోద్ధారకురాలుగా నుందుమని వ్రాయించినశుభలేఖ తత్కాలమునం దెలియవచ్చినందున నది పరిషత్తున కొకశుభసూచకమని సభ్యు లభినందించిరి. పరిషత్కార్యనిర్వాహకసభాధికారులనియమనము జరగినది. గతవత్సరములందున్న ముగ్గురు కార్యదర్శులలో నొక్కరగు డాక్టరు ఆచంట లక్ష్మీపతి బి.ఏ., ఎం.బి.సి.ఎం. గారిస్థానమున బ్ర॥ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగా రెన్నుకొనఁబడిరి. రౌద్రిసంవత్సరమునకుఁ బరిషదధ్యక్షులుగా మ॥ కట్టమంచి రామలింగారెడ్డిగారి నెన్నుకొనిరి.

మధ్యాహ్నము సభవారిచే నీక్రిందితీర్మానములు రెండును గావింపఁబడినవి :—

౧. ఆంగ్లేయవిద్యాశాలలయందుఁ బనిచేయు పండితులజీతములు మిక్కిలి తక్కువగా నున్నవనియు వారిజీతములు రు 50 లు మొదలు రు 150 లు వఱకు వృద్ధి కావలెననియు నీసభవారు తీర్మానించుచున్నారు.

౨. ఆంధ్రులు తమలోఁ దాము మాటలాడునపుడును, ఆంధ్రదేశమం దుపన్యసించునపుడును, ఆంధ్రులసమావేశములయందును, ఉత్తరప్రత్యుత్తరములయందును, మాతృభాషనె యుపయోగింపవలయు ననియు గ్రంథములు వార్తాపత్త్రికలు మొదలగువానియందుఁ దెనుఁగంకెలను వేయవలయు ననియు గ్రంథముల ముఖపత్త్రములమీఁద మాతృభాషతోడనే పేరులు వ్రాయుచుండవలయు ననియు సభవారు ఆంధ్రమహాశయులను బ్రార్థించుచున్నారు.

అనంతరము బ్ర॥ తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు వసుచరిత్రవిషయము కొంత ముచ్చటించిరి. మానవల్లి రామకృష్ణకవి ఎం.ఏ.,గారు పుస్తకముద్రాపకులు స్వల్పప్రతులనుమాత్రమే శోధించి గ్రంథముల ముద్రించుచుండుటవలన వానియందుఁ దప్పు లధికముగాఁ బడుచున్నవనియుఁ గొన్నిగ్రంథములందుఁ దాళపత్త్రగ్రంథస్థపద్యములు కొన్ని కనఁబడుట లేదనియు నిట్టిలోపములు బహుగ్రంథశోధనము లేమిచే సంభవించినవి కావున గ్రంథప్రకాశకులు బహుగ్రంథములంజూచి ప్రకటింపవలయు ననియు నాకారణమున మహనీయు లెల్లరుఁ దమకడ నున్న తాళపత్త్రగ్రంథములను సర్వజనోపయోగ్యము లగుగ్రంథాలయముల కొసంగినయెడ భాషకత్యంతోపకార మొనరించినవా రగుదురనియు నుపన్యసించిరి.

ఈమూఁడుదినములలో నవకాశము ననుసరించి నడుమనడుమఁ గొందఱు చిన్న చిన్న భాషావిషయకప్రసంగములం గావించిరి. కొందఱు పద్యములం జదివిరి.

అగ్రాసనాధిపతులు మూఁడుదినములలోఁ జదువఁబడిన వ్యాసములను విమర్శించి వానిపైఁ దమయభిప్రాయమును బ్రకటించిరి. పిదప బెజవాడపౌరుల పక్షమున బ్ర॥ దాసు విష్ణురావుపంతులుగారు సభ్యులనెల్ల నభినందించిరి. సభ్యుల పక్షమున బ్ర॥ జయంతి రామయ్యపంతులుగా రాహ్వానసంఘమువారిని స్వేచ్ఛాసేవకులను బెజవాడపౌరులను గొనియాడిరి.

పరిషద్దశమవార్షికసభ బ్ర॥ నందిరాజు చలపతిరావుపంతులుగారిచే నేలూరున కాహ్వానింపఁబడినది. ఈసభకు వచ్చినకొందఱుపండితులకుఁ బ్రయాణవ్యయము లీయఁబడినవి. ఈసభయందుఁ జదువఁబడినవ్యాసములును జేయఁబడిన యుపన్యాసములసారమును బరిషత్పత్రికయందుఁ గ్రమక్రమముగ వెలువడును.

# అధ్యక్షోపన్యాసము.

(బెజవాడ పరిషత్సభలోఁ జదువఁబడినది.)

ఆంధ్రభాషాభిమానులగుమహాశయులారా!!!

"శ్లో॥ స్వభాషాచ స్వమాతాచ స్వర్గాదప్యతిరిచ్యతే॥" అనున్యాయమునుబట్టి యాంధ్రభాష మనకు స్వర్గముకంటెను గొప్పదనియు గౌరవింపఁదగినదనియు స్పష్ట మగుచున్నది. లోకమున నందఱకును ముఖ్యముగ సంపాదింపఁదగినది విద్య యనియు దానివలన జీవనము మొదలుకొని పరమపురుషార్థ మగు మోక్షమువఱకును నుండుసౌఖ్యములు లభించు ననియు, నది లేనిమనుజులు పుచ్ఛవిషాణశూన్యము లగుపశువులే యనియుఁ జెప్పఁబడిన ప్రాచీనగ్రంథకర్తల సుభాషితముల మీ రందఱు నెఱింగియేయున్నారు. కావున దానివృద్ధియే మనవృద్ధికిఁ గారణము. దానిని బాగుగ నభ్యసించినవారే సభలలో వాక్ప్రచారముఁ జేయుటకు నర్హులు. సంస్కృతభాషనుమాత్రము కొంచె మభ్యసించినను మాతృభాషాసేవఁ జేయనివారు తల్లి లేనిపిల్లలవంటివా రని నాయూహ. కావున నే నీసభకు నగ్రాసనాధిపత్యము నంగీకరించుట దిగ్గజములచే వహింపఁబడఁదగిన భారము నేమియు నెఱుఁగనిశిశువు మోయుచునని యొప్పుకొనినవిధమున హాస్యాస్పదముగ నుండు నను విషయమును నేను బాగుగ నెఱింగియే యున్నాఁడను. అయినను గొప్పవార లగునాంధ్రమహాశయు లనేకులు నన్నుసైత మాంధ్రసాహిత్యపరిషత్తులో మాటలాడించి యాంధ్రుఁ డనుసంపూర్ణగౌరవమును నాకొసంగవలయు నని సంకల్పించుటచే నేనును వారియుత్సాహమును బూరించుటయే కాక యాంధ్రమాతయొక్క ముఖ్యపుత్రులలో నొకఁడను గావచ్చు నను నుబలాటముతో నీపదవికి నంగీకరించితిని. ఇంతియే కాని యీభాషయందుఁ బాండిత్యము గలదనుతలంపునఁ గాదు. కావున సరళహృదయులును, లౌకికవైదికవ్యవహారధురీణులును, నగునీసభ్యులు నాయారంభోపన్యాసమునందలి లోపములనుపేక్షించి గుణములనుమాత్రము గ్రహించి నన్ను మన్నింతురుగాక.

### భాషలకు సహజముగ నుండునవస్థావిశేషములు.

"సర్వఏవభావాః ప్రతిక్షణపరిణామిన ఋతేచితిశక్తేః" (ఆత్మతత్త్వప్రపం

చమున నుండు భావపదార్థము లన్నియుఁ బ్రతిక్షణమున మాఱుచు నేయుండును.) అని తత్త్వవేత్తలు సిద్ధాంతముఁ జేసియున్నారు. భాషయు భావపదార్థములలో నొకటియే కాన నిదియు మాఱుచునే యుండును. మఱియుఁ బ్రతివస్తువునకును బాల్యయౌవనకౌమారాద్యవస్థలు కన్పట్టుచున్నవి. చరణవ్యూహ మనుగ్రంథమున ఋగ్యజుస్సామాథర్వణవేదములకుఁ గ్రమముగ 18, 101, 1000, 9 శాఖలున్నట్లును, ఆశాఖలన్నియుఁ గొంతకాలము ప్రచారములో నున్నట్లును రాను రాను గొంతకాలమునకు స్వల్పసంఖ్యాకము లగుశాఖలు మాత్రమే ప్రచారములో నున్నట్లును జెప్పఁబడియున్నది. ఇప్పుడు మనయనుభవములో నవియు నామమాత్రావశిష్టము లై యెక్కడనో మహాత్ములహృదయగుహలలో దాఁగినట్లు కన్పట్టుచున్నవి. "రాజా కాలస్య కారణమ్" (రాజు కాలమునకుఁ గారణము) అని విక్రమోర్వశీనాటకమునఁ గాళిదాసు వచించినట్లు మనవిద్యల కీయవస్థ సంభవించుటకు దొరతనమే ముఖ్యకారణము. ఇట్లే యాంధ్రభాషయు నతిప్రాచీనమైనను గొంతకాలము బాల్యావస్థలో నుండెననియుఁ దర్వాత రాజరాజనరేంద్రునికాలమున నన్నయభట్టారక, తిక్కయజ్వాదులును, తర్వాత శ్రీనాథుఁడును, తెనాలి రామకృష్ణపండితాదులును, విద్యలభోజుఁ డని ప్రఖ్యాతిఁ గాంచిన శ్రీకృష్ణదేవరాయలకాలమునఁ బెద్దనాదులును నామహాశయు లగుదొరలయాదరణమున వృద్ధినొందించి రనియు దేశచరిత్రములవలనఁ దెలియుచున్నది. అట్టి యాంధ్రభాష యిప్పటికి విద్వత్పురుషులయందచే మాత్రము జీవింపవలసినస్థితికి వచ్చినది. ఏలన విదేశీయు లగురాజుల కీభాషయం దుండువిశేషములు చెవులఁ దూఱలేక యున్నవి. రాజులచే నాదరింపఁబడకపోవుటచే జనసామాన్యమునకు సైత మనాదరము కలుగనారంభించెను. కాని యన్నిపదార్థములవలెఁ గాలము సైతము మాఱుచున్నందున నీకాలమున నాంధ్రదేశములోని జమీందారుల కీయాంధ్రభాషయందు మరల గౌరవము ప్రబలుచుండుటవలనను నీయాంధ్రసాహిత్యపరిషదాదులు శక్తికొలఁదిని బనిచేయుచుండుటవలనను మనయాంధ్రభాషకు మఱల మంచిదినములు వచ్చుచున్న వని చెప్పవచ్చును. "సంఘే శక్తిః కలౌయుగే॥" (కలియుగమున సంఘమందు శక్తి యుండును) అనున్యాయము ననుసరించి ధనికులకును, విద్యావంతులకును జనసామాన్యమునకును నీయాంధ్రభాషయం దాదర మధికమగుచున్న దని చెప్పుటకు నీసభయు, నాంధ్రసాహిత్యపరిషత్పత్రికయు మొదలగునవియే నిదర్శనములు.

## భాష యన నేమి ?

"భాష్యత ఇతి భాషా" అను వ్యుత్పత్తిచేఁ బరులకుఁ దమయభిప్రాయమును దెలియఁజేయుటకై ప్రయోగింపఁబడుశబ్దసముదాయ మని భాషాశబ్దమున కర్థము. ఈశబ్దము లవ్యక్తము లనియు వ్యక్తము లనియు రెండువిధములు. అందు, కకారాదివర్ణములు సుస్పష్టముగ నుండనితిర్యగ్జంతువులభాషయందలి శబ్దములు మొదటివి. కేకయరాజు సర్వజంతుభాషాజ్ఞానము గలవాఁ డగుటచేఁ జీమల భాషను దెలిసికొని తనభార్యకుఁ జెప్పెనని రామాయణము నిరూపించుచున్నది. వర్ణములు స్పష్టముగ నుచ్చరింపఁబడి యన్యులకు బోధమును గలుగఁజేయు భాషయందలిశబ్దములు వ్యక్తశబ్దంబులు. వీనినే దేవభాష యనియు నాంధ్రభాష యనియు వ్యవహరింతురు. ఈభాష వాగ్రూపమున నున్నప్పు డాకాలమున వినినవారికి మాత్రము బోధమును గలుగఁజేయును. శబ్దము క్షణద్వయముకంటె నెక్కుడుకాల ముండదు గాన దానివలనఁ గలుగుఫలమును దాత్కాలికముగనే యుండును. లిఖితరూప మగుభాష సర్వకాలములయందును దనప్రయోజనము నిచ్చుచునేయుండును. ఈవ్యక్తభాషయం దున్నవేదము లాదికాలమున నున్న జనులయాచరణములును, వ్యవహారములును, సంఘస్థితియు, నీతియు, మున్నగు విషయములను జక్కఁగ బోధించుచున్నవి. అటులే స్మృతులును, పురాణములును, కల్పసూత్రములును, నీతిశాస్త్రములును, భౌతికశాస్త్రములును, కావ్యనాటకాలంకారాదిశాస్త్రములును మొదలగున వన్నియు నాయావిషయములను, వారివారియుద్దేశములను, నెవరో యొక రెఱుంగక యడుగ నెవరో యొక రుపదేశించినట్లును, నందులకై కొన్నియుదాహరణములం జూపి సందేహములఁ బాపుటచే వారు తత్త్వము నెఱింగి గమ్యస్థానమును జేరినట్లును బోధించుచున్నవి. మనము నాంధ్రభారతాద్యుత్తమగ్రంథములఁ జదివి మనవారివైదికములును స్మార్తములును నగునాచరణములను, పౌరాణికము లగుమతవిశ్వాసములను, రాజకీయము లగునీతులను, నార్థికోపాయములను, జాతులపరస్పరవిశ్వాసములను, వినయవిధేయతాదిసద్గుణములను జక్కఁగ గ్రహించుచునేయున్నారము. కావున వేదములవలెనే మనయాంధ్రమునందలి యుత్తమగ్రంథములును, నిహలోకము శాశ్వతము కాదనియు, శరీరములు క్షణభంగురము లనియుఁ, బ్రాపంచికసుఖము దుఃఖదాయక మనియు, విద్యాధనయౌవనకులీనతాద్యభిమానములు గర్వమును గలిగించి మనుజుని జెడఁగొట్టును గానఁ బైవానిని స్వార్థముకొఱ కుపయోగింపక

పరోపకారార్థమై యుపయోగింపవలె ననియు, బాహ్యసాధనముల చేతను మానసికసాధనముల చేతను నీశ్వరారాధనమే చేయఁదగినవిషయ మనియు, బోధించును గాని జాతులకుఁ బరస్పరము ద్వేషమును గలిగించుట, యుద్ధములు కలహించునట్లు చేసి తాను లాభము నొందవలయు నని ప్రయత్నించుట మొదలగుపరాతిసంధానమును బోధించుట లేదు. అలంకారశాస్త్రము నైతము రస మనెడు బ్రహ్మస్వరూపమును, తదనుభవమార్గమును, జూపుటకై ప్రయత్నించినదియే కాని, తుచ్ఛము లగు గ్రామ్యసుఖములను, దదనుభవాదులను జూపి మనుజుల నామార్గమునఁ బ్రవేశింపఁ బ్రేరేపించుట లేదు.

## ఆంధ్రసాహిత్యపరిషదుపయోగములు.

పైని జెప్పినట్లు ప్రపంచమంతయు మాఱుచున్నపుడు మనుజులజ్ఞానములును, విద్యలును, జీవికాసాధనములును, సేవ్యు లగుప్రభువులును, మాఱుచుండుటచే వీరిభాషయును దదనుగుణముగ మాఱుచునే యుండును. కావునఁ గాలక్రమమున లోపించిన ప్రాచీనవిషయములను మరలఁ బ్రచారములోనికిఁ దెచ్చుటయుఁ, గ్రొత్తవిషయములను దమభాషలోనికిఁ జేర్చుకొనుటయు మొదలగువిధానములు సృష్ట్యారంభమునుండియు నడచుచునే యున్నవి. మనయాంధ్రభాషయు సృష్ట్యంతర్గతమైనదియే. కావున దీనికిని నావిధానమంతయు నత్యావశ్యకమైనదే. సంస్కృతభాష నభ్యసించినపండితులును, రాజకీయభాషానిపుణులును, నితరభాషాకుశలులును, తమతమ విద్యానుభవమును స్వభాషలోనికిఁ బ్రసరింపఁజేసి మందమధ్యమాధికారు లగుమనుజులమనోభావములను వికసింపఁజేయనియెడల వారివిద్య కుక్షింభరిత్వమాత్రమునకే యుపయోగించి తిర్యగ్జంతువులయోగ్యతనే వీరికిని గలుగఁజేసినదగును. మనోవికాసాభివృద్ధికి భాషాభివృద్ధియే ముఖ్యసాధనము. మనయార్షగ్రంథములను బూర్వము పార్సీ మొదలగుభాషలలోనికిని నిప్పుడు రాజకీయభాషలోనికిం బరివర్తింపఁజేయు సమర్థులైనమహాశయులే దీనికిఁ దార్కాణము. శిల్పశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, వృక్షశాస్త్రము, నౌకాప్రచారశాస్త్రము, వైద్యశాస్త్రము, మున్నగుశాస్త్రములు పూర్వము మన లో నున్నను నిప్పటిదేశకాలాదుల కనుగుణముగ నుపయోగించుటకు నితరదేశపువిజ్ఞానమును సంపాదించినవారు వానిని దదనుగుణముగ ప్రచారములోనికిఁ దెచ్చిననే కాని యాశాస్త్రము లెక్కువగ నుపయోగింపఁజాలవు. కావున వానిని నీయాంధ్రభాషలోనికి మార్చినపుడు విషయములు విస్తృతములగునపుడు భాషయు విస్తృతమగు

చునేయుండవలయును. అట్టితటి భాషావ్యాప్తికిఁదదభిమానులగుమహాజనులసమా వేశములును, నాయాసభలయందు నిర్ధారణచేయఁబడు విషయములను జనసామాన్యమునకు బోధించుదినపత్త్రికలును, మాసపత్త్రికలును, మున్నగుముద్రిత గ్రంథములును విపులముగనే యుండవలెను. సాహిత్య మన నేమి? సాహిత్యశబ్దమునకు సమష్టి, కూడిక, యని యర్థము. ప్రకరణము ననుసరించి సాహిత్యశబ్దమునకు నితరార్థములున్నను విద్యావిషయమున నీపదము ప్రయోగింపఁబడు నపుడు 'కావ్యనాటకాలంకారముల యభ్యాసమువలనఁ గలుగుజ్ఞానమే' యర్థము. ఈజ్ఞానమును నితరశాస్త్రములయభ్యాసమువలనఁ గాని పూర్ణము కానేరదు. కావుననే శ్లో॥ సమష్టి స్సర్వశాస్త్రాణాం సాహిత్య మితి కథ్యతే ॥" సమస్తశాస్త్రముల యభ్యాసమువలనఁ గల్గువ్యుత్పత్తియే సాహిత్య మని విశాల మగునొకనిర్వచనము చేయఁబడియున్నది. కావ్యములయందలి శాస్త్రసిద్ధాన్తములను, నభిప్రాయవిశేషములను, నాటకములయందలియభినేయపదార్థములను, నలంకారశాస్త్రమునఁ జర్చింపఁబడినరసభావాదిలక్షణములను, శాస్త్రపరిచయము లేకయే తెలిసికొనుట దుస్సాధము. కావున నాసాహిత్యశబ్దార్థమున సమస్తవాఙ్మయమును నిమిడియున్నదని చెప్పినను నతిశయోక్తి కానేరదు. ఏభాషలోనైన నిట్టిజ్ఞానమును సంపాదించినవారు సాహిత్యము గలవారని చెప్పవచ్చును. కావ్యపంచకముఁ జదివినను నట్టిగ్రంథముల నభ్యసించినను నించుక వ్యుత్పత్తి కల్గును. అట్టివారందఱు నీపరిషత్తునఁ జేరి స్వసామర్థ్యముల జూపుటచేతనే యీపరిషత్పత్రిక ప్రసిద్ధికెక్కెను. ఇందు విచారింపఁ బడుచున్నవిషయములు దూరదర్శిత్వము మున్నగుసద్గుణములుగలవారలచే నుపపాదింపఁబడుటవలన దేశీయులకు మనభాషయందు గౌరవమొకింత కలుగుచున్నది. ప్రకృతము గ్రాంథికభాషావాదులును, వ్యావహారికభాషావాదులును, ప్రబలప్రయత్నములు చేసి వెదకివెదకి పట్టికలమూలమున సుశబ్దాపశబ్దములను బరిశీలించుచున్నారు. గ్రాంథికభాషావాదులకయినను, వ్యావహారికభాషావాదులకైనను భాషాభివృద్ధియే పరమసాధ్యము కావున నిరువురకును నుపాయభేదమే కాని యుపేయభేదము లేదు.

వ్యాకరణము.

లోకమున నొకరియభిప్రాయ మొకరు తెలిసికొనుటకు భాష యావశ్యకము. అందు వాక్యమువలనను వాక్యార్థమువలనను నొకరియభిప్రాయ మొకరికిఁ దెలియునుగాని కేవలపదములవలనఁ గాని పదార్థములవలనఁగాని తెలియదు

సర్వత్ర భవతి యనుక్రియ యధ్యాహార్య మగుటవలన, ఘటము, పటము, ఇత్యాదుల యర్థబోధ యగుచున్నదని వ్యాకరశాస్త్రమున నున్నది. కావున వాక్యమువలనను వాక్యార్థమువలనను బోధగలుగుచున్నదికాని పదపదార్థముల వలనఁ గాదు. ఇది యెట్లన:—"ఆపుస్తకము నిటుతెమ్ము" "ఈపుస్తకముఁ గొనిపొమ్ము" అనువాక్యములయందుఁ బుస్తక మనుపదమును గాని, తెమ్ము, కొనిపొమ్ము, అనుపదములవలనఁగాని ప్రయోగించినను వక్తయొక్క యభిప్రాయము తెలియదు. విశిష్టజ్ఞానమునకు విశేషణజ్ఞానము కారణము గానఁ బదార్థజ్ఞానమే కారణ మని నైయాయికు లన్నను, పదార్థజ్ఞానము వాక్యార్థబోధమునకు సాధనము ; వాక్యార్థమే ముఖ్యమగుసాధ్యము. కావున వాక్యార్థమే ముఖ్య మనిచెప్పుటలో సంశయ మేమియు లేదు. అయినను సులభముగ బోధించుటకై వైయాకరణులు ప్రకృతిప్రత్యయవిభాగమును నాయాయర్థముల విభాగమును గల్పించి వ్యాకరణశాస్త్రగ్రంథముల రచియించిరి. ఇదియే వ్యాకరణశాస్త్రమువలనిప్రయోజనము.

శబ్దసిద్ధి.

వ్యాకరణముచే సంస్కరింపఁదగినశబ్దములు వ్యాకరణముకంటెఁ బూర్వము సిద్ధములా ? లేక నూతనముగ నిష్పాద్యములా ? యని శంకింపవచ్చును. గణితము మున్నగుశాస్త్రములు సిద్ధ మగువస్తువునే బోధించునుగాని యపూర్వవస్తువులను బోధింపవు.అటులే వ్యాకరణశాస్త్రమునుబూర్వమునందు సిద్ధములైనసుశబ్దములు సాధువు లనియు నితరము లసాధువు లనియు బోధించును. "సిద్ధేశబ్దార్థసంబంధే" (శబ్దములును, వానియర్థములును, శబ్దార్థముల కుండెడిసంబంధమును వ్యాకరణశాస్త్రము రచింపఁబడకమునుపే సిద్ధములై యున్నవి.) అనియు, నివి సుశబ్దము లనియు నివి యపశబ్దము లనియుఁ దెలుపుటయే వ్యాకరణశాస్త్రమునకుఁ బ్రయోజన మనియు మహాభాష్యమునఁ జెప్పఁబడియున్నది. సాధుశబ్దములయందే వ్యాకరణశాస్త్రముచే బోధింపఁబడు కార్యములు ప్రవర్తించునుగాని యసాధుశబ్దములయందుఁ బ్రవర్తింపవు. ఆకారణముచేతనే కుండ యనునర్థము గల "గగరీ" యనుభాషాశబ్దమునకు, "ఆనయ" అనుసంస్కృతక్రియాపదముతో సంబంధము చేసినప్పుడు సంధికార్యము ప్రవర్తింపదు. అని శాస్త్రకారులసిద్ధాంతము కావున, నటులే యాంధ్రభాషలోనైతము సాధుశబ్దములకే శాస్త్రీయకార్యములు వచ్చునుగాని యపశబ్దములకు రానేరవు.

## అపశబ్దములు.

ఏభాషయందైనను నపశబ్దము లుండకమానవు. వ్యవహారమున నున్న శబ్దములన్నియు సుశబ్దములే యైనయెడల సుశబ్దాపశబ్దభేదమే లేకపోవునుగాన వ్యాకరణశాస్త్రమే వ్యర్థమగును. కాన నీయభిప్రాయమునే యాహోబలపండితుఁడు "యత్త్వపభ్రంశః" అనుసూత్రమున వివరించెను. దండియు, కావ్యమున స్వల్పదోషములసయితము పొందుపఱుపరాదనియు, నట్లుచేసిన కావ్యమంతయు దుష్టమగుననియు, శరీరమంతయు సుందరమైనను నొకచోట బొల్లి యున్నయెడల శరీరమంతయు దూష్యమే యగుననునర్థము గల, "తదల్పమపినోపేక్ష్య" మ్మనుశ్లోకమునఁ దేటపఱిచెను.

## వ్యాకరణము రచించువిధానము.

కొందఱు ప్రాచీనకవులును, నాధునికకవులును, భావప్రదర్శనైకపరాయణులై కొన్నియెడల నపశబ్దములఁ బ్రయోగించియుందురు. అంతమాత్రముచేతనే ప్రాచీనకవిప్రయోగము లన్నియు సాధువు లనియు నవీనులప్రయోగములసాధువులనియు నన వీలులేదు. ఈవిషయమునే "ఛందోవత్కవయః కుర్వన్తి నైషా భాష్యేష్టిః" (వేదములయందువలెఁ గవులు స్వేచ్ఛగఁ బ్రయోగింతురు. అంతమాత్రముననే యవి సుశబ్దములు కానేరవు) అని మహాభాష్యకారులు వక్కాణించియున్నారు. కావున విద్యాధికులు విమర్శించి వ్యాకరణమును రచింపవలయును. ఆంధ్రముయొక్క వ్యాకరణము లన్నియు నసంపూర్ణములుగఁ గన్పట్టుచున్నందున నీభాషామతల్లికయొక్క యభివృద్ధినిమిత్తమై విద్యాధికు లగు దేశీయులందఱును గలిసి పదసౌష్ఠవమునుఁ జర్చించి భాషనఁ బూర్ణవ్యాకరణమును బూర్తిచేయవలయును.

## బాల్యమున నభ్యసింపఁదగినభాష యేది?

బాల్యమున స్వభాష నభ్యసింపఁజేయవలయు ననునది నిర్వివాదమే. రెండవభాష యెద్దియై యుండవలయు ననువిషయమునఁ బహుతమయనుభవమును బ్రకాశింపఁజేయుచుఁ గొందఱు 'హిందీ' యనియుఁ, గొందఱు మహారాష్ట్రమనియుఁ జెప్పుదురు. కాని రాజకీయభాషయే ముఖ్యమయిన దని నాయభిప్రాయము. ప్రకృతము పాశ్చాత్యవిజ్ఞానమునందలి ప్రకృతిశాస్త్రములును, రాజకీయ, సాంఘికతత్త్వశాస్త్రములును మున్నగునవి దేశభాషలమూలమున మన

దేశమునం దంతటను వెదచల్లవలసియున్నదిగాన రెండవభాష యాంగ్లభాష
యే యభ్యసింపఁదగియున్నది.

ఆంధ్రభాష తఱచుగ సంస్కృతపదభూయిష్ఠమై తత్సమతద్భవపదములచే
నలరారుచున్నందున నీయాంధ్రభాషయందు నిష్కృష్టముగఁ బాండిత్యము
గలుగవలయు ననుకొనువా రాద్యప్రకృతి యగుసంస్కృతభాష నభ్యసించి తీర
వలయును. దీనికిఁ దార్కాణముగఁ బ్రథమమున నాంధ్రభాషకు వ్యాకరణమును
వ్రాయువారు సంస్కృతభాషతోడనే యాంధ్రవ్యాకరణమును వ్రాసి సంస్కృత
వ్యాకరణమున నున్న, క్త్వార్థకములు, తుమున్నర్థకములు, తద్ధర్మార్థకములు,
అపాదానము, సంప్రదానము, అధికరణము, మున్నగుసాంకేతికముల నీయాంధ్ర
వ్యాకరణమున నయితము చేర్చిరి. కావున సంస్కృతభాషను సంస్కృతవ్యాకరణ
మును నెఱింగినవార లీయాంధ్రవ్యాకరణమును బాలురకుఁ దెనుఁగున బోధించి
నను సంస్కృతభాషాజ్ఞానము లేనినాఁ డాసాంకేతికములు తెలియనేరవు. మఱియు
హిందీ మొదలగుదేశభాషలను సంస్కృతపాండిత్యము గలవారలు కొలఁదికాల
ములోనే నేర్చుకొనవచ్చును. అఱవభాష యొకటిదక్క మిగిలినమనదేశపుభాష
లన్నియుఁ దఱచుగ సంస్కృతపదభూయిష్ఠములే కావున నీసంస్కృతమువలన నవి
యన్నియు సులభముగ నలవడవచ్చును.

## ప్రభుత్వమువారికి విన్నపము.

ప్రాథమికపాఠశాలలయందలి యుపాధ్యాయులు బాలురకు దేశభాషాగ్రంథ
ములను జక్కఁగఁ జదువుటకును వ్రాయుటకును దగినసామర్థ్యమును గలుగఁ
జేయు నదుపాయములఁ జేయవలయు నని దొరతనమువారిచే నాజ్ఞాపింపఁబడ
వలయును. బాల్యమున దేశభాషలయందుఁ జక్కనిజ్ఞాన మలవడఁజేయునంతటి
దృఢజ్ఞానము గలయుపాధ్యాయు లవసరమని దొరతనమువారికిఁ దెల్పుకొనవల
యును. మాధ్యమికపాఠశాలలయందలి బాలురకు నాంధ్రభాష IV Form
నుండియు నైచ్ఛికపాఠముగ నుండుటచే కొలఁదిమందివిద్యార్థులకే పఠనీయ
ముగా నున్నది. మిగిలినవిద్యార్థులందఱు నేమియు భాషాపఠనముఁ జేయమి
సుశబ్దముల నుపయోగించి మృదువుగ మాటలాడనైనఁ జేఁత కాక యున్నారు.
ఐచ్ఛికముగ నాంధ్రమును దీసికొనినవారు నయితము నానాఁటికిఁ దాము పఠించు
గ్రంథము లతిపేలవము లగుటం జేసి యీభాషయం దల్పజ్ఞానము గలవారుగనే
యున్నారు. కళాశాలలయం దాంధ్రభాషను నిర్బంధముగఁ జదువువారలు

కొలఁదిమందియే. కాన నానాఁటికి మనభాష లుత్తరప్రాయముగఁ గన్పట్టుచున్నది. దేశభాషలను నిర్బంధపాఠముగఁ జదువువారలు కొలఁదిమందియే యగుటంజేసి గ్రంథనిర్ణాయకసంఘమువారు సులభగ్రంథములనే పఠనీయములుగ నిర్ణయింప వలసివచ్చును. అందుచే నానాఁటికి భాష పేలవమైనందున విద్యార్థులు సయి తము నల్పపరిశ్రమచేతనే పరీక్షయందుమాత్రము కృతార్థులయి తమభాషయందు దృఢజ్ఞానము లేనివా రగుచున్నారు. కానఁ బ్రాథమికవిద్య మొదలు కళాశాలల లోని చదువువఱకును జదువఁదగినగ్రంథములు సౌష్ఠవము గలిగి, వ్యాకరణదోష శూన్యములై, శిష్టతను బోధించునవిగ విచారించి పఠనీయగ్రంథనిర్ణాయకసంఘ మువారు నిర్ణయించునట్లు లాజ్ఞాపింపుఁడని దొరతనమువారిని గోరవలయును.

ఆంధ్రభాష సంపూర్ణ మయిన దగునా కాదా ?

ఏదైన నొకభాష సంపూర్ణమైనది యగునా కాదా యని విచారించు నపు డాభాష కవయవము లైన నామవాచకములు, విశేషణములు, క్రియా వాచకములు మున్నగువానిని బరిశీలించినఁగాని సంపూర్ణమనియో యసంపూర్ణ మనియో నిర్ణయించుటకు వీలు లేదు. మనయాంధ్రభాష తత్సమతద్భవపదముల తోఁ గూడియున్నందున నితరదేశభాషలవలెనే సంపూర్ణ మని చెప్పవచ్చును. ఒకప్పు డీయాంధ్రభాషలో వ్యవహరింపఁబడు శబ్దము లన్నియు 35,300 లని భాషాతత్త్వవేత్తలు లెక్కించియుండిరి ఇన్నిశబ్దములు వ్యవహరింపఁ బడునప్పు డు తఱచుగ భాషయు వృద్ధిపొందియే యున్నదని చెప్పితీరవలెను. పారిభాషిక పదము లన్నిభాషలకును సమానములే కాన నది లోప మని చెప్పుటకు వీలు లేదు.

అన్యభాషలలోనిశబ్దముల నాంధ్రభాషలో నుపయోగించుట

యెట్లని విచారింతము.

కొందఱు భాషాభిమానులు, అన్యభాషలలోని పదములను మార్పకయె యుపయోగించినఁగాని యర్థస్ఫూర్తి గలుగదని చెప్పుచున్నారు. మఱికొందఱు భాషాంతరములలోనిపదములను మార్చియె వ్యవహరింపవలయునని తలఁచెదరు. అది యెట్లనిన, ఇండియర్ రబ్బరు. అతిస్థితిస్థాపకవిశిష్టో భారతదేశీయవృక్షవిశేష నిర్యాసః, Shutle Cock (షటల్ కాక్) లఘుఘుటికావిశేషః యో వినోదార్థం దండాహతో భూత్వా ఇతస్తతః ప్రక్షిప్యతే' యనియు, కొన్నిశబ్దములను విశేష శబ్దముతోఁ గలిపి వృక్షవిశేషః, పుష్పవిశేషః, ఫలవిశేషః, అని చెప్పవలయు నని తలఁచెదరు. మఱికొన్నిశబ్దములను నేభాషలలోనుండి గ్రహించిరో యా

భాషలలో నియాకారమును మార్పక విభక్తిప్రత్యయములను గాని కొన్నియక్షర ములనుగాని చేర్చి స్వభాష కనుగుణముగఁ బ్రయోగింపవలయును. Sponge (స్పంజః) Duke (డ్యుకః) Soup (సాంబనం) లాటివం మొదలగునవి యీతీరున నుప్రయోగింపఁబడవలయుననియుఁ జెప్పెదరు. కాని యన్యభాషలలోని పదముల నత్యావసరమయినప్పు డట్టియర్థమును తెలిపెడిపదములు స్వభాషలలో లేనప్పు డును బరంపరాగతముగ నట్టిపదములు వ్యవహరింపఁబడుచున్నప్పుడును సాధ్య మయినంతవఱకు నాయాయిపదముల మార్పకయె వ్యవహరించినఁ ద్వరితముగ నర్థస్ఫూర్తి గలుగును.

విమర్శనము.

ఆంధ్రభాషలో విమర్శనాగ్రంథము లత్యల్పములు. సంస్కృతభాషలో విమర్శనాగ్రంథములు కలవు. అలంకారశాస్త్రమునందును, పండితరాయలవారు ను అప్పయ్యదీక్షితులవారును మున్నగు మహామహులు విస్తృతముగ విమ ర్శించి తమయనన్యాదృశ మయినపాండిత్యమునుఁ జూపి లోకమునకు మార్గదర్శకు లయిరి. మనభాషయందు నీగ్రంథములు పరివర్తితములు గామి నాలోపము గన్పట్టుచున్నది. కొందఱు బుద్ధిమంతులు ప్రారంభించినను నవియు నల్పసంఖ్యాక ములుగ నున్నవి. కొందఱారంభమునుమాత్రముచేసి దురుక్తులతోఁ బరిసమాప్తి చేయుటయే తక్క యెంతులాభము గన్పట్టదు. కాన నీవిషయమయి బుద్ధి మంతులు చక్కఁగ విమర్శనజ్ఞానమును వృద్ధిచేసి భాషాభిమానులకు మార్గదర్శకు లగుదురుగాత.

మనము ముందుచేయఁదగిన పనులు.

ఆంధ్రభాషాభిమానులయొక్క యుద్దేశములును, పండితులవిమర్శనములు ను బ్రతిసంవత్సర మొక్కపరియయిన సమావేశమగుటచేఁ దెలియఁబడుచున్నవి. కాని యింతటితోఁ దృప్తిఁజెందక యుద్దేశములను నెఱవేర్చుటయందె బద్ధకంకణు లై ప్రవర్తించినఁ గ్రమక్రమముగ భాషామతల్లి యన్నివిధములచే శోభించును. మనభాషలోకంటె హిందీ, మరాఠీ, బెంగాలీ మున్నగుభాషలలోఁ బ్రకృతిశాస్త్ర ములనుగుఱించి, శిల్పకళలనుగుఱించి, విదేశీయవిషయములనుగుఱించియుఁ బెక్కు గ్రంథములు రచింపఁబడి విశేషముగఁ బ్రచారములో నున్నవి. కాన నాయా దేశములలోనిబాలురకుఁ బ్రకృతిశాస్త్రములయందుఁ బ్రవేశము నభిరుచియు నధికమే ఆంధ్రభాషలో నింతవఱకును, నిట్టిగ్రంథములను వ్రాయుటయందుఁ

ప్రవృత్తి కొలఁదిగ నున్నది. మిల్టన్, హోమర్, మున్నగు నాంగ్లకవిశిఖామణులగ్రంథములయినను సంపూర్ణముగఁ బరివర్తితమయినటులు గాన్పింపదు. ప్రకృతిశాస్త్రవిజ్ఞానము గలయితరదేశములలోనివా రందఱు మనదేశమునకుఁ గావలసిన వస్తుసామగ్రిని పంపించుచున్నారు. అట్టికొఱంతను నివారింప గాఢాభిమాను లయి ప్రకృతిశాస్త్రగ్రంథములను వ్రాసింపఁ బ్రయత్నములు చేయుచు సమగ్రముగ గ్రంథములను రచించి విద్యార్థులకు నిర్బంధముగఁ జదువఁదగిన ప్రయత్నములు చేసిరో లేక యట్టి పాఠశాలల నయిన నేర్పఱచి యందు నిర్బంధపఠనీయములుగ నేర్పఱచిరో శ్రమచేసిననుగాని గ్రంథములు పెక్కులు వెలువడవు. వెలువడినను బ్రయోజన ముండదు. ఇట్టిసమయమున నాంగ్లభాషనుండి యేమి సంస్కృతభాషనుండి యేమి వచనరూపమున గ్రంథముల నాంధ్రమునకుఁ బరివర్తించుట కారంభించి యావజ్జీవమును నాంధ్రభాషయొక్క యభివృద్ధికై పాటుపడి యింగ్లీషువారియూహలను నింగ్లీషువారియాచరణములను నింగ్లీషువారికల్పనలను నాంధ్రభాషలోనికిఁ బరివర్తించి యీభాషాప్రపంచమున కొకనూతనమార్గమును జూపిన మహారాజశ్రీ రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారు కీర్తిశేషు లగుట యాంధ్రలోకమున కొకకొఱంతయే, కాని, యామహాశయునిమార్గము ననుసరించి ప్రకృతకాలమునఁ బ్రౌఢము లగు గ్రంథముల రచియింపఁగలవార లనేకులు బయలువెడలుచుండుట యంతయుఁ బంతులవారి కీర్తిశరీరమునుఁ బ్రకాశింపఁజేయుటయే యని తలఁచెదను. కావున నిట్టిసామర్థ్యము గలబుద్ధిశాలురు పూనికతో విడువక పనిచేయవలయును.

## పర్యవసానము.

భాషాభిమాను లీపరిషత్తును స్థాపించి కొలఁదివత్సరములు గడచినను నిర్విఘ్నముగ నభివృద్ధిపఱుచుచున్నారు. ఈ యాంధ్రసాహిత్యపరిషత్తు, ఈయెనిమిది సంవత్సరములలోను గ్రమక్రమముగ వృద్ధిఁ జెంది మంచిస్థితిలోని కేభగవంతుని యనుగ్రహముచే వచ్చినదో యట్టిపరమేశ్వరుఁ డింక ముందింతకంటెను బాగుగ వృద్ధినొందించుటకును సంకల్పితము లయినవిషయములను నిర్విఘ్నముగఁ గొనసాగించి పూర్తిచేయుటకును దేశీయులమానసికసంస్కారములనుఁ జక్కఁగ వికసింపఁజేయుటకును నన్యదేశములవలె నన్నివిషయములలోను నీభారతమాతయు మిన్నయయి తనరారుటకును, భౌతికము, శిల్పము, వైద్యుతము వైద్యము మున్నగు నత్యవసరము లగుకళలయొక్క విజ్ఞానము దేశీయుల హృదయక్షేత్రములయందుఁ ద్వరితముగ నాటుకొనునట్లు చేయుటకును దాని నాచరణములోనికిఁ దీసికొనివచ్చి ఫలిత మగునట్లు చేయుటకును నిరంతరమును బ్రార్థించుచు నింతటితో విరమించుచున్నాఁడను.

శ్రీరస్తు.

# ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము.

(బెజవాడ పరిషత్సభలోఁ జదువఁబడినది.)

---

మహాశయులారా!

నా పుణ్యవశంబున సర్వలక్షణశోభితసభాముఖంబున నిలిచి సదస్యుల కెల్లరకును స్వాగత మొసంగుభాగ్యము నాకు లభించినది. మా విజయవాటి కపక్షమునను, సమ్మానసంఘపక్షమునను, నేతత్పరిషత్సభ్యుల కందఱకును మనః పూర్వకసుస్వాగత మొసంగుచున్నాఁడను.

మిక్కిలి దూరస్థలంబులనుండి, మండువేసవియెండలకు సైఁచి, తీవ్ర మైనవడగాడ్పుల కోర్చి, దూరప్రయాణప్రయాసములకు సహించి, వ్యయ మనక, భార మనక, మా విజయవాడకు విచ్చేసినవారి సత్కీర్తి బహూకరింప నెవ్వరికి సాధ్య మగును? అయినను మా యోపినకొలఁది మే మొనర్చుసత్కారముల యందలిలోపములఁ బాటింపక మన్నింతు రని వేఁడుచున్నాను. 'ఎవ్వార లైనఁ గొండంతవారి, కననిఁ గొండంత పూజ సేయంగఁ గలరె'.

విజయవాడపురంబున నేతత్సభ జరుగుటవలన నీపురమునకును, బరిషత్తునకు నన్యోన్యము గౌరవాధిక్య మగుచున్నది. ప్రస్తుతము ప్రయాణసౌకర్యము లొసంగుచు, నినుపదారులకూడలి యైన యీపట్టనము మిక్కిలి పురాతన మనియును, ప్రాముఖ్యము వహించి యుండెననియును సభ్యు లెఱుంగనివిషయము గాదు. ఎంతటిపామరున కైనను విజయవాడ నామస్మరణమాత్రమున రెండురూపములు స్పష్టముగ హృదయఫలకచిత్రితములు కాకమానవు. మొదటిది పట్టనాధిష్ఠానదేవత యగుశ్రీకనకదుర్గాంబికా స్వరూపము; రెండవది తత్పాదకమలాక్రాంతవిమల కృష్ణవేణీస్వరూపము. ఈ రెండురూపములును సర్వదా పూజ్యములై మెలంగుచున్నవి.

కనకదుర్గాదేవి యెంతకాలమునుండి యీపట్టనము నివాస మయ్యెనో నిర్ణయించి చెప్పుట దుర్ఘటమే యైన నిది యాదేవి కతిపురాతననికేతన మనుట నిస్సంశయ మైనయంశము. క్రీస్తుశకము 1460 సంవత్సరమునకుఁ బూర్వమే యుదయగిరిలో రాజ్య మేలినవాఁడు, నారాయణకవికృత పంచతంత్రకావ్యమును గృతినందినవాఁడు నగుబసవక్షితీశ్వరునివంశకర్తయు మహాప్రసిద్ధుఁడు నగుమాధవవర్మ యనునాతనిఁగూర్చి పైకావ్యమునం దిట్లు వ్రాయఁబడియున్నది.

చ. మును బెజవాడదుర్గ నన ముద్ధతనంబున మెచ్చఁ జేసెఁ బెం
పున రథదంతివాజిభటభూరిబలంబులచేఁ గళింగభూ
జనపతిఁ ద్రుంచి చేవఁ దనసంతతికై మహిఁ బాడి నిల్పి గ్ర
మ్మనఁ జిరకీర్తులం గనినమాధవవర్మ నిజాన్వయంబునన్.

ఈమాధవవర్మ యనుమహాపురుషుఁడే క్రొత్తలంక మృత్యుంజయకవిచే రచింపఁబడిన ధరాత్మజాపరిణయకావ్యమునందు అల్లూరివారివంశమునకు మూలపురుషుఁ డనియును, ఆమహీపతి బెజవాడకనకదుర్గాప్రసాదము వడసి వర్ధిల్లె ననియును, బూర్వోదాహృతకావ్యమునం దిట్లు వర్ణింపఁబడియున్నాఁడు.

ఉ. మాధవవర్మ నాఁగ నొక మానవభర్త జనించి విస్ఫుర
ద్బోధసమగ్రుఁడై కనకదుర్గను శ్రీ జయవాటికాపురీ
సౌధవిహారిణిం గొలిచి చక్కఁగఁ దత్కరుణారసంబుచే
నీధర హేమవృష్టిఁ గురియించె నతిస్థిరకీర్తి మీఱఁగన్.

దుర్గాలయసమీపమం దున్నమల్లేశ్వరాలయమం దుఁగూడ రమారమి వేయేండ్లకుఁ బూర్వపుఁ జరిత్రలఁ దలఁపించుసూచనలు కలవు. చాళుక్యరాజప్రముఖుఁ డగుయుద్ధమల్లునికాలమున నిర్మింపఁబడినయీదేవాలయమునకు నతనిమనుమఁ డగురెండవయుద్ధమల్లుఁడు గోపురమును గట్టించినట్లు కొన్నిబలమైనయాధారములు కలవు. పదంపడి చీనాదేశయాత్రికుఁ డగుహానుత్సాంగు అనువాఁడును ఫ్రాన్సుదేశయాత్రికుఁ డగుట్రవర్నియ రనువాఁడును ఈపట్టనదేవాలయములను, ప్రాముఖ్యమును, వైభవమును, బరరాజులనో గూర వర్ణించియున్నారు. మఱియును క్రీస్తుశకము 17-వ శతాబ్దమునందు గోలకొండరాజ్యధురంధరులును, తానీషా కుపదేశికులును, అమాత్యశ్రేష్ఠులు నగు అక్కన్నమాదన్నలచే నన్నప్రదానార్థము దుర్గాసమీపమున నిర్మింపఁబడిన చావడు లీనాఁటికిని జెక్కుచెదరక నిలిచియుండి యెల్లకాలములకు నమ్మహనీయుల దాతృత్వప్రకటన మొనరించుచున్నవి. అమ్మంత్రిసత్తము లప్పుడప్పుడు విజయవాడకు వచ్చి కొంతకాల మిక్కడఁ గృష్ణవేణీకనకదుర్గాసమక్షమున నివసించి వెళ్ళుచుండెడివారు.

ఇదియునుంగాక పూర్వదిగ్విజయయాత్రకై తిమ్మరుసుమంత్రియు భార్యలును వెంట రా, ససైన్యముగా బయలువెడలినకృష్ణదేవరాయలు కటకాధీశ్వరుఁ డగుగజపతిని గృష్ణాతీరమున నెదుర్కొని యొనర్చినరణకేళికి మాపురమే రంగస్థల మయ్యెను. ఉత్తరపుటొడ్డున నున్నగజపతిసైన్యమును మాఱ్కొను

టకై కృష్ణను దాఁటుచుండఁగా ఘోరసంగ్రామము జరిగినప్పుడు "వైరిసైన్యాబ్ధిలో వచ్చు గెల్పులనావఁ గడఁజేర్చు ప్రాఁకుడుఁ గడపుఁజేయి" యని వర్ణింపఁబడినకౌక్షేయకముతో నుద్దండపరాక్రముఁడై పోరి, నదిని దరియించి, శత్రువుల నోడించి, తిరిగి కొండవీటిదుర్గమును ముట్టడించి కొంతకాలమునకు దుర్గమును స్వాధీనపఱుచుకొనెను. ఈకాలమునందే మూరురాయరగండఁడు భార్యాసమేతుఁడై కొన్నిదానము లొనర్చి బెజవాడశివాలయమందుఁ గొన్ని శాసనములు వ్రాయించెను.

ఇంతియకాక కృష్ణామండలము వాఙ్మయసంప్రదాయముల కాటపట్టని స తెలుంగనివిషయము కాదు. ఆంధ్రకవిపుంగవుఁ డగుపింగళి సూరనామాత్యుఁడును, ద్విపదరామాయణకర్త యగురంగనాథకవియు, రాఘవయాదవపాండవీయకర్త యగునెలకూచి బాలసరస్వతియు, మత్స్యపురాణాదికావ్యకర్త యగుహరిభట్టును కృష్ణామండలవాసు లనుటకుఁ బెక్కునిదర్శనములు కలవు. తురగా రామకవియు నయ్యంకి బాలసరస్వతియుఁ గలసి రచించిననాగరఖండమనుకావ్యము బెజవాడప్రభు వనివర్ణింపఁబడిన ధవళేశ్వరపు మార్కండేయుఁ డనుకమసాలి కంకితము చేయఁబడెను. "బెజవాడప్రభుఁ డియ్య నెంతయును గల్పించున్ ధరిత్రిన్ మహా। రజతస్వర్ణగృహంబు లెప్పుడు బుధవ్రాతంబు మోదింపఁగన్" అని కృతిపతి వర్ణింపఁబడియున్నాఁడు. ఇటీవలి కవులలో విశ్వగుణాదర్శమును బద్యకావ్యముగాఁ దెనిఁగించినచినతాతాచార్యుఁడును వల్లీపల్లవోల్లాసకర్తయు నూజివీడుసంస్థానపండితుఁడు నగుమాడభూషి నరసింహాచార్యుఁడును, మహామేధావి యనిపేరువడసిన విద్వాన్, మాడభూషి వేంకటాచార్యకవియును, కృష్ణామండల వాస్తవ్యులై యున్నారు. ఇప్పటికైనను, వాఙ్మయవిషయికోత్సాహ మం దేమి, విమర్శనశక్తులం దేమి, యీమండల మగ్రగణ్యమై యున్నది.

ఆర్యులారా! ఇట్టి ప్రాచీనవైభవమును, ఆధునికప్రాధాన్యమును, సారస్వతసంప్రదాయములను గలిగినయీవిజయవాడపురంబున వాఙ్మయవిచారణావిష్టమనస్కు లై యిందఱు పండితులు కూడినసభయందుఁ గర్తవ్యాంశము లనేకము లుండఁగాఁ గేవల ముపోద్ఘాతరూప మగునీనాయుపన్యాసంబునఁ గాలహరణ మొనర్చుట కూడనిపని కావున నమస్కారపూర్వకముగ నీ పురపక్షమున నే నొసంగుస్వాగతమును గైకొని జయప్రదముగా సభాకార్యనిర్వహణ మొనర్పుఁ డని మి మ్మందఱను వేఁడుచున్నాను.

పాటిబండ వేంకటరమణయ్య.

---

౨౯ను.

# బెజవాడలోని యుద్ధమల్లశాసనము.

## (అఱవమునందలి ఴ అను ధ్వని తెనుఁగున నుండుట)

ఈనడుమ బెజవాడలో యుద్ధమల్లశాసన మను వింతశిలాశాసన మొకటి బయల్పడి తెలుఁగు సారస్వతమునకు వింతశోభను దెచ్చుచున్న సంగతి యాంధ్రలోకమున కంతకును విశదమే. దీనిని బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులవారు టిప్పణముతోఁ గూడ నాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రచురించుటయే కాక "యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనము" అను పేరితో నొక గ్రంథమునుగూడఁ బ్రచురించి యాంధ్రులకు మహోపకారముం గావించిరి. దీని నాధారము చేసికొని శ్రీ రామయ్యపంతులవా రనేకచమత్కారములఁ దెల్పిరి. అవి చాల నపూర్వములుగా నున్నవి. అవి యటులుండ సంతోషకం బైన నపూర్వము నొకదానిని దీనిద్వారముగా గ్రహించి శ్రీయుత కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు పరిషత్పత్రికలోఁ గడచిన యాశ్వయుజకార్తికమాసముల సంచికలో నొకవింతవ్యాసమును బ్రచురించిరి. శ్రీలక్ష్మణరావుగారికి నఱవమునందలి 'ఴ' యను వింతయక్షరము పూర్వకాలపుఁ దెలుఁగునందు నుండినట్లుగా యుద్ధమల్లశాసనమువలనఁ దెలియవచ్చినదఁట! ఇదియే సత్యమగుచో భాష కొకవింతయందము వచ్చిన దనవలసినదే. వారు సెలవిచ్చినరీతిగా శాసనయోగ్యత హెచ్చగుననుటకును సందియము లేదు. శాసనయోగ్యతకే యాఁగ నేల; భాషయోగ్యత యనియే చెప్పవచ్చును. దీన భాష కపూర్వశోభయును గలుగునుగదా! అయిన నిది యపూర్వవిశేషము గాన దీనింగూర్చి యింకను బాగుగాఁ దఱచి చూడవలసియున్న దని నా తాత్పర్యము.

### 'ఴ' స్వరూపము.

శబ్దశాస్త్రజ్ఞులు కొందఱు తెనుఁగను పేరు 'తేనె' నుండి పుట్టిన దనిరి. భాషామాధుర్యముంబట్టి వా రట్టి తలంపునకు వచ్చిరి. తేనెవలె మధురమై తేటయై యుండు తెనుఁగునందు నఱవమునందలి 'ఴ' యను వింత యుచ్చారణము గలయక్కరము కల దనుటకు నవకాశ మంతగాఁ గాన్పించుటలేదు. ఈ

యక్కరమును వింతయక్షర మని నేను బలుకలేదు. శ్రీ లక్ష్మణరావుగారే "వింతయక్షరము;" "ఒక వింతయైన యుచ్చారణము గల యక్షరము"నని తమ వ్యాసములో వ్రాసియుండిరి. వింత యేమన దీనిపలుకుబడి యిట్టి దని నిర్ధారణము చేయుట కెవరికిని శక్యము కాదు. మూఁడునాలుగక్షరములధ్వని యిందుఁ గల దందురు. అఱవలే దీనిని సరిగ నుచ్చరింపఁజాలరు. శుద్ధద్రావిడదేశమునందలివారే దీనిని బలువురు పలువిధముల నుచ్చరింతురఁట.

*ఇది 'ష్ర్య'ల ధ్వని కలిగియున్నది. ఇది యైదక్షరములతో మార్పుఁ జెందుచున్నదని కాల్డువెల్లుదొరవారు వ్రాసిరి:—

"ṛ (the peculiar vocalic ṛ of Tamil) interchanges with five consonants." ఇట్టి వింత యక్కరము తెలుఁగునందుఁ గలదని శబ్దశాస్త్రజ్ఞు లెవ్వరును నిదివఱకుఁ జెప్ప సాహసించి యుండలేదు. "కాని యీధ్వనియు, నక్షరంబును దెనుఁగున నెన్నఁడైన నుండె నని యెవరు ననుకొనలేదు" అని శ్రీ లక్ష్మణరావుగారే వ్రాసియున్నారు. తెలుఁగులో నీయుచ్చారణమును నక్షరమును గల వనుట కవకాశము కాన్పింప దని దక్షిణదేశభాషల బాగుగా నారసి చూచిన కాల్డువెల్లుదొరవారు వ్రాసిరి. వారివాక్యముల నీక్రింద నిచ్చుచున్నాను.

"This sound does not now exist in Telugu, and it cannot clearly be proved that it ever had it."

తెలుఁగులో నీయక్షర మెన్నఁడైన నున్న దనుటకుఁ దగిన ఋజువు లేదని దీనిభావము. తొల్లింటి మన శబ్దశాస్త్రజ్ఞు లీయక్షరము తెనుంగునందుఁ గల దనలేదు. సంస్కృతమున లేక తెలుంగునందుమాత్రమే గలయక్కరముల లెక్కించుటలోఁ బూర్వులు ఎ, ఒ, చె, జె, ఱ, ఁ అను నాఱక్షరములను మాత్రమే వా రుగ్గడించిరి. 'ఱ' మున్నగు నక్షరము లున్న వని వ్రాసిన పూర్వులు 'ఴ' కూడ నుండిన దానిని బేర్కొనియుండరా? పూర్వులు గాని నవీనులు గాని యున్న దని చెప్పని వింతయక్షరమును; ఉన్నట్లు కాన్పించుట లే దనికూడఁ జెప్పఁబడినదానిని నిప్పుడు శ్రీలక్ష్మణరావుగారు క్రొత్తగా నున్నట్లు కనిపెట్టితి మనిరి కాఁబట్టి యీ విషయమై బాగుగా విమర్శించి చూచుకొనవలసియున్నది.

దక్షిణదేశభాషలఁ బరిశీలించువారికి భ్రాంతి పుట్టుటకుఁ గారణము లేకపోలేదు. ఆంధ్రసోదరభాషలలోఁ గొన్నింటిలో నిది యుండుటచేత, నా సాదృశ్యముంబట్టి తెలుఁగునందును నిది యుండు ననుభ్రమ యుదయించును.

* Between Tanjore and Pondicherry, it is softened into *rzh* or *zh*.

తెలుంగునం దీయక్కరము కాన్పించుట లేదని వ్రాసిన కాల్డువెల్లుదొరవారు మరల నీక్రింది వింతవాక్యమును వ్రాసిరి:—

"but the anology of all the other dialects leads us to conclude that it had it originally, and that it lost it in course of time, as we know that canarese did."

తెలుఁగులో నిది యెన్నఁడును గానరాకుండినను నితర దక్షిణదేశభాషలలో నిది కాన్పించుచున్నది గాన వాని పోలికను బట్టి తెనుఁగులోఁగూడ నుండెడి దనియుఁ గన్నడమునుండి యిటీవల జాఱిపోయినట్లె యిందుండియు జాఱిపోయి యుండు ననియు దొరవారు సెలవిచ్చిరి.

## దక్షిణదేశభాషలసంబంధము.

దక్షిణదేశభాష లగు నఱవము, కన్నడము, తెలుఁగు, మళయాళము మున్నగునవి సోదరభాషలై యున్నవి. సోదరులకుఁ గొన్నిసమానచిహ్నము లుండుట లోకములో సహజము. ఒకనిపోలిక యొకనొకని కుండును గాని ప్రధానాంశములలోఁ గొన్నిసాదృశ్యము లుండినను గొన్ని భేదములు కూడ నుండును. అట్లె సోదరభాషలందును గొన్నిసాదృశ్యములును మఱికొన్ని భేదసూచకము లగు విశేషములును నుండును. అట్టివానిం గొన్నిటిఁ జదువరుల యుపయోగార్థమై యిచ్చుచున్నాఁడను.

## ప్రత్యేకాంధ్రాక్షరములు.

ఇతరసోదరభాషలలో లేక తెలుంగునందుమాత్రమే కల యక్కరములు కొన్ని కాన్పించుచున్నవి. చ, జ, ఁ అనునక్షరములు తెలుఁగునందుమాత్రమే కలవు. ఇతర సోదరభాషలలో లేవు. చ, జ లంగూర్చి ముచ్చటించుచు, కాల్డువెల్లుదొరవా రిట్లు వ్రాసిరి.

"It is necessary here to notice the existence in Telugu of a peculiarly soft pronounciation of ch & j, with their aspirants which is unknown in Sanskrit and the Northern Vernaculars and is found only in Telugu and in Marathi."*

దీనింబట్టి దంత్యము లగు చ, జ, లు తెలుఁగునందుమాత్రమే కల వని తెలియవచ్చుచున్నది. ఇఁక నఱసున్నంగూర్చి ముచ్చటించుకొందము. ఇదియును తెనుంగునందుమాత్రమే కలదు. ఈవిషయమైకూడ కాల్డువెల్లుదొరవారిట్లు వ్రాసిరి:—

* మహారాష్ట్రములోనికిఁ దెనుంగునుండియే పోయిన దని దొరవారు వ్రాసిరి.

"The Tamil alphabet has nothing to correspond with the half anuswara of the Telugu - a character and sound peculiar to that language"

తెలుఁగులో నివి కలవుకదా యని యాపోలికింబట్టి యుత్తరదక్షిణ దేశ భాషలలోఁగూడ నవి కల వనుకొనవచ్చునా? ఉన్నవా? కావున నన్నిపోలికలు సరిపోవు ననుకొనరాదు.

*తూదభాషాక్షరవిశేషము.

ఇంగ్లీషులో నున్న 'f' అనునక్షరమును ధ్వనియును నాంధ్రాదుల సోదరభాషలలోఁ జేరినతూదభాషయందుఁ గలవు. ఈవిషయమై కాల్డువెల్లు దొరవా రిట్లు వ్రాసిరి:--

"one of the peculiarities of Tuda is the existence in it of the sound of f–e. g., pûf, an insect. In the other Dravidian dialects f is unknown."

కావున సోదరసాదృశ్యముల నాధారము చేసికొని, యున్నట్లు కాన్పించుట లేని విశేషములుకూడఁ గల వనునూహకు రాఁ జనదు. అట్లనుకొనుట రాభణుఁ డనిన ట్లుండును. "కుంభకర్ణే భకారోస్తి భకారోస్తి విభీషణే రాక్షసానాం కులశ్రేష్ఠో రాభణో నచ రావణః" అన్న ట్లుండును.

కావున సోదరభాషాసాదృశ్యముల నాధారము చేసికొని యఱవమునందలి 'ఴ' కారము తెలుఁగులోఁ గల దనుకొనుట యుచితము కాదు. సాదృశ్యములు పనికిరా వని మఱియొకతావున కాల్డువెల్లుదొరవారె యిట్లు సూచించిరి.

"'ural,' Tamil, a mortar pronounced oral, should by anology be oralu in Telugu, but instead of oralu we find rolu."

కావున నిట్టిపట్ల సాదృశ్యముల నమ్ముకొనరాదు. 'ఴ' యనునది యఱవమునందును దానిపుత్రిక యగు మళయాళమునందును గలదు. పూర్వకర్ణాటకభాషయందును నుండెడిది. నవీనకర్ణాటకమునందు లేదు. తెలుఁగునందెన్నఁడును లేదు. కర్ణాటకమునుండి జాఱిపోయినట్లె తెలుఁగునుండియు జాఱిపోయినదని కాల్డువెల్లుదొరవారు తలంచినట్లుగాఁ దలంపరాదా యందురేని; అట్లు తలంచుట కాధార మేదియును లే దని కాల్డువెల్లుదొరవారే వ్రాసియున్నారుకదా. కర్ణాటకభాషలో దీనికిఁ బ్రత్యేకముగా నొకయక్షరము (ೞ) కలదు. దానింగూర్చి కేశిరాజు మున్నగు పూర్వపు కర్ణాటశబ్దశాస్త్రజ్ఞులు

* నీలగిరి ప్రాంతములందలి వాఁడభాష.

తమ గ్రంథములలో విశేషముగా ముచ్చటించియున్నారు. అట్లె తెలుంగునందును నుండిన బూర్వలాక్షణికులు నన్నపాథర్వణాదులు దానింగూర్చి ముచ్చటించి దానిని భ్రమముచేయు విధుల నేర్పాటుచేసియే యుందురు. శకటరేఫమును గాపాడుకొని వచ్చుచున్న యాంధ్రశబ్దశాస్త్రవేత్తలు 'ఴ' కారమును సంరక్షించుకొని రాకుందురా? తెలుఁగునం దిది కల దని యెవ్వరును వ్రాయను లేదు. కాల్డువెల్లుదొరవారు చెప్పినట్లుగా నున్నదనుటకు నాధారములును లేవు. ఇంకను లేదనుటకే యవకాశములు కాన్పించుచున్నవి.

## దేశభాషీయాంతర్వర్ణపరిణామము.

ఒకదేశమువారినోటి కలవా టగునుచ్చారణ మింకనొకదేశమువారికి నలవాటు కాక పలుక సాధ్యము కాకుండును. కావుననే యొకదేశమువారిఁకనొకదేశమువారిభాషలోనిపదముల నుచ్చరించునప్పుడు సహజముగా నంతర్వర్ణపరిణామము కలుగుచుండును. 'ఴ' యనునది వింతయుచ్చారణము గలయఱవవర్ణ మని శ్రీలక్ష్మణరావుగారె వ్రాసియున్నారు. ఆవింతయుచ్చారణమును దెలుంగువారు నోట నుచ్చరించునలవాటు లేనివారు. కావుననే యీయక్షరధ్వని యీయాంధ్రదేశమునందుఁ గాన్పింపకుండుటయే కాక యఱవములో నిదిగలపదములు తెలుఁగులో 'డ' కారము కలవిగా మాఱిపోవుచున్నవి. దేశభాషీయాంతర్వర్ణపరిణామ మీరీతిగా జరిగినది. ఈధర్మమును మనసునం దిడుకొని 'ఴ' యను నఱవపు వింతధ్వని తెలుఁగులో నెట్లు పరిణమించుచున్నదో కనుఁగొందము. ఈవింతద్రావిడధ్వని ప్రస్తుతకర్ణాటకములో 'ళ' గను దెనుంగున 'డ' గను మాఱిపోవుచున్నది. ఈవిషయమై కాల్డువెల్లుదొరవా రిట్లు వ్రాసిరి :—

"This change of ṛ into ళ and the previous one of ṛ into ḍ from the constituents of an important dialectic law. That law is, that the same consonant which is ṛ in Tamil is generally ḍ in Telugu, and always ḷ in modern Canarese."

అఱవములో 'ఴ' గలపదములు తెలుఁగులో 'డ' కల నగుచున్నవి. ప్రస్తుత కర్ణాటకములో 'ళ' గల నగుచున్నవి. ఇందులకుఁ గొన్నియుదాహరణముల శ్రీలక్ష్మణరావుగారె యిచ్చిరి. వారివాక్యములతోఁ గూడ వాని నీక్రింద నిచ్చుచున్నాను :—

"అఱవమున ఴ ఈయక్షరముచేఁ జూపఁబడునుచ్చారణ గలశబ్దములు, కన్నడమున నిప్పుడు 'ళ' కారముతోను, తెనుఁగున 'డ' కారముతోను ఉచ్చరింపఁబడుచున్నవి. ఇందుకుఁ గొన్నియుదాహరణములు.

| అఱవము. | కన్నడము. | తెలుఁగు. |
|---|---|---|
| కోఴి | కోళి | కోడి |
| సుఴి | సుళి | సుడి |
| పాఴ్ | పాళు | పాడు |
| కూఴ్ | కూళు | కూడు |

ఈయుదాహరణములనుబట్టి మన మేమి యాలోచించుకొనవలసియున్నది? 'ఴ' యనువింతయుచ్చారణము తెలుఁగునందును ప్రస్తుతకర్ణాటకమునందును లేదు గావున నసఁగా ఆధ్వని వారినోట పలుకఁబడదుగాన నయ్యది మాఱిపోయిన దని మనము భావించుకొనవలెను. ఇంగ్లీషునందుఁ గల 'f' యను ధ్వని మనలో లేదు. అందుమూలముచే నింగ్లీషునకు నలవాటుపడని యాంధ్రులు 'ఫూల'ని యుచ్చరించుచున్నారు. అది యటులుండ, పైపదములలోని రూపములలో నేది మొదటిదో మనము తెలిసికొనవలసి యున్నది. 'ఴ' అను వింతధ్వని ద్రావిడులందుఁ గలవిశేష మగుటచే దానియం దుండుపక్షపచే వారు తద్రహితపరభాషాపదముల నుచ్చరించుటలో దానిని దెచ్చిపెట్టుచు వచ్చిరి. ద్రావిడులప్రత్యేకపురుచి తెలియుటకై కొన్నియుదాహరణముల నిచ్చుచున్నాను :—

| సంస్కృతము. | తెలుఁగు. | కన్నడము. | అఱవము. |
|---|---|---|---|
| కుక్కుట | కోడి | కోళి | కోఴి |
| బ్రధ్న | ప్రొద్దు | హొత్తు | పొఴుదు |
| నాడీ | | | నాఴి |

దీనింబట్టిచూడ శుద్ధద్రావిడులకు (అఱవము మళయాళము మాటలాడు వారికి) సహజ మగు ధ్వని 'ఴ' కార మనియుఁ దక్కినవారికిఁ గాదనియు బోధపడఁగలదు. కొన్నితావుల సంస్కృతమునందలి 'డ' కార మఱవములో 'ఴ' గా మాఱునని కాల్డువెల్లుదొరవా రిట్లు వ్రాసిరి :—

" In old Canerese this Sanskrit ḍ often becomes ṛ as in Tamil. "

శుద్ధసంస్కృతశబ్ద మగు 'ఫల' శబ్దము నుచ్చరించుటలో ద్రావిడులు 'పఴ' అని 'ఴ' యుతముగా నుచ్చరింతురు. అంతియకాక మళయాళభాషలో

నున్నశ్రీమద్రామాయణములో లక్ష్మణశబ్దములోనికే యీ 'ఴ' కారము ప్రవేశించినది. అఱవము మళయాళముల మాటలాడువారు స్వరశాస్త్రానుగుణము గానే కాక యైచ్ఛికముగాఁగూడ సంస్కృతాదిపదములలో 'ఴ' కారమును దెచ్చిపెట్టుచుండి రని తెలియవచ్చుచున్నది. వీనినన్నిటిని బట్టిచూడ ద్రావిడ మళయాళముల మాటలాడుశుద్ధద్రావిడుల సొంతసొమ్మై యీయక్కరము విరాజిల్లుచున్న దని తేలకపోదు; కుక్కుటశబ్ద మాంధ్రుల యుచ్చారణసందర్భముం బట్టి కోడి యైనది. కర్ణాటకుల యుచ్చారణసందర్భముంబట్టి కోళి యైనది. ద్రావిడుల యుచ్చారణసందర్భముంబట్టి కోఴి యైనది. 'టోడః' (౧.౩.౩౧) అనుప్రాకృతవ్యాకరణసూత్త్రానుసారముగా 'ట' కారమునకు 'డ' కారము వచ్చినది. (ఓదిత్యధికృత్య) స్తౌ (౧.౨.౮౮.) అనుసూత్త్రముచే సంయుక్తపరమైన మొదటి 'కు' 'కో' కాఁగా 'క్కు' లోపము వచ్చి కోడి యైనది.* ఇది ప్రాకృతమునుండి వచ్చినతద్భవము. మహారాష్ట్రములో 'కోడ్డు' యందురు. డ కారము ట వర్గములోనిది గాన 'కోడి' యనురూపమే 'కోఴి' యనురూపముకంటె నెక్కుడుగా మూలాక్షరానుగుణముగా నున్నది. కావున 'ఴ' యుతములే మొదటిరూపము లని మనము తలంపరాదు. మఱియు 'ఴ' అనునది యఱవలప్రత్యేకాక్షర మనియు వారినోళ్లకుమాత్త్రమే యది సహజ మగు నుచ్చారణ మనియు మనము తెలిసికొనవలెను. సాహచర్యమునుబట్టి యయ్యది కన్నడములో మొదటఁ బడినను విత్తనమందును, నసహజ మగుటచే నశించినది గాని వ్యాపింపలేదు. ఆంధ్రక్షేత్త్రమున నీవిత్తనము నాటఁబడను లేదు. మొలకయెత్తను లేదు. ఇది యఱవలకుమాత్త్రమే సంబంధించిన వింతధ్వని కావుననే శ్రీలక్ష్మణరావుగారును "అఱవమందలి 'ఴ' యను వింతధ్వని" యని వ్రాసిరి. "The peculiar vocalic ṟ of Tamil" అనుచుఁ గాల్డువెల్లుదొరవారును వ్రాసిరి. మూఁడునాలుగు వింతధ్వనుల కలయికచే నైనయీయక్కరము మొదటినుండియు మృదుమధురభాషగా నున్న తేనెవంటి తెనుంగున, భాషావిశేషముంబట్టిచూడఁ గల దనుకొనుటకే యవకాశము కాన్పించుట లేదు.

ఆంధ్రభాషయొక్క వైఖరిని బట్టిచూచిన 'ఴ' యనువింత యక్కరము తెలుంగునం దున్న దనుటకు నవకాశము లేదు. కాల్డువెల్లుదొరవారు చెప్పినట్లుగా నుండెడి దనుటకుఁ దగినఋజువు కాన్పించుట లేదు. సారస్వతమునం

* కుక్కుటశబ్దభవము కోడి యని వైకృతదీపికయందు బహుజనపల్లి సీతారామాచార్యులవారును, ఆంధ్రపదపారిజాతమునందు ఓగిరాల జగన్నాథకవిగారును వ్రాసియుండిరి.

తను నారసిచూచినను లక్షణగ్రంథములందుఁ గాని లక్ష్యగ్రంథములందుఁ గాని యీధ్వనియు నక్కరమును జూపట్టుట లేదు. ఇట్లుండ యుద్ధమల్లశాసనమునందును నింకను మఱికొన్నిశాసనములందును నీపలుకఁబడిని దెల్పు నక్కరమును గనుంగొంటి మని సోదాహరణముగా శ్రీలక్ష్మణరావుగారు వ్రాయించి యున్నారుకాన నిఁక వారు తెలుఁగుశాసనములలోఁ గ్రొత్తగాఁ జూపిన ‘ఴ’ కారోచ్చారణమును నక్షరమును విమర్శించి చూచుకొనుటకుఁ గడంగుదము.

## ‘ఴ’ యనుధ్వనిని దెల్పుతెలుంగక్కర మేది?

శాసనములఁ బరిశీలించుటకు ముందుగా నఱవమునందలి ‘ఴ’ కు బదులుగా నుండుతెలుంగక్కర మేది? అది యెట్లుండును? అనువిచారము చేయవలసియున్నది. మనసారస్వతమున నీవింతధ్వనిగాని యక్కరముగాని లే దని యిదివఱకె వ్రాసియున్నాఁడను. మనవా రెపుడైన నెందులకైన నీధ్వనిని దెల్పవలసివచ్చుచో నాద్రావిడాక్షరమునే (ఴ) అక్కడఁ బెట్టుచున్నారు.* ఏమనఁ దెలుఁగులో దానికిఁ బ్రతి లేదు. ఇప్పుడు శ్రీలక్ష్మణరావుగారు దానికై యాంధ్రులు పూర్వము శాసనములలో వాడినప్రత్యేకాక్షరమును గనిపెట్టితి మనిరి. అది అడ్డుగీటు లేనిబండి ఱ వలె (ఱ) నుండు నఁట. ఇట్టివ్రాఁత శాసనములం దక్కడక్కడఁ గాన్పించుచుండుట కలదు గాని దానిని బూర్వలిపిజ్ఞులు ‘డ’ యని చదువుచువచ్చిరి. పాశ్చాత్యపండితులును మనపండితులును ‘డ’ గ నుచ్చరించుచువచ్చినయీ (ఱ) యక్కరమును శ్రీలక్ష్మణరావుగారు క్రొత్తగ ‘ఴ’ గా నుచ్చరించుటకుఁ దగినప్రబలకారణము కాన్పింపదు. తెలుఁగుశాసనములందుఁ గల ‘ఱ’ అనుసంజ్ఞను బండితు లిదివఱకుఁ జదివినట్లుగా ‘డ’ గాఁ జదువక తాము ‘ఴ’ గాఁ జదువుటకు రెండుకారణముల వీరు చూపిరి. (౧) యుద్ధమల్లశాసనములో ‘డ’ ను దెల్పుగుర్తు బహుస్థలములలో వాడఁబడినది వేఱుగఁ గలదఁట. అది ‘డ’ గా నున్నదఁట. ఇది యట్లు లేక భిన్నముగా నున్నదఁట. ఒకయుచ్చారణమునకె రెండుభిన్నసంజ్ఞ లొకశాసనమునందే వాడఁబడుట తగి యుండ దఁట. కాన ఱ ను ‘డ’ కంటె భిన్నాక్షరముగాఁ దలంతురఁట. (౨) కన్నడములో ‘ఴ’ కారమును దెల్పుటకై యీ ‘ఱ’ అనుసంజ్ఞయే వాడఁబడుచున్న దఁట. కాన నిందును నయ్యది ‘ఴ’ కావలె నంట. ఈరెండుకారణముల చేతను వీరు తెలుఁగుశాసనములందలి ‘ఱ’ అను దానిని ‘ఴ’ గా గ్రహింతు

* చూ. బహుజనపల్లి సీతారామాచార్యులవారి నిఘంటువు మున్నగునవి.

రంట. పరికించిచూడ నీరెండుకారణములునుగూడ సరియైనవిగాఁ గాన్పిం చుట లేదు. ఏమన :—

(౧) ఒకభాషలో నొకధ్వనిని దెల్పుటకు రెండుమూఁడుసంజ్ఞ లుండుట యును గలదు. లేఖకులు వానిని స్వేచ్ఛగా వాడుటయుఁ గలదు గాని యొక్క దానినే పట్టుకొని ప్రాఁకులాడుట లేదు. యుద్ధమల్లశాసనలేఖకుఁడు స్వేచ్ఛ గా నొకధ్వనిని దెల్పుటకై బహుసంజ్ఞల వాడుచు వచ్చె. ఇందులకుఁ దగు నుదాహరణముల నీక్రింద నిచ్చుచున్నాను.

(1) 'చేఁబ్రోలను' పదమునందలి 'బ్రో' యనుధ్వనిని దెల్పుటకై 22-వ పంక్తిలో 'చేబ్రోల' నియు 29-వ పంక్తిలో 'చేంబ్రోల' నియు రెండుసంజ్ఞల వాడె. ఒకశబ్దమునం దున్నయొక్కధ్వనిని దెల్పుటకే రెండుభిన్నసంజ్ఞల వాడుటయు కాక వనిపట్టి వ్రారకు బదులుగా శకటరేఫమును వాడె. "శకటరేఫప్రయో గము విశేష" మని శ్రీరామయ్యపంతులవారు వ్రాసియున్నారు. గొంట్రు అనునది 'గొణ్డు' అని వ్రాయఁబడియున్నది. వ్రాఁతడి వాడలే దేమో యన 13 తావుల దానిని వాడినాఁడు. కావున లేఖకునకు నొక్కధ్వనినే బహువిధ ము లగుసంజ్ఞలచే లిఖించునిచ్ఛ యున్నట్లు కాన్పించుచున్నది. 'ఉ' అను ధ్వనిని దెల్పుటకై మూఁడువిధము లగుసంజ్ఞల వాడినాఁడు. అప్పటి కెన్ని సంజ్ఞ లుండిన నన్నిటి వాడినాఁడు. 'బెజవాడ' యనుపదమును రెండువిధ ముల వ్రాసె. ఏ ఓ అనుధ్వనులు రెండుమూఁడువిధముల లిఖింపఁబడియె. కావున "ఒక్కశాసనమునందే ఒక్కయుచ్చారణమునకై రెండుభిన్నాక్షరము లుపయోగింపఁబడిన వని చెప్పుట యుక్తియుక్తము గాదు." అని శ్రీలక్ష్మణరావు గారు వ్రాసినది యుపాస్త మగుచున్నది.

(౨) ఇఁక రెండవకారణమును విచారింతము. ప్రాచీనకర్ణాటకభాషలో 'ఱ' కారధ్వనిని దెలుపుటకై అడ్డుగీటు లేని బండి ఱ వాడఁబడినది గాన నం దును దీనిని 'ఱ' గానే చదువవ మని శ్రీలక్ష్మణరావుగారు వ్రాసిరి, గాని తెలుఁ గున నాధ్వనియే లేనప్పుడు దానికి నిందు సంజ్ఞ కలదనుకొనుట యెట్లు? అది యటులుండ నొకభాషయందలి యక్షరముయొక్క పోలికనుబట్టియా మఱియొక భాషయందలియక్షరధ్వనిని దెలిసికొనుట! అఱవమునందలిగ్రంథాక్షరముల లోని 'వ' మన తెనుంగు 'బ' వలె నుండును. అఱవమునందలి 'ఱ' కారము తెలుఁగునందలి లకారపుపోల్కవలె నుండును. అంతమాత్రముచే మన 'బ' ను 'వ' యనియు 'ల' ను 'ఱ' యనియు నుచ్చరింపవలసియుండునా? హళకన్నడపు

'చ' తెలుఁగు 'బ' వలె నుండును. కాన మన తెనుంగు 'బ' ను 'చ' యను కొనవలసియుండునా? కూడదు. ఇంతయేల తెలుఁగు లిపిలోనే పూర్వపు 'ధ' యిప్పటి 'ద' ను బోలి యుండును. కావున నక్షరరూపసాదృశ్యముంబట్టి రెండిట ధ్వని యొక్కటి యనినిర్ణయింపఁ బూనరాదు. అది చాలినంత ఋజువు కాదు. అదిగాక శ్రీలక్ష్మణరావుగారు వ్రాసినవ్రాఁతను బట్టిచూడ మొదటినుండియు నాంధ్రులును గర్ణాటకులుగూడ నీయక్కరమునె 'ఱ' కారస్థానమున వాడినట్లు కాన్పింపదు. 'ఴ' ఈరూపమునఁ గర్ణాటకు లాఱవశతాబ్దమునుండియు 'ఱ' ను దెల్పి రని వ్రాసి తెలుఁగు శాసనములలో నేడవశతాబ్దమున నీరూపము లేద నియు నప్పుడు వేఱుగ నుండెకి దనియు వీరు వ్రాసిరి. ఆవ్రాఁత నీక్రింద నిచ్చు చున్నాను :—

"రెండుసున్నలను ఒకదానిప్రక్క మఱియొకదాని నుంచి జోడించిన నెట్లుండునో యది యాయక్షరముయొక్క మొదటిరూపము."

ఈరూపము కన్నడములో లేదుగదా. ఇఁక దీనిని 'ఱ' కారముయొక్క ప్రతిరూపముగా వీ రెట్లు గ్రహించిరో! రెండు సున్నల నొకదాని ప్రక్కనొకటి జోడించుట 'ళ' ధ్వనిని దెల్పుట కని కాల్డువెల్లుదొరవారు వ్రాసిరి. ఏమైనను నాంధ్రాపూర్వ 'ఱ' యొక్క రూపనిర్ధారణము చేయుటలోఁగూడ శ్రీలక్ష్మణరావు గారు తేలిపోయి రని యూహింపఁబడుచున్నది. కావున నాంధ్రలిపితోఁ గూడిన పూర్వశాసనము లందున్న 'ఴ' అను చిహ్నమును దెనుంగువా రెన్నఁడును నుచ్చరింపని 'ఱ' యొక్క సంజ్ఞగా నెంచుకొన నవసరము కాన్పించుట లేదు. తెలుఁగునందుఁ గలధ్వనులలో నేదోయొకదానిని దెల్పుసంజ్ఞగా మనము గ్రహించుకొనుట యుచితము. దీనిని 'డ' యని పూర్వలిపి శాస్త్రజ్ఞు లగు శ్రీరామయ్యపంతులవారు మున్నగువా రిదివఱకె యుచ్చరించియుండిరికదా. అయినను శ్రీలక్ష్మణరావుగారు విషయమును సందేహములోఁ బెట్టిరి కావునఁ బూర్వపుటాంధ్రలిపియందలి 'డ' కారరూపవిచారమును గావింతము.

## డకారరూపవిచారము.

పూర్వశాసనములను బరిశోధించిచూడ 'డ' కారమునకు నడ్డుగీటు లేని ఴకారాకృతి వాడఁబడినట్లు స్పష్ట మగుచున్నది. నాకడఁ బ్రాచీనశాసనము లంతగా లేవు. శ్రీరామయ్యపంతులవా రిచ్చినవి మూడు నాలుగుమాత్రము కలవు. వానినిబట్టి నాచెప్పినదానిని ఋజువు చేయుదును. అఱవమునందలి

ప్ర తో సంబంధ మున్న దని చెప్పుటకు వలను గానిపదముల మీ కుదాహరణముగా నీయవలెను. లేకున్న మీరు దానితో నెట్లయినఁ గలుపఁజూతురు. నాయిచ్చురూపములఁ జదువరులు బాగుగా విమర్శించి చూచికొందురుగాక.

(౧) నందంపూడిశాసనములో 60-వ పంక్తిలో 'చూడామణిః' అనుపదమునం గల 'డా' యనుధ్వనిని దెల్పునక్కరము 'టా' గాఁ జెక్కింపబడి యున్నది. 64-వ పంక్తిలో 'క్రీడయా' అనుదానిలోని డకారము 'ట' గా వ్రాయఁబడి యున్నది. యుద్ధమల్లశాసనము గలజాతిమీఁదనే చెక్కఁబడి యున్న యీశ్వరభట్టసోమయాజుల శాసనములో 'డ' కారము మూఁడునాల్గుచోట్ల వచ్చినది. 4, 5 పంక్తులలో మంటలి (మండలి) యనియు 6-వ పంక్తిలో గుముటూరి (గుముడూరి) 8-వ పంక్తిలో బెజవాట (బెజవాడ) అనియుఁ జెక్కఁబడి యుండె. వీనిలో గుముడూరిని మీయిచ్చ వచ్చినట్లు పలికినను మండలిశబ్ద బెజవాడశబ్దముల నట్లు పలుక వలనుకాదుకదా. యుద్ధమల్లశాసనములో బెజవాడ యనుపదమునందలి 'డ' కారము శ్రీలక్ష్మణరావుగారు నిస్సంశయముగా 'డ' ధ్వనిని దెల్పునక్కర మని యొప్పుకొనిన 'డ' అనురూపముతోనే యీఁబడియున్నది. అది యీశాసనములో నడ్డుగీటు లేని ఱ వలె నీఁబడినది. చదువరులకు బాగుగాఁ దెలియుటకై రెండురూపముల నీక్రింద నిచ్చుచున్నాను.

యుద్ధమల్లశాసనము. ఈశ్వరభట్ట సోమయాజిశాసనము.

నందంపూడిశాసనములోని రెండవకత్తులో నియ్యది 'ట' గా నున్నది. మొదటికత్తునకును దీనికిని భేద మేమన దీనికిఁ దలక ట్టుండుట. రెండుకత్తులకును దలకట్టులో భేద మున్నదని లిపిశాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు. మొదటికత్తులోఁ దలక ట్టంతగాఁ బాటింపఁబడెడిది కా దనియు రెండవకత్తులోఁ బాటింపఁబడెడి దనియు బర్నెలుదొరవారు వ్రాసియున్నారు. కావున రెండవకత్తులోని 'ట' మొదటికత్తులో 'ట' గా నుండునని రూఢిపడుచున్నది. మొదటికత్తులోఁ దలకట్టు తామరదుద్దువలె నుండుటయుఁ గలదు. కావున 'ట' ఇదియు మొదటికత్తులోనిరూపమే.

యుద్ధమల్లశాసనములో నిట్టి 'డ' కార ముండుట.

శ్రీలక్ష్మణరావుగారు యుద్ధమల్లశాసనములోని 'డ' కారముల నన్నిటిని బేర్కొనుచు నొక్కచోట నున్న 'డ' కారమును మాత్ర మేకారణముననో

ముట్టక విడచిరి. 38-వ పంక్తిలో 'బెడంగను' పద మొకటి కలదు. అందు డకారము కలదు. శ్రీ రామయ్యపంతులవారు బెడంగనియే చదివియున్నారు. తక్కిన 'డ' కారము లన్నిటిని బరిశీలించిన శ్రీ లక్ష్మణరావుగారు దీనిని బరిశీలించి యందలి 'డ' కును నఱవమునందలి 'ఱ' కును గలసంబధమును దెలుపక విడచిరి. కాఁబట్టి 'బెడంగను' తెలుఁగు శబ్దమునందలి 'డ' కును 'ఱ' కును సంబంధము లేదనియు నుండిన వారు దానిని దెల్పియే యుందు రనియు నే నూహించుచున్నాఁడను. ఇందలిడకారము 'ఱ' గాఁ జెక్కఁబడి యున్నది. కావున డకారమునకు నడ్డుగీటు లేనిఱకారము వాడుట కలదని యుద్ధమల్లశాసనమును బట్టియే ధ్రువపడుచున్నది.

పైవిమర్శనమువలనఁ బూర్వశాసనములందు డకారమునకు 'డ' యనియు 'ఱ' యనియు రెండురూపములు కల వనియు నయ్యవి రెండునుగూడ యుద్ధమల్లశాసనములో వాడఁబడినవనియుఁ దేలుచున్నది.

## ఉదాహృతశబ్దవిచారము.

పురాతనాంధ్రలిపిలో డకు 'ఱ' అనురూప మున్నదని కనిపెట్టినాము, కాఁబట్టి యిఁక శ్రీలక్ష్మణరావుగారు 'ఱ' యుతము లనియిచ్చినశబ్దముల విచారించి చూచుకొందము. వీరు పూర్వశాసనములనుండి 9 యుదాహరణము లిచ్చిరి కాని వానిలో 7 విమర్శనమునకుఁ బనికిరాని వై యున్నవి. అవి గ్రామములయొక్కయో పురుషులయొక్కయో నామము లై యున్నవి. వ్యుత్పత్తిగాని విశేష మగువాడుక గాని లేనివి. కాన వానింగూర్చి చర్చించుట కవకాశము లేదు. ఎట్లన :—

౧. విజయాదిత్యుని ఏడూరుశాసనము. ఇందు 'బోఱిమ నామా' అని యున్నదఁట. దీనిని బోడిమ యనినను ననవచ్చును. బోఱిమ యనిచదివినను జదువవచ్చును. ఇది యది యని నిర్ధారణము చేయుట కవకాశము లేదుగాని బోడి యను తెలుఁగుపద మనుకొనుటలో హాని లేదు.

౨. విజయాదిత్య ద్వితీయ అమ్మరాజుయొక్క కలవచెర్లశాసనము. ఈ శాసనములో మనుష్యునిపేరిలో నీయక్షర మున్నదని వ్రాసిరే కానియాపే రేదియో వ్రాయ లేదు. కానఁ బరిశీలనమున కవకాశము లేదు.

3. రెండవచాళుక్యభీముని తామ్రశాసనము. ఇందు వేఱాంబా యని యున్న దఁట. ఇది వేడాంబ యెందుకుఁ గాఁగూడదు? వేడమ్మ వేణమ్మ యను పేళ్లు తెలుఁగులో నిప్పటికిని గలవు. వేఱంబ యనిన విశేష మేమి?

౪. నెల్లూరుమండలమునందలి నలజపాడుశాసనము. ఇందు 'ఱచ్చిన' అనియు 'ఱాళుకొండకు' అనియు నున్నవఁట. ఇవి 'డచ్చి' యు 'డాలుకొండకు'ను గావచ్చును. అట్లయిన నేమి హాని? ఱస్సియే ఱచ్చి యాయె నని శ్రీలక్ష్మణ రావుగారు వ్రాయించిరి. యుద్ధమల్లశాసనమునందలి 'ఱస్సి' నిగూర్చి ముందుఁ గావింపఁబడువిమర్శనమే దీనికిం జెల్లునుగాన నిచట విడిచితిని.

౫. విజయాదిత్యునిదైన కోలవెన్నుశాసనము. ఇందు మనుష్యనామమునం దీయక్షరము కల దనిరి. ఆపే రీయు లేదు. విమర్శించుట యెట్లు?

౬. ప్రథమవిష్ణువర్ధనుని తిమ్మాపురముశాసనము. ఇందు 'పఱికి విషయ' యని యున్నదఁట. ఇది 'డ' యేల కాఁగూడదు? బండిఱ యేల కాఁగూడదు?

౭. పశ్చిమచాళుక్యరాజైనవిక్రమాదిత్యుని తలంచితామ్రశాసనము. ఇందు 'కొఱచుచుకొన్డు' అనుగ్రామనామము కలఁదట. ఇది 'డ' యుతము గాని 'ఱ' యుతముగాని కావచ్చును. శాసనములందుఁ జెక్కఁబడిన యక్షరము లచ్చున ముద్రించిన ట్లొక్కవిధముగను విస్పష్టముగను నెప్పుడును నుండ నేరవు. 'ఱ' లోని అడ్డుగీటు కొన్నిటిలో సరిగ నంటకపోవచ్చును. అట్టి దానినిగూడ శ్రీలక్ష్మణరావుగారు తా మిచ్చిన ఱ లపట్టికలోఁ జేర్చినట్లు కాన్పించుచున్నది. ఇట్లెంచుచో ననేకములఁ జూపవచ్చును. శక్తివర్మపభుబట్టుశాసనములో 63-వ పంక్తిలో ప్రొలిసానిచెఱువు అనుదానిలోని 'ఱు' 'ఱ్రు' గాఁ జెక్కఁబడియున్నది. దీని నేల లక్ష్మణరావుగారు తీసికొనలేదో! ఇట్టి వనేకములు కలవు. తిమ్మాపురశాసనమునందును తలంచిశాసనమునందును నున్నది శ యని కొందఱు భావించుచున్నారు. ఏది సత్యమో దైవమున కెఱుక.

ఇఁక వీరు యుద్ధమల్లశాసనమునుండి కాక పైనుండి చూపిన యుదాహరణములలో రెండుశబ్దములు విమర్శనమున కందునవియై యున్నవి. సత్యాదిత్యుని మలపాడుశాసనము నందలి 'చోడ' శబ్దమును, అందును నింద్రకీలపర్వతమునందలి శాసనమునందును వాడఁబడిన 'ఏడు' శబ్దమును విమర్శార్హములై యున్నవిగాన వానిరూపముల విమర్శించిచూచుకొందము.

చోడశబ్దముంగూర్చి

కర్ణాటకభాషలో 'చోళ' అనియుఁ దెనుఁగున 'చోడ' అనియు లిఖింపఁబడు నీశబ్దము మలపాడుశాసనములో 'చోఱ' అని లిఖింపఁబడియున్నదఁట.

అందుమూలముచే దీనిని 'చోళ' యని శ్రీలక్ష్మణరావుగారు చదువుదురఁట! ఈవిషయమై వా రిట్లు వ్రాసిరి :—

" 'చోళ' శబ్దము సాధారణముగ నిప్పుడు 'ళ' కారముతో వ్రాయఁబడినను బురాతనకాలపుటవమున ఞ కారము గలదిగనే యుండెనని అప్పయార్యు మొదలయినవారివ్రాఁతలవలనఁ దెలిసికొనవచ్చును. లక్షణయుక్తముగ వ్రాయువా రిప్పటికి నీయక్షరమునే యుపయోగించెదరు."

వీరు వ్రాసినదానింబట్టిచూడ నీశబ్దము 'ఞ' యుతముగ నఱవమునందుఁ గూడఁ బూర్వ మెప్పుడో వ్రాయఁబడెడి దనియు లక్షణవేత్తలుమాత్ర మట్లు వ్రాయుదు రనియుఁ దేలుచున్నది. శాసనలేఖకులు లక్షణవేత్త లెన్నఁటికిని గారు. శాసనములం దుండులక్షణదోషములకు మితి లేదు. అవి యన్నియును లేఖక ప్రమాదములే యని లిపిపారగు లందఱును దలంచుచున్నారు. కాన లక్షణవేత్తృత్వము నిచట నెత్తఁ బని లేదు. ఇఁక శ్రీలక్ష్మణరావుగారు పూర్వపుటఱవములో నియ్యది 'ఞ' యుతముగా వ్రాయఁబడెడి దనిరి. ఆ 'పూర్వ' మెంతవఱకు? మలపాడుశాసనము పూర్వకాలములోని దగునా కాదా? ఈ యంశము వారు చర్చింపలేదు. అయినను నఱవముమాట నటుండనిండు; తదితరభాషలలో నిది యాదినుండియునుగూడ ఞ యుతముగా వ్రాయఁబడుట లేదు. సంస్కృతమునందును దెనుఁగునందునుగూడ నిది 'డ' యుతముగా వ్రాయఁబడుచున్నది. యుద్ధమల్లశాసనలిపిని బోలులిపిలో వ్రాయఁబడిన శక్తివర్మపభుబట్టుశాసనములో నియ్యది 'చోడ' యని 'డ' కారయుతముగానే వ్రాయఁబడినది. ఇం దున్నయాకృతి శ్రీలక్ష్మణరావుగారు తప్పక డ కారరూపమని యంగీకరించిన ౙ యే కాని ,సందేహించిన 'ట' కాదు (చూ. 41. 44 పంక్తులు) ఈశబ్దముంగూర్చి పూర్వశాసనముల బాగుగాఁ బరిశీలించిన కాల్డు వెల్లుదొరవా రిట్లు వ్రాసిరి :-

" The ṟ of the Tamil word Soṟa is a peculiar sound not contained in Telugu in which it is generally represented by ḍ nor in Sanskrit and Pali in which it is represented by ḍ or ḷ."

మఱియును బర్నెలుదొరవా రిట్లు వ్రాసిరి :—

" In Telugu ḷ is always expressed by ḍ ; e. g. choda—choḻa."

ఈప్రకారముగాఁ దెలుఁగుశాసనము లన్నిటియందును నీశబ్దము 'చోడ' యని 'డ' కారయుతముగా వాడఁబడి యున్నది. సంస్కృతమునఁగూడ 'చోడ' యని వాడఁబడియున్నది. ఎప్పటినుండి యీశబ్దము సంస్కృతాంధ్ర

ములందు 'డ' కారయుతముగా నున్నదన దానినిగూర్చి కాల్డువెల్లుదొరవారి యిట్లు వ్రాయుచున్నారు :—

"It appears as choda in one of Asokas inscriptions and also in the Telugu inscriptions of the chalukya dynasty."

అశోకునినాఁటికే యీశబ్దము 'డ' కారయుతముగా వాడఁబడుచున్నది' చాళుక్యులు వ్రాయించినశాసనములందు 'డ' కారయుతముగానే యున్నది. మఱియును దొరవారిఁకనొకచోట నిట్లు వ్రాసిరి :—

"In Telugu inscriptions it is often choḍa as in Asoka."

ఈవిధముగా శాసనపరిశోధకు లెల్లరును నిస్సంశయముగా 'డ' కార యుతమగు చోడశబ్దమే పూర్వశాసనములందుఁ గలదనిరి. ఎప్పటి కిది డకార యుతముగా నున్నది? అశోకునినాఁటికే 'చోడ' యని డకారయుతమై యున్నది. చోడాదిశబ్దములు సంస్కృతపదము లని యఱవలు ముఖ్యముగ వారు తలంచుచున్నారు. ఈవిషయమై కాల్డువెల్లుదొరవా రిట్లు వ్రాసిరి.

"But it is certain that Pandya, the name of the southern most portion of the Dravidians, is Sanskrit, and a similar peculiarity meets us with regard to almost all the names of the South Indian peoples—Cholas, Keralas, Andras, Kalingas, &c., which so far as is Known at present are Sanskrit not Dravidian."

మఱియును డకారమునకు మలపాడు శాసనములో వ్రాయఁబడినరీతిగా 'ఌ' అనురూపము కలదని కనుఁగొనియున్నాము. కాఁబట్టి మలపాడుశాసనములో 'చోఴ' శబ్దము కల దనుటయుచితము కాదు. ఆ ఴ యను వింతధ్వని గలవింతయక్షరము తెలుఁగున లేదు. కల దనుట కవసరము కాన్పించుట లేదు. 'ఌ' అను రూపము 'డ' కారరూపమే కాని 'ఴ' కారరూపము కాదు.

ఏడుశబ్దముంగూర్చి.

ఇఁక, ఏడుశబ్దముంగూర్చి ముచ్చటించుకొందము. ఏడుశబ్దోచ్చారణములో నిత్యమును మనకు డకారధ్వనియే ప్రత్యాంధ్రునినోటనుండియు వినఁబడుచున్నది. సప్తసంఖ్యం దెలుపునఱవపదములో 'ఴ' కార ముండుఁ గాక. తెలుఁగులో నాయుచ్చారణ మెప్పుడును లేదు. కలదనుట కవకాశమును లేదు. మలపాడుశాసనమునందును నింద్రకీలపర్వతశాసనమునందును లిఖింపఁబడి యున్నఏడులో 'ఌ' ఉండుటచేతనుగదా మనవారు దానిని 'ఴ' యుత మనఁ బ్రయత్నించుచున్నారు. అది తెలుఁగులో 'డ' కారరూపమే యని నేను దానిని ఋజువుచేసియే యున్నాను. అయినను నింకను విమర్శింపవలె నందురా? యట్లె యగుంగాక.

సప్తసంఖ్యం గూర్చి కాల్డువెల్లుదొరవా రిట్లు వ్రాసిరి :—

" Seven—The Dravidian noun of number seven is eṛu in Tamil and Malayalam, êlu in Canerese êl in Tulu êdu in Telugu. These differences are in accordance with the rule that the Tamil deep, liquid, semi-vowel ṛ becomes ḍ in Telugu and ḷ in Canerese. "

లిపిశాస్త్రజ్ఞు లగుకాల్డువెల్లుదొరవా రుచ్చారణశాస్త్రమును బట్టి యఱవమునందలి 'ఴ' కారము కన్నడములో 'ళ' కారముక్రిందను దెనుంగులో 'డ' కారముక్రిందను మాఱిపోవు నని చెప్పుచుండఁగా దానినే శ్రీలక్ష్మణరావుగారు సోదాహరణముగా ఋజువుచేసియునుగూడఁ బదియవశతాబ్దమునను దరువాతనుగూడఁ 'ఏఴు'ను రూపము తెలుఁగున నున్న దన నెట్లు సాహసించిరో తెలియవచ్చుట లేదు. గ్రిమ్మ్యు ధర్మము (Grims Law) నుబట్టి తెనుఁగున ఏడని యుండుటయే యుచితము. అది యటులుండ సప్తసంఖ్యం దెలుపు నీ దక్షిణదేశపదములోని ఏడు (తెనుఁగులో నున్నట్లు) మొదటిరూపమో, ఏళు (కన్నడమున నున్నట్లు) ప్రథమరూపమో, ఏఴు (అఱవమున నున్నట్లు) ఆద్యరూపమో యెవరు చెప్పఁగలరు? అఱవములోనిది మొదటిరూప మని చెప్పనిచ్చఁగల కాల్డువెల్లుదొరవారుకూడ దానిని రూఢిచేయఁజాలక యేది మొదటిదో చెప్ప శక్యము కాదని యీక్రిందిరీతిని వ్రాసిరి :—

" It cannot be determined with perfect certainty which of the three consonants ṛ , ḍ , or ḷ was the primitive one in this numeral. "

ఈరీతిగా దెనుఁగున ఏడనుపదము స్వరశాస్త్రానుగుణమై యాంధ్రుల పలుకుబడిలో నుండఁగా దాని నఱవములోనికిఁ బోయి 'ఏఴు' గా భావించుటలో నేమి న్యాయ మున్నది? శాసనములలో ఏఴని యుండుటనా? డకారరూప మట్లుండు నని మనము నిస్సంశయముగాఁ దెలిసికొనినాము గాన దానిని (మలపాడుశాసనమునను నింద్రకీలపర్వతశాసనమునను నున్నదానిని) 'ఏడ'ని చదువుట న్యాయము గాని తెలుంగులో లేనివింతధ్వనిని దెచ్చిపెట్టి 'ఏఴు' నుట ధర్మము కాదు. ఇతరపదసంయోగమునందుఁగూడ నిది 'డ' కారయుతముగానే యుండును. ఏడు+పది=డెబ్బది యైనది. ఇట్లు సుప్రసిద్ధముగా డకారయుతమగు ఏడుశబ్దమును బూర్వశాసనములలోఁ గొన్నిట ఏఴు అని యున్న కారణమున నఱవమునందలివింతవర్ణము దీనియందుఁ గలదనుట మహాసాహస మగును. తెలుఁగులోనె ఴకార మున్నదనుకొనుటకంటె డకారమునకు ఴ అనురూపముండనె యున్నది గాన, ఏడని శ్రీరామయ్యపంతులవారు చదివినట్లు చదువుటయే యుచితము.

యుద్ధమల్లశాసన స్థపదవిచారము.

పై రితరస్థలములనుండి 'ఱ' యుతము లనియిచ్చినపదములు 'డ' యుతము లనుటయే యుచిత మని కనుఁగొనియున్నాము గాన నిఁక యుద్ధమల్లశాసనమునుండి వీరు 'ఱ' యుతము లని యిచ్చినపదముల విమర్శించిచూచుకొందము. వీరిశాసనమునుండి మొదటఁదీసినపదము 'ఱస్సి'. ఇది 14-వ పంక్తిలో నున్నది. దీనిని శ్రీరామయ్యపంతులవారు 'డస్సి' అని చదివియుండిరి. అది 'కా దని వీరు దానిని 'ఱస్సి' చేసిరి. అయిన నర్థ మేమన నర్థముమాత్రము వీరి కింతయు స్ఫురించియుండలేదు. ఇందుల కఱవమునం గలమూలపదమే కాన్పింపలేదు. ఇందునుగూర్చి వీరు వ్రాసినదాని నీక్రింద నిచ్చుచున్నాను :—

"ఇందలి మొదటిశబ్దమునకు మూలము అఱవమునందుఁ గాని కన్నడమునందుఁ గాని కానరాలేదు"

ఇఁక దీనికి వీ రేమి యర్థము చెప్పఁగలరు? ఏమియును జెప్పఁజాలరు. ఇట్లు 'ఱస్సి' యనిన నిరర్థక మైనది. శ్రీరామయ్యపంతులవారు చదివిన 'డస్సిం'గూర్చి విచారింతము. దీనికి శ్రీరామయ్యపంతులవారు తెలుఁగునుండి వ్యుత్పత్తిని నర్థమునుగూడఁ దెల్పిరి. అదెట్లన :—

'డస్సి—(పం. ౧౪) డయ్యుధాతువు క్త్వార్థకరూపము. ఇచ్చట సకర్మకముగాఁ బ్రయోగింపఁబడినది. ఇయ్యొట్టుడస్సి యనఁగా నీయొట్టును క్షీణింపఁజేసి పాటింపక యని యర్థము. ఒట్టుతప్పి యనియుఁ జెప్పవచ్చును."

మననిఘంటువులలో డయ్యుధాతువునకు బలహీన మగు నను నర్థమీఁబడియే యున్నది. ఈవిధముగా 'డస్సి' యని చదివిన నర్థము కలదు. 'ఱస్సి' యని చదివిన ముక్కును మూలమును గాన్పించుట లేదు. అర్థమే లేదు. కావున నెట్లు చదువుట యుచితమో చదువరులే యూహించుకొందురుగాక.

ఇఁక అడిసిన (21-వ పంక్తి) అడిపుట (3౯-వ పంక్తి) యనుశబ్దములంగూర్చి విచారింతము. ఇవి రెండును నొక్కధాతువునుండి పుట్టిన వని శ్రీలక్ష్మణరావుగా రంగీకరించియుండిరి. ఇఁక వీనియర్థమునకై యఱవమునకుఁ బోవలెనా తెలుఁగునందు మనకుఁ గావలసినయర్థము లేదా యని విచారింపవలసియున్నది. అఱవమునకుఁ బోయి అడి ధాతువునకుఁ గొట్టుట యనునర్థము కల దని శ్రీరామయ్యపంతులవారు వ్రాసిరి. దానికే నాశముచేయుట, పాడుచేయుట, ధ్వంసముచేయుట, కూల్చుట, ఇత్యాద్యర్థములు కల వని శ్రీలక్ష్మణ

రావుగారు వ్రాసిరి. ఇందులకై యఱవమునకు నేల పోవలయునో నాకుబోధ పడుటలేదు, అడుచుట యనుధాతువు తెలుఁగునందుఁ గలదు. దానికిని, కొట్టుట, త్రుంచుట లోనగునర్థములు కలవని మననిఘంటువులవలనఁ దెలియ వచ్చుచున్నది. లింగంబడిచిన ననఁగా లింగమును ద్రుంచిన) పీఁకిపాఱవేసిన యని యర్థము కానవచ్చును. మనవారు చెప్పినయర్థము తెలుఁగుధాతువు నందే యుండఁగా దానిని నసఁగా "అడుచుట" యనుదానిని విడిచి యఱవము నందలి 'அழி' కి నేల పోవలెను? అవసరము లేదు. అడుచుధాతు వగుచో అడిసిన అడిపుట యనురూపము లెట్లు వచ్చిన వందురా? అడిచిన, అడుచుట అని యుండఁదగినదే కాని లేఖకుఁడు విద్యావంతుఁడు కాకపోవుటచే అడి సిన యనియు అడిపుట యనియు లిఖించె. 'పైవారు' అనుటకు మారుగా 'పయ్యావరు' అని లిఖింపలేదా? 'ప్రత్యక్షమై యున్న' అనుదానిని 'ప్రత్యక్ష బయన్న' అని చెక్కలేదా? చేంబ్రోలుయేలెడు అని చెక్కలేదా? దీనిని బట్టి ఏలుధాతువు యాదియందురా? అట్లె అడిపుట యనునదియును అడిసి యను నదియు లేఖకదోషములు, అట్లు కా దందురా. அழி ధాతువు నెత్తికొనినను అడిసిన అడిపుట యనురూపము లెట్లు సాధువులు? కావున మనము తెలుఁగు ధాతు వగు అడుచుధాతువును ఐడచి యఱవమునందలి அழி ధాతువును గ్రహింప నవసరము లేదు.

విమర్శించిచూడ నఱవమునంపలి వింతయుచ్చారణము గల 'ழ' కారము తెలుఁగులోఁ గల దనుటకు నవకాశ మింతయుఁ గాన్పించుట లేదు. శ్రీలక్ష్మణరావుగారివాదము నిస్సారముగాఁ గాన్పించుచున్నది. వా రింకను దగు పరిశోధనము గావించి ప్రబలకారణములు చూపినం గాని యావింతయక్కరము మృదుమధురాంధ్రమునఁ గలదనుట కవకాశము కాన్పించుట లే దని యిందు మూలముగా నాంధ్రపండితలోకమునకు విన్నవించుకొనుచున్నాను.

శాసనము వింతశాసన మగుటకుఁగూడ ననేకము లగు కారణములు గలవు. వానినిగూర్చి ప్రత్యేకవ్యాసము వ్రాసియున్నాను. యుద్ధమల్లశాసన మనునది రాజనరేంద్రునకుఁ దరువాతిది గాని పూర్వము పుట్టినది కాదు. వీని నన్నిటినిగూర్చియును శాసనమునందలి తక్కినవింతలను గూర్చియును నా వ్యాసమున విపులముగాఁ జర్చించియున్నాను. "సత్యమేవ జయతి."

కాశీభట్ట - బ్రహ్మయ్యశాస్త్రి.

---

శ్రీరస్తు.

# ఆంధ్రభాషాప్రశంస.

మ. వరకృష్ణాతటినీతలప్రకటసౌభాగ్యంబు శ్రైలాగ్రభా
స్వన్మల్లేశము తాడికొండపుర మస్మద్వాసమౌ విద్వదా
కరభాస్వన్మదిగొండవంశభవుఁడం గావ్యజ్ఞసేవానుభా
వ్యరసస్ఫీతుఁడ నాగలింగసమభిఖ్యాముఖ్యవిఖ్యాతుఁడన్.

ఉ. శ్రోత్రరసాయనోక్తి యని సూరులు మెచ్చఁగ సౌకుమార్యస
త్పాత్రతఁ గన్న యాంధ్రజనవాగ్జయిత్రిమహామహత్త్వమున్
స్తోత్రముచేసి జన్మఫలసుస్థితిఁ గాంచఁ దలంచినాఁడ సౌ
భ్రాత్రమునన్ సదేశబుధవర్యులు ప్రేమననుగ్రహింపుఁడీ.

ఉ. మానితసాహితీమకుటమండన మైనరసప్రబంధము
న్నానుగఁ జేసినట్టిబుధమాన్యుఁడు పండితరాజు భాషలం
జానగునాంధ్రమే యనియె సందియ మేది కులాభిమానము
న్నానియు దేశభాష నభిమానము మానఁడు వింత యే మిఁకన్.

చ. తమతమబాసలం జనులు దప్పక పేర్కొనుచుందు రట్ల ను
త్తమత లభించునే సుజనతానుత నాంధ్రసరస్వతి న్మహా
త్తములు విదేశవిజ్ఞులు ముదంబున మెచ్చుట భాషలందు ను
త్తమపదలాభవైభవ ముదారత దీని కొసంగఁజాలదే.

ఉ. గంధగతవేదవైరిమతరాజి ప్రభూతనుతప్రబంధనీ
రంధ్రితభూనభోంతరవిరాజితుఁ డప్పయదీక్షితేంద్రుఁ డీ
యాంధ్రత లేమి కాత్మఁ గటకటా వెతఁజెందె జగత్ప్రసిద్ధిగా
నాంధ్రత యాంధ్రభాషయు ననల్పతపఃఫల మంచు నెన్నఁడే.

చ. పలుతెగ లైనభాషల నపారవివేకము గన్నకృష్ణరా
యలు నిజమెన్నఁ గన్నడధరాధిపుఁ డయ్యును దేశభాషలం
దెలుఁగును లెస్సఁ జేసెఁ గద దీనిమహత్త్వము నిక్కువంబుగాఁ
దెలియక యిట్లు పల్కునె సుధీజనతావినుతుం డలంతియే.

ఉ. నిత్యవిమర్శనైకపరినిష్ఠితు లింక స్వతఃప్రమాణతా
మత్యధునాతనార్యజనమస్తకవాహ్యవచస్కు లైనవా

శ్చాత్యులు ప్రాచ్యభాషలఁ బ్రశస్యను దెల్గునె చేసి రిద్ధిమేల్
బ్రత్యయకారిగాదె జయపట్టము భాషల నాంధ్రి కీయఁగన్.
శా. వ్రాలా చూడఁగ మేలిముత్తెములచాల్ రాజిల్లుదేశ్యంపుశ
బ్దాలా క్రాల్గోలనూలిపాలియులివుల్ భాసిల్లు ప్రావ్యంపుఁబ
ద్యాలా యెంచఁగ నంచయానసడ లాహో తెల్గునన్ సందియం
బేలా దీనికిఁ దక్కుబాస లెసయానే సౌకుమార్యంబునన్.
ఉ. విందులుగాంచుఁడీ భువనవిశ్రుతభాషలఁ జూడఁజూడఁ జ
క్కందన మిందె కాక మఱి కల్గునె యెయ్యెడనే స్వరందముం
జిందెడు కుందకుట్మలరుచిం దవులొందిచరించుతుందిలేం
దిందిరబృందసుందరరుతిం దలపించెడిముద్దుపల్కులం
జెంది మనీషిపఙ్క్తి రసశేవధి ముంచుచు నిందు నాంధ్రి నె
మ్మిం దివిషద్వచోవిదులమెప్పునకై కృతిఁ గోరినన్ శతా
నందనివాసనిష్ఠుతదనంతవిభంగతరంగసంగతా
మందకలధ్వనిస్ఫురదమర్త్యధునీపృథునీరపూరని
ష్యందవిడంబిశుంభదుపసంభృతసంభ్రమశోభిగుంభనా
నందితపండితక్రమమునం బచరింపఁగవచ్చు దేశ్యసూ
క్తిం దనియింపు మన్న నలతేనెలసోనలుజాలువాఱ వీఁ
కం దగు జంటిగెంటుతెలిగంటులవాతెఱపంటిసంటుతి
య్యందనముం దలిర్ప మరుసమ్ముల నిమ్మగు కమ్మతావులుం
గ్రందుకొనం గొనంబులు గరం బలరన్ రతనాలప్రోకలై
యందపుమోకలై గొనబులౌ లలిపల్కుల నానువారికి
న్విందొనరింపవచ్చు మఱి వెణ్ణెయి కోఴి యుఱ్ఱుప్పుతన్ కురల్
కాంద ళిడై మిడ ర్మిఴ మిఴత్తొడవాఴుపఴంనరళ్లిర
ళ్లిందను ద్రావిడోక్తి యెన యెట్లగు దీనికి నింకమీఁద ని
ల్లింద యదన్ను రాక్షసగళింద విభీషణు కేళి మాడి కూ
ట్టొం దను కన్నడంబు సరియో కన నీగతి నెల్లబాసలం
దుం దుల లేక శోభిలు సనుత్తమభాషకు మూల మెంచఁగాఁ
గొందఱు పూని రెండిటను గొన్నిపదంబులు సేరియుండఁ జూ
డం దమిళంబు దీనికి స్ఫుటంబుగ బీజ మటందు రింక నుం
గొంద ఱిలం ద్రిలింగపదగోచరమైన తెలుంగుఁ బండితా
ళిం దనియింపలేని త్రికళింగపదోత్థఁగ నెంతు రెంచ నీ
కొందఱు తెంపు తెం గ నెడి ప్రోత్తపదంబులు మూలమందు రే

మందము దీనిఁ బోవిడువుఁ డారయుఁ డీ మఱి యొక్కచిత్రముల్
ముందటి సత్కవీశ్వరుల మూలధనంబును జూడ సంస్కృతం
బందలిపూర్ణపాండితి గదా యిఁకఁ గొందఱు గ్రంథకర్తలం
దుం దలపోయ నిప్పు డది తోఁపదు గా సురభారతిం గవుల్
ముందుగఁ బద్యబంధముల ముచ్చటగా రచియించి నాటకం
బుం దనరం బొనర్ప కటమున్న మహాకవిపట్ట మబ్బదం
చుం దిలకించి వ్యంగ్యములు శోభిల నొక్కటి రెండు మూఁడు జా
నొంద రచించుచుండ్రు మఱి యు న్మనుముందటి యాంధ్రసత్కవీ
డ్బృందము నాయు వెల్ల హరియించెను పద్యనిబంధనంబు తో
నందముగాఁగ నాటకము లారచియించునదృష్టరేఖ వా
రొందఁగఁ జాలరైరి యిపుడో మఱికొందఱు ధీయుతుల్ కృతు
లొప్పిందుగఁ జల్పఁబూని గణము ల్వడి ప్రాసములుం గణింపఁగా
నిందుశ్రమంబు గల్గుననియే తలపెట్టక పద్యకావ్యముల్
ముందుగ నాటకంబులనె పుష్కలతన్ రచియింతు రౌర మె
చ్చం దగుఁ గాలసుస్థితికిఁ జయ్యన వెల్వడి దూరదేశము
ల్సొందఁగ ధూమయానము బలెం బహుదూరపువార్త లాలకిం
పందగు తంత్రిసాధనము మాడ్కి మహాకవిపట్ట మారకే
యందనుసాధనంబు గననయ్యెఁగదా మఱి వీరు తొల్లి యే
చందపునోమునోఁచిరొకొ చాలిఁక వీరల నిట్టు లీసుతో
నింద నొనర్పఁగాదు మఱి నిక్కముగా బుధులార యిప్పుడున్
ముందును గల్గుసత్కవుల ముఖ్యవిశేషము నేర్పరింపఁగా
డెందమునం దలంచియె సుఁడీ యిఁక నేమన దేవవాణి శో
భం దనరారు ధీయుతులు భాసురహేతువిమర్శనంబు లిం
పొందఁగఁ జేసి సత్కృతుల నొప్పుగఁ గూరిచి దేశమాతృభా
షం దగునట్లు సూరిజన సంస్తవనీయనుగా నొనర్పవేఁ
డం దొరకొంటి నియ్యెడ దృఢంబుగ నెవ్వనిపిచ్చి వానికా
నంద మటన్ననీతిని మనంబున నెంచి మదీయభాషితం
బందలిదోషపంక్తి ముదమారఁ ద్యజించి గుణంబు గల్గినం
బొందికతో గ్రహించి యనుమోదముగాంచి యనుగ్రహింపఁగా
వందనముల్ రచించి యిటుపై విరమింప ననుజ్ఞనొందెదన్.

ముదిగొండ - నాగలింగశాస్త్రి.

శ్రీ:

# స్వాగతపద్యములు.

సీ. శింజానమంజులమంజీరశింజితరంజత్పదధ్వనుల్ రాణ మెఱయ
మందారమంజరీమధుఝురీమాధురీభరధురీణ ఫణితుల్ ప్రమద మెసఁగ
నతిమనోహరసువర్ణాలంకృతివిశేషభాసురసుస్వరూపమ్ము దనరఁ
బ్రతిపదప్రతిభానభావహావవిలాసనిరుపమనైపుణీగరిమ నెగడ
విజయవాటికాపురవరవిలసితాంధ్ర, సాహితీసభాపీఠికిఁ జారుగతుల
నెగడ వేంచేయు నాంధ్రవాణీమతల్లి, కిదియ స్వాగతపూర్వసత్కృతిశతమ్ము.

సీ. పావనకృష్ణాస్రవంతికాయాతవాతపరంపరలు సేద నపనయింపఁ
గమనీయకనకదుర్గాకృపాంచితకటాక్షములు తాపత్రయశాంతి నొసఁగ
విమలతపఃప్రీత విజయవాంఛితదాత శంభువు విజయకాంక్షల నిడఁగ
మాతృభాషాప్రథమాన భక్త్యభిమానములు ముందుకును బదమ్ములను దివిటీ
విజయవాటికాపుర్యభిప్రేతవిలస, దాంధ్రసాహిత్యపరిషత్సభాంగణమున
కరుగుదెంచిన నిఖిలబుధాగ్రసరుల, కిదియ స్వాగతపూర్వసత్కృతిశతమ్ము.

సీ. చెలువంపుఁబలుకుఁదొయ్యలిపలుకరకముల బెడఁగారునడకల బెళుకు కెఱింగి
తీయంపుఁబాగడపూఁదేనెతీపి దొఱంగు కవనంపుసొంపు సంగడ మెఱింగి
కలికికుల్కుల నొల్కు కవితాకుమారికిఁ బొలుపు గూర్చు నలంకృతుల నెఱింగి
ద్రాక్షసారాయమ్ము తమకున నెసఁద పెఱవస మొనర్చెడి రస మెఱింగి
కృతికి వన్నెను దెచ్చు నౌచితి నెఱింగి, పరఁగ లోకోపకృతికిఁ గబ్బముల నల్లు
బల్లిదు లగుమహాకవితల్లజులకు, నిదియ స్వాగతపూర్వసత్కృతిశతమ్ము.

సీ. కమ్మచ్చులోని తీఁగవిధంబు నొకభంగిఁ గవనధారామనోజ్ఞత చెలంగి
శబ్దనాళికల రసప్రవాహమ్ముఁ బాఱించి సిద్ధిని గాంచు మించు గలిగి
తావి మిసిమి మెత్తఁదన మొప్పురతనాల చందనా శబ్దరత్నములఁ గూర్చి
ప్రౌఢ యశా వాల్గంటి పోఁడిమిఁ బలు తెఱంగుల చిత్రపుం బోకడల మెలంగి
వాసిగాంచి యశోదేహభాసితు లయి, నేఁడుసభకు వేంచేయు నిర్నిద్రమతుల
నన్నయాదిమహాకవీంద్రప్రతతికి, నిదియ స్వాగతపూర్వసత్కృతిశతమ్ము.

సీ. అద్వైతితాఁ బ్రహ్మ మగురీతి భావనాత్మతఁ గవిసర్వంబు తానె యగును
దివినుండి భువికిని భువినుండి దివికిని జరియించు సుకవి విజ్ఞానదృష్టి
ప్రవహద్రసమున భావప్రపంచమునందు సృజియించు నూతనసృష్టి సుకవి
మహనీయభారతీమంత్రతంత్రోపాసకతఁ గవిబ్రహ్మ ప్రాజ్ఞత వహించు
నణువుకన్నను నణువయి యలఘుకన్న, నలఘువయి కానిపించు మహాత్ముఁడు కవి
యాతని యనంతఘనమహిమానుభూతి, కిదియ స్వాగతపూర్వసత్కృతిశతమ్ము.
సీ. కోరునంతనె ప్రతికూలమ్ము చెప్పక యిమ్మహాకృతికిఁ దా నియ్యకొన్న
యనఘుండు ఘనసంస్కృతాంధ్రమహారాష్ట్ర భాషాప్రపాండిత్యభాసురుండు
గీతారహస్యసత్కృతికినాంధ్రీకర్త వేదాంతవిజ్ఞాన విశ్రుతుండు
వ్యాకరణాచార్య పదభూషితుండును ఛాత్రసంపాదిత సద్యశుండు
నాంధ్రసాహిత్యపరిషదగ్రాసనాధి, పత్యమున కన్నివిధముల బహుసమర్థుఁ
డైననోరి సుబ్రహ్మణ్య ధీనిలయున, కిదియ స్వాగతపూర్వసత్కృతిశతమ్ము.

జంద్యాల - వేంకటశివకవులు.

శ్రీరస్తు.

# కవిప్రశంసాలేశము.

తే. శాస్త్రవిదులకు బాహ్యసౌష్ఠవము చూపి, యమ్ముకొనె నీకు స్వాంతరంగమ్ముఁ బ్రకృతి
నరతదీయవిలాససర్వస్వరసికు, నినుఁ గవిని నీశ్వరాఖ్యఁ బేర్కొనఁగఁ దగదె?
చ. అమరపురమ్ముసందలి యుదంతము, లబ్జజువీటిలోనిచి
త్రములు, దిగీశదివ్యనగరమ్ములలోని విశేషవర్తనల్
క్రమమున నీకెఱుంగనగు కైవడి నేరికిఁగానరావ నీ
యమలినభావచక్షువున కడ్డము లేదుగదా! మహాత్మకా!
సీ. పరమంత్రభేదతత్పరుఁ డైననృపునకు మంత్రులతో నైనమంతనములు
ప్రణయకుపితఁ దేర్ప రమణుండు కేళీగృహమ్మున నాడునెయ్యంపునుడులు
కేవలకరుణ నంతేవాసికి గురుండు పొనరించుతత్త్వసంబోధనములు
నిక్షిప్తధన మున్ననెల వంత్యదశఁ బుత్త్రునకుఁ దెల్పులోభిదీనతరవాక్కు
లొక్కఁడైనఁ దూచాతప్పకుండ నెట్లు, వినినకైవడి మాకుఁ దెల్పెదవొ? దివ్య
మైన శ్రోత్రంబు గలదేమొ యనఘ! నీకు, సకలబుధమాన్యగుణసాంద్ర! సుకవిచంద్ర!

మ. అవియేశబ్దము లానిఘంటువు లవే, యావాక్యముల్ సంధు ల
య్యవె; త్వల్లేఖిని సోఁకఁగా నమృతనిష్యందంబు లబ్బె కనుం
గవ కత్యుజ్జ్వలచిత్రరూపముల వేడ్కం జూపు; నియ్యాంధ్రజా
లవినోదం బెటనేర్చితోయి! భువనశ్లాఘ్యుండ! విద్వత్కవీ!

చ. నవుఁడవొ కాక పూర్వుఁడవొ; నట్టది మెట్టయొ కాక మిట్టయో;
తివిరి చరిత్రశోధకుల త్రిప్పు లివన్నియు నేల మాకు? నీ
ప్రవిమలకావ్యసర్గ మపవర్గసుఖప్రద మంతెచాలుఁ; ద
త్ప్రవణుల కాప్తకాములకు వ్యర్థవిచారశతంబు లేటికిన్.

సీ. ఖలగర్వపర్వతంబులు వ్రక్కలించుచోఁ దావకఫణితి శతారధార;
దేశహితంబు బోధించి ప్రేరించుచో నీవాక్కు ప్రకట డిండిమరవంబు;
జనదురాచారపిశాచాళిఁబోల నీ మహితోక్తి నరసింహమంత్రజపము;
అఖిలగుప్తార్థంబు లలవరింపంగ నీయమలభాషితము సిద్ధాంజనంబు;
నీ వెసఁగుచోటు వాగ్దేవతావసథము, నీకుఁ గావించుపూజ వాణీసపర్య
నిన్ను విడిచి సారస్వతనిష్ఠ గలదె? సకలబుధమాన్యగుణసాంద్ర! సుకవిచంద్ర!

దుర్భా - సుబ్రహ్మణ్యశర్మ.

శ్రీరస్తు.

# దిగువతిరుపతిగోపురమును గట్టించినవారు.

---

తిరుపతిపురములోని శ్రీగోవిందరాజస్వాముల సన్నిధివీథిలో నొక గొప్ప గోపురము కలదు. అది యించుమించు 120 అడుగు లుండును. ఆకృతిని బట్టియు, శిల్పవైఖరిని బట్టియు నది సుమారు మూఁడువందలవత్సరములకు ముందు నిర్మింపఁబడియుండు నని యూహింపఁదగి యున్నది. దానినిర్మాత యెవ రనియు నిదివఱకు మే మెన్నఁడును జింతింప కుంటిమి. అయిన నొక్కనాఁడు నేనును నాస్నేహితులును గార్యాంతర మేమియు లేనందున గోపురప్రతిమలఁ జూచుచు విస్మయించుచుండఁగాఁ గొన్నిప్రతిమలక్రింద మాసిపోయిన తెనుఁగులిపి కానవచ్చెను. కొంత పరిశ్రమపడి పఠింప నీయక్షరపంక్తి వెలువడెను :—

"శ్రీ ....మస్తు శ్రీమన్మహామండల తిరుమల తిరువెం
గళనాథరాజయ్య దేవచోళ మహారాజ లయ్య

వారికుమార అనంతరాజయ్యవారు శమకుభ
యంగా కట్టించ్చిన గోపురం శ్రీ"

ఇది గోపురముయొక్క పశ్చిమద్వారమున దక్షిణపువైపున గోపురభూభాగమున నుండి రమారమి 12 అడుగుల యెత్తులోనుండినది. ఈయక్షరపంక్తిపైని నొక్కపురుషప్రతిమయు, మూఁడు స్త్రీప్రతిమలు నుండినవి. ప్రతిమలు $2\frac{1}{2}$ అడుగులమొదలు $1\frac{1}{2}$ అడుగులవఱకుఁ బ్రమాణములు కలవి.

ఇట్లు గోపురనిర్మాతయొక్క నామధేయము లభించినందున మేము సంతోషపడుచుండ నీప్రతిమల కెదురువైపున శ్రీవేంకటేశ్వరప్రతిమయు, భార్యాభర్తల ప్రతిమలును గానవచ్చెను. వానిక్రిందుగఁ గూడ శాసన మొకటి కానవచ్చెను :—

"శుభమస్తు మట్ల తిరువెంగళనాథ రాజువారున్ను
వారిదేవులు చంనంమ్మవారున్ను"

అని తేలినది.

ప్రథమశాసనములోని ద్వితీయతృతీయాక్షరములు కూడ నిట్లుండవలె "శుభ" అని యుండవచ్చు నని యూహించితిమి.

దక్షిణపువైపునఁ బ్రతిమలు అనంతరాజయ్యవారును వారిమువ్వురు ధర్మపత్నులును; ఉత్తరపువైపున గోపురనిర్మాతయొక్క మాతాపితృలు నుండవలయు నని తీర్మానించితిమి.

శాసనములోని తిరువెంగళనాథరాజయ్యవారు "మట్లవారిసీమ" యనఁబడుచుండిన భూభాగమున కధిపతి యనియు, నదియిప్పటి కడప, కర్నూలు జిల్లాలలోని భాగములఁ జేరి యుండినదనియు, నమ్మహనీయుఁడీప్రాంతమున తోళ్లప్పాచార్య లనువారిపూర్వులకు రాజంపేటసమీపమున నొకగ్రామమును దానముచేసె ననియు వదంతి కలదు. ఇప్పటికి నాగ్రామము తోళ్లప్పాచార్యులవారి వంశస్థులలోఁ గొందఱ యధీనముగా నున్నది. దానశాసనము దొరకెనేని గోపురనిర్మాణకాలము సులభము.

క. కృష్ణమాచార్యులు.

శ్రీరస్తు.

# ఆధునికాంధ్రభాషాభివృద్ధి.

ఈమాట వినుటతోడనే ప్రాచీనాంధ్రభాషాభివృద్ధి యనియు స్ఫురించునుగాన నీ రెండువిషయములలో నాచెప్పఁబోవు నీవ్యాస మొకింత యాలకించి మన్నింతురుగాక యని కోరుచున్నాఁడను. ప్రస్తుతకాలమున సర్వాభివృద్ధులతోపా టాంధ్రభాషయు నభివృద్ధిఁ గాంచుచున్నదనువాదము వినుచున్నారము. అది యెంత సారవంతమో కొంత విచారింతము. భాషాభివృద్ధి పఠనముచేతను గవిత్వముచేత నీరెంటిచేతనుగదా వృద్ధిఁగాంచవలెను. పఠనముచేనే వే లుత్తీర్ణులై విద్వాంసు లగుట, కవిత్వమువలన నవీనగ్రంథము లభివృద్ధి యగుట తటస్థించును. ఇప్పు డాంగ్లకలాశాలలయందుఁ జదువుచున్న విద్యార్థులు ప్రధానముగఁ గాకపోయిన నప్రధానముగనైన నాంధ్రభాష నభ్యసించుచున్నారు. చదివినవారిలోఁ గొందఱు గాకపోయిన మఱికొందఱైనఁ బరిజ్ఞానము నొందుచున్నారు. ఇఁకఁ గవితావిషయ మన్ననో నాటకములు నవలలు వచనప్రబంధములు పాఠశాలలలోఁ జదువుటకుఁగా లెక్కకు మిక్కిలి చిన్నచిన్న పొత్తములు భాషాపరివర్తనములు కల్పితగ్రంథములు చరిత్రలు పరిహాసములు పాటలు పద్యములు నింక ననేకవిషయములలో నభివృద్ధిని గాంచుచున్నది. ఇట్లు పరిజ్ఞానమున నేగాక శబ్దజాలములోఁగూడఁ బ్రకృతిశాస్త్రమును తర్జుమా చేయుటకుగాఁ గల్పితము లగు సాంకేతిక పదములు, ఆంగ్లేయభాషను మార్చుటకై కల్పితము లగుజాతీయతాదిపదములు, ఆంగ్లభాషాతద్భవములు తెలుఁగు భాషనుండి పుట్టినవికృతులు మొదలగువాని యభివృద్ధి గనిపించుచున్నది. ఈ యభివృద్ధిఁ గోరువారు సెప్పు ప్రధానవాద మాబాలగోపాలముఁ దెలియు నటులు పుస్తకము లుండవలెను. శబ్దాడంబర మర్థగాంభీర్యము లేక స్ఫుటార్థప్రతిపాదక మగువ్యవహారభాషలో నీపొత్తము లుంట మిగుల శ్రేయస్కర మని నైయున్నది. ఈనవీనభాషాభివృద్ధికి మార్గమును జూపి ప్రసిద్ధిగాంచినది కీర్తిశేషు లగు శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగా రనుట బహుజనాభిమతము. ఈపంతులుగారు తెలుఁగులో నాటకములు లేనపుడు శాకుంతలమును దెలిఁ

గించి నాటకకవిత్వమునకు మార్గము సూపెను. ఆనాటకరాజము కాళిదాస కవితాపరిపాక లబ్ధరసమయి ప్రపంచమున కెంతదూరమున నున్నను దెలుఁగు శాకుంతలములలో నగ్రస్థానము వహించుచున్నది. ఆంగ్లభాషావ్యామోహ మగ్న మైనయీకాలములో నీసంతులుగారు సులభశైలి ననేకోపన్యాసముల గ్రంథరూపమునఁ బ్రచురించి యాంధ్రమును రుచిచూపిరి. మనుష్యసామాన్య ప్రవర్తనమును బోధించుటకై చేసిన కొన్ని పొత్తములలోను బ్రహసనముల లోనను స్వభావమును బోధించుటకై సంకరభాషను నాడిరికాని సంకరభాష గ్రంథస్థమై గౌరవింపఁబడవలయు ననుట వారియభిమతము కాదని వారు వ్రాసిన సలక్షణ గ్రంథమువలనను వారి వ్యాకరణముంబట్టియుఁ దెల్లమగును. కాని యిప్పటి వ్యవహారభాషావాదులు వ్యవహారభాషలో వారితదనంతరము వ్రాయఁబూని ప్రసిద్ధిం గాంచుటకు "యదనంతరం" న్యాయముచే వారికృతు లాధారమైన వని చెప్పినఁ జెప్పవచ్చును. వారికి లోపలను సంకరభాషలోనఁ బుస్తకములు గనిపించుచున్నవి గాని యయ్యవి కేవలము వెక్కిరించుటకై చేయఁబడినవి కొన్నియు లక్షణము తెలియక తెలివి తక్కువతోఁ జేయఁబడినవి కొన్నియునై చక్కని ప్రఖ్యాతిం గాంచ లేకపోయెను. ఇప్పటి గ్రామ్యభాషావాదులట్లుగాక లక్షణములం దెలిసికొనియుఁ దెలియ ననునభిమానముగలవారలై పొత్తముల రచించి వానిని బ్రఖ్యాతిలోనికిం దెచ్చుటకై వాదముల సల్పి తమకుఁ గలపలుకుబడి నంతయు నుపయోగించుకొని ప్రభుతావలంబన కలవారై విద్యాశాలల వంచించి ప్రసిద్ధిని బొందఁజూచుచున్నారు. ఇఁకఁ బ్రాచీనభాషాతత్త్వ మొకింత విచారింతము. సామాన్యజ్ఞానము మనుష్యజన్మసిద్ధ మగునది పుస్తకపఠన లేకయే తెలియును గాన నావిషయమై గ్రంథరచన యక్కఱ లేదని వారిమతము. కనుకనే కుక్క, పిల్లి, కోడిపాఠములు వారు పిల్లలకై వ్రాయలేదు. వేద మజ్ఞాతార్థజ్ఞాపకము గాని లోకవిజ్ఞాతార్థముం జెప్పదు. ఆమార్గము ననుసరించి తన్మార్గానుయాయు లగుపెద్దలు నిట్టిస్వల్పవిషయముల వ్రాయరైరి. పుస్తకముల వ్రాయుటలో శబ్దసాధుత్వ మర్థగాంభీర్యము వ్యఙ్గ్యప్రాధాన్యము రసబాహుళ్యము గలగ్రంథముల రచించిరి. వాల్మీకి వ్యాసుఁడు కాళిదాసు మొదలగు గీర్వాణభాషాప్రణేత లేత్రోవం బోయిరో నన్నయతిక్కనాదు లా త్రోవన త్రొక్కిరి. నన్నయభట్టారకునకుఁ బూర్వ మాంధ్రమునఁ గవిత యుండిన నుండవచ్చునుగాని ప్రసిద్ధగ్రంథము లట్టివి మనకు లభింపకుంటచే నాయన మనకు మార్గదర్శకుఁ డయ్యెను. గ్రంథరూపమును ధరించినయాంధ్రవాణి

నన్నయభట్టారకోపజ్ఞమై తనలావణ్యమున నీభారతదేశభాషల కగ్రస్థానము వహించి దేశభాషలందుఁ దెలుఁగులెస్స యనుప్రఖ్యాతిని గాంచెను. కవిత్రయ ప్రణీత మగునాంధ్రభారతము సంస్కృతమునుండి పరివర్తితమైనను స్వతంత్ర గ్రంథముంబోలె విలసిల్లుచు వ్యాసమహాముని రచనపాటవమునకుఁ దీసిపోక మన భాషాజననికి శిరోభూషణమై విలసిల్లుచున్నది. ఆంధ్రమున కదిమొదలు నేఁటి వఱకు లక్ష్యగ్రంథ మనిన లక్షణగ్రంథమనిన భారత మనియేకదా చెప్పవల యును. శబ్దసాధుత్వమును బోధింప వ్యాకరణము ఛందస్సును బోధింప ఛంద శ్శాస్త్రము. ఇట్లే అలంకారశాస్త్రము, ధర్మశాస్త్రము, మహాపురుషజీవితమును బోధింప నితిహాసము. ఇది యది యన నేల. ఆంధ్రకవితామతల్లి యాయుస్థా నము లన్నిటఁ బోషించుచున్నది యాభారతమేకదా. తర్వాత వచ్చుకవిపుంగవు లందఱు నామార్గమునె త్రొక్కి తమతమ ప్రతిభావిశేషములం బ్రదర్శించిరి. అదిమొదలు నేటివఱ కేనూత్నమతావలంబకులో తక్క నవిచ్ఛిన్నముగ నా మార్గముననే నడుచుచున్నారు. కారణమేమి! పరిశీలనబుద్ధితోఁ జూచిన మన యూహాలకు స్ఫురించు స్ఫురణ లన్నియు "బాణోచ్ఛిష్ట మిదంజగ" త్తనినట్టు లాగ్రంథములం గలవు. "నైకమోజః ప్రసాదో హీరసభావవిదః కవేః" అనినట్టు లోజఃప్రసాదగుణము లామహాకవివాక్యముల సందర్భానుసారముగ వ్యక్త మగు చుండును. ఇప్పటివారలు, అందఱకుం దెలియునట్లు కవిత యుండవలయు నని వా దించువారలు నిస్సారతను దెచ్చికొనిరే కాని మార్దవమును జూపఁజాలకపోయిరి. కవిత సులభశైలిలో నుండవలయు నన్న శైలిని మార్చవలయునేగాని సారహీ నము సేయఁగూడదు. మంజులపదశోభిత యై యలంకారభూషిత యైనకవితను గాఢముగ హృదయమున నాటునట్లు చెప్పవలయు నన్న నది కవికే చెల్లును గాని కవిగానివాని కెన్నితిప్పలు పడినను జెల్లదు. ఇందు కుదాహరణము ధర్మ రాజు సంధినిమిత్తమై కృష్ణుని హస్తినాపురము పంపుచుఁ, దాఁ జెప్పవలసినదంత యుఁ జెప్పినపిదప, "మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు వాక్యమ్ములపద్ధతి యెఱుఁగుదు, పామ్మెవ్వఁడ నీకు నేను బుద్ధులు సెప్పఁగ" అని విరమించెను. ఇందు సోమయాజిగారు శబ్దసౌలభ్యమును జూప వలసినంతఁ జూపి ధర్మరాజునకుఁ గృష్ణునందుఁ గలభక్తినమ్మిక తనమనోదార్ఢ్యముఁ దెల్పుచు రాయబారిగాఁ బోవువాఁ డెట్టిప్రజ్ఞానవంతుఁడై యుండవలయునో ధ్వనింపఁ జేసె. ఇట్లె భాగవతములోఁ బోతనామాత్యుఁడు బలి వామనునకు దాన మిచ్చుతఱి గురువాక్యములు విని తనకు సర్వధనాపహరణము నిశ్చయ మని తెలి

సియు సాహసించు సందర్భమును దెల్పుచు, "ఉడుగని క్రతువులవ్రతములఁ, బొడఁగనఁ జననట్టి పొడవుపొడవున గుఱుతై, యడిగెడునట ననుబోఁటికి, నిడరాదె మహానుభావ యిష్టార్థంబుల్" అనిచెప్పెను. ఇందుఁబలికి దానప్రియత్వము, తన యిష్టమును సాగించుకొనినను గురువునందు భక్తిఁ గలిగియుండుట వైష్ణవతత్త్వము మొదలగు భావాతిశయమునంతయు మూర్తీభవింపఁజేసి పదలాలిత్యము నిరుపమానముగఁ బ్రదర్శించెను. ఇట్లు సుబోధకత సౌశబ్ద్యము గలపదజాలముతోడ సమయప్రపంచమును నిర్మించినకవిబ్రహ్మల ధిక్కరించి నిస్సారము నపశబ్దభూయిష్ఠము నగుకవిత్వముం బెంపఁబూనుట భాషావినాశనహేతు వని తజ్జ్ఞుల యభిప్రాయము. ఇప్పటికవితావిశేషము ప్రధానముగ నవలలు నాటకములు మొదలగువానిలోఁగదా యభివృద్ధిని గాంచుచున్నది. ఏనాటకమును జూచినను వీరకరుణరసములలో నొక్కటియె కానఁగనునుగాని తక్కినరసములన్నియు సామాన్యముగ విసర్జింపఁబడుచున్నవి. ఆవీరశృంగారములైనను గదాదండము చేఁబూని పండ్లుపటపటఁగొఱుకుచు మేఘగర్జనములు సేయుటతో వీరరసమును, గంటికిమంటికి నేకధారగా నేడ్చుచు నెత్తి యొత్తు బాఁదుకొనుచు విలపించుటతోఁ గరుణరసమును బరిసమాప్తిని బొందుచున్నవి. కాని భావగాంభీర్యము ధర్మప్రబోధము మొదలగునవి చాల మృగ్యము లగుచున్నవి. ఇట్లగుటకుఁ బ్రణేత లశక్తు లనుట నిశ్చయమే కాని యంతకన్నను గేవలపామర జనాకర్షణమే ప్రధానముగా నుంచుకొని నాటకసంఘములు సేయుప్రయత్నమతిశయిల్లుట ముఖ్యకారణము. పామరజనము ననుగ్రహించుటకు వారి కాయా కథాభాగములనైనఁ దెల్పునిమిత్తమై యీచేయుకృషి సఫల మనియే చెప్పవచ్చును. అట్లనుట సమంజసమే. ఇట్లే వ్యాకరణశుద్ధభాష తెలియనిసామాన్యజనుల కుద్బోధము గలిగించుటకై సంకరభాష నాశ్రయించుట ముఖ్యము. అని చెప్పువారివాదమును నిప్పటిమాపరిశ్రమ సామాన్యజనోపయోగనిమిత్తమై చేయఁబడుచున్న దని చెప్పినవారివాదమునకు ధన్యవాదము చేయవచ్చును, గాని వా రట్లనుట లేదు. ఇదియ పరమావధి, కవిత యన నిట్లె యుండవలయు ననువాదమునకుఁ బూనిరి. లోకముతోపాటు భాషయు మాఱుచుండును. అది స్వభావము. విధిగా నట్లు మాఱవలసినదే యని వారివాదము. ఈమాఱెడుభాషకుఁ దెలుఁగనుపత్రిక నొకదానిని బ్రచురించుచున్నారు. అది నేఁ గొంతవఱకుఁ బఠించితిని. నా కందు వారిసిద్ధాన్త మిట్లు కనిపించెను. భాషకు వ్యాకరణము గాని, భాష వ్యాకరణమునకు బద్ధమై యుండ నక్కఱ లేదు. వ్యా

కరణము రచించినచిన్నయసూరి తనవ్యాకరణమునకు విద్ధరుముగ, కూఁతురిని, అని ప్రయోగించెను గాన వ్యాకరణపుహద్దులలో భాష యుండనక్కఱలేదని కొంత విమర్శించి కొన్నిభారతము మొదలగువానిలోని ప్రయోగములను సాధించుటకు వ్యాకరణము చాల దని చూపించిరి. ఇప్పటియాంధ్రవ్యాకరణము భాష నంతను సంస్కరించుటకుఁ జాల దని యంద ఱొప్పుకొనినవిషయమే. కాని నిబంధనాబద్ధము గాక భాష మాఱినంత మాఱనీ క్రొత్తరూపములు సొచ్చినన్ని చొరనీ యనువాదము విచారదూరము. వ్యవహారములో భాష మాఱిన మాఱవచ్చునుగాని పరమార్థములో భాష నిబద్ధమైయే యుండవలెను. భారతాదిప్రబంధము లన్నికాలములలో నుండవలసినవి. ఆగ్రంథముల కర్థము గ్రహింపవలయు నన్న నాభాషాతత్త్వ మెప్పుడు గోచరమగుచునే యుండవలెను. అది యెట్లు ఘటిల్లు. ధర్మబోధక మగుశాస్త్రీయగ్రంథము లెప్పటికి నావ్యాకరణశుద్ధ మగుభాషలోనే యుద్భవిల్లవలెను, కాన యాభాష మాఱకూడదు. మార్పుఁజూచిన నెప్పటికప్పు డాపటిష్ఠ మగుభాషలో మీరు వ్రాయఁగడంగెదరా! అది మీకు సాధ్య మగునా! నాఁడు మొదలు నేఁటివఱకుఁ జేయుప్రయత్నములలో నట్టిగ్రంథము లావిర్భవించెను. కనుక నాభాషను నిత్య మని యొప్పుకొనవలయును. నామరూపాత్మక మగుప్రపంచము కల్పకల్పాంతరములయం దొక్కరూపముతోడనే యున్నదని యుపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. స్ఫోటరూప మగుశబ్దము నిత్య మని వైయాకరణులు; శబ్దార్థములు వానిసంబంధము నిత్యము గనుక వేదమునకుఁ బ్రామాణ్యము స్వతస్సిద్ధమని పూర్వమీమాంసకులు నుడివిరి. కాళిదాసు రఘువంశారంభమున మంగళారము పార్వతీపరమేశ్వరప్రార్థనఁ జేయుచుఁ వాగర్థావివసంపృక్తౌ వాగప్రతిపత్తయే। జగతఃపితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ" అనుశ్లోకములో శబ్దార్థసంబంధము ప్రకృతిపురుష సంబంధముతోఁ బాటు నిత్య మని సూచించెను, "ప్రమాదోధీమతా మపి" యనినట్లు కవికులాగ్రణి యగుకాళిదాసు "అన్వైహి" యని ప్రయోగింప వైయాకరణమూర్ధన్యుఁ డగుభట్టోజిదీక్షితులు, "అన్వైప్రీతివృద్ధిరసాధురేవ" యని దానియసాధుత్వమును బోధించెను. భట్టిమొదలగు మహాపండితులగ్రంథములలో 'హేసుభ్రు' అనిప్రమాదము గాంచనగును. అట్లని భాషను మార్పవలయునా. చిన్నయసూరి, కూఁతురిఁ అని వాడినంతన భాష నెందుకు మార్పవలెను. చేతఁగానిచో వారు పొత్తము లాభాషలోననే వ్రాయవచ్చును. చదివినతదధికారులు చదువవచ్చును. ఇంతియుకాని, యిష్టమ్ము

వచ్చినట్లు భాషను మార్చి భాషాగౌరవమును పాండిత్యమహిమను గ్రహింపఁ జేయఁబూనుట హేయము. పండితులు పాండిత్యము శబ్దజాలము నర్థగాంభీర్యము వానిప్రౌఢి వారిభేదకత మొదలగు నాయౌదార్య మట్లు సాగనిండు. అట్లు కాదని వీరు చేసినపని యేమి. ఇష్టమువచ్చినట్లు నిస్సారము నపశబ్దభూయిష్ఠము నగుభాషలోఁ బొత్తములు వ్రాసిరి. పండితాహ్లాదకర మగురసము భావము మృగ్య మగుచుండె. కాన నట్టికవితకుఁ బ్రచారము కాని బ్రఖ్యాతి గాని చేకూరక యాపొత్తములు మూలలఁ బడఁజొచ్చె. పోయినఁ బోవుఁగాక, అట్లుగాక పాఠశాలలలోని పఠనీయగ్రంథము లగుచున్నవి. మహాశయులార! ఈయంశము నొకింతశ్రద్ధతో వినవలయు నని మీయభిమానమును గోరుచున్నాఁడ. ఈహూణపాఠశాలలే కదా మనదేశభాషలకుఁగూడ నవలంబకము లగుచున్నవి. కాని యచ్చట నీభాషలకుఁ గలుగునగౌరవమును మీరు స్మరింపుఁడు. అచ్చట నాంగ్లభాష ముందు నాంధ్ర మప్రధాన భాష యని కదా వాడఁబడుచున్నది. చతుశ్శాస్త్రవేత్త యైనను నాపండితునిస్థితి హీనదశలో నున్న దని మీకుఁ దెలియనివిషయము కాదు. ఇఁకఁ బరీక్షలోఁ దేలుటయ కృతకృత్యత యని భావించుచు సర్వదా యాంగ్లభాషలోనె మునిఁగి తేలుచున్న విద్యార్థులయభిమాన మెంతమెండుగ నుండునో భావింపుఁడు ఐనను బొత్తములయం దున్నసారస్వతానందమును వైదుష్యము వక్తృత రసపోషకత గల పండితులు భారతము భాగవతము రామాయణము మొదలగుపుస్తకములలోని భాగములు సెప్పుచున్నపుడు రసజ్ఞు లగువిద్యార్థులు మైమఱచి వినుటయుఁ దగిన పరిజ్ఞానమును బొందుటయుఁ దటస్థించుచున్నది, పై నుడివినవలలు నాటకములు రచించినవారు తమపొత్తములను బ్రచారణచేయించుకొనుటకై చంకఁ బెట్టుకొని యేమితిప్పలుపడుదురో కాని, యీగ్రంథములం బఠింపించవలసిన భార ముపాధ్యాయులనెత్తిని, జదువవలసినభారము విద్యార్థులనెత్తిని నొకసారిగఁ గూలుచున్నది. ఆపుస్తకములఁ జూచిన నేమిచెప్పవలయునో తెలియదు. చెప్పకున్న పరీక్షలలో నుత్తీర్ణులు కాఁజాలరు. అందు శబ్దసాధుత్వమా వారి కక్కఱ లేదు. అర్థగాంభీర్యమా, వారికిఁ బనికిరాదు, చేతకాదు. వర్ణనావిషయము చూతమన్న "అస్థివద్భకవచ్చైవచ్ఛ్లవద్బల్లిగద్దవత్ । రాజతేభోజతేకీర్తిః పునస్స్వాసిదంతవత్" అనుపూర్వపుశ్లోకము జ్ఞాపకమునకు వచ్చుచున్నది. అందులోఁ గొన్నినామము లుదాహరించుచున్నాఁడ. బెంజమన్ ఫ్రాంక్లిన్, ఒకదొరసాని వ్రాసినయుద్ధచరిత్రకు తర్జుమా. ఇంకొకముసలమ్మ వ్రాసినరామ

పాట, వీనిలో నుత్తమోత్తమముగ నెన్నఁబడుచున్నది మంజువాణీవిజయము, పఠనీయ గ్రంథనిర్దేశకులు, ప్రాచీనకవికృతము లగుపుస్తకములలోనివిభాగముల ముద్రించునపుడు విశేషజాగరూకతతో శృంగారరసోద్బోధకము లగుపదముల రసభంగమున్నైన యోజింపక మార్చుచుందురు. అట్లు మార్చుట పరమామోదమె. విద్యార్థులు కట్టిపదములు వినఁబడకుండుట శ్రేయస్కరమే, మార్చినచోటుల నుదాహరించెద. గజేంద్రమోక్షకథలో గజేంద్రునిచేఁ బ్రార్థింపఁబడి గజేంద్రరక్షణార్థమై వచ్చునారాయణుని వర్ణించుచు, సిరికిం జెప్పడు....శ్రీకుచోపరిచేలాంచలమైనవీడఁడు గజప్రాణావనోత్సాహియై, యని నారాయణుని భక్తపరాధీనతను దెల్పుటకై రచించెను. అచ్చట వీరుచేసిన దిద్దుపాటు. శ్రీభుజోపరిచేలాంచలమైన వీడఁగని చేసిరి. కుచేలోపాఖ్యానమునఁ గుచేలుఁడు కృష్ణుని దర్శించి యింటికి వెళ్లుచు నా శ్రీకృష్ణుండు చేయుమర్యాదలను 'శ్రీకుచాలిప్తచందనాంచితకరాబ్జతలమునను నద్దులొత్తెవత్సలతమెఱసి,' యని స్మరించెను. ఇచ్చటఁ గుచాలిప్తయనుటకుబదులు కరాలిప్త యని పాఠమును దిద్దిరి. ఈవిధముగ వారు చేసినమార్పు లెంతరసవిహీనములై యున్నదియు సహృదయులకుం జెప్పనవసరము లేదు. విద్యార్థులకై నవరింపఁబూని రనుకొందము. అట్లైన నాపద్యములనే దీసివేసిన నెంతో బాగుండును. భర్తృహరిలో యతినృపతిసంవాదములో నృపతులు యతులను మన్నింపరనుటకు పృథుఘనస్తననమితోత్కటవారకాంతలముగాము, అనివర్ణించెను. ఇచ్చట, ఘనస్వననమితోత్కటవారకాంతలముగామని దిద్దిరి. ఘనస్వనముచే వారకాంత లెందుకు వంగి రని యడిగిన నేమిసమాధానము సెప్పవలయును. వారిశ్రద్ధావిశేషములు ఔచిత్యమును బాటింపక విద్యార్థుల బ్రహ్మచర్యరక్షణమే దృష్టియం దుంచుకొనినది యనిన ననవచ్చును.గాని నూత్నగ్రంథములలో నెట్టియౌచిత్యభంగ ముండినను నెంతవిరసముగా నున్నను నట్టిపచ్చిశృంగారమును విద్యార్థులకుఁ జెప్పించుటకు మాత్రము వెనుదీయుట లేదు. సుమతి యనువాఁడు మంజువాణిని మోహించెను. మంజువాణికిని సుమతియందు మోహము గలదు. వీరిపరస్పరానురాగములు సూచి కొందఱుసభ్యులు మంజువాణిని బ్రోత్సాహపఱిచిరి. యామె కన్నెగరవేసెను. పిదప నామెయుఁ జతురభాషిణియుఁ గలసి యుద్యానవనమున విహరించుచుండిరి. ఇంతలో సుమతి వారిని సంధిలెను. చతురభాషిణి కారణాంతరమను ఛద్మతోఁ దొలగెను. ఈసందర్భమున నాపొత్తముం జదువుఁడు. పాదుకేగినఁ దలపోలమునఁగాని నిల్వ దనుసామెత తెల్లమగుతీరున దాని కెంద

న్మిమోవిని తనమోమున మఱిమఱి ముద్దాడ....నునుసిగ్గున మోమువాంచి తాఁ బడినలంపటకుఁ బడలినదానికైనడి—ప్రళయభైరవ మనుపుస్తకములోఁ బరాక్రమబాహువనువాఁడు సోమప్రభను తనయుద్యానవనమున సంధిలి మోహించెను. ఆయమ తిరస్కరించెను. ఈయన బెదరించెను. అందు కామె మూర్ఛఁజెందెను. చెలికత్తెతో నామెను గారాగారమునకుఁ బంపెను. తదుపరి ఆపొత్తములోనివర్ణన “ఒకతీరునఁ దనతిక్కదిగఁగాఁ బరాక్రమబాహువులతా గృహమునుండి వెలుపలికి వచ్చెను”. ఇట్టిస్థలములలో వారిశ్రద్ధావిశేష మేమయ్యెనో దుర్జ్ఞేయముగా నున్నది. ఇక నాపొత్తములయం దున్నయపశబ్దముల నసందర్భముల వర్ణించిన నొకగ్రంథ మగును. ఏదియెట్లున్నను వారి యాజ్ఞానుసార మా పొత్తము లుపాధ్యాయులు సెప్పవలసియున్నారు. విద్యాస్థానములు విద్యార్థిబృంద మిట్టిదీనదశయందున్న నిఁక నాంధ్రభాషాభివృద్ధి యెట్లగును. ఈయాంగ్లపాఠశాలలోనైనను వారు చదువుకాలమంతయు నొకింత శ్రద్ధావిశేషముగఁ జదివిన మంచిపాండిత్యము గలుగకపోదు. ప్రతిపట్టనములఁ బల్లెలనుండి పాఠశాలలను వదలిన నిఁక విద్యాభివృద్ధి యననేమి. భాషాభివృద్ధినిఁ జేసికొనవలయు నన్న నీపాఠశాలలలోనె చోటు సంపాదించుకొనవలయును. ఆర్యులారా! యాంధ్రసారస్వతమును బరీక్షించిన గీర్వాణమును వదలిన నేమి మిగులునో యోజింపుడు. ఆంధ్రభాషాశరీరమును ధర్మమును లక్షణము లన్నిటిని గీర్వాణవాణియేకదా పోషించుచున్నది. ఆంధ్రదేశమన నేల, భారతవర్షమహిమాతిశయమును, ఋషిపుంగవుల విజ్ఞానధన మంతయుఁ దనకుక్షియం దిడుకొని భరించుచున్నది గీర్వాణవాణియే కదా. ఇదివఱకాంధ్రభాషకుఁ గలిగినయభివృద్ధి యొకసాహిత్యభాగములోననే గాని శాస్త్రజాలములఁ బ్రవేశ మంతలేదు. ఇపుడు తెలుఁగులో నున్న వ్యాకరణము తెలుఁకిగుభాష నైనను బోషింపఁజాలదు. ఇఁక నీభాషాశరీరమును బోషించుచున్నగీర్వాణవాణి నెట్లు పోషించును. ఆభాషాతత్త్వమును దెలిసికొనవలయునన్న పాణినీయ మభ్యసింపవలయును. షడ్దర్శనములం దెలింగింపఁగడఁగి కాఁబోలును వీరేశలింగపంతులవారు తర్కసంగ్రహమును దెలింగింపంబూనిరి కాని యది తెలుఁగనియు సంస్కృతమనియుఁ జెప్పుటకు వీలుగాక అయ్యె వారిని జేయఁబోయినఁ గోఁతియైన ట్లున్నది. పరమేశ్వరుని రెండునేత్రము లని చెప్పఁదగిన పూర్వోత్తరమీమాంసలు భారతవర్షధర్మమును బోషించుచున్నవి. ఇట్టియమూల్యరత్నము లాభాషాగర్భమున ననేకములు గలవు. ఎంతకాలము

తనపుత్రులచే ననాదరముగఁ జూడఁబడినను, నాగీర్వాణవాణి యింతవఱకుఁ దనదివ్యజ్ఞానము తనపుత్రుల కొసంగుచున్నది. తనదివ్యరూపము నుపాసించు ఘనులకు జ్ఞానామృతమును వర్షించుచున్నది. భారతపుత్రులార! ఈమీసారస్వతాభిమాన మాదిశకుఁ గొంత ద్రిప్పుఁడు. మనమాతృభాష నుద్ధరించుటకుఁ గృతప్రయత్నులు గండు. ఈభాషాస్వరూపమును దెల్పఁగలపండితులు బహుస్వల్పసంఖ్యాకులే మిగిలియున్నారు. వారుగూడఁ బోయిన నిఁక నాశ యుండదు. దానియాశను వదలుకొంటిమా సర్వశాస్త్రసంశోభిత మగుపాండత్యము దెలుఁగున లభింపదు. తెలుఁ గంతకుఁ జాలదు. ఆంధ్రభాషాపాండిత్యమును సంపూర్ణముగఁ బొందవలయు నన్నను గీర్వాణభాష నవశ్య మభ్యసింపవలసినదె. కాన నాంధ్రభాషాభివృద్ధిని గోరుచున్నమీరలు గీర్వాణభాషను వృద్ధిచేయుట విధియై యున్నది. కా దని పోనాడితి రేని కాళిదాసాదిమహాకవుల కవితామృతము, వాల్మీక్యాదిఋషిపుంగవుల జ్ఞానధనము, పాణిన్యాదిసూత్రకర్తలసర్వతోముఖ మగుసూత్రనిబంధన, వ్యాసగౌతమాదులపరమార్థతత్త్వ వివేచనము నశించు నేమో యని భీతి వొడముచున్నది. మాన్యులారా పూర్వకాలమును స్మరింపుఁడు. ఆకాలపుధర్మము, జ్ఞానము, శౌర్యము, నుత్సాహము నన్నియు నశించినవి. ఇఁక సారస్వత మొకటి ప్రాణావశిష్ట మై నిలిచియున్నది. పాపము శాంతిలుఁగాక. సారస్వతము పూర్వపుటౌన్నత్యము వహించుఁగాక. గీర్వాణభాషాభివృద్ధితో నాయమయనుంగుపుత్రికలు దేశభాషలు పెంపొందుఁగాక. తద్వారమున మనప్రజ్ఞాశౌర్యములు వృద్ధిని గాంచుఁగాక. ఆంధ్రమాతృప్రియపుత్రు లగుమీయుత్సాహసంపద వర్ధిలుఁగాక.

వేమూరి శివస్వామిశాస్త్రి.

శ్రీరస్తు.

# గ్రంథస్వీకారము.

వీరసంయుక్త :—ఇది దేశచరిత్రాంశబోధక మగు నేకాంకముల నాటకము. మ. శ్రీ. మోచర్ల హనుమంతరావుగారిచే రచింపఁబడినది. ఇందలికథ పృథ్వీరాజచక్రవర్తియొక్కయు నతనిపత్ని యగుసంయుక్తాదేవియొక్కయుఁ బవిత్రచరిత్రము. ఈమహమ్మదుగోరితో నీరాజదంపతులకు జరిగినమహాయుద్ధ మిందు వర్ణ్యము. కథాసంవిధానమును పాత్రౌచిత్యము నిందు బాగుగఁ బోషింపఁబడినవి. సంయుక్తాపదము రాణి మొదలగుపదములతోఁ గలిసియుండుటకంటె వీరసంయుక్తమగుటలో నెంతయో విశేషము స్ఫురించుచున్నయది. రచనాశైలి మృదులముగా నున్నది.

దీనసంరక్షణశతకము :—ఇదియు మ. శ్రీ. హనుమంతరావుగారు రచించినయదియే. చక్కఁగ భక్తి విరక్తిని బోధించుచుఁ గొంచెము లోకము నెఱింగించును.

మల్లిక :—ఇదియు హనుమంతరావుగారికృతియె. ఇందు ౧౦౯ గీతపాదములలో వరశుల్కమువలన జనుల కెంతటి బాధలు సంభవించునో యనువిషయము చక్కఁగఁ దెలుపఁబడినది. తల్లి లేనిపిల్ల యగుమల్లికనల్లారుముద్దుగాఁ బెంచి విద్యాబుద్ధులు గఱపినతండ్రి మల్లికకు వివాహోచితప్రాయము రాఁగానే సంబంధ మాలోచింప బెంగఁగొనుటయుఁ దండ్రిదుఃఖముం జూడలేక మల్లిక యగ్నింబడి యుసురు విడుటయు నాకెజనకుం డానాచితియందే భస్మమగుటయుఁ దుదకు వరశుల్కమాహాత్మ్యమున నాకుటుంబము పేరైన లేక నశించుటయుఁ బర్యవసితాంశముగా వర్ణింపఁబడి యిట్టిగాథలు కేవలకల్పితములుమాత్రమే కాక వాస్తవముగ నటనట జరగుచుయున్నవని జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. ఇది యాకారమునఁ జిన్నిపొత్తమైనను జాలిని నీతిని బోధించుటలో మిన్నగా నున్నది. వెల అణా, ౧.

ఈపైని వివరింపఁబడిన మూఁడుపొత్తములును కాకినాడలో యమ్. హెచ్. రావు అండుసన్సు. అను చోటికి వ్రాసినఁ బడయనగును.

సుగుణమణి :—ఇది ఈమనివాస్తవ్యులు అత్తలూరి సూర్యనారాయణ గారిచే రచింపఁబడిన చిన్నకథ. ౬౮ పుటలు. ౧౨ ప్రకరణములు. ఒక బ్రాహ్మణుఁడు కలిమి గలకాలమున నొడమఱచి పెద్దకూఁతు పెండ్లికై వరశుల్కమును మితిమీఱ నిచ్చి శుష్కదరిద్రుఁడై రెండవకూఁతును ద్రవ్యాశచే మూఁడుకాళ్లముదుసలి కంటఁగట్టి గ్రహించినశుల్కధన మల్పేతరమేమైన నద్దాని నత్యల్పకాలముననే వ్యయపఱిచి దైవికముగ సతీసుతులఁ గోల్పోయి తుదకుఁ బశ్చాత్తాపమొందుట యిందలికథాంశము. దీనివలన నెంతనీతిని లోకులు గ్రహింపఁగలరో యంతయు నీచిన్నిపొత్తమున నిమిడియున్నది. బోగముమేళముల ముచ్చట యిందు బాగుగాఁ జర్చింపఁబడినది. అనవసరవ్యయము మధకముగ వివరింపఁబడినది. రచయిత కిది ప్రథమప్రయత్నమగుటచే లక్షణవిరుద్ధప్రయోగము లటనటఁ గాన్పించుచున్నవి. వెల అణాలు ౬.

వలయువారు గుంటూరుజిల్లా దుగ్గిరాలపోష్టు ఈమనిలో నున్నగ్రంథకర్తకు వ్రాసికొననగును.

వనజాక్షి :—ఇది ౧౭౦ పుటలలో ౧౭ ప్రకరణములు గలచరిత్రాంశబోధక మగునవల. వైఖరి సుందరరామయ్యగారిచే రచింపఁబడి యెడ్డనపూడి సంజీవయ్య అండ్ సన్సువారిచే శ్రీవిజ్ఞానవినోదినీప్రచురములలో మొదటిదిగాఁ బ్రచురింపఁబడినది. ప్రకాశకులు విమర్శనార్థము పరిషత్తునకుఁ బంపిరి. ఇందుఁ గలచరిత్రము, మహారాష్ట్రశూరశిఖామణి యగు శివాజీచక్రవర్తి అఫ్జల్ఖాను అనుమహమ్మదీయసామంతుని గపటోపాయమున నన్యాయ్యమార్గమున నంతమొందించె ననులోకప్రవాదము ముఖ్యవర్ణ్యము. దీనికిఁ దోడుగ వనజాక్షి యనునొకబ్రాహ్మణబాలవితంతువు మొదటఁ బాతివ్రత్యమునను ధర్మశాస్త్రానుసరణమునను దన్ను బునరుద్వాహము గా నెంచినయొకసజాతీయసంఘసంస్కారి నొల్లక తురుకకూఁడుకుడిచి కులభ్రష్టయై యిఁక వ్రతములఁ జేసి పుణ్యలోకమందుట కవకాశము లేదని యడిగినవారికి సమాధానముఁ జెప్పి యువనుని బెండ్లియాడి దేశమునకు హిత ముపదేశించిన యొకపుణ్యాంగనచరిత ముపకథగా వర్ణింపఁబడినది. దస్తగిరిసాహేబుగారిమూలముననే గొందఱు మహమ్మదీయుల క్రౌర్యముగూడఁ జక్కఁగఁ దెలుపఁబడినది. పఠనీయగ్రంథనిర్ణాయకసభవారిపొత్తమును బాఠశాలాపఠనీయముగా నంగీకరించిరి. దీని వెల అణాలు ౧౨.

వలయువారు మదరాసు నమ్మాళ్వారువీధి ౨౫ నెంబరు గృహమందలి యె. సంజీవయ్య అండుసన్సువారికి వ్రాసికొనవలయును.

ప్రతిజ్ఞాపాలము:—ఈనవల వంగభాషలో పాంచకడి దేవునిచే రచియింపఁబడినదానికి వేంకటపార్వతీశ్వరకవులచే నయినయాంధ్రీకరణము. ఆంధ్రప్రచారిణీగ్రంథమాలకుఁ బునరుద్ధారకు లయిన శ్రీ. అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుఁడుగారిచేఁ బ్రకటింపఁబడినది. ఆంధ్రకర్తలలరచనాధిక్య మాంధ్రు లెల్ల రెఱింగినదియే. ఈనవల యపరాధపరిశోధనవిషయకము. ఇందలియపరాధుల యొక్కయుఁ బరిశోధకులయొక్కయుఁ దంత్రములు సామాన్యముగా దాంటికాయలంత లేసి యగుగోలకొండమిరియములకు జోడై పుష్టికథలందుండు నవిశ్వసనీయకల్పనముల కనల్పములై యున్నవి. ఇట్టిగ్రంథములు చదువునపుడు "వాస్తవముగా నిట్లు జరగియుండునేమో" యనునూహగొన్నవారి కత్యంతభయవిస్మయము లుదయించును. బియాస్కోపునందుఁ జూచునాంగ్ల నాటకముల కివి యపరావతారములు. ఈకథలోని కృతాంతునికపటములును, భూగృహవిశేషములును, మాయాలిని యనుకథలో జుమల చావునుండుఁ దిని గోతిలోఁ బాతఁబడి యిరువదితొమ్మిదిదినములు బ్రతికియుండి ముప్పదియవ నాఁడు చేసినమాయావిని యుపసంహారములోనికథాంశము మొదలగుకార్యములను జను లెట్లునమ్ముదురో. దానివలన నేనీతి నేరీతిని గ్రహింతురో? మన దేశమం దాదినుండి యిప్పటివఱకుఁగూడ నిట్టియపరాధములఁ గనివిని యెఱుంగము. దీనివలన జనసామాన్యము గ్రహింపఁగలనీతులకంటె నపరాధులును బరిశోధకులును గణింపవలసినతంత్రములే మెండు. ఇందును బరిశోధకుల యుపాయములు యుక్తులును శ్లాఘనీయములుగా లేవు.

భాషాభివృద్ధిమూలమున దేశాభివృద్ధి కావలయు ననెడియాశయమునకు "భాషలో మంచినీతిని భక్తిని విజ్ఞానమును ననేకసద్గుణపుంజములను దెలుపుగ్రంథము లనేకములు రచింపఁబడవలయును, వాని జదివి జనసామాన్యము సత్పథ మనుసరము గాఁగొనవలయును. దేశ మిప్పుడు సజ్జనాకీర్ణమై యప్పు డభివృద్ధి నొందినదే, యని యర్థము. కావునఁ బ్రతిగ్రంథమందు నాబాలగోపాలము నేర్వఁదగినసద్గుణములు వెల్లివిరియునట్లు చూపుచు సర్వోపకారకము లగుగ్రంథము లనేకము లుద్భవించి దేశము నుద్ధరింపవలసియున్నది. ఆంధ్రప్రచారిణీగ్రంథమాల యిట్టిసద్గ్రంథములఁ బ్రకటించు టెంతయుఁ గీర్తిదాయకము. దీనివెల రూ. ౧ ౪ ౦.

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

## (TELUGU ACADEMY.)

## సిద్ధార్థినామసంవత్సరకార్యనివేదనము.



### —* సభ్యులు. *—

పరిషత్ప్రతిష్ఠాపకు లిరువురు.

పరిషదుద్ధారకు లొక్కరు.

పోషకు లెనమండ్రలో నొక్కరు కాలధర్మము నొందిరి.

యావజ్జీవసభ్యులు ముప్పదియిరువురిలో నిరువురు మృతినొందిరి.

సాధారణసభ్యులు పాతవారు 168 గురు, క్రొత్తగాఁ జేరినవారు 13 గురు ఈ 181రిలో 18 గురు మానుకొనిరి. సంవత్సరాంతమున నున్నవారు 163 గురు.

గౌరవసభ్యులు ప్రాఁతవారు 38 గురు. క్రొత్తగాఁ జేర్చుకొనఁబడిన వారు 4 గురు. ఇం దొక్కరు కాలధర్మము నొందిరి గావున సంవత్సరాంతమున వారిసంఖ్య 41.

### కార్యనిర్వాహకసభ.

కార్యనిర్వాహకసభ్య లేఁబదిమందిలో మ-రా-శ్రీ, పోలవరము జమీందారుగారు, మొక్కపాటి సుబ్బరాయఁడుగారు, రావుబహద్దూరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు, కొణదల రామచంద్రరెడ్డిగారును గాలధర్మము నొందిరి. వీరిస్థానములందు మ-రా-శ్రీ, వేపా రామేశముపంతులుగారు బి.ఏ., బి.ఎల్. రావుబహదూర్ ధర్మవరము శేషాచార్యులుగారు బి-ఏ., బి.ఎల్. బి. సి. ఇ. నాళము లక్ష్మీకాంతముగారును కే. ఏ. వీరరాఘవాచార్యులు బి.ఏ.గారు

నియమింపఁబడిరి. ఈసంవత్సరమునఁ గార్యనిర్వాహకసభలు నాలుగుపర్యాయ ములు గూడినవి.

సిద్ధార్థిసంవత్సరమునను, పెదపవని జమీాందారుగా రగు శ్రీరాజా శ్రీ సీతారామచంద్ర శ్రీరంగభూపాల భాతేరావుబహాదరుగారు పరిషదధ్యక్షులుగా నుండిరి.

మొదటనుండియుఁ గోశాధ్యక్షులుగానున్న మ-రా-శ్రీ దివాన్ బహాదరు కంచి కృష్ణస్వామిరావు పంతులుగారు సి.ఐ.ఇ. దివాన్ బహాదరు పిట్టి త్యాగరాయ సెట్టిగారు బి.ఏ, గారలు తమపనినుండి విశ్రాంతు లగుటవలన వారికి మాఱుగ మ-రా-శ్రీ వేపా రామేశముపంతులు బి-ఏ, బి-ఎల్. గారును, రావుబహ దరు ధర్మవరము శేషాచార్యులు బి-ఏ., బి-ఎల్. బి.సి.ఇ. గారును నియమింపఁ బడిరి

పత్రికాప్రకటనము యథాప్రకారము నడచుచున్నది సంవత్సరాది నున్న పత్రికాగ్రాహకులసంఖ్య 188. క్రొత్తవారు 24 గురు. వీరిలో 38 గురు తగ్గిరి. మొత్తము సంవత్సరాంతమున నున్నవారిసంఖ్య 174.

పుస్తకభాండాగారము.

1. అచ్చుపుస్తకములు :—

ఈయేటఁ గొన్నవియు నుచితముగా వచ్చినవియుఁ గలిసి 61; వీనిలో 11 కొన్నవి. వీనివెల రు. 5-3-6. ఉచితముగా వచ్చినవి. 50. వీనివెల రు. 167-11-9లు. పరిషత్ప్రకటితగ్రంథములకు వినిమయముగా ఎపిగ్రాఫియా కర్ణాటికా (Epigraphia Carnatica యనుపేరుగల శాసనగ్రంథములను బరిషత్తున కొసంగుటకు మహిసూరుదొరతనమువా రంగీకరించి యీసంవత్సరమున 16 పుస్తకములు పంపినారు.

2. వ్రాఁతపుస్తకములు :—

ఈయేఁడు వ్రాఁతపుస్తకముల సంపాదించుటకై నెల్లూరుమండలములో దీపాల పిచ్చయ్యశాస్త్రిగా రనువారు నియమింపఁబడి ఆగష్టునెల మొదలుగ డిసెంబరునెలచివరివఱకు నైదునెలలలో నూటయేఁబదిపుస్తకములు సంపాదించి నారు. మఱియు నెల్లూరుమండలములోని ఆలూరుపాడు గ్రామవాసులగు బహ్మశ్రీ వేదము వేంకటాచలయ్యగారును, తంజావూరు ధన్వంతరికార్యాల

యాధికారులు ఆర్. డి. శ్రీనివాసశాస్త్రిగారును గొన్నితాళపత్రగ్రంథముల నొసంగియున్నారు. ఇప్పటికిఁ బుస్తకభాండాగారమున నున్నవ్రాఁతప్రతుల మొత్తముసంఖ్య 4400.

ఇందుఁ దంజావూరినుండి వచ్చినగ్రంథములలో నంజరాజుచేఁ జక్కనిశైలిలో రచియింపఁబడిన హాలాస్యమాహాత్మ్య మను డెబ్బదిరెండాశ్వాసముల వచనకావ్య మొండు గలదు.

ఇద్దఱు పండితులఁ బంపి తంజావూరు సర్ఫోజీమహారాజ సరస్వతీభాండాగారమందలి,

1. నన్నెచోడని కుమారసంభవము.
2. కేతన దశకుమారచరిత్రము.
3. తెనాలి రామకృష్ణుని ఘటికాచలమాహాత్మ్యము.
4. ధనాభిరామము.
5. రాజగోపాలవిలాసము.
6. విజయరాఘవవంశావళి.
7. రఘునాథాభ్యుదయము.
8. మన్నారుదాసవిలాసనాటకము.

అను గ్రంథములకుఁ బ్రతులు వ్రాయించి తెప్పించినారము. ఇవి నిఘంటువున కుపయోగించును. నిఘంటువు పని యైనపిదపఁ బరిషత్పుస్తకభాండాగారమునం దుంపఁబడును.

నిఘంటువిషయమునుబంధమునఁ జూచునది.

## —* ఆర్థికవిషయము. *—

ఈయేఁడు పరిషత్తుయొక్క సర్వాదాయము రు.6350-14-0లు. సర్వవ్యయము రు. 6229-10-9 లు. ఆయవ్యయములఁ దెలుపుపట్టిక వెంటఁగనఁబఱిచిన పట్టికలలోఁ జూడసగును.

## అంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. సిద్ధార్థినామసంవత్సరపు

### ఆయము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సంవత్సరాదిని నిలువ | | | | 89 | 13 | 5 |
| బ్యాంకినుండి తెచ్చినవి | | | | 3003 | 5 | 9 |
| బాంకి వడ్డి | | | | 477 | 11 | 6 |
| **చందాలు :—** | | | | | | |
| యావజ్జీవసభ్యుల చందాలు | 100 | 0 | 0 | | | |
| సాధారణసభ్యులచందా | 141 | 0 | 0 | | | |
| పత్రికచందా | 296 | 0 | 0 | | | |
| | | | | 537 | 0 | 0 |
| విడిసంచికల విక్రయము | | | | 43 | 4 | 0 |
| **పుస్తకముల విక్రయము :—** | | | | | | |
| విప్రనారాయణచరిత్రములు | 9 | 12 | 0 | | | |
| జైమినిభారతములు | 28 | 0 | 4 | | | |
| కవిజనాశ్రయములు | 46 | 5 | 0 | | | |
| జ్యోతిశ్శాస్త్రసారములు | 6 | 4 | 0 | | | |
| యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనములు | 2 | 4 | 0 | | | |
| నీతిసీసపద్యశతకములు | 3 | 5 | 0 | | | |
| చంపూరామాయణములు | 21 | 2 | 0 | | | |
| జ్ఞానప్రసూనాంబికాశతకములు | 1 | 0 | 0 | | | |
| డిఫెన్సుఆఫ్ లిటరరీతెలుఁగు | 1 | 4 | 0 | | | |
| | | | | 119 | | |
| చేబదుళ్లు | | | | 550 | 0 | 0 |
| వి. పి. పోస్టేజీ | | | | 10 | | 0 |
| ఇతరముద్రణములు బైండింగు | | | | 3 | 0 | 0 |
| ఫిక్సెడ్ డిపాజిట్టునుండి జమ | | | | 1500 | 0 | 0 |
| పుస్తకభాండాగారము ఇతరవ్యయము | | | | 17 | 0 | 0 |
| | | | | **6350** | **14** | **0** |

నెం 5, పూంటురోడ్డు, మదరాసు
26-3-1920.

జి. నరసింహాము,
ఆడిటరు.

(ది 20 మార్చి 1920 సంవత్సరముపఱకు) ఆయవ్యయముల లెక్క.

## వ్యయము.

| | | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| బ్యాంకికి బంపినవి ... | | | | | 3100 | 3 | 6 |
| వి. పి. పోస్టేజీ ... | | | | | 13 | 1 | 6 |
| చేబదుళ్లు ... | | | | | 150 | 0 | 0 |
| ప్రయాణవ్యయములు :— | | | | | | | |
| పండితుల ప్రయాణవ్యయములు ... | | 72 | 6 | 0 | | | |
| కార్యస్థానోద్యోగుల వ్యయములు ... | | 22 | 8 | 6 | | | |
| | | | | | 94 | 14 | 6 |
| పత్రికావిషయము :— | | | | | | | |
| కాగితములు ... | | 373 | 0 | 0 | | | |
| ముద్రణవ్యయము ... | | 292 | 6 | 0 | | | |
| పోస్టేజీ .. | | 59 | 14 | 0 | | | |
| చిల్లరవ్యయము ... | | 0 | 14 | 6 | | | |
| | | | | | 726 | 2 | 6 |
| ఇతరముద్రణము, బైండింగు .. | | | | | 159 | 10 | 0 |
| పుస్తకభాండాగారము :— | | | | | | | |
| పుస్తకములు కొనినవి | | | | | | | |
| తాళపత్రగ్రంథములు | 15-0-0 | | | | | | |
| ముద్రితగ్రంథములు | 5-3-6 | 20 | 3 | 6 | | | |
| ప్రతులు వ్రాయించుటకు ... | | 32 | 12 | 0 | | | |
| ఇతరవ్యయము ... | | 49 | 10 | 9 | | | |
| | | | | | 102 | 10 | 3 |
| ఉద్యోగులజీతములు ... | | | | | 1053 | 5 | 4 |
| ఇంటియద్దె ... | | | | | 385 | 0 | 0 |
| చిల్లరపోస్టేజీ ... | | | | | 90 | 11 | 9 |
| రిజస్టరి, తంతులు ... | | | | | 6 | 7 | 6 |
| కార్యస్థానము చిల్లరవ్యయము ... | | | | | 39 | 7 | 0 |
| కలములు కాగితములు మొదలైనవి ... | | | | | 24 | 1 | 0 |
| ఆడిటరుఫీజు ... | | | | | 50 | 0 | 0 |
| పుస్తకసంపాదనము-ఏజెంట్ల జీతము మొదలైనవి ... | | | | | 165 | 7 | 9 |
| నిఘంటు చిల్లరవ్యయము ... | | | | | 15 | 5 | 3 |
| పుస్తకప్రకటనము-ముద్రణాదికము .. | | | | | 53 | 2 | 11 |
| కార్యస్థానమున సంవత్సరాంతమున నిలువ ... | | | | | 121 | 3 | 3 |
| | | | | | 6350 | 14 | 0 |

పురాణము నాగభూషణము.
గుమ్ముడూరి వేంకటరంగరావు. } కార్యదర్శులు.
ఆచంట లక్ష్మీపతి.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. శ్రీ సిద్ధార్థినామసంవత్సర

### అప్పు.

| | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| పరిషత్తుఖండము :— | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | 81,163 | 2 | 1 | | | |
| ఈసంవత్సరమున హెచ్చువ్యయము | 1,988 | 2 | 11 | | | |
| | | | | 79,174 | 15 | 2 |
| నిఘంటుఖండము :— | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | | | | 15,000 | 0 | 0 |
| పత్రిక అచ్చుబిల్లులబాకీ | | | | 127 | 4 | 0 |
| చేబదులు | | | | 400 | 0 | 0 |
| మొత్తము ... | | | | 94,702 | 3 | 2 |

పైని దెలుపఁబడిన జమాఖర్చు నిలువలెక్కను, ఆంధ్రసాహిత్య పరిషత్తువారి సిద్ధార్థినామ సంవత్సరపు లెక్కలతో తనిఖీచేసి సరియైనట్లు తెలుపుచున్నాను.

నెం. 5, హంటరురోడ్డు, మదరాసు.
26 3-1920.

బి. నరసింహారావు,
ఆడిటరు.

## ...రాంతము (డి. 20 మార్చి ఆ 1920 సం॥న) జమా-ఖర్చు నిలువ లెక్క.

### ఆస్తి.

| | | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| పరిషత్తు ఫండు :— | | | | | | | |
| 3½% గవర్నమెంటుపత్రము ... | | 10,000 | 0 | 0 | | | |
| మద్రాసుబాంకులో ఫిక్సెడ్ డిపాజిట్టు ... | | 1,500 | 0 | 0 | | | |
| ,, కరెంటు అక్కౌంటు ... | | 206 | 10 | 6 | | | |
| మేనేజరువశమున నిలువ .. | | 121 | 3 | 3 | 11,827 | 13 | 9 |
| వసూలుకావలసిన చందాలు ... | | 13,629 | 9 | 0 | | | |
| రానిబాకీలు ... | | 1,132 | 0 | 0 | 12,497 | 9 | 0 |
| కుర్చీలు మొదలగుసామానులు (అసలు) ... | | 525 | 8 | 0 | | | |
| గతసంవత్సరాంతమున మినహా | 157-10-0 | | | | | | |
| ఈసంవత్సరాంతమున మినహా | 12-2-0 | 169 | 12 | 0 | 355 | 12 | 0 |
| ప్రచురింపఁబడిన పుస్తకములనిలువ ... | | 1597 | 5 | 0 | | | |
| ,, పత్రికలనిలువ ... | | 1040 | 4 | 0 | | | |
| ,, కాగితములనిలువ ... | | 183 | 13 | 0 | 2,821 | 6 | 0 |
| పుస్తకభాండాగారము ముద్రితప్రతులు :— | | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ ... | | 1382 | 0 | 6 | | | |
| ఈసంవత్సరమున ఉచితముగా వచ్చినవి ... | | 167 | 11 | 9 | | | |
| ,, కొనినవి ... | | 5 | 3 | 6 | | | |
| ,, వ్రాయించినవి .. | | 32 | 12 | 0 | | | |
| | | 1587 | 11 | 9 | | | |
| గతసంవత్సరాంతమున మినహా | 451-0-0 | | | | | | |
| ఈసంవత్సరాంతమున మినహా | 54-0-0 | 505 | 0 | 0 | 1,082 | 11 | 9 |
| పుస్తకభాండాగారము వ్రాతప్రతులు ... | | 51,160 | 14 | 6 | | | |
| భారతోద్యోగపర్వము సంప్రతించుటకు ... | | 148 | 2 | 0 | 51,309 | 0 | 6 |
| నిఘంటువ్యయము :— | | | | | | | |
| గతసంవత్సరాంతమునకు ... | | 14,792 | 8 | 11 | | | |
| ఈసంవత్సరమున వ్యయము ... | | 15 | 5 | 3 | 14,807 | 14 | 2 |
| మొత్తము | | | | | 94,702 | 3 | 2 |

పురాణము నాగభూషణము,
గుమ్మడూరి వేంకటరంగరావు, కార్యదర్శులు.
ఆచంట లక్ష్మీపతి,

## ఆంధ్రసాహిత్యపరిషత్తు — చెన్నపురి. శ్రీ సిద్ధార్థి

### వ్యయము.

| | | | అ | | రు. | | |
|---|---|---|---|---|---|---|---|
| జీతములు :— | | | | | | | |
| ఆఫీసు ఉద్యోగులకు | 1053-5-4 | | | | | | |
| పుస్తకసంపాదనము-ఏజెంట్లు | 165-7-9 | 1218 | 13 | 1 | | | |
| ప్రయాణవ్యయములు | ... | 94 | 14 | 6 | | | |
| ఆడిటరుఫీజు | .. | 50 | 0 | 0 | | | |
| కార్యస్థానము అద్దె | ... | 385 | 0 | 0 | | | |
| కాగితములు మొదలగునవి | ... | 24 | 1 | 0 | | | |
| చిల్లరపోస్టేజీ | ... | 90 | 11 | 9 | | | |
| రిజిష్టరు పోస్టేజీ | ... | 6 | 7 | 6 | | | |
| చిల్లరవ్యయములు | .. | 39 | 7 | 0 | | | |
| వి. పి పోస్టేజి | ... | 13 | 1 | 6 | | | |
| ఇతరముద్రణము | ... | 139 | 14 | 0 | | | |
| పుస్తకభాండాగారము చిల్లరవ్యయము | ... | 32 | 10 | 9 | | | |
| | | | | | 2095 | 1 | |
| పుస్తకప్రకటనము-ముద్రణాదికము. | ... | 53 | 2 | 11 | | | |
| పత్రికావిషయము :— | | | | | | | |
| గతసంవత్సరము పత్రికలు | ... | 1031 | 8 | 0 | | | |
| కాగితములు ముద్రణము మొదలగునవి | ... | 616 | 2 | 6 | | | |
| గతసంవత్సరము నిలువకాగితముల వ్యయము | ... | 147 | 9 | 0 | | | |
| అచ్చుకర్చు బాకీ | ... | 127 | 4 | 0 | | | |
| | | | | | 1975 | 10 | 5 |
| మినహాయింపులు :— | | | | | | | |
| కుర్చీలు సామానులు | | 12 | 2 | 0 | | | |
| పుస్తకభాండాగారము | | 54 | 0 | 0 | | | |
| గత సం॥ ప్రచురింపఁబడిన పుస్తకముల నిల్వ | | 1608 | 2 | 0 | | | |
| వసూలుకానిచందాలు | | 1132 | 0 | 0 | | | |
| | | | | | 2806 | 4 | 0 |
| మొత్తము | ... | | | | 6876 | 15 | 6 |

నెం. 5, వరాంటు రోడ్డు, మదరాసు.
26-3-1920.

జి. నరసింహాము,
ఆడిటరు.

## నామసంవత్సరాయవ్యయముల లెక్క.

### ఆయము.

| | | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| ఉద్ధారకుల చందాలు | ... | 0 | 0 | 0 | | | |
| పోషకుల చందాలు | ... | 0 | 0 | 0 | | | |
| సాధారణసభ్యుల చందాలు | ... | 744 | 0 | 0 | | | |
| పత్రికచందాలు | ... | 505 | 0 | 0 | | | |
| | | | | | 1249 | 0 | 0 |
| విడిసంచికల విక్రయము | ... | 43 | 4 | 0 | | | |
| పుస్తకముల విక్రయము | ... | 119 | 4 | 4 | | | |
| పత్రికల నిలువ | | 1040 | | 0 | | | |
| | | | | | 1202 | 12 | 4 |
| కాగితముల నిలువ | | | | | 183 | 13 | 0 |
| పుస్తకముల నిలువ :— | | | | | | | |
| బైండువి | | 751 | 5 | 0 | | | |
| బైండుకానివి | | 846 | 0 | 0 | | | |
| | | | | | 1597 | 5 | 0 |
| | | 477 | 11 | 6 | | | |
| వి. పి. పోస్టేజి | | 10 | 7 | 0 | | | |
| ఉచితముగా వచ్చిన పుస్తకములు | | 167 | 11 | 9 | | | |
| | | | | | 655 | 14 | 3 |
| ఈసంవత్సరమున హెచ్చుకర్చులు | | | | | 1988 | 2 | 11 |
| మొత్తము | | | | | 6876 | 15 | 6 |

పురాణము నాగభూషణము.
గుమ్మిడూరి వేంకటరంగరావు. } కార్యదర్శులు.
ఆచంట లక్ష్మీపతి.

## —* ఉపసంహారము. *—

శ్రీ శ్రీ హయిదరాబాదు నవాబుగారు గ్రంథములను బ్రకటించుచున్నవారు ముద్రించిన గ్రంథములు పలుచని కాగితములమీఁదఁ దప్పులతో నిండియున్నవనియు నాగ్రంథములు భాషకు హాని కలిగించు ననియు నాలోచించి వానిని జక్కఁగ సవరించి మంచికాగితములమీఁద నచ్చువేయుటకై యొకవిద్యాశాఖ స్థాపింప లక్షరూప్యములు దయచేయునట్లు వార్తాపత్రికలలోఁ జదివి యానందించుచున్నారము. ఈయేర్పాటు వారిస్వభాష కనియె యెంచవచ్చును. నైజాము రాజ్యములో వెలువడిన పూర్వాంధ్రకవులగ్రంథములనుగూడ నట్లు శుద్ధముద్రణము చేయించుటకై పై యేర్పాటులోఁ జేర్పించుట కాదేశవాసు లగునాంధ్రులు తమప్రభుత్వమువారిని బ్రార్థింపవలయును.

కడచిన నవంబరునెలలో ననేకులు సభ్యులకును బండితులకును "పరిషత్తువా రిదివఱకుఁ జేయుచున్న కార్యములు ప్రస్తుతకాలమునకు సరిగఁ జాలియున్నవా ? లేక వానిలో నేవేని మార్పులఁ జేయుటయవసరమా" యని యడుగుచుఁ బత్రిక లంపి యున్నారము. కొన్ని ప్రత్యుత్తరములు వచ్చియున్నవి. వాని నిప్పుడు జరగఁబోవు వార్షికసభలో విమర్శింపవలసియున్నది. జరపవలసిన కార్యము లనేకము లున్నమాట సత్యమే. ఏపని చేయుటకును ధనము కావలయును. అదియే ప్రస్తుతము తక్కువగా నున్నది. వాగ్దత్తము లయిన మొత్తములు కొన్ని చిరకాలమునుండి రావలసి యున్నవి. దాత లాధనమును సాధ్యమయినంత శీఘ్రముగా నిచ్చినచో గొప్పయుపకారముచేసినవా రగుదురు. పరిషత్తున కేఁబదివేలరూపాయ లయిన మూలధన ముండినచో దానివలన వచ్చు వడ్డితోడను, సాధారణసభ్యులవలనఁ బత్రికావిక్రయమువలన వచ్చు ధనముతోడను సామాన్యపరిషత్కార్యములు నిర్విఘ్నముగా జరగును. లేనియెడల జరగవు. కావున నంత మూలధనము సమకూర్చుటకై పరిషత్సభ్యులును భాషాభిమానులును బూనుకొనవలయును.

# అనుబంధము

## ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమునకు వ్రాంతపుస్తకములిచ్చినవారిపేళ్లు.

(నెల్లూరుమండలము.)

1. తంగిరాల వెంకటసుబ్బమ్మగారు, ముత్తుకూరు.
2. కరణము శేషయ్యగారు, కృష్ణాపట్టణము.
3 అక్షా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పెనుబర్తి.
4. వి. బలరామరెడ్డిగారు, అనికేపల్లి.
5. పైడిమర్రి వేంకటసుబ్బయ్యగారు, మాదిరాజుగూడూరు.
6. నేలభొట్ల వేంకటసుబ్బయ్యగారు, బుచ్చిరెడ్డిపాలెము.
7. వి. నరసింహశాస్త్రిగారు, ఆముదాలపాడు.
8. కొండగుండ వీరరాఘవశాస్త్రిగారు, మిట్టపాలెము.
9. అడ్డాడసిద్ధేశ్వరశర్మగారు, మడమనూరు.
10. వేంకటసుబ్బారెడ్డిగారు, కొరుటూరు.
11. వేలూరు నాగశర్మగారు, ఈపూరు.
12. నారాయణరెడ్డిగారు, వెంకన్నపాలెము.
13. ఆదినారాయణప్పగారు, గాడెలవాగు.
14. పోతురెడ్డి రామిరెడ్డిగారు, పెదతాపోలూరు.
15. రామచంద్రారెడ్డిగారు, ముసునూరువారిపాలెము.
16. శ్రీరామశాస్త్రిగారు, అనంతపురము.
17. వేంకటరెడ్డిగారు, పైనంపురము.
18. నారాయణయ్యగారు, సర్వేపల్లి.
19. యన్. వెంకోపరావుగారు, నెల్లూరు.
20. సుబ్బరామయ్యగారు, కోవూరు.
21. సీతారామరెడ్డిగారు, రేబాల.
22. పుడాలి సుబ్బరామయ్యగారు, వల్లాపల్లి.
23. కొండూరు సూరంరెడ్డిగారు శ్రోత్రియంగల్లు.
24. అమ్మనబ్రోలు పిచ్చిరెడ్డిగారుయల్లాయపాలెము

25. మహాంకాళి పెద్దయ్యగారు, పెల్వరు.

26. జిల్లెళ్లమూడి కోటయ్యగారు, మట్టిపాడు.

27. అక్కిరాజు వేంకటరమణయ్యగారు, సంగము.

28. రూపాకుల సుబ్రహ్మణ్యముగారు, ఇరువూరు.

29. బుచ్చినాయఁడుగారు, పూండ్ల.

30. నరసయ్యగారు, వెంకన్నపాలెము.

31. ధర్మకోట నారాయణయ్యగారు, పేడూరు.

32. ఇంగువ చెంచురామయ్యగారు, ఇందుకూరిపేఁట.

33. సుబ్బారెడ్డిగారు, మైపాడు.

34. రాతు చంద్రారెడ్డిగారు, నారంరెడ్డిపేఁట.

శ్రీ

# సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణము.

ఇప్పు డున్న నిఘంటువులకంటె విపులమును సమగ్రమును నగు నూతనాంధ్రనిఘంటు వొకటి నిర్మించుట యాంధ్రసాహిత్యపరిషదుద్దిష్టకార్యములలో నొకటి. ఈకార్యమునకుఁ బట్టుధన మంతయుఁ దామే యిచ్చెద మని పీఠికాపురాధీశ్వరు లగు గౌ॥ శ్రీ రాజా సూర్యరావుబహదరు, C.B.E. గారు మొదటినుండియుఁ బ్రతిజ్ఞ చేసియున్నారు. కొన్ని కారణములచేత వెంటనె పని యారంభించుట కనుకూలపడినదికాదు. ప్రమాదీచనామసంవత్సరములో నిఘంటునిర్మాణమున కవతారికగా భారతములోఁ బ్రయోగింపఁబడినపదముల కన్నింటికి నను క్రమణిక (concordance) యొకటి సమకూర్పవలసినట్లు నిశ్చయింపఁబడి యాప్రకారము భారతములోనిపదము లన్నియు నెక్కొక్కపద మొక్కొక్కకాగితపుముక్క (card) మీఁద వ్రాయఁబడి కొన్నిపదములు సంకలితములు గూడ నయినవి. అప్పుడే వివిధప్రదేశములందు వివిధవృత్తులలో వాడఁబడుచున్న పారిభాషికపదముల సంపాదించుట కొకపండితుని నియమింపఁగా నాయన కొంతకాలము సంచారముచేసి కొన్నిపదములు సంపాదించినాఁడు. ఇటీవల రాక్షససంవత్సరము (౧౯౧౫ సం॥ నవంబరు నెల)లో బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారిని సంపాదకుఁడుగా నియమించి నిఘంటుకార్యము ప్రారంభింపఁబడి పింగళసంవత్సరాంతమువఱకుఁ బరిషత్కార్యస్థానమందుఁ బని జరగినది. ఈకాలములో భారతానుక్రమణికకు సంబంధించిన పదములు కొన్ని సంకలితము చేయఁబడినవి. హరివంశము మొదలగు కొన్నిగ్రంథములలోని పదములకుఁ బట్టికలు సమకూర్చుటకై పదములు విడివిడిగా వ్రాయఁబడినవి. కొన్ని తెలుఁగుశబ్దముల కితరద్రావిడభాషలలోఁ గలసజాతీయములు వ్రాయఁబడినవి. సంపాదకులయిన శాస్త్రులుగారు భారతాదిగ్రంథములు కొన్నిచదివి యచ్చటచ్చట టిప్పణములు వ్రాసినారు. తత్సమపదసంపాదనముగూడఁ బ్రారంభింపఁబడినది.

చెన్నపట్టనములో జరిగినపని యంత తృప్తికరముగా లే దనియు, నిఘంటుకార్యస్థానము పిఠాపురమందుఁ గాని కాకినాడలోఁ గాని యుంచి తాము పనిచేయించెద మనియు నందుకుఁ బరిషత్తువా రంగీకరింపవలయు ననియు శ్రీ పిఠాపురము రాజుగారు కోరినందునఁ బరిషత్తువా రొప్పుకొనిరి. నిఘంటుకార్యస్థానము పిఠాపురములో కాళయుక్తిసంవత్సరప్రథమదినమున స్థాపింపఁబడి యప్పటినుండి పని నడచుచున్నది. ఈగ్రంథమునకు సంపాదకుఁడుగా నుండి పని నడిపించు మని శ్రీరాజావారు నన్నుఁ గోరినందున నే నందున కొప్పుకొంటిని.

నిఘంటునిర్మాణపద్ధతినిగూర్చి యిదివఱలో నే నొకవ్యాసము రచించి పండితులకుఁ బంపఁగా వారు తమతమయభిప్రాయముల నిచ్చియున్నారు. ఈయభిప్రాయములు మొత్తముమీఁద నాయభిప్రాయమున కనుగుణముగానే యున్నవి. ఈపద్ధతిప్రకారము కాళయుక్తిసంవత్సరప్రారంభము నుండియే పని జరుగుచున్న దని తెలియవలయును. దీనిప్రకారము వస్తుసంగ్రహము తద్విమర్శనము నని నిఘంటుకార్యము రెండుభాగములు. వస్తుసంగ్రహమే యిప్పుడు జరుగుచున్నపని. అది యెంతవఱ కయినదియు నీక్రింద వివరించెదను,

## సంస్కృతసమపదములు.

నిఘంటువులో వచ్చుపదములు తత్సమములు నాచ్ఛికములు నని రెండువిధములు. తత్సమపదములలో ముప్పాతికమువీసము పైఁగా సంస్కృతసమములే. వీనిలోఁ గ్రియాపదములు వేఱుగను, తదితరపదములు వేఱుగను గ్రహింపవలయును. సుబంతశబ్దములును వానియర్థములును ఆప్టేకృత సంస్కృతాంగ్లేయనిఘంటువునుండి గ్రహింపవలయు నని చెన్నపట్టనమందుఁ బని జరుగుచున్నప్పుడే నిర్ణయింపఁబడి యప్పటినుండి యాపని నడచుచున్నది. ఈసంవత్సరము ఫిబ్రెవరు మాసాంతమునకు పల్లో సగమునకు నయినది. అనఁగా గ్రంథము మూఁడువంతులుగాఁ జేసిన యెడల నందు రెండువంతు లగును. ఇంతవఱకు రమారమి యేఁబదివేల (౫౦౦౦౦)పదము లయినవి. ఇఁక నిరువదియైదువేల (౨౫౦౦౦) వఱకు నుండవచ్చును. మొత్తము రమారమి డెబ్బదియైదువేల (౭౫౦౦౦) శబ్దములవఱకుఁ గావచ్చును. కేవల వైదికశబ్దములును, వైదికార్థములును వ్రాయుట లేదు. విమర్శనకాలమందు మాఱుమూల పదము లని మఱికొన్ని పదముల విడిచివేయుట తటస్థింపవచ్చును. చివరకు సంస్కృతసమము లేఁబదివేలకుఁ దక్కువ కాకుండ నిలిచియుండును. ఇవి శబ్దరత్నాకరములోని పదములకంటె రెట్టింపున కధికముగా నుండును.

ఇన్నిపదము లావశ్యకములు కావనియు, తెలుఁగుగ్రంథములలోఁ బ్రయోగింపఁబడిన శబ్దములుమాత్రము నిఘంటువులో నుండినఁ జాలు ననియుఁ గొందఱయభిప్రాయమయి యుండవచ్చును. ఇది సరికా దని నామతము. ఆంధ్రగ్రంథములలో నేయేసంస్కృతశబ్దము ప్రయోగింపఁబడియున్నదో తెలిసికొనుట కాగ్రంథము లన్నియు సవిమర్శముగాఁ జదివి యొక్కొక్కపదమే యర్థసహితముగా వ్రాయవలసి యుండును. ఈపదములలో ననేకములు సమాసఘటితములు. అనేకసమాసములు దీర్ఘములు. దీర్ఘసమాసములన్నియు భేదించి యవాంతరశబ్దము లన్నిటి నెత్తి వ్రాసినపిమ్మట సంస్కృతనిఘంటువులలో నున్నపదములలోఁ జాలవఱకుఁ దెలుఁగులో నున్నట్లే తేలును. కాని యాశబ్దములను వానియర్థములను గనిపెట్టుట కీపద్ధతి ద్రావిడప్రాణాయామమువంటిది యగును. కొన్ని యనావశ్యకపదములు పడినను సంస్కృతనిఘంటువునుండియే పదపదార్థములు గ్రహించుట బహువిధముల సుకర మయిన పని. ఇప్పు డున్నయాంధ్రగ్రంథములలో లేనిసంస్కృతపదములు కొన్ని యిఁకమీఁదఁ బుట్టుగ్రంథములలో నుండవచ్చును. ఇంతియకాక, పాశ్చాత్యభాషాగ్రంథములలోని భావములు ప్రతిపాదించు తెలుఁగుగ్రంథము లిప్పుడిప్పుడు బయలుదేఱుచున్నవి. ఇఁకముం దధికముగాఁ బుట్టఁగలవు. ఈనూతనభావముల వ్యక్తపఱచుటకుఁ దగినమాటలఁ గల్పింపవలసియుండును. సంస్కృతశబ్దములతోఁ గాని యామాటలఁ గల్పించుట యనుకూలపడదు. సంస్కృతపదములు పెక్కు లున్నచో మననిఘంటు వీనూతనగ్రంథరచన కుపకరించును. కావున, సంస్కృతసమపదముల విషయమయి యిదివఱలో నిర్ణయింపఁబడి యిప్పుడు ప్రచారములో నున్నపద్ధతియే ప్రశస్తమని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. ఈమార్గమే కిట్టిల్ పండితకృత కర్ణాటాంగ్లేయనిఘంటువునం దవలంబింపఁబడినది.

ఆప్టేనిఘంటువు మూలాధారముగా గ్రహింపఁబడినను సంశయాస్పదము లగుస్థలములందు వాచస్పత్యాది లక్షణగ్రంథములుకూడ నుపయోగపడుచున్నవి.

## సంస్కృతసమక్రియాపదములు.

విశేష్యవిశేషణములవలెఁ గ్రియాపదముల సంస్కృతనిఘంటువులనుండి గ్రహించుటకు వీలు లేదు. సంస్కృతక్రియాపదములు ధాతువులనుండి బహురూపములుగాఁ బుట్టును. వ్యాకరణసాధ్యము లగునీరూపము లన్నియు సంస్కృతనిఘంటువులలోనే చూపుటకు సాధ్యము కాదు. సంస్కృతక్రియాపదము లన్నియుఁ దెలుఁగులోఁ బ్రయోగార్హములు గావు. సుబంతములవలె, తిఙంతశబ్దములఁ దెలుఁగులోనికిఁ దెచ్చుకొనుటకు సూత్రము లేర్పడియుండలేదు. మఱియుఁ దెలుఁగులో నామధాతువు లనేకము లున్నవి. ఈకారణములఁబట్టి యాంధ్రకవిప్రయుక్త సంస్కృతసమధాతువులే నిఘంటువులోఁ జేర్పఁదగినవి. గ్రంథములు చదివి క్రియాపదము లెత్తి వ్రాయుటకై యొక పండితుని నియమింపఁగా నాయన బహుగ్రంథములు శోధించి యింతవఱకుఁ బదుమూఁడువందల ముప్పదినాలుగు (౧౩౩౪) వేర్వేఱుపదములు వ్రాసినాఁడు. మొత్తము తత్సమక్రియలు రెండు వేలకు మించు నని తోఁచుచు

శబ్దరత్నాకరమునందువలెనే తత్సమపదముల కర్థాదులు నిరూపింపఁబడును. సంస్కృతమునందుకంటెఁ దెలుఁగులో ధారుణీశబ్దమునకువలె రూపమందుఁ గాని, అనుమానశబ్దమునకువలె నర్థమందుఁ గాని విశేషము లున్నప్పుడుమాత్రమె (తెలుఁగుగ్రంథములనుండి) ప్రయోగము లుదాహరింపఁబడును. ఈశబ్దముల కింతకంటె విశేషాంశములు తెలిసికొనఁ గోరువారు సంస్కృతనిఘంటువులఁ జూడవలసియుండును.

## తద్భవపదములు.

సంస్కృతసమపదముల సంఖ్యకంటె తద్భవపదముల సంఖ్య మిక్కిలి యల్ప మయినను నిఘంటునిర్మాణకార్యములో ముఖ్యాంశిక మైనది గా నీశబ్దములను గుఱించియే యాయి యున్నది. ఈ పదములకు,

౧. విశేష్యవిశేషణోత్యాది వ్యాకరణ సంప్రదాయసిద్ధ సంజ్ఞలును,

౨. అర్థములును,

౩. ప్రయోగవాక్యములును,

౪. ప్రాకృతసమములకును, ప్రాకృతములద్వారమున వచ్చిన తద్భవములకును సాధ్య మగునంతవఱకుఁ బ్రాకృతరూపములును,

౫. తద్భవము లన్నింటికి సంస్కృతరూపములును,

౬. దేశ్యశబ్దముల కరవము మొదలగు ద్రావిడభాషాంతరములందుఁ గల సజాతీయపదములును,

౭. సాధ్యమయినంతవఱకు శబ్దవ్యుత్పత్తులను,

నిర్ణయింప వలసియున్నది. అనేకార్థములు గలశబ్దము లనేకము లున్నవి. ఒకానొకప్పుడీయర్థములకుఁ గలభేద మల్పముగానే యుండును. ఈభేదలేశములు కనిపెట్టి నిఘంటువులోఁ గనఁబఱుపవలసి యున్నది. ప్రయోగములనుబట్టి యర్థనిర్ణయము చేసి యాయర్థముల సప్రమాణముగఁ జూపవలయును. శబ్దరత్నాకరమందుఁ బ్రయోగవాక్యము లచ్చటచ్చట నుదాహరింపఁబడియున్నవి.
కాని, యని వాంఛ. పరిశిష్టమునందుఁ బ్రయోగములు బహుళముగా నుదాహరింపఁ

బడును. ఒకానొకప్పు డర్థము సాధించుటకు నొకప్రయోగము చాలదు. అనేకప్రయోగసమన్వయమునఁ గాని యర్థము తేలదు. అట్టిపట్టులందు రెండుమూఁడు ప్రయోగము లుదాహరింపవలసి యుండును. మఱియు నొక్కశబ్దమే వేర్వేఱుకాలములం దెట్లు వాడఁబడినదో చూపుటకై యనేక ప్రయోగము లావశ్యకములు. అర్థనిర్ణయ మెట్లు చేయఁబడినదో యావిధానము కరతలామలకముగాఁ జూపుటయు, శబ్దస్వరూపములయొక్కయు, శబ్దార్థములయొక్కయు చరిత్రము సూచించుటయు నాధునికపాశ్చాత్యనిఘంటు నిర్మాణపద్ధతి. సాధ్యమగునంతవఱకీపద్ధతియే పరిషన్నిఘంటువునం దవలంబింపఁబడును.

ప్రయోగసంపాదన మిప్పుడు నడుచుచున్నది. ఏడుగురు పండితు లీపని చేయుచున్నారు. ఒక్కొక్క రొక్కొక్కగ్రంథమే పుచ్చుకొని యందలియాచ్ఛికపదముల నొక్కొక్కపద మొక్కొక్క కాగితపుముక్కమీఁద వ్రాసి దాని కర్థాదులు వ్రాయుచున్నారు. ప్రస్తుతమునాఁటికిఁ డెబ్బదియేడువేల యయిదువందల తొంబదియైదు (౭౭౫౯౫) ముక్క లయినవి. ఇవి యన్నియు వేర్వేఱుశబ్దము లనుకొనఁగూడదు. వచ్చినవే పెక్కుసారులు వచ్చినమాట లనేకములున్నవి. అనావశ్యకము లయినపునరావృత్తులు రాకుండుటకై కొన్నినిబంధనలు చేయఁబడినవి. అయినను బలువురు పండితులు వ్రాయుచుండుటంబట్టి కొంతవఱకు వచ్చినవే రాక తప్పదు. పునరావృత్తి దోషమే యయినను గొంతవఱకర్థనిర్ధారణమున కుపకరించును. పండితులు తమమతమయినతాల ననుసరించి యర్థాదులు నిర్ణయింతురు. వాని నన్నింటిని పరిశీలించి సిద్ధాంతీకరించు భారము నిఘంటు సంపాదకునియం దున్నది. కావున గ్రంథబాహుళ్యము కొంతవఱకావశ్యకమే. అది యతిమాత్రము గాకుండుటకై భారతము మొదలయిన పెద్దగ్రంథములు కొన్ని నేను ముందుగాఁ జదివి యందలి ముఖ్యపదముల గుర్తించుచున్నాఁడను. ఆప్రకారము గుర్తింపఁబడిన పదములకు మాత్రమే పండితు లర్థాదుల వ్రాయుచున్నారు.

ప్రయోగములు గ్రంథములనుండి మాత్రమే గాక ప్రాచీనశాసనములనుండియు, సామెతలనుండియు, గ్రంథస్థములు గాని యితరలోకోక్తులనుండియుఁ గూడ గ్రహింపఁబడును. ఒకపండితుఁడు వేఱుగాఁ బ్రాకృతపదములు, నింకొకపండితుఁ డరవభాషలోని సజాతీయపదములును వ్రాయుచున్నారు. ఇంతవఱకెనిమిదివందల ముప్పదియొక్క (౮౩౧) ప్రాకృతపదములును, అయిదువేల మున్నూటపదియేడు (౫౩౧౭) డరవపదములును సిద్ధమయినవి. కర్ణాటకసజాతీయపదము లెత్తి వ్రాయుటకుఁ దగినపండితుఁ డింతవఱకు దొరకలేదు. యత్నించుచున్నాము.

ఇంతవఱకు కన్నియుం జెర యొకలక్ష ముప్పదియైదువేల నన్నూటనలువదియొక్క (౧౩౫౪౪౧) పదము లయినవి. వీనిలో నాచ్ఛికపదములుతప్పఁ దక్కిన వన్నియు వేర్వేఱుపదములే. ఇవి యన్నియు నిరువది దినములు తక్కువగా రెండుసంవత్సరములలో సమకూర్పఁబడినవి.

ఆచ్ఛికపదములలోఁ గూడ శబ్దరత్నాకరములో లేనిపదములు, నర్థములు పెక్కులు కనఁబడుచున్నవి. ఇవి యెన్నియో చివరకుఁగాని తేలదు. కాని కొన్నివే లుండునని తోఁచుచున్నది. శబ్దరత్నాకరమునందుకంటె, పరిషన్నిఘంటువునం దుండువిశేషము లేవి యనఁగా :—

౧. శబ్దాధిక్యము,

౨. అర్థాధిక్యము,

౩. ప్రయోగవాక్యాధిక్యము.

౪. అన్యభాషాసజాతీయపదములు,
౫. తద్భవముల ప్రాకృతసమ సంస్కృతరూపములు, ప్రాకృతసమముల ప్రాకృతరూపములు,
౬. దేశ్యశబ్దములకు వ్యుత్పత్తులు,
అన్యదేశ్యగ్రామ్యము లెంతవఱకు గ్రాహ్యము లో నిర్ణయింపవలసియున్నది.
కాళయుక్తి సిద్ధార్థిసంవత్సరములలో నిఘంటువునిమిత్త మయిన వ్యయము :—

| | | | | |
|---|---|---|---|---|
| జీతములు | . ... ... | రు. ౫౮౯౧ | ౧౪ | ౨ |
| పుస్తకములు | ... ... ... | ౨౮౬ | ౬ | ౦ |
| కాగితపు ముక్కలు | ... ... | ౬౯౫ | ౧౨ | ౬ |
| సామానులు | ... ... ... | ౨౯౪ | ౧౦ | ౮ |
| ఇంటియద్దె | ... ... ... | ౪౦౫ | ౦ | ౦ |
| | | ౭౫౭౩ | ౧౧ | ౪ |

వెరసి యేడువేల యేనూట డెబ్బదిమూఁడు రూపాయలు పదునొకండణాలు నాలుగుపైసలు.

వస్తుసంపాదనము రెండుసంవత్సరములలో ముగియు ననుకొంటిని గాని యట్లు కాలేదు. ఇంకొకసంవత్సరము పట్టునట్లున్నది. అటుపిమ్మట విమర్శనము కావలసియున్నది. వస్తుసంపాదన మొకమూల జరుగుచుండ వేఱొకమూల విమర్శనముగూడ నడచుచుండినయెడలఁ బని శీఘ్రముగా ముగియు నని కొందఱ యభిప్రాయము. ఇది సంస్కృతసమపదములవిషయములో వీలయినఁ గావచ్చును గాని యాచ్ఛికపదములవిషయములో బొత్తిగా వీలుగాదు. సాధనసామగ్రి చక్కఁగా నుండినఁగాని విమర్శించి సిద్ధాంతీకరించుట కనువుపడదు. అసమగ్రాధారములఁబట్టి చేసినసిద్ధాంతములు మఱి మఱి పూర్వపక్షములు కావలసివచ్చుచుండును. అందువలన ననావశ్యక మయిన కాలహరణమును, ధనవ్యయము నగును. విమర్శనారంభమునకుఁ బూర్వమే కార్డు లన్నియు నక్షరక్రమముగా నేర్పఱిచి వరుసగా విమర్శించుచు వచ్చినయెడల నొకసంపుటమునకుఁ జాలినన్ని కార్డులు సిద్ధము కా వేగమె యచ్చునకుఁ బంపుచుండవచ్చును. ఇదివఱకు వ్రాయఁబడిన కార్డులు చాలవఱకు నక్షరక్రమముగా నేర్పాటయి యున్నవి. చిట్టచివర కన్నింటిని గలిపి వరుసగా నేర్పఱుప వలసి యుండును.

పలువురు భాషాభిమానులును విద్యాధికులును నిఘంటుకార్యస్థానమునకు వచ్చి నడుచుచున్న పని పరిశీలించి తమ యభిప్రాయములు వ్రాసియున్నారు. ఈ యభిప్రాయములలోఁ గొన్నింటి ననుబంధముగా ముద్రింప నయినది.

౧౫-౩-౧౯౨౦. జయంతి రామయ్య.

# అనుబంధము.

## — అభిప్రాయములు. —

నేటిదినము 4 గంటలకు నిఘంటుకార్యాలయమునకు బోయి చూచితిని. అచ్చట నున్న పండితు లందరు తమకు నియత మగునిఘంటు నిర్వహణమునకుఁ దగినశ్రద్ధాజాలము నెత్తి వ్రాయుట ముచ్చటతో జూచితిని. ఇది సర్వలోకోపకారక మయినది.

21st *April* 1919,
PITHAPURAM.

(Sd.) M. V. RAMANACHARI,
*Sanskrit Pandit,*
*Maharajah's College, Vizianagram.*

(True Copy.)

I inspected the Andhra Lexicon Office to-day at 4-15 P.M. The whole staff has been vigorously working. I inspected some of the cards written by the Pandits. They exhibit great care and circumspection. If work is carried on at this rate, I am sure that it will soon reach its completion. I am glad to note that though the Hon. Editor is not residing here, the staff have been working heart and soul.

I read the rules of the office. They exhibit great tact on the part of the framer. They avoid clash of work among the staff and the entrustment of compiling *tatsama padas* to a single Pandit is very commendable. I wish this institution every success and the Rajah, who is the founder of this institution, is to be congratulated on securing such able and energetic staff of Pandits.

PITHAPURAM,
8-5-19.

(Sd.) G. G. SOMAYAJULU, M.A., B.L.,
*Subordinate Judge (Ellore).*

(True Copy.)

PITHAPURAM.
13-6-19.

I visited today the Telugu Lexicon Office. All the Pandits are doing well and the lexicographical work, on the whole, reflects much credit on those who have organized as well as on those who have been patronizing it.

(Sd.) C. K. RAMANUJIAH,
*Telugu Pandit, School Dept,*
*Christian College, Madras.*

(True Copy.)

ఈ 1919 సం॥ అక్టోబరు 27-28 తేదులను బ్రహ్మశ్రీ మహారాజశ్రీ జయంతి రామయ్యపంతులువారితో గూడ నీ శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు కార్యస్థానములో జరుగుపనిని జూచితిని. అక్కడ నున్నపండితులు చేయుపనులను వివరముతో నాకు సదరు రామయ్యపంతులు గారు, పండి

లుతు బోధచేసిరి. దానివలన నిఘంటు నేయేపద్ధతులమీదను చేయుచున్నారో యవి తెలియఁబడి నది. ఇదివరలోనున్న తెలుగునిఘంటువులకంటె విశేషాంశము లిందు మెండు గలవు. వానిలో నున్న పదములకంటె నెక్కుడుశబ్దములు గలవు. ఆపదముల యర్థములలోని యంశాంశలేశభేదములు స ప్రమాణముగఁ బ్రసిద్ధకావ్యములలో నున్న ప్రయోగములతో నేకరించుచున్నారు. తత్సమతద్భవ దేశీయశబ్దములలో నుండుబహువిధము లతి శ్రమతోను శ్రద్ధతోను గ్రంథములలో వెదకివెదకి పోగు జేయుచున్నారు. ఇట్టిగ్రంథము మన తెలుగు-బాసలో లేదు. కాలనియమ మంతగఁ బాటింపక నీగ్రంథరచనా సంపూర్తి కొఱకు జేయవలసినపను లింక మెండు గలవని రామయ్యపంతులుగారు సెల విచ్చుచు కాలయాపన వ్యర్థాగాఁ గలుగకుండ వారు చక్కని నిబంధనలు చేయుచున్నారు. మహా రాజరాజశ్రీ పిఠాపురపు రాజావారియొక్క యుద్యమము బహుశ్లాఘనీయ మనుట స్తుతిరూప మ గునర్థవాది కాదు. యథార్థోక్తియే. వారిసంస్థానములోని నిఘంటునిర్మాణ విషయమయి పాటుబడు వారందఱును నతిశ్రద్ధతోఁ బనిచేయుచున్నారు. కాన వారుకూడ సంస్తవనీయు లనుట యొక విశేషము గాదు. ఇట్లు విన్నవించుచు విరమించెదను.

28-10 19 } (Sd.) వావిలాల వెంకటశివావధాని, (బి.ఏ.)<br>
పిఠాపురం. } పించెనుసబ్జెడ్జి, బృందావనవాసి.

---

నేడు శ్రీసూర్యరాయనిఘంటు కార్యస్థానమునకు వచ్చి. నిఘంటుకల్పనమునకుఁ బండితులు వ్రాసియుంచిన శబ్దపట్టికఁ జూచితిని. పూర్వనిఘంటువులవలన సాధింపరానియర్థముల సమీచీన ముగ నిర్ణయించి యచటఁ బండితవర్యులు చేయుకృషి ప్రశంసాపాత్రముగ నున్నది. ప్రాచీనగ్రంథ ముల నున్న దేశ్యముల స్వరూపభేదము అర్థభేదము నిరూపించుటలోఁ జేయుచున్న పరిశోధనము పండితులసహాయముచేఁ బరిశీలింప నెపుడీనిఘంటురాజము ప్రకటితమగునా యనిపించుచున్నది. సంపాదకు లగు శ్రీరామయ్యపంతులవారి తీవ్రోత్సాహము శ్రీరాజావారియౌదార్యములు కారణము లుగ నీనిఘంటురాజము త్వరలో వెలువడ నభిలషింతు,

ది. 20-11-19. శేషాద్రిరమణకవులు, (అనియున్నది<br>
గంపలగూడెము ఆస్థానకవులు

నేడు నేను శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థానమునకు వచ్చి పండితులు వ్రాసిన శబ్ద ములపట్టికలం జూచితిని. పూర్వనిఘంటువులవలనఁ దెలియరాని యర్థములను చాలనూతనార్థము లను సాధించుచున్నారు. ఈనిఘంటువు పూర్తియైనచో భారతభూమిం నిఘంటుకొఱంత తీరునని యభిప్రాయపడుచున్నాను. ఈ నిఘంటుకార్యస్థానమునఁ బని చక్కగా జరుగుట లేదని నేను కొంతమందివలన వింటిని, గాని నేడీకార్యస్థానమునకు వచ్చి (చూచిన దానిని బట్టి) వినినది స ర్వాబద్ధమని తెలంపవలసివచ్చినది. ఈ నిఘంటువు పూర్తియై దేశమును నుద్ధరించుటకుఁ గాను పరాత్ప రుని ప్రార్థించుచున్నాను

24-11-19. కోటగిరి వెంకటకృష్ణారావు,<br>
కుమారరాజా, గంపలగూడెం.

(True Copy.)

శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటుకార్యాలయంబును తిరిగి సందర్శించుభాగ్యము లభించుట సంతోషకారణము. పూర్వనిఘంటువుంబోలె అర్థములు సమర్థించుటకు ప్రయోగములు వెతకుటగాక, ప్రయోగములనుబట్టి ప్రకృతకార్యాలయమున అర్థములు నిర్ణయింపబడుచుండుట ప్రశంసనీయము. ఇది కాలహరణకారణమే యైనను సర్వోత్కృష్టమైన నిఘంటువు సిద్ధమగుట కిదియే పరమ సాధనము. కార్యాలయోద్యోగులు భక్తిశ్రద్ధలతో తమకార్యములు నిర్వర్తించుచున్నవిధము ప్రత్యేకించి ప్రశంసింపదగియున్నది.

20-1-20. కాళ్లకూరి గోపాలరావు,

(వపరాను)

(True Copy.)

I had great pleasure in visiting the Lexicon Office on the afternoon of the 10th Feb I was shown round the office by the Pandits and am glad to note the work done there is quite satisfactory I feel sure that the work, when finished, will be of great use to the Telugu public.

(Sd.) P. V. RAMANUJASWAMY, M.A.,

*Vizianagram.*

(True Copy.)

I and my Assistant, Mr C R. Krishnamachariar, were kindly invited by Mr. J. Ramayya Pantulu to see his Telugu Lexicon Office and give our opinion on the activities of the institution We are glad to say that much has been done in this short period of two years and under the able guidance of the President and the scientific method adopted, the Lexicon, when it comes to be issued, must prove to be a monumental production The patron, the Rajah Sahib of Pithapuram, is to be highly congratulated for his admirable taste for literary fame which has been the one great ambition of Telugu kings from historic times.

(Sd.) H. KRISHNA SASTRI B.A.,

*Assistant Archæological Superintendent for Epigraphy, Madras Circle.*

(True Copy)

To the highly literary and cultural value the Lexicon is bound to possess, collection of provincialisms in Telugu will greatly add much. This will go a great way in solving the question of the feasibility, if any, of a so-called " Modern Telugu " literature.

(Sd.) C. R. KRISHNAMACHARI,

*Assistant Epigraphist.*

2-3-20.

(True Copy.)

S. V. & CO., MADRAS.

# విజ్ఞాపనము.

మహాశయులార!

కఱవు తన మహిమమునంతను ముద్రాక్షరశాలలపైఁ జూపుచున్న యీదినములలో స్వకీయ ముద్రాయంత్రములుగలవారికే తొట్రుపాటు కలుగుచున్నది, పరవశులగువారి మాట యెత్తనేల. రౌద్రిసంవత్సరము ప్రారంభించిన మూఁడునాలుగు నెలలకుఁగాని సిద్ధార్థి కడపటిసంచిక వెలువడు నవకాశము లేకపోయినది. కాలమును బట్టి నాలుగైదు సంవత్సరములనుండి మాపరిషత్కార్యము లన్నియుఁ జక్కఁబెట్టుచున్న ముద్రాయంత్రశాలవారిని విడిచి వేఱొక క్రొత్త ముద్రాయంత్రమువారియొద్దికిఁ బోవుట తటస్థించినది. అది పత్రిక యాలస్యముగా వెలువడుచున్నదానికిఁ గారణాంతర మైనది. ఈ చైత్ర వైశాఖ సంచికలోఁ గొంత ప్రాఁతవారుఁ గొంత క్రొత్తవారు ముద్రించియున్నారు. ఇఁకమీఁదఁ గ్రొత్తవారే నిలిచియున్న సంచిక లన్నిటిని శీఘ్రముగాఁ జేసి యిచ్చెద మని చెప్పుచున్నారు. పాఠకు లతి స్వల్పకాలమున సకాలమునకు వెలువడిన సంచికను జదువఁగలరు. వారువారు దయచేయవలసిన చందాలకై జ్ఞాపికలు వ్రాసికొనియున్నారము. ప్రత్యుత్తరము లీయనివారికిని జందాలను బంపనివారికిని మేమీ సంచికను బంపుట నిల్పియుంచితిమి. సొమ్ము పంపించి ప్రత్యుత్తరములు వ్రాసి చేరనివా రెల్లరు వారివారి పత్రికలం దెప్పించుకొనఁ గోరుచున్నారము. ఈ రౌద్రిసంవత్సరము కఱవులో నధికమాసముకూడ వచ్చినది. ధనమునకుఁ జిక్కు కలుగకుండఁ బాఠకులు తమతమ చందాలను బంపి యెప్పటి యభిమానముఁ బత్రికపైఁ జూపఁ గోరుచున్నారము. ప. అ.

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితగ్రంథములు.

# చంద్రభానుచరిత్రము

తరిగొప్పుల మల్లనకవి విరచితము.—అచ్చులో నున్నది.

## ప్రకటితగ్రంథములు

| | రూ. | అ. |
|---|---|---|
| పురాతనాంధ్రచ్ఛందశ్శాస్త్రము. వేములవాడ భీమకవి ప్రణీతము. - - - - - - - | 0 | 10 |

## కావ్యాలంకారచూడామణి.

| | | |
|---|---|---|
| విన్నకోట పెద్దయకవి రచితము. ఛందోవ్యాకరణ భాగములందెలుపు ౮, ౯. ఉల్లాసములు. - - - - | 0 | 8 |
| విప్రనారాయణచరిత్రము. చదలువాడ మల్లయకవికృతము. | 0 | 8 |
| జైమినిభారతము. (వచనము.) సముఖము వేంకటకృష్ణప్పనాయకునిచే రచింపఁబడినది. - - - - - | 0 | 12 |
| చంపూరామాయణము. ఋగ్వేదికవి వేంకటాచలపతికవిచే రచింపఁబడినది. - - - - - - | 1 | 0 |
| నీతిసీసపద్యశతకము. తాళ్లపాక పెద తిరుమలయ్య. - | 0 | 2 |
| యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనము. - - - | 0 | 8 |
| జ్యోతిశ్శాస్త్రసారము (వచనము.) శ్రీమాన్ కపిస్థళము కృష్ణమాచార్యులుగారు, బి. ఏ. - - - - | 0 | 8 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము. (శిష్టు సర్వశాస్త్రి.) - | 0 | 2 |
| సర్వేశ్వరశతకము. యథావాక్కుల అన్నమయ్యగారు. | 0 | 3 |
| A Defence of Literary Telugu. - - - | 0 | 8 |

From page 17 to 56 and the title page are printed at the British Madel Press, Choolai and the rest at the Srinivasa Varadachari & co., Madras and published at the Telugu Academy office 39 Harris Road, Pudupet, Madras.

చందా సం॥ కు రూ 3. విడిసంచిక అ. ౮.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౯. రౌద్రిసంవత్సరము జ్యేష్ఠాషాఢమాసములు. సంచిక ౨.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి: ౧౯౨౦.

# విషయసూచిక.

రౌద్రిసంవత్సరము — జ్యేష్ఠాషాఢములు.

# ఆంధ్రచ్ఛందస్సు.

## ఛందస్సుప్రాచీనత.



శ్లో॥ "శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం    షం తథా।
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః" ॥

అనుసూక్తిచొప్పున ఛందశ్శాస్త్రము వేదాంగ మగుటంజేసియు, వే... నైతము ఛందోబద్ధమై యుండుటంజేసియు నియ్యది మిక్కిలిప్రాచీన మైనశా... మని చెప్పవచ్చును.

రామాయణమును రచించినవాల్మీకిమహాకవి నారదుఁడు వర్ణించి... శ్రీరాముని గుణప్రశంసను విని, పిదప స్నానార్థము తమసానదీతీరమున కేఁ... యచట నొకనిషాదుఁడు క్రౌంచమిథునములో మగపక్షిని వధింపఁగా మిక్కి... శోకించి, యాఋషి వానిని

శ్లో॥ "మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీస్సమాః।
యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్" ॥

అనుమాటలతో శపించె ననియు, నట్టిశాపవాక్యము లప్రయత్నసిద్ధముగ ఘుణాక్షరన్యాయమున శ్లోకరూపము నందె ననియు నాముని యది శ్లోకమువలె నగపడుటంజేసి, యది శ్లోకరూపమా? లేక, కేవలపదసందర్భమాత్రమా? యని యాలోచించుచుండఁగా, భాషాధీశుఁడు వచ్చి

శ్లో॥ "తమువాచ తతో బ్రహ్మా ప్రహస్య మునిపుంగవమ్
శ్లోకఏవ త్వయాబద్ధో నాత్ర కార్యా విచారణా
మచ్ఛందాదేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ"

అని యిట్లు పలికి యది శ్లోకమే యని నిర్ధారణముచేసె ననియు రామాయణకృత్యాదిని జెప్పఁబడియున్నది. పై 'మానిషాద' అనుదానిలోని యర్థవిశేషము, రామాయణకథాసంక్షేపకథనరూప మనియు, ఛందోవిషయము వాల్మీకిమహాకవికి బ్రహ్మదేవునిదయవలన నలవడినరామాయణకావ్యరచనాదక్షానర్గళకవితాప్రవాహపుఁబ్రశంస యనియు గ్రహింపక, కొందఱు రామాయణకాలమునకుఁ బూర్వము ఛందస్సే లేదని యాసందర్భమునకు విపరీతార్థములను జెప్పెదరు. వేదములు ఛందోబద్ధము లగుటంజేసి, వేదవేదాంగపారగుఁ డగు

వాల్మీకిమహర్షి కానఁటకు ఛందోజ్ఞానమే లేదని చెప్పుట యెంతయు వింతయై యుండునుగదా!

ఛందము నుపయోగములు.

"అముష్య విద్యా రసనాగ్రనర్తకీ" అను శ్రీహర్షసూక్తిచొప్పున విద్యలను జిహ్వాగ్రమున నుండునట్లు ధారణచేయుటకు ఛందస్స్వరంబులె సాధకంబులని చెప్పవచ్చును. అట్లు ఛందస్సు ధారణోపయోగకారిమాత్రమే కాక "పాద బద్ధోఽక్షరసమః, తంత్రీలయసమన్వితః" అనువాల్మీకిమహాకవిసూక్తిచొప్పున సంగీతకళాపరావతారమై, శ్రుతిసుఖప్రదమై, భారతీయువతి ధరియింపఁ దగినయమూల్యాలంకారమునై యానందానుసంధానముచే మనోవికసనకారియు నగుచున్నది.

సంస్కృతచ్ఛందమె యనేకభాషల ఛందములకు మూలము.

మహోన్నతదశలోనికి వచ్చియున్నసంస్కృతభాషలోనిఛందఃకళ యార్యులసంబంధమున హిందూదేశభాషలలోఁ బెక్కిటి నలంకరించినది. అట్లు తక్కినభాషలతోపాటుగ ద్రావిడభాషలందును సంస్కృతచ్ఛందఃకళ వ్యాపించి తత్తచ్ఛందఃకళలను విస్తరింపంజేసినది.

క. ఇంతఱుపి దుభయభాషెయొ, ళంతొడరదె సర్వవిషయభాషాదిగళిం
ముంతిరుపిద పెంనినగాఁ, అంతరిసదెకెళ్ ఇదంపయోరుహావదనే.

కర్ణా॥ ఛందో॥ ౧ ఆ॥ ౭౦ ప.

He says that his first instruction will concern the metres common to the two great divisions of languages (the Samskrita and Prakrita), it thus being given concerning the .....languanes etc., of all the countries.

*F. Kittel's Nagavarma's Prosody.*

ద్రావిడభాషలకుఁ గలసహజచ్ఛందోభేదములు.

ద్రావిడభాషలందు సహజములై నియతములై యున్నయతిప్రాసములును, ద్విపదాక్కరాదు లగునల్పసంఖ్యాకము లగుఛ్ఛందస్సులును దక్కఁ దక్కిన తెలుఁగునందలి, మ, య, ర, స, త, జ, భ, న, ల, గ, గణములతో నడచువృత్తములును, జతుర్మాత్రాకములగు గా, భ, జ, స, న; ల, ములతో నడచు కందార్యాగీతిపద్యములును, సంస్కృతచ్ఛందోలక్షణలక్షితములెయై యున్నవి. కందమునయిత మార్యాఛందోభేదమె యనఁదగును.

ఇట్లు సంస్కృతచ్ఛందఃప్రసిద్ధగణబద్ధము లగుశార్దూలార్యాదిపద్యములను గర్ణాటకాంధ్రములలో నుపయోగించునపుడు ద్రావిడభాషలఛందస్సుల

లో సహజము లై యున్నయతిప్రాసరూప నియతాలంకారముల నిడుటమా త్రమె విశేషమై యున్నది. అందును గన్నడమునందలియతి, సంస్కృతచ్ఛందః ప్రసిద్ధయతివంటిదె యయి యున్నది. కావున నందుఁ బ్రాసము నిడుట మా త్రమె విశేషము. అఱవమునందును దెలుఁగునందును బ్రాసము నియతముగా నుండుటయెగాక సంస్కృతచ్ఛందములోని పదవిరామరూపయతికి మాఱుగ సజాతీయవర్ణావృత్తిరూపయతియు, నాయతిస్థానమునఁ దఱచుగా నిలుపఁబడును.

ద్రావిడభాషలలో యతిప్రాసములు సహజములు.

ఇట్టియతిప్రాసములు సంస్కృతపద్యములలోసైత ముండిన నుండవచ్చును గాని, యందు నియతముగా నుండవలసిన ప్రసక్తి లేదు. అయ్యవి శబ్దాలంకారము లగుటంజేసి, తక్కినయలంకారములవలెనె యథేష్టముగా నిలుపఁబడవచ్చును. ఇఁక ద్రావిడభాషలయందుమాత్ర మవి యుగ్గుతోడఁ బట్టినవాని వలె సహజములై యున్నవి. ద్రావిడభాషలకు సహజము లగునక్కర లను పాటలలో నొక టగుమధ్యాక్కరతో నున్న తొమ్మిదవశతాబ్దపుయుద్ధమల్లుని బెజవాడశాసనము నియతము లగుయతిప్రాసములతోఁ గూడియున్నది. సంస్కృతవాఙ్మయమునుండి తెచ్చికొనిన శుద్ధాంధ్రచ్ఛందములలో, నవి నియతము లై యుండుటయే గాక యనంతము లగు తెలుఁగుపాటలందును, దెనుఁగుసామెతలందును, వ్యాపించియున్నవి.

పాటలు.

"శ్రీగణాధిపతిని చిత్తానతలతు
తలచినే మ్రొక్కెద దైవాలకెల్ల". పాముపాట.
"గంగవై తేనీవు గగనమందుండాలి
మగని శిర మెక్కుట తగునటే గంగ". సవతులకయ్యం.
"హరీహరీనారాయణాదినారాయ్ణా
కరుణించురామమ్ము కమలలోచనుడ". ప్రార్థనపాట.

సామెతలు.

"ఆలొల్లక అరవైయేళ్లు;
మొగుడొల్లక ముప్పైయేళ్లు
బాలప్రాయం పన్నెండేళ్లు"
"కాఁగలకార్యం గంధర్వులుచే సేరు"
"సానులకు స్వయంపాకాలు, బాపర్లకు బత్యాలు"

"చెడ్డా పడ్డా శ్రీకాకుళమే గతి"

"కోరివీగీ కొడుకుని గంటే, మూగీ చెముడూ ముంచుకొవొచ్చేయి"

"మూసకమ్మసమర్తకు మణ్ణైతేనేమి? పుణ్ణైతేనేమి?"

"తానొకటి తలిస్తే దైవమొకటి తల్చేడు"

"నూవుకాయకు నూరువ్యాధులు"

ఇట్లు దేశ్యము లగుపాటలయందును, సామెతలందును సైత మీయతిప్రాసములు వ్యాపించియుండుట నరయఁగా, నివి యఱవకన్నడపుఛందముల నుండి తెలుఁగుఛందస్సులోనికిఁ దీసికొనిరాఁబడియుండు ననుటకు మాఱుగా నిప్పటిశబ్దతత్త్వశాస్త్రజ్ఞులు చెప్పుచున్నరీతి నీద్రావిడభాషలకెల్ల మూలమైన యొకానొకద్రావిడభాషలో నీయతిప్రాసములు ప్రసిద్ధములై యుండి తన్మూలమున ద్రావిడభాషలం దెల్ల వ్యాపించి యుండు నని చెప్పుటయె యుచిత మేమో యని తోఁచుచున్నది.

## యతిప్రాసముల యొప్పిదము.

సహజసుందర మగునీయతిప్రాసనియము మనెడుసగిమీపనితోఁ గూడిన ...వోరూప మగునలంకారమును ధరించినయాంధ్రకవిత, యసాధారణవిలాస ...తో నలరుటలో వింత యేమున్నది? "పలుకునుడికారమున నాంధ్రభాష ...స్త్ర" అను శ్రీనాథకవిసూక్తిచొప్పునను "ఎల్లనృపులుఁ గొలువ నెఱుఁగవే ...కి, దేశభాషలందుఁ దెనుఁగు లెస్స" అను శ్రీకృష్ణదేవరాయసూక్తిచొప్పు... "తేనియ లొల్కునదిగానఁ దెనుఁగు" అను కొందఱు చెప్పునిరుక్తిచొప్పు... ...చమత్కారకారియు, సహజసుందరమును, ప్రకృతిమధురమును, నగు ...భాషలోనికవిత, యతిప్రాసచిత్రితచ్ఛందోరూపాలంకారాలంకృత యగు ...గానవిలాసములు లోకోత్తరగుణోత్తరములై, వీనుల కింపునింపు ననుటకు ...ము ముండునా? ఈయంశము సహృదయుల నెమ్మనములకు విశదపడుటకై ...కుఁగాను రెండుపద్యముల నుదాహరించుచున్నాను.

...నులవిందై యమృతపు, సోనలపొందై యమందసుమచలదళినీ
గానముక్రందై యాస్వన, మానందబ్రహ్మమైనదధిపతివల్కెన్.

వసుచరిత్రము ౨ ఆ. ౧౮.

... ఏమాలపొదరిండ్ల నాపాటలాశోకదీప్తిఁ గసకకలాపమురసె
సాలావళులు దాఁటి యేలాలతావారబాలాతతిపరాగపటము లూడ్చి

నానామధుపనవ్యగానామృతము మెచ్చి సూనాసవము లెల్లఁ జూఱలిచ్చె
శంకారహితధీరహుంకారశుకభటాహంకారముల ఫలాహుతియొనర్చె
ననుచు నాగంధవహునిశౌర్యములు దెలుపు, లీల విరిసినవిరులురాలినరజంబు
లొలికినరసంబులురిలినఫలములధిపు, మ్రోలనిడి పల్కిరుద్యానపాలురపుడు.

వసుచరిత్ర.

నిక్కముగా నాంధ్రకవీంద్రులు కవితలోనితక్కినగుణములకన్న నిట్టిశ్రుతిసుఖప్రదాయిసహజమధురపదగ్రథనకళావిలాసముల కెక్కువ మక్కువపడి, తమకౌశలమునెల్ల నావిషయముననె దారవోసియుండి రనియు, నక్కారణముననే యాంధ్రకవిత, శ్రుతిసుఖప్రదానవిషయమునఁ దక్కినయన్నిభాషలకవితలకును దలమానికమై వెలయుచున్నదనియును, జెప్పుట యతిశయోక్తి కానేరదు.

సంస్కృతాదిమహాకవులు కవితాకళ్యాణికి ఛందోరూపమంగళసూత్రాలంకారముమాత్రమె యుండినం జాలునని భావించిరి. ఆంధ్రకవీంద్రులన్ననో కవితాసువాసినికిఁ గుత్తికంటును మట్టియలును బోలి యతిప్రాసములుసైతము నియతాలంకారములై యుండవలయు నని తలంచిరి. ప్రకృతిమధుర మగు నాంధ్రవాణి సహజసుందరయతిప్రాసరూప శబ్దాలంకారాలంకృత యగుచు ఛందస్స్వైరలయమేళితయై నటించునపు డయ్యది రసికులనెమ్మనములకుఁ బరమానందసంధాయినియై యుండుననుటకు సందియ ముండదుగదా!

‘‘అలంకృతీనాం శక్తావప్యానురూప్యేణ యోజనమ్’’

అనుధ్వనికారోక్తి చొప్పునను,

చ. ‘‘పరిమితభూషణంబులును ఫాలముపై నెలవంకనామముం
బరఁగనొయారియై నయనపర్వ మొనర్చె వధూలలామ దా
విరళగణేయతారలు నవీనతరేందుకళావిలాసముల్ వ
రుస వెలుంగఁగా విదియనాఁటివిభావరి పొల్చుకైవడిన్.’’

నరసభూపాలీయము.

అనుమూర్తికవిసూక్తిచొప్పునను రసభంగముచేయని యతిప్రాసరూపవిరళాలంకారములచే మాత్ర మలంకరింపఁబడి మృదుమధుర పదన్యాసలలిత యై ప్రౌఢరీతిని, రసౌచిత్యవిలాసములతోడను సూక్తినైపుణముతోడను భావగాంభీర్యముతోడను, నలరుచున్నపుడే కవితామతల్లి శ్లాఘ్యతాపదవి నధిరోహింపఁ జాలియుండును. ఈవిషయమున మచ్చునకుఁగా రెం డుదాహరణముల నిచ్చుచున్నాఁడ.

ఉ. "నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁ డోపు నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము క్రమ్మఱింపఁగాన్."

ఉదంకపౌష్యసంవాదము భార. ఆది. ౧ ఆ. ౧౦౧.

ఉ. "చిచ్చఱకన్ను మూసికొని చేతిత్రిశూలము డాఁచి లీలమై
వచ్చినరుద్రుచందమున వ్రాలెద వీ వనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిమగవారికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి మెవ్విధిం గెలువవచ్చు మహాత్మ యెఱుంగఁజెప్పవే.

భార. భీష్మ. 3 ఆ. 300.

శబ్దాలంకారములవలని నష్టములు.

పైశైలివంటిమధుర మగుశైలితో మనవారలు కొందఱు తనివినొందక కేవలశబ్దాలంకారప్రియులై, ముచ్చెసరుకులతో గొల్లభామ నలంకరించువిధమున రసౌచిత్యములను, బాటింపక, శబ్దాలంకారపరంపరతోఁ గవితావనిత నలంకరింపసాగిరి.

ఉ. అబ్జముఖీమనోజ నరసాధిపనందన కృష్ణ నీయశం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము నీపరాక్రమం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము నీవిహారపితం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము చిత్రమిద్ధరన్.

కవిజీవితములలోని పంచపాషాణములలోనిది. ౩౬౨ పుట.

సీ. రాజరాజసుహృద్ధరాజరాజముఖీవిరాజ రాజన్ముఖప్రభల నేలి
పారిజాతకపాదపారిజాతరిపుద్విపారిజాతశ్రీలఁ బ్రతిఘటించి
హారికాండగంగాలహరికాండజకులేంద్రహారికాండదీప్తుల నతకరించి
ఘనసారశారదఘనసారసజవాహఘనసారకాంతులఁ గడకుఁ దఱిమి
.......యెసఁగె మగదల కృష్ణమంత్రీంద్రుకీర్తి. దశావతా. ౧౬౪.

ఇట్టిరచన లాపాతమధురములై యున్నను వీనియందు సారస్యౌచిత్య భావగాంభీర్యాదులు మృగ్యములై యుండుటయే గాక, యపుష్టార్థ, నేయార్థాసమర్థకనిరర్థక గూఢార్థక్లిష్టార్థానుచితత్వాదిదోషములును, నిండియుండు నను టకు సందేహము లేదు. ఒక్కొక్కప్పుడు వాగనుశాసనాదిమహాకవులకవనము

నందును కేవలయతిప్రాసనిర్బంధమాత్రముసైతము, నిరర్థకపదప్రయోగాది దోషములకు సాధకమై రసోచితపదప్రయోగమునకుఁ బ్రతిబంధకమై యుండు టయుఁ గలదు.

క. "ఈసౌపర్ణాఖ్యానము, భాసురముగ వినిన........ భార. ఆది. ౨ ఆ. ౧౨౪.

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులన్,
జారుతరంబు లయ్యె.................................. భార. అరణ్య. ౪ ఆ.

ఉ. ............ । భావజశక్తి నైనయది పన్నుగనన్నుఁ బరిగ్రహింపు,........
భార. ఆది. ౩ ఆ. ౧౨౯.

ఉ. ........ । మానుగఁ బత్ని వీ వగుము మానితధర్మవిధానయుక్తితో.
భార. ఆది. ౮ ఆ. ౫౪ ప.

పైపద్యభాగములందలి యధోరేఖాంకితపదములు ప్రాసవిశ్రమార్థకములే గదా!

వాగనుశాసనునివంటిమహాకవికే యతిప్రాసనిర్బంధము లిట్టిచిక్కులను గూర్చునపు డిఁక సామాన్యునకు నందును వెట్టివెట్టిశబ్దాలంకారముల నపేక్షించువానికిఁ జెప్పెడి దేమి? కొందఱాధునికుల గ్రంథములలో "ధర, ధారుణి, మహి, భువి, క్షితి, ఎసఁగు, ఒప్పు, ఒనరు, అలరు, పొనరు, వఱలు, పన్నుగ, మానుగ, రహి, లలి, లసత్, ఉద్యత్, కనత్," మొదలగుదోఁపుడువాసపుఁ బదములను యతిప్రాసస్థలములలో, దోఁ పనిపద్యము లరుదై యున్న వని చెప్పుట యత్యుక్తి కానేరదు.

యతిప్రాసము లనియతములు కానోపును.

పయినుదాహరించినరీతిని గొన్నియెడల యతిప్రాసములు సరిగాఁ గుదురనపు డీయలంతిస్థలములకై నియమభంగమును జేసికొననేల?'యని తలఁచియే కావలయు వాగనుశాసనాదు లేదోయొకపదము నెట్టెటో సంవర్ధపఱిచి కాని, యేవోకొన్నియుక్తులచొప్పున వర్ణసాజాత్యమును గల్పించికాని, తవిన, రూడి, అలివెను, మున్నగు నపూర్వరూపవిశేషములను బ్రయోగించి కాని, యతిప్రాసములను నెలకొల్పి వాని నియతత్వమును స్థిరపఱుచుచువచ్చిరే కాని, సరిగాఁ గుదిరినపుడు యతిప్రాసములను బాటించియుఁ, గుదురనపు డుపేక్షించియుఁ బదౌచిత్యము, మున్నగువాని కెక్కుడుప్రాధాన్యము నొసంగరైరి. అక్కారణముచేతనే యతిప్రాసములకు నియతత్వము రూఢమూలమయ్యెను.

శబ్దాలంకారసంపత్తికై కల్పింపఁబడినయతిప్రాసములు రసోపస్కారకములై యుండుటకుమాఱుగా, రసాపకర్షకములై యుండుట దుష్టమై యుండు ననుటకు సందేహము లేదు. మఱియు సామాన్యముగా సమానవర్ణావృత్తియే శ్రుతిసుఖదాయకమై యలంకారము కానోపును గాని, యేవో వ్యాకరణాది శాస్త్రములందుమాత్రము ప్రసిద్ధములై యున్నసంబంధములనుబట్టి సజాతీయమై యుండువర్ణ మావృత్తమైనంతమాత్రమున నుద్దిష్ట మగుశ్రుతిసుఖము సిద్ధింపనేరదు. తే. గీ. 'ప్రజ్ఞచయసక్తకంఠదావాగ్నిపాయ', ఇందు గకార జకారములప్రాస మేకవర్ణావృత్తివంటిది కాదు గదా. కం. పోనుద్యోగము చేసిన, ప్రాణంబా యింక నీకుఁ బాఫేయం బా'. ఇత్యాదులందలిశాస్త్రీయ మగు 'నణ' ప్రాసము శ్రుతిసుఖవిషయమున (అసమ్మతమగు) కేవల నణప్రాసముకన్న భిన్నము కాదు గదా? అట్లయినను సమానవర్ణావృత్తి గలుగునట్లు పదములను సంఘటించుట కొన్నియెడల దుశ్శక మగుచు నుండుటంజేసి, మనవారు మతాచారములందువలెనె, యిందును నేవో కొన్ని ప్రత్యంతరములను గల్పించి యుపయోగించుచు, యతిప్రాసము లెట్లైన నిల్పఁబడిన ననిపించుకొనఁ జూచుచువచ్చిరి. అక్కారణముచేతనే యవి, నియతముగా నుండక తీరదనియు, వానిని విడిచిన నేదో ప్రత్యవాయము వచ్చుననియుఁ గొందఱు తలఁచునంతటి వెఱ్ఱిసిద్ధాంతము బయలుదేఱినది. కావుననె యసమర్థులుసైతము, దానిని విడుచుకొనఁజాలక శాస్త్రానకుఁగాను "యజ్ఞోపవీతార్థం హరిద్రాక్షతాః సమర్పయామి" అనురీతిని బయి నుదాహరించిన "ధర, లలి, రహి" ప్రభృతి నిరర్థకశబ్దములను జొనుపుచు వెలిఁ దీర్చికొనుచున్నారు. ఆహా! దృష్టఫలకము లగుకృత్యముల కదృష్టఫలకత్వము నంగీకరించుటవలనఁ గదా యిట్టిచిక్కులు వాటిల్లినవి!

విమర్శకులును యతిప్రాసములను విడువఁజాలకుండుట.

ఇట్లాంధ్రకవిలోకమం దంతటను దత్ప్రయోగ మొకయవర్జనీయ మగు విధిగా, రూఢమైయుండుటచేతనే తుదకు వానితత్త్వమును బాగుగా నెఱిఁగిన వాఙ్మయచరిత్రజ్ఞు లగువిమర్శకాగ్రగణ్యులుసైత మట్టిచిక్కులకు లోనగుచునే యున్నారు. "సంభావితస్యచాకీర్తి ర్మరణాదతిరిచ్యతే" అనుగీతాసూక్తిచొప్పున మంచిదైనను విమర్శహైన్యమున లోకగర్హితమై యున్నచో నుజ్జగింపఁదగినదే గదా? ఇంతయేల! పండితవ్యవహారమున కెక్కినవ్యావహారికభాష గ్రాహ్యమే యని యెఱిఁగినవారుఁగూడ, లోకమునకు వెఱచి దానిని గ్రంథములందు

యథేష్టముగా వాడుకచేయుటకు వెనుదీయుచుండలేదా? అనావశ్యకములే యని యెఱిఁగియెఱిఁగియు నెన్నెన్నియాచారములకుఁ దత్త్వజ్ఞులుసైతము లొంగుచుండలేదు? కావునఁ బరమేశ్వరవిలాసప్రసిద్ధ మగునీకీర్త్యపేక్షాశక్తియే మానవులను మొదట నట్టికార్యములందుఁ బ్రవర్తింపఁజేయునదియుఁ, బిదప నట్టియాచారములు చెడకుండ సంరక్షించుచు వచ్చుచున్నదియు, నయి యున్నదని చెప్పుటకు సందేహము లేదు.

### సౌలభ్యాపేక్ష యతిప్రాసములను సడలించుట.

అట్లయినను నీశ్వరవిలసిత మగుసౌలభ్యాపేక్ష యను మఱొకమహావస్తువు జీవులకుఁ బ్రకృతిమధుర మైనది గలదు. మనసునకైనఁ దెలియకుండ మానవుల నకృత్యములందుసైతముఁ బ్రవర్తింపఁజేయుమహాశక్తి యద్దానికిఁ గలదు. ఆచారవ్యవహారములందువలెనె భాషావిషయములందుసైత మమ్మహాశక్తియే కొన్నిటి నకృత్యము లని వాదించువారినిసైత మాకృత్యములందుఁ బ్రవర్తింపఁజేయఁగలుగును. కాని కీర్త్యపేక్షాశక్తిప్రాబల్యమున సౌలభ్యాపేక్షాశక్తికిఁ గల్గుజయము చిరసాధ్యమును, క్రమసాధ్యమును నగునుగాని యొక్కమాఱు పెద్దమార్పు రా నేరదు. రేఫశకటరేఫమైత్రి యగ్రాహ్య మనియుఁ దస్స్థలముననే పోతనార్యునిభాగవత మగ్రాహ్య మయ్యె ననియు, నుద్ఘోషించిన యప్పకవివంటివాఁడును నద్దానినె కొన్నియెడలఁ బ్రయోగింప మానఁజాలఁడయ్యెనుగదా! పండితవ్యవహారమున కెక్కినను వ్యాకరణసిద్ధము కాని వ్యావహారికభాష గ్రంథముల కెక్కరా దని పెనఁగులాడుమహాశయు లనేకులు స్వగ్రంథములం దట్టిభాషకుఁ దా వీయకుండ లేకపోవుట యెల్లరకును విదితమేగదా!

### దేశభాషాభిమానులయత్నము లదృష్టాధీనములు.

దేశీయులయదృష్టమునుబట్టి దేశాభిమానులకుఁగాని, భాషాభిమానులకుఁగాని, యుత్సాహ ముద్రేకించుచుండును. దేశభాషలు మహోన్నతస్థితికి రానున్నప్పుడు తత్తదభిమానులకుఁ దత్తదనుకూలమహాకార్యములను సాధించుపరాకాష్ఠ (పూనిక?) జనించుచుండును. అట్లు కానపుడు వారికి నిరుపయోగము లగుకార్యములందుఁ బ్రవృత్తి గల్గుచుండును. దురదృష్టవశముననేగాకున్న ననేకు లగునాంధ్రమహాకవులకు సంస్కృతవాఙ్మయసంబంధమున రసపోషణము, ఔచిత్యము, భావనాశక్తి, పాత్రోచితస్వభావవర్ణనము, కథాకల్పనాకౌశ

లము, మున్నగువానియం దంతగా నభిలాషపొడమక, యరవకన్నడాదివాఙ్మయ సంబంధముననో, మఱియేకారణముననో ''మీసాలపై తేనియల్'' అనురీతి గలయీశబ్దాలంకారములను జిత్రించుసభిలాష పొడమి ప్రన్పృద్ధము కానేల?

అట్లు శబ్దాలంకారశృంఖలితు లయ్యుఁ గొన్నియెడల రసమును వెల్లివిరియఁజేయునిరర్గళమృదుమధురకవితాప్రవాహము గలయాంధ్రమహాకవులకు నిజముగాఁ గథాకల్పనౌచిత్యరసపోషణాదులం దభిలాష మెండై, శబ్దాలంకారరచనయందు వైముఖ్యమే పుట్టియున్నయెడల నాంధ్రవాఙ్మయ మీవఱ కెట్టి మహోన్నతదశకు వచ్చియుండునో చెప్పఁజాలము గదా!

శబ్దాలంకారకవితకుఁ గల్గినయాగంతుకఫలవిశేషము.

పైనుదాహరించినరీతి నీశబ్దాలంకారాదులు రసౌచిత్యాదులకుఁ గొంత వఱకుఁ బ్రతిబంధకములే యైనను, భాషానియమనమునకుమాత్రము మూలాధారములై యాంధ్రభాషకుఁ గొంతయుపకారము నొనరించుచున్నవి. సామాన్యముగా భాషానియమనమునకు శబ్దాలంకారరచన యంతగా నావశ్యకము కావలసినప్రసక్తి లేకున్నను, నాంధ్రభాషావిషయమున నేర్పడిన యొకానొక వింతసిద్ధాంతముచే నట్టిప్రసక్తి గలుగవలసివచ్చెను.

సామాన్యముగా నాయాకాలములందలి పండితవ్యవహారస్థభాషయే యాయాకాలములలో గ్రాంథికభాష యగుచుండును. పూర్వపూర్వకాలములందలి భాషల కాయాకాలములలోని వాఙ్మయమె రక్షకమై యుండును. అట్లుగాక యాంధ్రభాష కదృష్టవశమున వ్యవహారభ్రష్టసంస్కృతభాషావాఙ్మయపరిచయముచేతఁ బ్రాచీనగ్రాంథికభాష యాచంద్రతారమును గ్రాంథికభాషయై యుండఁ దగునన్నసిద్ధాంత మిటీవల బయలుదేఱినది. కాని యిట్టి సిద్ధాంతము ప్రాచీనులకాలమున లేకుండుటనో మఱియేకారణముననో యట్టి ప్రాచీనభాషకు నియామకము లగుసమగ్రములైన కోశములుగాని, వ్యాకరణములుగాని సంస్కృతమునకు వలెఁ బుట్టియుండలేదు. కాఁగాఁ గలకాలము నాంధ్రములోఁ బుట్టఁదగినగ్రంథముల కెల్లఁ బ్రాచీనప్రబంధస్థభాష చాలవఱకు నియామకము కావలసి వచ్చెను. మఱియు నట్టివాఙ్మయ మిప్పటివలె ముద్రణాద్యుపస్తమపరికరము లేకుండుటచేతను, నసంస్కారులచేఁ దఱచుగ వ్రాయఁబడుచు వచ్చుచుండుటచేతను నందుఁ దండోపతండముగఁ దప్పులు ప్రవేశించుచువచ్చెను; ఇంతియగాక;

ఉ. "నన్నయముఖ్యసత్కవిజనంబుల కావ్యములందు లేఖకుల్
కొన్నియుఁ బాఠకాధములు కొన్నియుఁ బోకడఁ బెట్టఁ దక్కువై
యున్నెడఁ జూచి జానపదు లోడక దిద్దినతప్పుత్రోవలె
ల్ల న్నిజమంచుఁ గైకొనిన, లక్షణవేత్తలు సమ్మతింతురే."

అను నప్పకవిగారియాశయము చెప్పిన నాఁడు మొదలు నేఁటివఱకును నాయాకాలములందలి లక్షణగ్రంథములకు సరిగాఁ బ్రాచీనవాఙ్మయము సవరింపఁబడుచువచ్చెను. అక్కారణములచే ననేకస్థలములందు నిజ మయినకవిప్రయోగ మిది యని స్థిరపఱుచుటకు వీలుపడనంతటిదురవస్థ యాంధ్రభాషకుఁ దటస్థించినది. అయినను మనవా రింకను బ్రాచీనాంధ్రగ్రంథభాష తోడనే గ్రంథరచనము చేయునభిలాషను విడువకయు, నిజ మయినప్రాచీనాంధ్రభాషను దెలియఁజాలకయు, నట్టిప్రాచీనభాషకును నద్యతనపండితవ్యవహారస్థభాషకును విలక్షణము లగువలువిధము లైననూతనప్రయోగములను బ్రయోగించుచు గ్రంథముల రచించుచున్నారు.

కావున నీసమయమున శబ్దాలంకారబహుళము లగురచనలు భాషానియమనవిషయమున మిక్కిలిగా నుపచరించుట కవకాశము తటస్థించినది. సామాన్యముగా ఛందోయతిప్రాసశ్లేషయమకానుప్రాసాదిస్థలములందు నిబద్ధము లగుప్రయోగములు మార్పరానివై యుండునుగాన నవి కవిప్రయుక్తములే యని నిశ్చయింపఁదగినవై యుండును. ఆంధ్రభాషలోని ఛందోలక్షణములు గాని వ్యాకరణలక్షణములుగాని తఱచుగా నిట్టియాధారములనుబట్టి పుట్టినవే యని చెప్పవచ్చును. చెప్పవచ్చు నననేల! లక్షణములను సూత్రించునపు డిట్టియాధారములనే దొరకినంతవఱకుఁ బ్రమాణముగాఁ జూపుచుండుట యాంధ్రలక్షణగ్రంథములలోని సంప్రదాయ మై యున్నది.

శబ్దాలంకారములవల్లఁ గల్గునుపయోగ మల్పము.

అట్లయినను ననంతము లగుభాషావిషయములను నియమించుటలో నీయలంతిసంఖ్య గలనిర్బంధస్థలములలోని ప్రయోగములు సమర్థములు కాఁజాలకున్నవి. కాన గాఢాంధకారమున మెఱుఁగుడుపురుగులవల్లఁ గల్గువెలుతురువలె నీయలంతిప్రయోగము లల్పసాహాయ్యమునుమాత్రమే చేయఁజాలుచున్న వని చెప్పకతీరదు.

శబ్దాలంకారకవితనుబట్టి భాషను నియమించుట దుష్కరము.

మఱియు నొకప్రయోగము దొరకునపుడు దానిని బలువిధములుగా సమర్థించుచు నుండవచ్చునుగాన నం దేరీతినియమ మాప్రయోగమును బ్రయోగించిన కవికి సమ్మతమో గ్రహించుటయు దుష్కరమే యని యంగీకరింపక తప్పదు. ఈకారణముచేతనే లక్షణగ్రంథములలోఁ బరస్పరవిరుద్ధము లగు మతభేదము లనంతములు బయలుదేఱుట సంభవించినది. ఈవిషయము నిచట దిఙ్మాత్రముగ నుదాహరించి చూపెదను.

ఉ. "క్షత్త్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్త్రియవైశ్యశూద్రు లనఁగాఁ గలనాలుగుజాతులన్ స్వచా
రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితుకాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబునన్."

భార. ఆది. ౨.ఆ. ౧౭౭ ప.

అనునన్నయభట్టారకుని యొకప్రయోగమునుబట్టి పలుగురు లాక్షణికులు పలువిధము లగునభిప్రాయములతోఁ బలువిధము లగునియమములను గల్పించుచున్నారు.

క్షత్త్రియశబ్దములో 'తకార' ద్విత్వము లే దని తలఁచి యట్టిదానితో సరిగఁ బ్రాసస్థలమున నున్న 'మాంధాతృ' శబ్దములోని 'ఋ' వర్ణము రేఫము కాని చోఁ బ్రాసభంగ మగు ననియు నక్కారణముచేతనే "ఉర్ద్వం ద్వేరః" అను చింతామణిసూత్రము రేఫమును విధించుచున్న దనియుఁ గొందఱు చెప్పుదురు.

"క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః క్షత్త్రస్య శబ్దో భువనేషు రూఢః" అను మొదలగు సూక్తులచొప్పున క్షత్త్రియశబ్దములో 'తకార'ద్విత్వము గల దనక తీరదు. అక్కారణమునఁ బైపద్యపుఁ బ్రాసస్థలములో నున్న "చారిత్ర" శబ్దమునందును "అనచిచ" అనుపాణిని సూత్రమువలన ద్విత్వము సంపాదించి ప్రాసమును సమర్థింపనగును. అట్లే చతుర్థచరణమునందును "మాం। ధాతృ" శబ్దమున "ఉర్ద్వం ద్వేరః" అను నియమము నంగీకరించి రత్వము సాధించి పిదప "అనచిచ" అనుదానిచే ద్విత్వమును సంపాదింపనగును. సిద్ధసమాసమధ్యమున ఋకారమునకు రత్వము వచ్చుట నంగీకరించునపు డాపిమ్మట "అనచిచ" అను దానిచే ద్విత్వము సంగీకరించుట విరుద్ధము కానేరదు. "అనుక్తమన్యశబ్దానుశాసనవత్" అను పరిభాషచొప్పున "అనచిచ" అనుదానినిఁ దెనుఁగు వ్యాకరణములో నుపయోగించుట యసంగతము కానేరదు. అచ్చటిద్విత్వ ముచ్చారణ

స్వభావమునుబట్టి కల్పింపఁ దగినదగుటచే నట్టివిధి సర్వభాషాసాధారణ మగు న్యాయమువంటిదియుఁ గానోపును" అని మఱికొందఱు వాదింతురు.

పైపద్యము నాల్గవచరణమున "ఉర్ ద్వం ద్వేరః" అనువిధానమునుమాత్ర మంగీకరించినం జాలును. ప్రాసస్థలములలో హల్సంయోగాంతర ముండునపు డొకచో ద్విత్వ ముండి యొకచో లేకున్నను క్షతి లేదు. అక్కారణమున 'అన చిచ' అను సంస్కృతవ్యాకరణవిధి నసంగతముగఁ దెచ్చికొననక్కఱ లేదు. కాఁగా మూఁడవచరణములోని 'చారిత్ర' అను చోటను, నాల్గవచరణములోని 'మాంధాత్ర' అనుచోటను ద్విత్వతకారము లేకపోవచ్చును." అని వేఱొక కొందఱు చర్చింతురు.

"ఈపక్షత్రయమునందును మొదటిపక్షమువా రేకతకారవిశిష్ట మగు క్షత్రియశబ్దమును గలదని యంగీకరించునపుడు పైపద్యమునందలి ప్రాసములు కుదురుటకయి ద్వంద్వమున రత్వము వచ్చునను శాస్త్రము నంగీకరింపవలసినంత యావశ్యకత లేదు. ప్రసిద్ధమగు సంయుతాసంయుతప్రాసము నంగీకరించుట చేతనే యందలి ప్రాసములకు సాధుత్వము సిద్ధించును. ఇఁక—

ఆ. "క్రింద జడ్డలును బిఱుంద బిందువులును, నూఁది ప్రాసములకు నుండె నేని
హ్రస్వ మొకట నిడుఁదయక్కరం బొక్కట, వాని మొదల నిలుపవచ్చు నెందు."

అను నప్పకవివచనముచొప్పునఁ బ్రకృతపద్యపుఁబ్రాసమున బిందుపూర్వకత్వ ముగాని సంయోగేతరయుతిగాని లేనందునఁ బ్రాసపూర్వాక్షరములలో నొకట హ్రస్వాచ్చును వేఱొకట దీర్ఘాచ్చును నుండుట పొసఁగనేర దను బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికాకారుల (బాల. గుప్తా. ౩౬౭ పుట.) పూర్వపక్షముచొప్పునఁ బైచోటఁ బ్రాసభంగ మగునుగాన రత్వశాస్త్రము నంగీకరింపక తీర దని శంకింపవలదు. ప్రాసపూర్వాక్షర మొకప్పుడు గురు వయ్యెనా తక్కినచోట్ల గురువే కావలయు ననియు, నొకచో లఘువయ్యెనా యంతటను లఘువే కావలయు ననియు సిద్ధాంతముగాని పైరీతి నిర్బంధము లేదు. అప్పకవి—

కం. "గురులఘువులలో నెయ్యది, మురహర తొలిచరణమునకు మొదల నిలుచూని
ద్ధర నాపైనిడుప్రాసా, క్షరములపూర్వమున నదియ కదియింపనగున్."

అని చెప్పి దానివెనుకఁ దద్విచక్షణము ప్రకారాంతరమునఁ బయినుదాహరించిన "క్రిందజడ్డలు...."అను పద్యములతోఁ జెప్పియున్నాఁడు. ఇట్లే య నంతామాత్యుఁడును—

కం "ఆదిని గురులఘువులలో, నేది నిలిచె నదియె మొదల నిడి పాదము లు
త్పాదింపవలయు నుపజా, త్యాదుల మిశ్రములుదక్క నంబుజనాభా."

అని చెప్పియున్నాఁడు. కాఁబట్టి నియతముగాఁ బ్రాసపూర్వాక్షరములు గురువులైకాని లఘువులైకాని యుండవలయు ననిమాత్రమే సిద్ధాంత మగుటం జేసి యేకతరాంగీకారపక్షమునఁ బయిపద్యములో సంయుతాసంయుతప్రాసము చెల్లుట నిరాబాధ మని యెఱుంగునది. అక్కారణముచే "ఈపద్యమును రేఫశ్లిష్టమునొద్ద నుదాహరించుట కేవలము ప్రమాదాయత్తము" అని గుప్తార్థప్రకాశికాకారులు వ్రాయుటయే కేవలము ప్రమాదాయత్త మని చెప్పనగును. అప్పకవియే గాక యహోబలపండితుండును నీపద్యమును సంయుతాసంయుత ప్రాసమునకు లక్ష్యముగనే యుదాహరించెను. "క్షత్త్రియవంశ్యులై జగతి" నిత్యాదిపర్వపద్యే చతుర్థపాదే మాంధాతృపదస్య సంయుతాసంయుతప్రాసత్వేన ఋకారాంతత్వమేవ నన రేఫత్వమితి జ్ఞేయమ్." (అహోబల ౩౨౭ పుట.)

"ఆనజస్సాన్యదృతోర్ద్వంద్వే రేఫ శ్చ్యేకవర్తతే" అనునథర్వణసూక్తిచొప్పున 'ఆనజ్' రాఁదగినస్థలములందే పాక్షికముగ, దానిని బాధించి యీరత్వము వచ్చు నని యహోబలపతి యభిప్రాయపడి యున్నాఁడు. కాన "మాంధాతృరఘుక్షితీశులు" అనుద్వంద్వమున విద్యాయోనిసంబంధములు లేమింజేసి 'ఆనజ్ఋతోర్ద్వంద్వే' అనుచొప్పున 'ఆనజ్' రానేరదు. అక్కారణమునఁ దత్సమానస్థానమం దేవచ్చు రత్వమును రాఁజాలదు. కావుననే యహోబలపతి యీపద్యమున 'మాంధాతృశబ్దమున రేఫ కానేర దని "ఋకారాంతత్వమేవ--నన రేఫత్వమ్" అని వ్రాసియున్నాఁడు. తుదకు గుప్తార్థప్రకాశికాకారులును "రేఫాదేశంబు సంస్కృతద్వంద్వంబునందు నానజాదేశంబువోలె" అని యిట్లు (౧౯౯-న పుట) కొన్నివిషయములందు రత్వమున కానజ్సమానస్థానికత్వము నంగీకరించియు 'ఆనజ్జు'నకుఁ బ్రసక్తి లేనియీస్థలమునందు రత్వము వచ్చుటకుమాత్ర మంగీకరించి యడిదము సూరకవిగారితో నేకీభవింపనెంచుట యెల్ల ద్విత్వము ప్రాసములో నాపృత్తము కాకున్నను క్షతి లే దనుతమవాదమునకు లక్ష్యమును సృజించుటకే యని తలఁచుట యసత్యము కానేరదు.

క. "క్షత్త్రియధర్మంబున మాం, ధాతృఁడు రాజ్యంబు నీతిఁ దగఁ బాలించెన్
శాత్రవరహితంబుగ నిజ, గోత్రము వెలయంగఁ బ్రజలు కొనియాడంగన్."

అని యిట్లొకపద్యము నందిసింగన బలరామవిజయములోని దని లక్షణచూడామణి యనునామాంతరము గలరంగరాట్ఛందమునఁ దృతీయాంకమున

సంయుతాసంయుతప్రాససందర్భములో నుదాహరింపఁబడియున్నది. ఈపద్యము ప్రాసస్థలమునుబట్టి విచారించునపుడు 'క్షత్రియ' శబ్ద మేకతకారకముగ నాకవియు దానినుదాహరించినరంగరాట్ఛందఃకర్తయుఁ దలంచిరనియు నిట్టియెడ సంయుతాసంయుతప్రాసమును జెప్పుటయే యుచిత మనియు విశదపడకమానదు గదా! గుప్తార్థప్రకాశికాకారు లీక నేవిధమునఁ బెనఁగులాడినను నిందలిమాంధాతృశబ్దమున రత్వమును సాధించి ద్వితకారకక్షత్త్రియశబ్దమె యటఁ గవిప్రయుక్త మని స్థాపించి ప్రాసమున ద్విత్వాన్యత్వానావశ్యకతారూపస్వపక్షమును నిలఁబెట్టుకొనఁజాలరుగదా! ఇంతియకాక ప్రాసపూర్వాక్షరములు నియతముగా గురువులై గాని లఘువులై గాని యుండవలె నన్నయప్పకవి సిద్ధాంతమును గప్పిపుచ్చి ప్రాసాక్షరములలో సంయోగము గాని బిందువు గాని లేనపుడు తత్పూర్వాక్షరములలో నొకటి దీర్ఘము నొకటి హ్రస్వమును సంయుతాసంయుతప్రాసస్థలమునందు సైతము కారాదను తమమతమును నిల్పుకొనఁ జాలరుగదా.

ఇఁక వాచస్పత్యమున క్షత్త్రియశబ్దము తకారద్వయవిశిష్టముగ నుదాహరించుటనుబట్టియు "సక్షత్త్రియస్త్రాణసహస్సతాంయః" "క్షతాత్కిలత్రాయత ఇత్యుదగ్రః । క్షత్రస్యశబ్దో భువనేషు రూఢః," అను మొదలగు మహాకవుల నిరుక్తిని బట్టియు, క్షణుహింసాయా మితి ధాతో స్సంపదాదిత్వాత్ క్విప్, గమాదీనా మితి వక్తవ్యమిత్యనునాసికలోపే తుగాగమే చ క్షదితిరూపంసిద్ధం క్షతఃనాశాత్ త్రాయతే ఇతిక్షత్త్రః సుపీతి యోగవిభాగాత్ కః" అను మల్లినాథసూరి చూపిన ప్రక్రియనుబట్టియు ద్వితకారకరూపము గలదనుటకు సందియము లేదు. అయినను నది వ్యవహారవశమున నేకతకారముగానే వినఁబడుచుండుటంజేసి పైనుదాహరించిన పండితకవు లద్దాని నేకతకారముగ గ్రహించి యుందు రని యెన్నిన నెన్నవచ్చును. లేదా యట్టిమార్పు నంగీకరింపక యేకతకారవిశిష్ట క్షత్రియ శబ్దమును సంస్కృతవ్యాకరణముచొప్పున సాధించినను సాధించుకొనవచ్చును. పయి నుదాహరించినమల్లినాథసూరి చూపినప్రక్రియచొప్పున, నాశార్థక మగు 'క్షత్' అనుశబ్దము సిద్ధమే కదా! పిదప "క్షతం = నాశం, రాతి = దదాదిశత్రూణామ్" అనువ్యుత్పత్తి ననుసరించి యేకతకారవిశిష్టక్షత్రశబ్దము (క్షత్ + రా + కః = క్షత్రః)నె సాధించుట కేమియు నాటంకము లేదు. క్షత్రియక్షత్త్రాద్య నేకశబ్దము లేకతకారకములుగానే సర్వశబ్దసంబోధినీప్రభృతి కోశములలో నుదాహరింపఁబడి యున్నవి. పైకారణములచే నచ్చట నేకతకారవిశిష్టక్షత్త్రియశబ్దము

నంగీకరించుట విరుద్ధము కారనేమ. కావ నహోబలపండితాప్పకవ్యాదుల ననుసరించి సంయుతాసంయుతప్రాసమును గ్రహించుటయే లెస్స యని చెప్ప వలసియున్నది.

శా. "ఈత్రైలోక్యమునందుఁ గల్గదు రణం బెచ్చోట లేకుండుటం
జేతుల్ వేయు వృథాభరం బగుట వచ్చెన్ దేవ యీమేనికిన్."

అను మొదలగు నాచనసోమనాదిమహాకవిప్రయోగాంతరములను సాధించుటకయి యంగీకరింపక తీరని సంయుతాసంయుతప్రాసముతోనే ప్రకృతపద్య ప్రాసస్థానములకు సాధుత్వము సంపాదింపఁదగియుండఁగా వధర్వణాచార్యాహోబలపండితాదులనియమముల నుల్లంఘించియు నప్పకవిని నిరాకరించియుఁ, బయి భారతపద్యమున రారానిరత్వమును జేయుటగాని, కేవలాప్రసిద్ధ మగుద్విత్వావృత్త్యనావశ్యకతారూపనూతనసిద్ధాంతమును గల్పించుటగాని యర్హము కాదు గదా! అట్లు కల్పించినను బయిని వ్రాసినరంగరాట్ఛందములో నుదాహరింపఁ బడినవందిసింగనప్రయోగము సంయుతాసంయుతప్రాసము నంగీకరింపకుండ సాధించుటకు శక్యము గాదుగదా!

అట్లయిన నిఁక రత్వవిధాయకశాస్త్రము వ్యర్థ మగుచున్నదని శంకింప రాదు. "మాతృపితృబుద్ధి నై దేహపుత్రిఁ దలఁతు" అనుప్రయోగాంతరము నందు 'ఆనజాదేశమున కపవాదముగాఁ బాక్షిక మగు నీరత్వశాస్త్రమునే యంగీకరింపనిచో నిత్య మగునానజాదేశము దుర్నివార మగుటంజేసి ఛందోభంగము కావలసి వచ్చును. అక్కారణముచే నిట్టిప్రయోగములను సాధించుటలో రత్వశాస్త్రము చరితార్థ మగుచున్న దని గ్రహింపవలయును. పైయభిప్రాయములతోడనే "ఉర్ధ్వం ద్వేరః" అనునాంధ్రశబ్దచింతామణిలోని రత్వవిధాయకశాస్త్రమునకు వ్యాఖ్యానము చేయునపు డహోబలపండితుఁడు—
గీ. "మాతృపితృబుద్ధి నైదేహపుత్రిఁ దలఁతు" అనుదానినే ప్రమాణముగాఁ జూపి "క్షత్రియవంశ్యులై" అనుభారతపద్యమాసూత్రమునకు లక్ష్యము కానేరదని స్పష్టముగా వ్రాసియున్నాఁ డని (చూ—అహో 324, 325పుటలు.) గ్రహింపవలెను.

ఇఁక "పున్నామనరకాత్ త్రాయతే ఇతి పుత్త్రః" అనువ్యుత్పత్తి నాశ్రయించి తకారద్వయవిశిష్ట మగు పుత్త్రశబ్దము ప్రాసయతిగాఁ బయిగీతపద్యమునఁ బ్రయోగింపఁబడియుండుటచే మాతృశబ్దములోని ఋకారమునకు శేషము వచ్చినను 'తకారం' ద్విత్వము లేదు గాన ద్విత్వావృత్త్యనావశ్యకతా

రూపస్వపక్ష మీప్రయోగముచేత నైన స్థిరపడు నని గుప్తార్థప్రకాశికాకారు లాశింప కుందురుగాక. వాచస్పత్య, శబ్దకల్పద్రుమాదికోశములలో 'పుత్ర' శబ్ద మేకతకారవిశిష్టముగను ద్వితకారవిశిష్టముగనుగూడ సాధింపఁబడి యున్నది. "పు(త్త్ర)త్రః" పుం....పునాతి పిత్రాదీనితి. పూ + 'పువో హ్రస్వశ్చ' ఉణా ౪-౧౬౪-ఇతిక్త్రః. ధాతోః హ్రస్వశ్చంచ" అని యి ట్లేకతకారవిశిష్టరూపము శబ్దకల్పద్రుమమున సాధింపఁబడియున్నది. కావున నాప్రయోగమును బట్టి ద్విత్వావృత్త్యనావశ్యకతాహూపాపూర్వసిద్ధాంతము స్థిరపడనేరదు." అని యి ట్లింకొకకొందఱు సిద్ధాంతము చేయుచున్నారు.

మహాశయులారా! చిత్తగించితిరా! ప్రయోగములనుబట్టి వ్యాకరణ నియమముల నేర్పఱు మటలోనిచిక్కులు; సామాన్యముగా ఛందోయతిప్రాసాది స్థలములం దిట్టిప్రయోగములు దొరకుటయే యరుదు. ఎక్కడనేని యొక ప్రయోగము దొరకెనా యది పైరీతిని వివిధాభిప్రాయములకు లోనై సందేహ నివృత్తిచేయుట కసమర్థమై మతములవైవిధ్యమునకు బీజమై యుండును.

క. "పాండవులవలనఁ గీడొ, క్కొండును లే దధిప నీదుకొడుకులు ధరణీ
మండల మంతయు మ్రింగిరి, పాండునృపతిభాగమునకుఁ బాపిరి వారిన్."

భారతము.

పయిపద్యములో రెండవచరణమునుబట్టి "ఒక్కొండు" అనుపదము భారతకవిసమ్మత మని విశదపడు ననుటలోఁ బైరీతినే వివిధము లగునభిప్రాయ భేదములు బయలుదేఱుచున్నవి.

పయిప్రయోగము విశ్రమము గుదురుటకయి కవి ప్రయోగించి యుం డుటచే నట్టినిర్బంధస్థలములలోని కక్కుఱితిప్రయోగములు గ్రాహ్యములు కానేర వనియు నొకప్పు డట్టివానిని బ్రయోగించినకవులు మహాకవులై యుం డుటచే వానిని సాధువులుగా నెన్నినను మన మట్టివానిని బ్రయోగింపరా దని యుఁ గొందఱయాశయము. (చూ-ఆంధ్రకవులచరిత్ర ౧౯౧౭లో ముద్రి తము-౧౩౦-౧౩౧ పుటలు).

ఇంగ్లీషుకవనములోని యంత్యనియమమువలె యతిప్రాసము లిట్టియెడఁ గుదురనందున నుపేక్షితము లయ్యె ననరాదా యని మఱికొందఱయభిప్రా యము.

గుణసంధిసంబంధమునుబట్టి 'అకారౌకారములకు' (అకార + ఉకార) యతి నంగీకరించి పైస్థలములందు 'ఒక్కండు' అనియే ప్రయోగింపఁబడె నని

యు నిట్టి రహస్యముం గనఁజాలక 'అకారౌకారములకు' యతిమైత్రి లేదను కొని 'ఒకార' మధ్యరూపంబు నాంధ్రవైయాకరణులు కల్పించి యుందు రని యు మఱికొంద ఱభిప్రాయపడుచున్నారు.

"నన్నయ తిక్కనాది మహాకవీంద్రు లిట్టి సామాన్యస్థలమున యతిప్రాసములను ఘటింపలేక కక్కుఱితిపడి యపశబ్దమును బ్రయోగించి రనుట కేవలము పరిహాసనీయ మగువిషయము. వారు వెనుక నుదాహరించిన రీతిని మరకు నిరర్థకపదప్రయోగమునకేని సహించి యంతటను యతిప్రాసములు నిర్వహించుచు వచ్చుచుండుటచే వాని కనియతత్వము నంగీకరించుట యసంగతము. అకారౌకారముల యతిమైత్రి కీవివాదస్థలమే తప్ప మహాసముద్రమువంటి యాంధ్రవాఙ్మయమునఁ బ్రబలమగునట్టియుఁ బ్రామాణిక మగునట్టియుఁ బ్రయోగాంతరము లేమింజేసి యది యాదరణీయము కానేరదు. అక్కారణముననే 'ఒక్కొండు' అనురూప మిటీవలి కవులును బ్రయోగించుచు వచ్చిరి. అట్లే యాంధ్రవైయాకరణు లెల్ల నవిసంవాదముగా వాని నంగీకరించి సూత్రించుచువచ్చిరి." అని వేఱొక కొందఱ సిద్ధాంతము.

పై నుదాహరించిన వివిధాభిప్రాయములను బాగుగా విమర్శించి చూచునపుడు నన్నయతిక్కనాదు లెఱిఁగియెఱిఁగి యపశబ్దములను బ్రయోగించి రనుట యసమంజస మనకతీరదు. వారిప్రయోగములే వ్యాకరణరచనకు సాధకమై యుండఁగా నవి యపశబ్దము లనియు వ్యాకరణవిరుద్ధము లనియుఁ బలుకుట మిక్కిలి పరిహాసాస్పద మగువిషయము. అపుడు కొంద ఱాశబ్దము నట్లొకారమధ్యముగా వాడుచుండుటంజేసి భారతకవులు వాని నట్లు ప్రయోగించి యుందురు. ఇప్పటి పండితవ్యవహారమున నట్టియుచ్చారణము లేమింజేసి యవి యపశబ్దము లనుభ్రమ మనవారికిఁ బొడముచున్నది. నిజముగా నిప్పటి పండితవ్యవహారమున నట్టివి లేకుండుటచే నిప్పు డవి ప్రయోగార్హములు కావనుట యుక్తమే గాని, భారతకాలమున నవి పండితవ్యవహారములో లేవనుటకును నవి యపశబ్దము లనుటకును దగిన యాధారములు లేమింజేసియు నిప్పటి పండితవ్యవహారమునుబట్టి యాకాలపుమహాకవిప్రయోగముల కసాధుత్వమును గల్పించుటగాని యాకవులకుఁ గక్కుఱితిని గల్పించుటగాని యసంగత మగుటంజేసియు, నాకాలమున నవి ప్రయోగార్హములే యై యుండుననని యంగీకరింపక తీరదందున నాచంద్రతారము నట్టిప్రాచీనాంధ్రభాష గ్రాంధికభాషగా నుండు.

దగు నని పెనఁగులాడుచున్నమనవా రట్టిప్రయోగము లిప్పుడు ప్రయోగార్హములు గావని తలంచుట మాత్రము కేవలము ప్రామాదికమై యున్నది.

ఉచ్చస్థితి ననుభవించుచున్న వ్యవహారస్థము లగుభాషాంతరముల వాఙ్మయములతో సంబంధము లేమిం జేసి కొంత కాలముక్రిందటినుండియు మనవారికిఁ బ్రాచీనగ్రాంథికభాష, కలకాలము గ్రాంథికభాష కానోపు ననునభిప్రాయము పొడమినను బాశ్చాత్యభాషావాఙ్మయసంబంధమున నాగరకత దినదినప్రవర్ధమాన మగుచున్న యిక్కాలమున నట్టియభిప్రాయము కాలూనఁజాలదు. ఇఁకఁ దత్తత్కాలికపండితవ్యవహారస్థభాషయే తత్తత్కాలికగ్రాంథికభాష కాఁదగు ననునభిప్రాయము బలపడకతీరదు. ఇట్టిసమయమున నుచితాలంకారములును, రసపుష్టి, భావగాంభీర్యము, భావనాశక్తి, పాత్రోచితోక్తినైపుణము, లోకస్వభావవర్ణనము, కథాకల్పనాకౌశలము మున్నగుకవితాప్రధానగుణములే రుచించునుగాని వ్యర్థాపుష్టార్థానుచితత్వాదిదోషాలవాలం బగుశబ్దాలంకారరచన రుచింపనేరదు. కావున నీవలఁ గుండుశబ్దాలంకారరచన ప్రాచీనాంధ్రభాషానియమనరూపాగంతుకఫలక మయిన నగుంగాక. ఇది మొదల ఉట్టిపని యపూర్వనాగరకతావిశేషంబున నుదయించుచున్నసమగ్రకోశవ్యాకరణాదులపై నిడి కవితాలక్ష్మి తనసహజసౌందర్యముతో విహరించుఁగాక—

## ప్రాచీనమార్గములను దాఁటనగునా?

“ప్రాచీను లగునాంధ్రకవీంద్రు లీమనపాటిబుద్ధిశాలులు కారా? వారిపద్ధతులను మార్చుటకు మన మంతబుద్ధిశాలులమా?” అని శంకింపఁ బనిలేదు. “పురాణ మిత్యేవ నసాధు సర్వం నచాపి కావ్యం నవ మిత్యవద్యమ్। సన్తః పరీక్ష్యాన్యతరద్భజన్తే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః” “అనుమహాకవికాళిదాససూక్తిచొప్పునఁ గేవలప్రాచీనతనుబట్టియే ప్రామాణ్యము నిచ్చుట సరిగాదు. ప్రత్యక్షవిరోధ మగపడుచున్నను నింకను దన్మార్గమునే యనుసరించుట యర్హమా? మఱియు మనయాంధ్రకవీంద్రులుసైత మీయతిప్రాసములనియమము వలనిబాధలను గనిపెట్టియే పూర్వాపూర్వు లాచరించినియమముల నుత్తరోత్తరులు సడలించుచునేవచ్చిరి. ఇంతకును నూతనమార్గములను ద్రొక్కుటకు మార్గదర్శకము లగువాఙ్మయములసంబంధ మిప్పటివలె నప్పుడే యుండియున్నచో నీవఱకే యిట్టిశృంఖలములను విడఁగొట్టియుందురు. సామాన్యముగా నా[illegible]కున్నస్థితికన్న నున్నతస్థితి కెక్కుటకు యత్నించుట మనుజులకు సహజధర్మ[illegible]

యున్నది. దురదృష్టవశమున దేశము తక్కువస్థితిలో నుండునపు డెంతటి ప్రభావశాలులు బయలుదేఱినను నాఁటి కున్నతక్కువస్థితికన్న నున్నతస్థితి నందునభిలాషమాత్రమే వారికిఁ బొడముఁ గాని యుత్తరోత్తరముగాఁ బొందఁ దగుసర్వోన్నతస్థితి నందునభిలాష పొడమనేరదు.

నన్నపార్యుఁ డేల యీశబ్దాలంకారశైలి నాదరించెనో.

నన్నయభట్టారకునికాలమునాఁటి కాంధ్రవాఙ్మయ మున్నట్లే యగపడదు. తొమ్మిదవశతాబ్దపుఁ దుదిని బుట్టినపాటలవంటియక్కరపద్యములలో నున్నయుద్ధమల్లుని బెజవాడశాసనమునుబట్టి చూడఁగా నాఁటికి యతిప్రాసపూర్ణము లగు "అక్కరలు" మున్నగునలంతిపద్యము లాంధ్రభాషలో నుండెడి వని తోఁచుచున్నది. ఆకాలములం దిరుగుపొరుగుదేశపుభాష లగునరవకన్నడములందును నంతకుముం దనియతములే యయి యుండియు నప్పటికి నియతము లైయున్నయతిప్రాసములు గలకవనమే ప్రసిద్ధమై యుండెను. తుదకు శబ్దాలంకారము లనఁజనునీయతిప్రాసములు నియతములు కాని సంస్కృతభాషయందును బ్రాచీనకవు లగుకాళిదాసాదులసరస మగుశైలి యడుగంటి యనుప్రాసయమకశ్లేషాదిశబ్దాలంకారకవిత విస్తరింపఁజొచ్చెను. ఆకారణములచే నిరర్గళకవితాప్రవాహము గలనన్నయభట్టారకుఁడును నప్పటికి శ్లాఘ్యతమ మనిపించుకొనఁజాలినశబ్దాలంకారాలంకృతశైలినే యభిలషించియుండె నని తోఁచుచున్నది. ఇటీవలివారు కొంతవఱకు సడలించియుండుటచే నిపుడు మన మెఱిఁగియున్నయతిప్రాసములపద్ధతి యిట్లయిన నున్నది గాని నన్నయభట్టారకుఁడు విధించుకొన్ననియమము లన్నయో యింకను దుష్కరములై యుండెడివి. వానిని ముందు వివరింపఁబోవు సీసపద్యవిషయమునఁ గనఁదగును.—

ఆకాలపుఁగన్నడములోని ప్రాసము.

కన్నడభాషలో వర్ణసాజాత్యరూపయతి లేనేలేదు. మిక్కిలి సులభమైన ప్రాసనియమముమాత్ర ముండెడిది. సర్గములలోని మొదటినాల్గక్షరములకును బరస్పరము ప్రాసమైత్రి యుండెడిది. అట్లె శషసలకును బ్రాసమైత్రి యుండెడిది.

క. "సకలజనవినుతసం శత, మఖసదృశవిశాలవివిధవిభవోదయసం
సుగుణగణయుతససరిబల, విఘటనసం కందణువనారాఘువసం."

క. "ఇదుసగవర్గప్రాస, క్కుదాహృతంకుఱిత శషసవర్ణత్రయమం
విదితప్రాసవియుక్తా, స్పదదోళ్ నిలెపే ళ్దడదుసమీపప్రాసం."

క. "శశధరబింబాననెయం, ఝషకేతన మాతెయంవిరోజాంబకెయం
బిసవిశదవర్ణెయంకం, డొసెదంబన దొళగెజనకతనుజెయవణువం."
నాగవర్మకర్ణాటచ్ఛందోంబుధి.

నన్నపార్యుని ప్రాసనియమము.

అట్లు మిక్కిలి సులువుగా నున్న కన్నడప్రాసనియమమును మెచ్చక నన్నయభట్టారకుఁడు "సమానానాముత్తమశ్లోకోస్తు" అన్నరీతి నేవర్ణముక కావర్ణమే ప్రాసమునం దావృత్త మగుచు నుండవలె నన్న దుష్కరనియమమును బెట్టుకొనెను. నన్నయభట్టారకుని భారతభాగములో దధలకుఁ బ్రాసమైత్రి కలిగిన పద్య మొకటియు, డఢలకుఁ బ్రాసమైత్రి గలపద్య మొకటియుఁ గానఁబడుచున్నవి.

ఉ. "కా దన కిట్టిపాటియుపకారము తపకుఁ డేకవిప్రసం
బోధనఁజేసి చేసె నృపపుంగవ...." భార. ఆది. ౨ ఆ. ౨౦౪ ప.

శా. "ఏడక్షౌహిణు లెన్నఁ బాండవబలం బేకాదశాక్షౌహిణుల్,
రూఢిం గౌరవసైన్య మీయుభయముల్...." భార. ఆది. ౧ ఆ. ౭౦ ప.

అయినను నిటీవలివా రిట్టిపాఠముల నంగీకరింపక మఱెక్కడను బ్రయోగింపక యీరెండుస్థలములందుమాత్ర మిట్లు నన్నపార్యుఁడు ప్రాసవిషయమునఁ గక్కుఱితిపడునా యని తలఁచి కావలయును 'సంబోదన' 'రూఢి' అని యిట్లు తద్భవరూపములను, మఱికొన్నివిధముల పాఠాంతరములను గల్పించి సవరింప నారంభించిరి. ఇట్టిసవరణము చిరకాలముక్రిందటనుండియు నారంభించి యుండుటచేతను రెండుమూఁడునందలయేండ్లక్రిందటిప్రతులకన్నఁ బ్రాచీనము లగుతాళపత్రపుఁబ్రతులు దొరకుట యసంభవ మగుటచేతను నీవిషయమునఁ గవిహృదయ మెట్టిదో తెలియకున్నది. అయినను నాముక్తమాల్యదాద్యనేకగ్రంథములలో దధలకును థధలకును బ్రాసమైత్రి యగపడుచున్నది. తిక్కనయుఁ బ్రయోగించియుండె నని యప్పకవ్యాదు లుదాహరించిరి గాని మనవారు వానిన్నిసెతము దిద్దివేయుచున్నారు. శసప్రాస మిటీవలగ్రంథములలో నగపడుచున్నది గాని భారతమునందుమాత్ర మగపడదు.—

అరవమునను దెల్గునను గలవర్ణసాజాత్యరూపయతి.

కన్నడమునందువలె నొక్కప్రాసనియమమె గాక యరవమునందు మన తెనుఁగునందువలెనే యతిప్రాసనియమములు రెండును గలవు. సంస్కృతకర్ణాటములందువలెఁ గాక యరవమునందు మన తెనుఁగునందువలెనే యతి వర్ణసా

జాత్యనుప్రాసమే యయినను నది పాదము లన్నిటియందును నుండవలసిన నియమము లేదు, యథాసంభవముగా నుండవచ్చును. వర్ణములకుఁ గలయతిమైత్రి యించుమించుగాఁ దెలుఁగునందువలెనే కొంతవఱకు సులువుగా నుండుటగాన వేఱుగ వ్రాయలేదు. ప్రాసమైత్రిభేదములు మాత్రము తెనుఁగునందువలెఁ గాక యందు మిక్కిలి సులువుగా నున్నవి. వాని నిట సంక్షేపముగా నుదాహరించుచున్నాను.—

| అరవము. | తెనుఁగు. |
| --- | --- |
| i. ప్రాచీనకాలమునందుఁ బాదాద్యచ్చుల హ్రస్వదీర్ఘముల సాజాత్యము మాత్రమె యుండినం జాలు నని యంగీకరించెడివారు. | పాదప్రథమవర్ణము లగు ప్రాసపూర్వాక్షరముల హ్రస్వదీర్ఘత్వాదిరూప గౌరవలాఘవములు తుల్యము లై యుండుటయే గాక ద్వితీయాక్షరములు నైతము సరిగా నుండవలయును. |
| ఉ. ఆ వా = కూ కూ | |
| ii. ద్వితీయాక్షరములలో ననునాసికసరిపడినను జాలును. | అట్టినియమము తెనుఁగున లేదు. |
| ఉ. కమ్పు = అమ్మక; | |
| iii. ప్రాసస్థలములలో నుండు సంయోగమునందలి మొదటి 'య్,వ్,ర్, ల్, అనువానినితరప్రాసస్థలములలో నిలుపకపోవచ్చును. | ఓసచాయ కొంత స్వాతంత్ర్యముగా సంయుతాసంయుతప్రాసమున నగపడుచున్నది. |
| ఉ. కాయ్మాండ = పూంమాండ; | |
| iv. క, చ, ట, త, పలకుఁ బ్రాసమైత్రి గలదు— | ఇట్టినియమము తెనుఁగునఁ గానరాదు. |
| v. గ, జ, డ, ద, బ, లకుఁ బ్రాసమైత్రి గలదు— | వర్గప్రాసము మాత్రము గాంచినగాని యది యప్రశస్తప్రాస మందురు. |
| vi. ఞ, మ, ఙ, ణ, న, లకుఁ బ్రాసమైత్రి గలదు— | దీనిజాడ నణలకుఁ గొన్నిచోటుల మైత్రిని జూపునుభయప్రాసమునఁ గాంచును. |
| vii. య్, ర్, ల్, న్, ళ్, అను వానికిఁ బ్రాసమైత్రి గలదు. | రళప్రాసమునందును లళలకుఁ బ్రాసము చెల్లుటయందును నిట్టిరీతిగలదు. ఇందు రళప్రాస మప్రశస్తమందురు. |

(See.) Comparative prosody of the Dravidian languages by
T. RAJAGOPALA RAO GARU.

పయిరీతిని మిక్కిలి సుళువుగా నున్నప్రాసనియమములను మెచ్చక నన్న పార్యుఁ డతిదుష్కర మగురీతిని నిలుపుచువచ్చెను.

## తెనుఁగున వాడఁబడిన పద్యములు.

ఇఁకఁ బద్యముల నుపయోగించుటలో సాధారణముగా నితఁడు సంస్కృత కర్ణాటకచ్ఛందోమార్గము నే యధికముగా ననుసరించి యున్నాఁడు. సంస్కృత చ్ఛందములో గ్రహింపఁబడిన పద్యములలో మంచినడక గల శార్దూలమత్తేభ స్రగ్ధరామహాస్రగ్ధరాదులను విశేషించి చంపకోత్పలమాలలను మిక్కిలి యధి కముగా నుపయోగించియున్నాఁడు. సంస్కృతములోని యార్యాఛందమునకు సంబంధించియున్నట్టియుఁ గర్ణాటకవులు వాడినట్టియుఁ గందపద్యములను నయిత మత్యధికముగా వాడియున్నాఁడు. పథ్యాది కందషట్కమును బథ్యా ర్యాదిసంస్కృతార్యావృత్తముల ననుసరించియే యున్నది. లయగ్రాహి మున్న గు మఱికొన్ని మంచినడక గలవృత్తములు నయితము కన్నడమునుండియే గ్ర హింపఁబడియుండెను. ఇట్లు సంస్కృతకర్ణాటములనుండి గ్రహించినపద్యముల గణములలోఁ దఱచుగా నేవిధ మయిన మార్పులును జేయలేదు. అవఱకుఁ గర్ణాటభాషలో నే యున్నప్రాసమును నిల్పి తఱచుగా సంస్కృతకర్ణాటములలోఁ జెప్పఁబడిన పదవిచ్ఛేదరూపయతికి మాఱుగా నచట నే తెలుఁగునందుఁ బ్రసిద్ధ మయియున్న వర్ణసాజాత్యరూపయతిని మాత్రము నూతనముగా నిలుపుచువచ్చె ను. కొన్నియెడల యతిస్థానముమాత్రము శ్రుతిసుఖమునుబట్టి యథారుచిగా నాంధ్రకవులు మార్చుకొనుచుండుటయుఁ గలదు.

## యతిస్థానములను గవులు మార్చుట.

పృథ్వి. తిలాణుమణికోటి సంఘటిత దివ్యదేహంబుతోఁ
దిలోత్తమ యనంగ నొక్కయువతీలలామంబు ను
త్పలాక్షి సృజియించె సర్వగుణభాసిరూపక్రియా
కలావిదుఁ డు విశ్వకర్మ తనకౌశలం బేర్పడన్.

భార. ఆది. ౭ ఆశ్వా. ౧౦౩ పద్యము.

అని యిట్లు నన్నయభట్టారకుఁడు "జసౌజస యలావసు గ్రహయతిశ్చ పృథ్వీ గురుః" అనురీతిని దొమ్మిదింట యతి నిల్పక పృథ్వికిఁ బండ్రెండింట య తిని బ్రయోగించియున్నాఁడు. దాని ననుసరించి యప్పకవి "జసల్ జసయవంబు లుష్ణకరసంఖ్య విశ్రాంతులున్" అని యిట్టి లక్షణమును జెప్పియున్నాఁడు.

అట్లయినను దొమ్మిదింటనె యతి శ్రుతిసుఖముగా నుండునని కావలయు నిటీవలికవులు తొమ్మిదింటనె యతిని నిల్పసాగిరి.

పృథ్వి. “గదాహతికి నార్తుఁ గొంకక యెదిర్చి రాఁగా నిదోఁ
గదా యనుచుఁ ద్రిప్పి రాక్షసుఁడు వైచె........?

మనుచరిత్రము ౪ అ. ౯౭ ప.

అప్పకవి పెద్దనార్యునకుఁ బిమ్మటివాఁడే యైనను నన్నపార్యునిప్రయోగము పరమప్రమాణ మని తలఁచి కావలయుఁ బైమార్పును జేర్కొనియుండ లేదు. ఇట్లె కవిరాజవిరాజితాదులలో యతిస్థానముల మార్పులు గలవు. విస్తర భీతి నుదాహరింపనైతిని.

తెనుఁగుభాషలోని పద్యములు.

కం. వెలయంగఁ దెనుఁగుబాసకు, దళమయ్యెడు సీసములును దరువోజలుగీ
తులు నక్కరములు ద్విపదలు, పొలుపొందఁగ రేచఁ డిష్టమున నొనరించెన్.

కవిజనాశ్రయము. జాత్యధికారము.

అనుచొప్పున సామాన్యముగా మన తెనుఁగుభాషలో నినేంద్రగణములతో నడుపఁబడు జాత్యుపజాతులలో సీసగీతిప్రభృతు లగు ననేకపద్యములు కందాదులవలెనే కన్నడమునఁ ద్రిచతుర్మాత్రాక పంచమాత్రాక ప్రభృతిమాత్రా గణములతోడనే నడుపఁబడుచు వచ్చినవి. అట్లయినను దెనుఁగువారు, వాని నడక సరిగా నుండకుండుటచే వానిగణములను మార్చి మంచినడక గలపద్యములనుగాఁ జేసిరి. సీసాదులలోని సూర్యగణములు త్రిమాత్రాకగణములే యగుటచేతను నింద్రగణములలో రెండు చతుర్మాత్రాకములును నాలుగు పంచమాత్రాకములును నగుటచేతను గన్నడాంధ్రములు రెండిటియందును బైపద్యములనడక చాలవఱకు సరిపడుచునె యుండును.

ద్విపద, తరువోజ.

కన్నడమున ‘దువయి’ అనునొక పద్యము గలదు. అయ్యది మనద్విపద పేరికి సరియైయున్నది గాని రెంటికిని నడక మిక్కిలి భేదముగా నున్నది.

ద్విపదలతో నుండుపాటలు తెనుఁగులోకమున నత్యధికములై యుండుట చేత వానినడక మధురముగా నుండక యెల్లిదమై వినఁబడుననియో శబ్దాలంకారములు చాల వనియో నన్నపార్యుఁడు ద్విపదలను వాడలేదు, కాని, రెండు ద్విపదచరణములకు సరి యగుగణములు గల పాదములు నాల్గింటితో నుండు

తరో్వజలనుయతిప్రాస బాహుళ్యమున రచించు నని కావలయుఁ దఱచుగా నుప
యోగించెను. దీనికిఁ బ్రతిపాదమునందును బ్రాస ముండుటయె గాక యతిస్థాన
ములు మూఁడు కలవు గాన నొక్కొక్కపాదమున నాలుగుచోట్ల యతిరూప
మగువర్ణసాజాత్య ముండును. అయినను నీతరో్వజకును సీసమునకువలెనె
పాదపూర్వార్ధమున నొకయతియు నుత్తరార్ధమున నొకయతియు నిలుపుచు నెఱ్ఱా
ప్రెగడకొంతవఱకు సులువుచేసి యున్నాఁడు.

"జయ సర్వభూతేశ జయ సర్వవరద, జయ సర్వరక్షక జయ సరోజాక్ష
జయ జగద్వందిత జయ జగన్నాథ, జయ జగద్ధారక జయ విశ్వరూప
జయ కృష్ణ గోపాల జయ మహాసత్త్వ, జయ పూతనాఘాత జయ దైత్యదమన
దయ నిమ్ము జీవితదానమ్ము నాక, భయశరణాగతిఁ బ్రార్థింతునిన్ను"

హరివంశము పూ. భా. ౭ ఆ. ౧౫౫ పుట.

పయిపద్యమునందలి నాల్గవచరణములోని యతిఁ బరిశీలింపఁగాఁ బాద
మంతటను నాల్గుచోట్ల నొక్కవర్ణమునకే యతి నిలుపుట యభ్యుచ్చయ మనియుఁ
బాదపూర్వార్ధమునం దొకటియు నుత్తరార్ధమునందు వేఱొకటియు నిలుపుట
మాత్రమె నియతి మనియుఁ దేలుచున్నది. సులక్షణసారమునం దుదాహరింపఁ
బడినలక్షణపద్యము ప్రాసమునుగూడ సడలించి యింకను లక్షణమును సులువు
చేయుచున్నది.

తరో్వజ. ఇలనింద్రగణములునినునితోఁగూడ నాలుగుగాఁ జేసినయముతోడుతను
కలయంగ నెనిమిదిగణములు రెండు గణములఁదుదఁగూడఁగాయతినిల్పి.

సులక్షణసారము. ౭౦ పద్యము.

పయి నుదాహరించినరీతి నెఱ్ఱాప్రెగడ సులువుచేసినతరో్వజ ద్విపదమాలిక
కన్న భిన్నము కాదు. అట్లే సులక్షణసారోదాహృతతరో్వజమంజరీద్విపదయు నగు
చున్న దనవచ్చును. కావుననె నన్నయభట్టారకాదులు ద్విపదను వాడకున్నను
నిటీవలిపాల్కురికి సోమన, శ్రీనాథ, గౌరనప్రభృతిమహాకవు లనేకులు ద్విపదల
తోను మంజరీద్విపదలతోను నితరపద్యసాంకర్య మైన లేనిప్రబంధరాజములను
జేసియున్నారు. ఇంతయేల? మంజరీద్విపదలో యతిప్రాసనిర్బంధములు చాల
వఱకు సుకరములై యుండుటం జేసి యిప్పటిమహాకవులుసయితము కొందఱు
మంజరీద్విపదతోడనే లోకోత్తరము లగుగ్రంథరాజములను రచించుచున్నారు.

## సీసము.

కన్నడమందు సీస మనుపేరితో నొకపద్యము గలదు. అందుఁ బ్రతిపాదమునందును మొదటఁ బంచమాత్రాకగణములనాఱిటిని నిల్పి తుదిని రెండు త్రిమాత్రాకగణములను నిలుపవలయును. అట్లు నాల్గుపాదములను నడిపించిన పిదప నొక "అటగీతె"ను జేర్పవలయును. అటగీతెకు విషమపాదములందు మొదటనాలుగుత్రిమాత్రాకగణములును (సమపాదములలో మొదట మూఁడు త్రిమాత్రాకగణములును) దర్వాత నొకచతుర్మాత్రాకగణమును బిదప నొక త్రిమాత్రాకగణమును నిలుపవలయును. సీసచరణములకు నాల్గిటికి వేఱుగాను గీతిచరణములు నాల్గిటికి వేఱుగాను బ్రాసముల నిలుపవచ్చును.

కం. పురుహూతగణగళాఱుం, సరసిజసఖగణగళెరడుసంధిసిబర్కం
చరణక్కె సీసదంతదా, ళొఱగింతహాసరళతన్నొళొప్పువ తెఱదిం (౨౬౯)

"A fourth instance: the Sisapadya. Each quarter of this consists of 6 Puruhuta ( | | ◡ | ) gana i-e feet of five Moras to which the two feet pointed out Sarasijasakha ( | | | - | | | ) i-e two feet of three Moras are added.

సీస. | | | | | - | | | | | - | | | | | - | | | | | (యతి) | | | | | - | | | | | - | | | - | | |

To this a so called Atagite, as people call it, is to be added, the scheme of which is two times.

| | | - | | | - | | | (యతి) | | | - | -  - | | |
| | | - | | | - | | | (యతి) | | | | -  | -" (F. Kittel).

సీ. తింగళంతళెదిత్త రంగమంగళకర్త తుంగసూర్యసుభర్త తమసనాశ
మంగళం మనవాంత మధురతాకరుణాత్త భంగనిగ్రహివాత భీతిహరణ
సంగీతరసలోల సాహిత్యదానంద పొంగువర్కెగెపోలి పమలకిరణ
కంగళుంముగియెద కరంగళుంబిగువిడద పింగదెనహాయుమం పడిపళరణ.

ఆ. గీ. విగతదుష్కృతాంగ విమలసుస్థిరచిత్త । గగనపీతవాన సన్నుప్రీత
నగకులాదిధాత మునిసురాసురవంద్య । జగపరిణుతరాజ కేసలదాత.

నాగవర్మకృతకర్ణాటచ్ఛందోంబుధి.

ఇంవలిపద్యము పేరును, నెత్తుగీలియదుకుబడియు సీసగణములసంఖ్యయు యతిస్థానములును మన తెనుఁగుసీసమునకుఁ దుల్యముగనె యున్నవి.

పయి నుదాహరింపఁబడిన గణములసంబంధముచేఁ బద్యములనడకయు నిరూపింపఁగఁ దెలుఁగుసీసముయొక్కయు నాటవెలఁదియొక్కయు నడకకు సరిగనే యున్నది. పైని గుఱుతించిన యథోరేఖాంకితస్థలములలో మాత్రము తెలుఁగుసీసపుగణములయొక్కయుఁ బద్యపునడకయొక్కయు సామ్యము భగ్న మయినది. తెలుఁగుసీస మినేంద్రగణములతో నడచుచుండఁగా నిది వానికి మాఱుగఁ గన్నడములో నున్న బ్రహ్మవిష్ణుగణములతో నడువక పైనుదాహరించిన సంబంధము గల మాత్రాగణములతో నడచుచున్నది. కన్నడసీసపాదములలో నొక్కయతియె పదవిరామరూపము గలదు. తెలుఁగుసీసపాదములయందుఁ బూర్వార్ధమున నొకయతియు నుత్తరార్ధమున వేఱొకయతియు వర్ణసాజాత్యరూపములు నిల్పఁబడుచున్నవి. కన్నడసీసమునఁ బ్రాసనియమముమాత్ర ముండును. నన్నయేతరుల తెలుఁగుసీసములందు యతినియమముమాత్రము గలదు. ప్రాసనియమము లేదు. ఇఁక నన్నయభట్టారకునిసీసము లన్ననో కేవలయతులతోఁ గాని కేవల ప్రాసములతోఁగాని నడచును. కొన్నిచోట్ల యతిప్రాసములలో నొకజాతి సీసచరణములందును వేఱొకజాతి యెత్తుగీతిచరణములందును నిల్పఁబడును. అట్లె కొన్నియెడల సీసపూర్వార్ధములం దొకజాతియు నుత్తరార్ధములం దొకజాతియు నిల్పఁబడును. పైరీతి నేదోయొకదుష్కర మగు నిర్బంధముతోడనే వాగనుశాసనుఁడు సీసములను గీతములను నడపించుచువచ్చెను. గణముల ననుకూలముగా మార్చియుండుటచేతనే కన్నడసీసముల నడకకన్నఁ దెనుఁగుసీసములనడక మిక్కిలి మనోహరముగా నుండును. అందును నన్నయభట్టారకుని సీసము లన్ననో పై నుదాహరించినరీతి శబ్దాలంకారనియమబాహుళ్యముతోఁ గూడియుండుటం జేసి కడుంగడు మనోహరతమములై యుండును. (తేటగీతితో సరి యగునడక గలపద్యమును గన్నడములో నాగవర్మ చెప్పిన ట్లగపడదు) ఇట్టి నన్నపార్యునిసీసభేదముల నెల్ల మ-రా-శ్రీ, గిడుగు వేంకటసీతాపతిరావుపంతులు బి.ఏ., ఎల్.టి. గారు ౧౯౧౯ సం॥రము అక్టోబరునెలలోని "తెనుఁగు" అను తమపత్రికలో వివరించియున్నారు. ప్రాచీనులగు ననంతామాత్యాదులునయిత మిట్టి నన్నయభట్టారకుని నియమములను జాలవఱకు గ్రహించియేయున్నారు.

## సీసమాలిక.

యతినైనఁ బ్రాసంబునందైన రెంటితోఁ జెప్పి రేనియు సమసీస మగును
నియమముల్ దీనిపై నిలిపినసీసంబు లాఱు తెఱంగులై యతిశయిల్లు

నెనిమిదంఘ్రులఁ బ్రాసమెక్కింప వళ్లకై సర్వతః ప్రాససీసం బనంగఁ
నాది నేవడినిల్పిరావడే వదమెల్లఁ జేయ నయ్యది వడిసీసమనఁగఁ

ప్రాసమాఱంఘ్రులఁ (ఎత్తుగీతి రెండుచరణములుగా నెంచునది) బదిలంబు
గావింప నక్కిలిప్రాససీసాఖ్య మనఁగఁ। బదఖండయతులందుఁ బ్రత్యేకయ
తులుగా స్థిర నవకలివడిసీస మనఁగఁ। గుదురు నుత్సాహంబుతుదియందు
గీతంబుఁ జెప్పిన విషమాఖ్యసీస మనఁగఁ। గడనెల్ల లఘువులె కల్పించి రెద్దా
నఁ జనును సర్వలఘుసీ సంబునఁగ

సీ. సప్తవిధములివియు శబ్దశాసనుండు, పంచమామ్నాయఫక్కిలోఁ (భారతము
లో) బల్కెఁ గాని। కడమకవు లాఱుసీసముల్ విడిచిపెట్టి, చెలఁగి సమసీస
పద్యమె చెప్పినారు. అప్పకవీయము. ౪ ఆ. ౩౭౦ పద్యము.

పై భేదములలో వృత్తప్రాససీస మనునామాంతరము గలయక్కిలిప్రాస
సీసము తెలుఁగుభాషకు సహజ మగుయతితోఁ గూడినకర్ణాటసీసమునకు సమీ
పముగా నున్నది. దీనినే యనంతామాత్యుఁడు తనఛందోదర్పణమునఁ 'ప్రాస
సీస' మనియు వ్యవహరించెను. "వృత్తంబులకుఁబోలె వెలయు నాల్గడుగుల
వెసఁ బ్రాసములు నిల్పి విరతు లునుపఁ, బ్రాససీసం బగు." అనంత చ్ఛందస్సు. ౩ ఆ.

ఉత్సాహ.

ఇట్లే జాతులలోఁ జేరిన కేవలసూర్యగణములతో నడపఁబడు తెలుఁగు
లోనియుత్సాహవృత్తము కన్నడములోనియుత్సాహవృత్తమునకు మిక్కిలి దగ్గ
ఱగా నున్నది.

"The third instance: the Utsava or Utsaha with 24 Moras, in each quarter that are enclosed in 8 feet, each of which consists of 3 Moras." F. Kittel.

"ప్రేమ వాసనద్గుణైక ధామసూర్యకోటిభాస
కోమలాంగసంతతాభి రామనిర్మలాంతరంగ" నాగవర్మఛందోంబుధి-౨౭౪ప.

ఎనిమిదవగణమునకు మాఱుగ నొక్కగురువుమాత్రమె యుండుటయుఁ
దెనుఁగునకు సహజ మగుయతివిశేష ముండుటయుమాత్రమె తెనుఁగులోని
విశేషము.

## ఉత్సాహము.

సాహచర్యమమరసప్తస వితృవర్గమునుసము
త్సాహ మొప్ప నొక్క గురువు చరణముల భజింపఁగా. అనంతచ్ఛందస్సు. 3.

"శ్రీనివాసమూర్తిసేవ చేసి వేడి సన్నుతించి
మానసమున దులసిదళము మహిమచెప్పెదా"
తుళసిదళముమహిమ (యెవరి) (కలయ?) తెలియ నెవరివశము గాదు.
తుళసిదళము సకలలోకముల పవిత్రమూ
అన్నయేమొ తుళసిపూజ మున్ను చేసినాను గనుక
చెన్నుమీర నాకు భర్తవెన్ను డాయెనూ
అనగ నవ్వి దేవమాని యమ్మ నీవు తుళసిపూజ
ఘనము చేసినావుగనుక కలిగె భాగ్యమూ." తులసిదళము.

'తులసిదళము' అనునీపాట తెలుఁగుదేశములోనిస్త్రీలు ప్రసిద్ధముగాఁ బాడుచుందురు. ఇయ్యది కర్ణాటోత్సాహమునకును దెలుఁగునుత్సాహమునకును మధ్యస్థమై యున్నది. ఆంధ్రకన్నడములందువలెఁ గాక దీనికిని ద్విపదకు వలెనే రెండే చరణములు. అందు మొదటిచరణమున నెనిమిదిత్రిమాత్రాకగణములును, రెండవచరణమునఁ దుది నొకగురువు గలయేడుత్రిమాత్రాకగణములును వెలయుచున్నవి. దీనిమొదటిపాదమునఁ గన్నడోత్సాహపువరుసయు రెండవచరణమున నాంధ్రోత్సాహపువరుసయు నగపడుచున్నవి. మొదటిచరణము పొడవుగను రెండవది కుఱుచగను నుండుటచే నడకలోనియారోహణావరోహణములు మిక్కిలి యింపుగా నున్నవి. కాన నీపాటవరుస రెండుభాషలలోని యుత్సాహములవరుసకన్నను మిక్కిలి మనోహరముగా నున్న దనుటకు సందియము లేదు. ఇట్టి మంచిమంచివరుసలు గలపాట లనంతముగా నాంధ్రలోకములోఁ గలవు. ఇట్టివానిమార్గములు విపులముగాఁ జూపక మనవారు (Hairsplitting) నిరుపయోగము లగుయతిప్రాసభేదములచర్చలతోను, గృత్యాద్యవస్థావిశేషరూపము లగువర్ణగణాదిశుద్ధిప్రతిపాదకగ్రంథములతోను లక్షణగ్రంథములను నింపియున్నారు.

## ఇనేంద్రగణములు.

మఱియు సంస్కృతమున లేనట్టియుఁ గేవల ద్రావిడభాషలకు సహజములై నట్టియుఁ గ్రొత్తపద్యములను నడవుటకై ద్వితీయతృతీయ చతుర్థచ్ఛంద

మూలనుండి కన్నడమున బ్రహ్మావిష్ణురుద్రగణములును దెనుఁగున నినేంద్రచంద్రగణములును గల్పింపఁబడెను.

ప్రస్తరింపఁబడిన ద్వితీయతృతీయ చతుర్థచ్ఛందములలోఁ గేవలగుర్వాదులును లఘువు ముందు చేర్చిన లఘ్వాదులును గన్నడమున వరుసగా బ్రహ్మవిష్ణురుద్రగణము లనఁబడును. తెలుఁగున నట్టిమూఁడుఛందములందును మొదటి రెండేసి గణములను విడువఁగా మిగిలినవానిలోఁ గేవల గుర్వాదులును లఘువు ముందు చేర్చిన లఘ్వాదులును వరుసగా నినేంద్రచంద్రగణములుగా నెన్నఁబడును.

కం. అర్ణవజాతాననెసం పూర్ణతెయుంసకలవిషయభాషాదిగళం
  నిర్ణయమాగరుపిదెనాం కర్ణాటకభాషెయంద మంకేళ్ పెళ్వెం. 296.

The author having finished the languages etc., common to all the countries, now introduces the Canarese metres.

క. ఎరడుంమూఱుంనాల్కుం గురువింప్రస్తరిసలంబు నిధిగజధరణీ
  శ్వరగణమొగెగుమవర్కం సరసిజభవవిష్ణు రుద్రసంజ్ఞిగళెక్కుం. 297.

చ. కరపురవార్ధియాగెగురువాగిరె తద్గురివింద ధోదసా
  గిరెలఘుయుగ్మమాక్రమదె ముంతెసముంకడె వట్టిబిఃప్పినొళ్
  బరెలఘుముంతె పింనెలఘుముంతెసమం మొదలింతగుర్ద్వపం
  కరుహదళేక్షణేగణమనింతిదు సర్వలఘుత్వమప్పినం.

The four Brahma feet from 3—4 Moras.

‿ ‿

| | ‿

‿ |

| | |

The eight Visnu feet from 4—6 Moras.

‿ ‿ ‿

| | ‿ ‿

‿ | ‿

| | | ‿

‿ ‿ |

| | ‿ |

‿ | |

| | | |

నాగవర్మకర్ణాటచ్ఛందోంబుధి.

గురువులొగి రెండుమూఁడునాల్గుంచి ప్రస్తరింపఁ బ్రభవించుగణములు రెండు త్రోసి
లఘుగణాదుల నొక్కొక్కలఘువు పెట్ట, రవిబలారిందుగణము లౌ రంగధీర.

అనంతచ్ఛందస్సు? ౪-వ ఆశ్వాసము.





సూర్య గణములు.

ఇంద్రగణములు

## అక్కరలు.

కేవల ద్రావిడభాషాప్రసిద్ధము లగుపద్యములు పయిగణములతో నడుపఁబడియున్నవి. పైరీతి నిటీవలి యాంధ్రకవులు రెండవఛందములోని కేవల త్రిమాత్రాకములను సూర్యగణములుగాను, మూఁడవఛందస్సులోని ౪ లేక ౫ మాత్రలుమాత్రమె గలగణముల నింద్రగణములుగాను గ్రహించి యక్కరాదులగు తెలుఁగుపద్యముల నడిపించిరి కాని నన్నయభట్టునకుఁ బూర్వమె యక్కరలతోఁ బుట్టియున్న తొమ్మిదవశతాబ్దపు యుద్ధమల్లుని బెజవాడశాసనమునందలి యక్కరల గణములను బరిశీలింపఁగా ద్వితీయచ్ఛందమును సంబంధించిన గణములలో ౩ లేక ౪ మాత్రలు గలగణములు సూర్యగణములుగాను తృతీయచ్ఛందమును సంబంధించిన గణములలో, ౪, ౫, ౬, మాత్రలు గలగణములింద్రగణములుగాను గ్రహింపఁబడియున్నట్లగపడియున్నది. కన్నడమునందును నిట్లె యినేంద్రగణములకు మాఱుగా నున్నబ్రహ్మవిష్ణుగణములను గ్రహించియున్నారు. కాని కర్ణాటకులు గ్రహించిన పైసంఖ్యలు గలమాత్రలతోనె యుండు మఱికొన్ని గణములనుగూడఁ దన్నాశ్రయమున నె శాసనకారులు గ్రహించియుందు రని తోఁచుచున్నది. అట్లు గ్రహించినగణముల క్రమము నిటఁ జూపుచున్నాను. ప్రస్తరింపఁబడిన ద్వితీయతృతీయచ్ఛందములలో గుర్వాదులను లఘువు ముందుచేర్చిన లఘ్వాదులను మాత్రమె గాక లఘువుముందుఁ జేర్చినగుర్వాదులను సైతము కన్నడపువారు గ్రహించినసంఖ్య గలమాత్రల

తోనె యున్నవానిని గ్రహించిరి. కావుననె పయిరీతిని గ్రహించుటలోఁ గర్ణాటకులు గ్రహించినమాత్రలసంఖ్యకన్న నధికసంఖ్యగలమాత్ర లుండునని కాఁబోలు మొదటిగణమునకు ముందు లఘువు చేర్చిన దానిని రెండుఖండములందును గ్రహింపక విడిచినట్లుగూడ నగపడుచున్నవి. " | U U " ఇట్టి పంచమాత్రాకగణ మినగణస్థానమునందును, "| U U U" ఇట్టి సప్తమాత్రాకగణ మింద్రగణస్థానమునందును పైశాసనములో నెచ్చటను నగపడలేదు. శాసనగృహీతగణములను బ్రస్తారమునఁ జూపెదను.

| ఇనగణములు. | ఇంద్రగణములు. |
|---|---|
| \| U U | \| U U U |
| \| \| U | \| \| U U |
| \| U \| | \| U \| U |
| \| \| \| | \| \| \| U |
| U U | \| U U \| |
| U \| | \| \| U \| |
| | \| \| \| \| |
| | U U U |
| | U \| U |
| | U U \| |
| | U \| \| |

పైగణములలో ద్వితీయచ్ఛందోగణములవంటివి 'తేమా పులిమా' అను సంజ్ఞలతోను దృతీయచ్ఛందోగణములవంటివి "కూవిళం, కరువిళం, తేమాంగై, పుళిమాంగై," అను సంజ్ఞలతోను నరవమున గ్రహింపఁబడియున్నవని శ్రీ చేకుమళ్ల రాజగోపాలరావుగారును వ్రాసియున్నారు.

పైరీతి నినేంద్రగణముల భేదము నంగీకరించి గ్రహించినచో, నిటీవలి మన తెనుఁగు లాక్షణికులు గ్రహించిన మధ్యాక్కరలక్షణమె పై శాసనాక్కరలకును గుదురుపడును. దీనినిబట్టి చూచునపుడు పైరీతిని శాసనకాలమునకుఁ గల యక్కరలక్షణమునే యిటీవలి మనవారును గ్రహించి రనియుఁ బద్యపునడక కుదురుపడియుండుటకయి యినేంద్రగణములలోఁ గొన్నిమార్పు లంగీకరించియుండి రనియు నట్లే శ్రుతిసుఖము ననుసరించి యతిస్థానమునుగూడ నిటీవలివారు మార్చికొని రనియుఁ దోఁపకపోదు. ఈసందర్భమున నిటీవలి తెనుఁగు

లాక్షణికు లంగీకరించిన మహాక్కరలక్షణముఁ జూపుటయుఁ బై శాసనములను జూపుటయు నావశ్యక మని తలఁచి యిట వ్రాయుచున్నాను.

"ఓజతో నిద్దఱింద్రులును నొక్కయాదిత్యుంను మఱియు
రాజితంబుగ నిద్దఱమరరాజులు నొక్కసూర్యుండు."

అనంతచ్ఛందస్సు. ౩ ఆ.

కన్నడములోని దారెయక్కర నడునడుక్కరలకును దీనికిని జాలవ్యత్యాసము గలదు. సంజ్ఞాసామ్యముమాత్రము గలదు.

౧. "స్వస్తినృపాంకు శాత్యంతవత్సలసత్యత్రినేత్ర
౨. విస్తరశ్రీయుద్ధమల్లుణ్డనవద్యవిఖ్యాతకీర్తి
౩. ప్రస్తుతరాజాశ్రయుణ్డుత్రిభువనాభరణుణ్డుసకల
౪. వస్తుసమేతుణ్డురాజ సల్కిభూవల్లభుణ్డత్రి-ణ
౫. పరగంగ బెజవాడం గొమరస్వామిభక్తుణ్డై గుడియు
౬. నిరుపమమతినృపధాముణ్డై త్తిచ్చెనెగిదీర్చెమఠంబు
౭. గొరగల్లాకొరులిద్దువిడిసి బృన్దంబు గొనియుణ్డువారు
౮. ....రిగాకయబ్బారనాసి వచ్చినపాపంబు గొణ్డ్రు
౯. వెలయంగనియెవ్వట్టుడస్సిమలినులై విడిసినబ్రోల
౧౦. గలతానపతులును రాజుపట్టంబుగట్టినపతియు
౧౧. నలియంబయ్యెవ్వరల వెల్వరించిన నశ్వమేధంబు
౧౨. ఫలంబూపేక్షించి నాలింగబడిసిన పాపంబుతమకు
౧౩. జ(న)నుతచేళ్ళోలనుణ్డి బెజవాడజాత్రకువచ్చి
౧౪. త్రిణయన సుతుణ్డొణ్డు పోటుమెచ్చుకతివిరి యిన్నెలన
౧౫. యనఘుణ్డు సేకొనియిద్దు ప్రత్యక్షు బయున్న నిచ్చు ("ప్రత్యక్షంబయ్యున్న" లేక "ప్రత్యక్షుంబైయున్న" అనియుండవలెను)
౧౬. గనిమల్లణ్డె త్తించె గుడియుమఠంబునుం గార్తికేయునకు
౧౭. (అస్పష్టము)
౧౮. రమనతో బెజవాడకెల్ల బెడంగును రక్షయుంగాను
౧౯. న్నమతతమల్లపరాజు వేరడుదానుంగట్టించె

౨౦. ంగ్రమంబున దానికకలశ (ం?) బిక్షట్లుగాగ మొగమాడు

౨౧. వమరంగ శ్రీయుద్ధమల్లుణ్డై త్రించెనమిత తేజుణ్డు

౨౨. తనధర్మవోడంబడి కాచున్నృపులకున్త" అనియిట్లు పింగళసంవత్సరవైశాఖమాసపు సాహిత్యపరిషత్పత్త్రికలో శ్రీజయంతి రామయ్యపంతులు బి.ఏ., బి.యల్., వారు ప్రకటించియున్నారు.

ఇందుఁ బై నుదాహరించినరీతిని "కలశబిక్షట్లు" అని దిద్దిన పదరూపము సరిపడును. 'ప్రత్యక్షబయన్న' అనుచో 'ప్రత్యక్షంబయ్యన్న' అనిమాత్రము సవరించినచో శాసనమంతటను బయి నుదాహరించిన భేదముగలగణము లతోనుండు మధ్యాక్కరలక్షణము సరిపడఁగలదు. నున్నలకు గుఱుతుగా శాసనలిపియం దక్షరములపై చిన్నబొట్టు పెట్టుదురుగాన నది స్పష్టముగాఁ గనఁబడకుండుట వింత కాకుండుటంజేసి యిది యొకసవరణ మనిపించుకొనఁ బోదు.

శ్రీరామయ్యపంతులవారు పైశాసనములోని యక్కరలకు వెనుకనుదాహరించిన యిప్పటియినేంద్రగణముల యక్కరల లక్షణమునే సరిపెట్ట యత్నించిరి. కాఁగా నట్టిలక్షణ మనేకస్థలములయందు సరిపడనందున "యుద్ధమల్లుణ్డు" అనుమొదలగుచోట్ల "యుద్ధమల్లుఁడు" అని చదువవలెననియు, నట్లే 'ఫలంబు' అను మొదలగుచోట్ల 'ఫలబు' అని చదువవలె ననియు, నట్టిమార్గము ప్రాచీనలేఖనమునం దుండెడి దనియు వ్రాసియున్నారు.

ఈవిషయమున మిక్కిలి పరిశ్రమచేసి యనేకము లగుశాసనములను బరిశీలించి యున్న శ్రీరామయ్యపంతులవారి యభిప్రాయమును సామాన్యముగా నొఁగాదనుట సాహసమే యయినను నాకుఁ దోఁచినవిషయము నీసందర్భమున వ్రాయకతీర దని తలఁచి యిట్లు వ్రాయుచున్నాను. సామాన్యముగా నిందు నున్న యుచ్చారణము ప్రాచీనతమ మనియు నద్దానిని దేల్చిపలుకు నరసున్న యుచ్చారణము తరువాతి దనియు నెవ్వరికేని యంగీకరింపకతీరదు. కాఁగా మొదట నున్న నూఁదియే పలికెడివా రనియుఁ గ్రమముగా ద్రుతస్థానికము లగునున్నలను దేల్చిపలుకునాచారముకూడ వ్యవహారసిద్ధ మయ్యె ననియు న క్కారణముననే కొంతకాలమునఱకును దేల్చిపలుకునపుడు సైత మూఁదిపలుకు నప్పటివలెనే నున్నయేయవిశేషముగా వ్రాయఁబడుచువచ్చె ననియుఁ గ్రమ క్రమముగా నూఁదిపలుకవలసియున్నపు డందులకు గుఱుతుగా నున్నకుఁ దరు

వాత నుండుహల్లునకు ద్విత్వము వ్రాయుటయుఁ దేల్చిపలుకవలసియుండునపు డట్లు పరహల్లునకు ద్విత్వమును గుఱుతింపక కేవలము నున్నమాత్రమే వ్రాయుటయు ననువ్యవస్థ యేర్పడె ననియు, (ఇట్టివ్యవస్థ ముందు వ్రాయఁబోవు దీర్ఘాసిశాసనమునాఁటి కింకను రాలేనట్లు దానినిబట్టి తోఁచుచున్నది.) నటుపై నూరక లేనిపోనిద్విత్వమును వ్రాయుట యసంగత మని తలఁచికావలయు నిప్పటిరీతి నూఁదిపలుకునపుడు నిండుసున్నయుఁ, దేల్చిపలుకునపు డరసున్నయు వ్రాయునాచార మేర్పడె ననియు, నాయాకాలముల లేఖనములనుబట్టి గ్రహింపవలసియున్నది. పైశాసనమునందుఁ దేల్చిపలుకవలసినస్థలములందేగాక యనఁగా నరసున్న యుండఁదగిన స్థలములందేగాక యెంతమాత్రము నరసున్న యుండరాని ‘‘మఠంబు’’ ‘‘నలియంబు’’ ‘‘ఫలంబు’’ క్రమంబు’’ మున్నగుస్థలములందుఁ గూడఁ దేల్చిపలుకుట కంగీకరించుట సరియై యున్నట్లగపడదు. అట్లు తేల్చిపలుకనిచో శ్రీరామయ్యపంతులవా రంగీకరించిన యిప్పటిమధ్యాక్కరలలక్షణ మాశాసనాక్కరలను సాధింపఁజాలదు. అరసున్నలు నిలువఁదగిన చోటులందే సున్నలనుగాని వానికి మూలము లగునను నాసికములనుగాని తేల్చిపలుకుట ప్రాచీనశాసనములలో సహజ మగునాచారమై యున్నదిగాని యర్ధానుస్వారసమానస్థానికములు గానట్టి ‘మరంబు’ మొదలగుచోటులందలిసున్నలను దేల్చిపలుకునాచార మగపడదు. అట్టియెడలఁ దేల్చిపలుకునాచారమె యపుడుండియున్నయెడల ‘‘మల్లుండు’’ మొదలగుచోటులందువలెనె వానియందును నిపుడు తేల్చిపలుకుటయు నందులకు గుఱుతుగా నరసున్నను నిలుపుటయు సంభవించియుండును. పైవిషయములు సహృదయులచిత్తములకు విశదపడుటకై పదునొకొండవశతాబ్దపు వనపతియొక్క దీర్ఘాసిశాసనములోని సీసపద్యము నిట యథామాతృకముగా నుదాహరించుచున్నాను.

‘‘శ్రీశకునేణ్డు (ణ్డులు) భూసతిపై శైలనందాబ్జభవసంఖ్య (౯౯౭+౭౮= ౧౦౭౫ క్రీ. శ.) నొప్పవేంగి । దేశంబు గిమిడియ గోసలగిడ్రిసింగి దేశంబుమఱి యొడ్డదేశమనంగం । జనినభూపాలుర నని నోర్చిచలమర్తిఁ గణ్డాక్షై నెగడినమణ్డలికుణ్డు । భూసురవంశుణ్డువాసవనిభ భోగిబణపతి సౌజన్యగుణయుతుణ్డు । దీర్ఘాసిభగవతిదేవిదేవాలయమున ముందటం గడు ఘనతరముగ । మణ్డపమెత్తించె భణ్డనవిజయుణ్డు గణ్డగోపాలు ణ్డఖణ్డకత్తిఁ । దీవియ వెన్నైనగ్గేనికి నవ్వేలం దన

మనోవల్లభి వనజనేత్రి । దీవియ నెక్కొంబన్నాపతియును (నా) క్షోణీశకులు గల యంతకును ముదమున(?) ।

గగనభూమిచంద్రఖరకరోదకశిఖి, మారుతాత్మమూర్తి మహిమమధన
యి(ష్టపూర్త) ఫలము లెల్లకాలంబును, మెచ్చుతోడుండనునుకునిచ్చుచు[న్న]

ఎపిగ్రాఫియా ఇండికా. ౪-వ వాల్యుము, ౪౫ నెంబరు.

పై శాసనమునం దర్ధోరేఖాంకితస్థలములలో నున్నలనుగాని వానికి మూలము లగు ననునాసికాక్షరములను గాని తేల్చి పలుకవలసియున్నది. అట్లు తేల్చి పలుకవలసియున్నస్థలములం దెల్ల నరసున్న నిలుపఁబడియె యుండుటచే నట్లు తేల్చిపలుకుట సహజముగనే యున్నది. ఇఁక నరసున్న నిలుపరాని 'దేశంబు' మున్నగు నర్ధోరేఖాద్వయాంకితస్థలములలో నెచ్చటను నున్నను దేల్చిపలుకవలసినయవసరము లేనే లేదు. కావునఁ బై నుదాహరించిన యుద్ధమల్లుని యక్కరల శాసనమునం దరసున్న యుండఁదగినచోటులందును, నుండఁదగనిచోటులందునుగూడ నున్నలను, ననునాసికములను దేల్చిపలుకవలయు ననుట యుక్తిసహముగా నున్నట్లగపడదు. మఱియు నిట్టియుక్తికి ననుసవ్యవస్థ నంగీకరించినను, 'అర్థిక' (౪ పంక్తి), 'శ్రీమరస్వామికి' (౫-వ పంక్తి), 'నలియంబయ్యావరల' (౧౨-వ పంక్తి), అను మొదలగుచోట్ల ఛందోభంగము దుర్నివారమైయున్నది.

వెనుక నే నుదాహరించిన యినేంద్రగణములచే నొప్పిన శాసనాక్కరలను నడిపించినచో నెచ్చటను నున్నలను దేల్చిపలుకకయె, యథాస్థితముగనే గ్రహించినను లక్షణము సరిపడుచుండుటం జేసి యట్లు గ్రహించుటయె యుక్తమని యొప్పఁదగి యున్నది. మఱియు నున్నను దేల్చిపలుకునాచారము మిగులఁ దరువాత వచ్చిన దనియు, మొదట నూఁదిపలుకుటయె సహజమై యుండె ననియు నంగీకరించుట సర్వసమ్మతమై యుండుటం జేసి దీర్ఘాసిశాసనమునకు నన్నయభట్టారకునకును సుమారు రెండువందలయేండ్లక్రిందటి దగు నీ యక్కరల శాసనమునాఁటికి నున్నలను దేల్చిపలుకునాచారముకూడ నింకను రానేలేదేమో యనియుఁ దోఁచుచున్నది.

నన్నయభట్టుభారతభాగములో నీయక్కరలు తఱచుగఁ గనఁబడుచున్నవి. వానియందును బంచమగణాద్యక్షరమె యతిస్థానమై యున్నది. ఇప్పటిలక్షణముఁబట్టి మనవా రధునాతనపుస్తకములలో దిద్దివేసిరిగాని ప్రాచీనతాళపత్ర గ్రంథములను బరిశీలించిచూచునపుడు మనయాంధ్రలాక్షణికులు చూపినలక్ష్య

ణము గలగణముల వైఖరి యందు సరిపడకున్న దని యెవ్వరికిని దోఁచకపోదు. నన్నయభట్టు నూతనముగాఁ గల్పించుకొన్న సీసాదులలో నుపచరించు నినేంద్ర గణములతోనే యంతకుఁ బూర్వము చిరకాలమునుండియు నుండుపద్యములను గూడ నడపక తీరదని తలంచుట సరియా? మనవా రంగీకరించిన యినేంద్రగణ ములును మఱికొన్ని యధికమాత్రలు గలగణములును బ్రాచీనాక్కరలను నవు పుటలో నినేంద్రగణములై గ్రహింపఁబడి యున్నవి. తాళపత్రగ్రంథములు తప్పుల కుప్పలును నిటీవలివారి సవరణములతో నిండియున్నవియు నగుటచేత నన్నపార్యుఁ డాశాసనప్రసిద్ధము లగు నక్కరలతోనె తనయక్కరలనుగూడ నడపెనో లేక యలంతిమార్పుల నేవేని చేసెనో స్పష్టముగాఁ జెప్పుటకు వలను పడకున్నది. ఈ సందర్భమున నాయొద్ద నున్న తాళపత్రపుఁబ్రతులనుండి యొక యక్కరపద్యము నుదాహరించుచున్నాను.

నాయొద్దనున్న ప్రతులలోఁ బ్రాచీనపుఁబ్రతిలోనిది.

అక్కర. అవసరజ్ఞు డైన వేదవ్యాసు డేతెంచె నంత నత్తపసి
కపిలగడ్డంబును గపిలజడలునుం గపిలకన్నులును
తపశి యంన్నునపాడవునల్లని దీర్ఘతనువు (ను) జూచి
యువిదయు గనుగవమూశి తెరువకయుండె భయమునా.

౧౨౦ తాటాకు.

ఈపద్యము వెనుక నేనుదాహరించిన శాసనాక్కరల లక్షణమునకు లోంగియే యున్నది. అట్లయినను మనవా రిటీవలిలక్షణకర్తలు చెప్పిన మధ్యాక్కరలలక్షణమునకు సరిగా దిద్ది వేసిరి.

మధ్యాక్కర. అవసరజ్ఞుండయి వ్యాసుఁ డేతెంచె నంత నత్తపసి,
కపిలగడ్డంబును గపిలజడలును గపిలకన్నులును,
దవినయున్నవన్ల నైన దీర్ఘపుందనువును జూచి,
యువిద గన్నుంగవ మొగిచి తెఱవకయుండె భయమున.

౧౯౧౫ సం. వావిళ్లవారిప్రతి. భార. ఆది. ౪ ఆ. ౨౫౪ ప.

పై పద్యమున ఛందస్సు సరిపెట్టుపనియేగాక పవప్రాసము నూడఁబెఱుకుకార్యభారముకూడ మనవారికిఁ దటస్థించెను. తాళపత్రపుగ్రంథములందెల్ల నీపద్యమునఁ బవప్రాస ముండుటయెగాక ప్రాచీనముద్రణములందు సైతము గలదు. ఇంతయేల? విమర్శకాగ్రగణ్యు లగుచిన్నయసూరిగా రీపవప్రాసము నంగీకరించియే బాలవ్యాకరణమునం దనిందగ్రామ్యమునకుఁ బైపద్యము

నాధారముగాఁ జేసికొని "కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు" అనువాని నుదాహరించి యున్నా రని యంగీకరింపక తప్పదుగదా? మనవారు పవప్రాస ముచ్చాలించుటకై యిందు రెండుచరణములందలి ప్రాసస్థానములను దిద్దియున్నారు. అందు "తవిన' అనునది నిరర్థకపదము. 'కపిల' శబ్దభవముగా 'కవిల' శబ్దము నంగీకరించి తక్కిన-చోట దిద్దినారు. దీని కివివాదస్థలమేగాక ప్రాచీన వాఙ్మయమునుండి మఱొక్క-ప్రమాణము నయిన నీయఁజాలరుగదా.

ఇట్లే మనవా రించు కేని సంకోచింపక నన్నయమధ్యాక్కరల నెల్ల దిద్దివేసిరిగాని యొక్క-పద్యముమాత్ర మెట్టిప్రమాదముననో యట్టియాపదకుఁ దప్పి యింకను నిలిచియున్నది.

అక్కర. అరుణస, రోరుహ, దళమృదులంబు లైనయుత్తరుణి
చరణతలంబులు గోడిగరాలపైఁ జనుచునుకిఁ జేసి
పరుసంబులై గడు నెఱ్ఱనైనవి పద్మాయతాక్షి
పరఁగ నాకారణమున సిట్టిదుఃఖభారముఁ దాల్చె.

భార. ఆర. 3 ఆ. ౨౫౯ వావిళ్లవారిప్రతి.

పయిపద్యము చాలవఱకు శాసనాక్కరల లక్షణములకు లోఁగియె యున్నదిగాని పైయధోరేఖాంకితస్థలద్వయమునందు మాత్రలు సరిపడలేదు. దిద్దుబాటు లేనట్టియుఁ దప్పులకుప్పలు కానట్టియుఁ బ్రతులు దుర్లభంబులై యుండుటచేత నన్నపార్యునియక్కరలవైఖరి నిర్ణయింప శక్యముగాకున్నది. పై శాసనమువంటి తాత్కాలికనిర్దుష్ట మగుప్రతి దొరకినప్పుడుగాని యట్టివిషయముల నిర్ణయించుట కవకాశ ముండదుగదా!

అయినను నీయక్కరలనడక సరిగా నుండకుండుటనే కావలయును దిక్కనసోమయాజి మచ్చునకేని దీనిని జెప్పియుండ లేదు. పిదప దీనిని నవరించి శంభుదాసాదు లగుకొంద ఱరుదుగఁ జెప్పియున్నారు. వానినిబట్టియే కావలయు ననంతామాత్యాదు లారీతిలక్షణమును జెప్పియుండిరి. రగడలు మొదలగుమఱికొన్నిపద్యములందును గొంతసామ్యము కన్నడాంధ్రములకుఁ గలదు గాని విస్తరభీతి నిటవివరింపలేదు.

## ఆంధ్రచ్ఛందోలక్షణగ్రంథవిషయవిభాగము.

ఇఁక నాంధ్రచ్ఛందోలక్షణగ్రంథములలోని విషయవిభాగములను స్థాలీపులాకన్యాయముగాఁ బరికించిచూతము. ఛందోలక్షణగ్రంథములలో సామా

న్యముగా నన్నిటియందును దోషవివరణ మనుకొంతభాగము వెలయుచుండును. కర్ణాటచ్ఛందోంబుధియందు నాగవర్మయు నిట్టిభాగమును జేర్చియుండెను. అంతకంతకు నాంధ్రచ్ఛందోలక్షణకర్తలు తాము రచించులక్షణగ్రంథములలో ఛందోలంకారవ్యాకరణశాస్త్రవిషయములు మూఁడిటిని విస్తరించి చెప్పుసంప్రదాయము ప్రబలినది.

క. "చనుసుత్తమగండాధ, ర్వణహనుమవనంలెసుకవిరాక్షసజయదే
వనశ్రీధరాఖ్యగోక, ర్ణనీలకంఠాదిధీమనచ్ఛందంబుల్."

అనురంగరాట్ఛందములో నుదాహరింపఁబడిన లాక్షణికులలో ననంతామాత్యునిఛందోదర్పణమును, నితరము లగువిన్నకోటపెద్దనార్యుని కావ్యాలంకారచూడామణియుఁ, దాతంభట్టు కవిచింతామణియు, ఆనందరంగపిళ్లలక్షణచూడామణియుఁ గాకునూర్యప్పకవి యప్పకవీయమును, మున్నగుగ్రంథములెల్లఁ బయి నుదాహరించిన రీతిని మూఁడుశాస్త్రములవిషయములను బ్రతిపాదించునవియే యైయున్నవి. మఱికొన్ని యొక్కొక్కవిషయమును వేఱొకకొన్ని రెండువిషయములను వివరించునవియుఁ గలవు.

అట్టివానిలో నున్నఛందోభాగము "౧. వర్ణగణాదిశుద్ధివివరణము. ౨. పద్యలక్షణములు ౩. ప్రస్తారాదిషట్ప్రత్యయములు. ౪. యతిప్రాసప్రకరణము." అని యిట్లు నాలుగుభాగములుగా వివరింపఁబడుచు వచ్చినది.

## వర్ణగణాదిశుద్ధి.

కృత్యాదిపద్యమున నిలుపవలసినవర్ణములయు గణములయు నిర్ణయమును జేయుటకై బీజాక్షరవిభాగము, పొంతనములు, కూటములు, నధిదేవతలు, బ్రాహ్మణాదివర్ణములు మున్నగు ననేకవిధము లగునాకారములను వర్ణములకుఁ గల్పించి వానిని నిజముగాఁ బాటింపఁజూచునపుడు కృత్యాదిపద్యరచనమే పొసఁగనిరీతి నతివిపుల మగుగ్రంథమును సామాన్యముగా ఛందోలక్షణకర్తలందఱును విస్తరించిచెప్పియున్నారు. ఇంతయేల! లోకము దుష్కరకార్యసాధనవిషయమున "కృత్యాద్యవస్థ" యనుసామెతను వాడునంతటిచిక్కు లద్దానిలో గ్రహింపఁబడియున్నవి. కొన్నిప్రాచీనలక్షణగ్రంథము లీయొక్కవిషయము నుపదేశించుటతోడనే కృతకృత్యము లయ్యెను. అట్లయినను నానాఁటి కిట్టివిషయము లట్టిప్రాముఖ్యపదవినుండి తొలఁగుచువచ్చె నని చెప్పుట కెంతయు సంతసించుచున్నాను. ఈసందర్భమున నట్టివిషయములను మచ్చునకై దిఙ్మాత్రముగ నుదాహరించుచున్నాను.

క. ఈయేఁబదివర్ణములకుఁ, బాయకకులమును గ్రహములు ఫలబీజంబుల్
నాయకులు తెలియఁగావలె, శ్రీయుతయానంపరంగనృపసారంగా.

రంగరాట్ఛందము.

క. నాయకుఁ డేకులమైనను, బాయకతత్కులగణంబు పద్యముమొదటన్
ధీయుక్తి నిడఁగమేలగు, నేయెడ సంకరము లిడఁగ నెగ్గగుఁ బతికిన్.
క. మునుకొని పద్యముఖంబున ననిలగణం బిడిన నాయురారోగ్యములుం
గొనసాగు దానిముందట, ననలగణం బిడినఁ బతికి నలజడి సేయున్.
మ. ధర దైవంబు గ్రహంబు సౌమ్యుఁడు హరిద్వర్ణంబు సత్కాంతి యా
సుర మూహింప గణంబు జాతి తిలకించున్ శౌద్రి యాయోనిదా
హరిణం బుజ్జ్వలతారజ్యేష్ఠ రసముద్యద్రౌద్ర మారాశి తే
లురుభద్రంబు ఫలంబునా మగణ మింపొందున్ బుధస్తుత్యమై.

సులక్షణసారము.

## పద్యలక్షణభాగము.

వెనుక నుదాహరించినవివిధము లగుపద్యములగణములును వానియతిస్థానములును విశదముగా నీపద్యలక్షణభాగమున వ్రాయఁబడియుండును. అట్టివిషయములను జెప్పులక్షణపద్యమె యద్దానికి లక్ష్య మగునట్లుగ లక్షణకర్తలే పద్యరచనమును జేయుచువచ్చిరి. ఈ సందర్భమున నేయేకాలములం దేయే పద్యము లేయేరీతుల నుండెడివో? వేని కేకాలమున వాడుక యధికమై యుండెడివో? ఏయేపద్యముల కేయేకాలములలో నెట్టియెట్టిమార్పులు సంభవించినవో?" అను మొదలగువిషయములును వివరించుటగాని, వానికిఁ బ్రాచీనకవుల ప్రయోగములను బ్రమాణముగాఁ జూపుటగాని లాక్షణికులు చేసియుండలేదు. మఱియు దేశీయము లగుపాటలు పదములు మున్నగువానిలోఁ గలఛందోవిశేషముల నెవ్వరును వివరింపలేదు. మఱియు నీభాగమున నాంధ్రవాఙ్మయమున నెక్కడను వాడఁబడియుండ వని దృఢముగాఁ జెప్పఁదగిన శ్రీస్త్రీనారీమృగీప్రభృతివృత్తములను సంస్కృతపింగళాదిచ్ఛందములనుండి యెత్తి వ్రాయుట యనావశ్యక మనియుఁ జెప్పఁదగియున్నది.

## షట్ప్రత్యయములు.

ఈవిషయములలో నొక్కప్రస్తారముతప్పఁ దక్కినవి కేవలము వినోదమాత్రఫలక మగుచిత్రగణితరూపమున నుండుటం జేసి యీఛందోవిషయమున నంతగా విస్తరించుట యావశ్యకము కాదని వానిస్వరూపము నిట వివరింపనైతిని.

## యతిప్రాసప్రకరణము.

ఈభాగ మొక్కటియె ఛందోలక్షణగ్రంథములలో సర్వాధికమై యుండు ననుటకు సందేహము లేదు. ఇయ్యది యొక్క ఛందోలక్షణగ్రంథవైపుల్యమునకే మూలకారణమై యుండుటగాక యాంధ్రవ్యాకరణముల వైపుల్యమునకుం గూడ మూలకందమై యున్నది. ఈవిషయము నీవల కొంత విపులముగం జూపియున్నాను. మఱియు నింతలియఖండయతి ప్రాదియు నిత్యసమాసయతి ఆదేశయతి మున్నగునవి సంస్కృతభాషాసంబంధ మశేషాధికముగాం గలిగి యుండుటచేం గేవలాంధ్రపండితులకు దుర్గ్రహములై యున్నవి. ఇవి యుచ్చారణా సౌఖ్యమునకైమాత్రమె కల్పింపంబడినను వివివి నియమములు నిలుపునాచారము ప్రబలినందున నంతటను సంపూర్ణ సుస్వరసౌఖ్యము నొసంగంజాలు నేకవర్ణావృత్తిని ఘటింపంజాలక యనేకవిధము లగుసవర్ణసామాన్యాపహ ప్రత్యంతరము లను గవులు కల్పించుకొని పలువిధములగు భేదముల నంగీకరించి యొక్కటొక్కటి చేర్చుచు వచ్చుటంజేసి యీప్రకరణము మిక్కిలి విపులమై యనేకస్థలములందు సంస్కృతవ్యాకరణసంప్రదాయములకు లోనై, తుదకు రెండుభాషలయందును నసాధారణప్రజ్ఞ గలవారికి మాత్రమె సమగ్రముగం దెలియందగినస్థితిలోనికి వచ్చినది. ఇందలియతిభేదములు-

క. "స్వరవర్గాఖండప్రా, ద్యవ్యయబిందుప్లుతములు ప్రయుక్తాక్షరముల్
పరువడి నెక్కటివొలిక, సరసలు నాంబడువిధములం జనునష్టాదశా."

అని యిట్లు కవిజనాశ్రయమునం బదివిధములతో నారంభింపంబడి యొకకు నలువదియొక్కవిధముగా నప్పకవ్యాదులచే విస్తరింపంబడినవి. అట్లె ప్రాసభేదములు సైత మనేకములు బయలుదేఱినవి. అయినను నప్పకవి చెప్పినయతిప్రాస భేదములలోం గొన్ని నామకరణమాత్రఫలకములై యాసందర్భమునం జెప్పం దగినంత యావశ్యకత లేక యున్నవని చెప్పందగియున్నవి.

స్వరప్రధానయతియుం, బ్రాణియతియు, సంయుక్తయతియు యతిసామాన్యలక్షణరూపములు గాని యతిభేదములు కానేరవు. ప్రత్యేకయతి, భిన్నయతి, వికల్పసంధియతి, మున్నగునవి చెప్పవలసినంతయావశ్యకత యగపడదు. అఖండయతిని నంగీకరించునపుడు సామాన్యముగాం దక్కినయుభయయతు లన్నింటిని జెప్పవలసిన ప్రసక్తియే లేదు. మఱియు, నఖండయతి, రలయతి రఱయతియు మహాకవిప్రయోగసిద్ధములై యుండంగా నప్పకవి వానిని నిరసించుటలో నాధారమేమో తెలియరాకున్నది.

పదద్వయము సంధించినస్థలము యతిస్థాన మగునపు డందుత్తరపద మజాది యయ్యెనేని యచట "విఱిగిన యుత్తరపదాద్యచ్చుతో స్వరయతి నిల్పుట, సంధించినయుజ్ఝల్లులకుఁ బ్రాణియతి నిల్పుట" అను నీ రెండువిధము లును గవిప్రయోగసమ్మతములె యైయున్నవి. ఇం దొకపక్షమున ఖండము గాను వేఱొకపక్షమున నఖండముగా యతినిల్పఁబడుచున్నను నఖండముగా నెంచుటయె వింతయని కావలయును దీని నఖండయతి యందురు. అయినను గొన్నిచోటుల ఖండముగా నెంచుటయు (ప్రాణ, రామునికై, రామునికన్న, విశ్వామిత్రుఁడు, కోకిలాలాపము, మొ॥) వింతయె యగుటంజేసి దీనిని ఖండాఖండయతి యనియుఁ జెప్పుదురు. ప్రాచీనలాక్షణికు లనేకులు దీనిని సార్వత్రిక ముగా నంగీకరించియున్నను నప్పకవి యట్లంగీకరింపక దొరకినప్రయోగమున కెల్ల నొక్కొక్కవిధిని గల్పించుచుఁ బడినయవిధి యింతింత తని చెప్ప శక్యము కాదు. "యుష్మదాజ్ఞ, అస్మదాజ్ఞ" అనుచోట్ల నుభయయతి చెల్లును, "తదాజ్ఞ" అనుచోఁ జెల్లనేరదు. 'విశ్వామిత్రుఁడు' అనుచో నుభయయతి చెల్లును. "సూర్యాచంద్రములు" అనుచోఁ జెల్లనేరదు. తుదను "వనౌకసులు" నృప భాధిపతి" అనుచోట నుభయయతి చెల్లును. 'మురారి, రమేశుఁడు' అను చోట్ల నియ్యది చెల్లనేరదు. బాగుగా విమర్శించిచూచునపు డిట్టియుక్తిశూన్య విషయములు కేవల మసంగతము లని తోఁపకపోదుగదా.

ఇఁకఁ బాదప్రథమద్వితీయాచ్చులనడుమ నున్నహల్లులు పాదములం దెల్లనాచోటనే నియతముగా నావృత్తము లగుచుండుట మాత్రమె యవర్జ్యమైన విధియై యుండఁగా నైచ్ఛికము లగుటంజేసి యనియతములె యనఁ దగు తక్కిన క. "భాసురములగుచునుకర, ప్రాసాను ప్రాసదుష్కరప్రాసాంత్య

ప్రాసద్విప్రాసత్రి, ప్రాసములన షడ్విధముల ప్రాసము లమరుఁ."

అని యిట్లు భీమకవ్యాదులు చెప్పిన ద్విప్రాసాది భేదము లలంకారశాస్త్రమునఁ జెప్పఁదగియుండును గాని ఛందోభాగమునఁ జెప్పఁదగి యుండవు గదా. అది యట్లుండఁగా సులక్షణసారాదిగ్రంథములు కొన్నిటిలో నీయలంకారరూపానియతప్రాసభేదములు మాత్రమె చెప్పఁబడుట మఱింత వింతగా నున్నది.

'సంయుతాసంయుతప్రాసము, ఖండాఖండప్రాసము, ఉభయప్రాసము, ప్రాసమైత్రి, ఋప్రాసము, అభేదప్రాసము, స్వవర్గజప్రాసము' అను మొదలగు భేదములు ప్రాసనియమమును సడలించినరీతిని జూపునవియై యున్నవి.

తక్కిన "యర్ధబిందుప్రాసము, పూర్ణబిందుప్రాసము, సంయుతాక్షరప్రాసము, రేఫయుతప్రాసము, లఘుద్విత్వప్రాసము", మున్నగునవి ప్రాససామాన్యలక్షణముతోడనే గతార్థము లగుటంజేసి యాభేదములను వేఱ చెప్పవలసినంత యావశ్యకత యగపడదు. అనంతామాత్యాదులు పేర్కొన్న త్రికారప్రాసము, సంయుతాసంయుతప్రాసమును జెప్పుటలోని ప్రథమప్రయత్న మని గ్రహింపవలసియున్నది. వ్యాకరణాదులు నకారమునకు మకారమును విధించుచుండుటంజేసి యనునాసికప్రాసమును వేఱ చెప్పనక్కఱ లేదు.

గీ. "స్రజ్నిచయసక్త కంఠదావాగ్నిపాయి" అను మొదలగు చోట్ల "స్రగ్నిచయ" అనియు నుండనోపునుగాన వికల్పప్రాసము నంగీకరింపవలసిన యావశ్యకత యగపడదు. మఱియు మహాకవిప్రయోగసిద్ధము లై రంగరాట్ఛందము మున్నగువానిలో నంగీకరింపఁబడియున్న శసప్రాసము నప్పకవిగారంగీకరింపకుండుటకుఁ దగినయుక్తి గానరాకున్నది. ఆ. వె. అప్రశస్తములగు ప్రాసజాలము లలం, కారవిస్మితములుకావు గాన" అని యిట్లప్పకవిగారు శసప్రాసమునం దేకవర్ణావృత్తి భగ్న మగుటచే నలంకారత్వము చెడునని యొక యుక్తిని జూపియున్నారు. ఆపట్టునఁ గొన్నియెడలఁ దా మంగీకరించు శషప్రాసము నణప్రాసముమాత్ర మెట్లు సరియో తెలియరాకున్నది.

మహాశయులారా! పై నుదాహరించిన నాలుగుభాగములు గల ఛందోలక్షణ గ్రంథములలోని యీ యతిప్రాసప్రకరణ మనుభాగము తక్కినయన్నిటికంటె మిక్కిలి విపులమై యున్నది. అం దేవర్ణమున కావర్ణమావృత్త మగునట్లు చెప్పుట దుశ్శక మగుటంజేసి యతిప్రాసములకు సహజ మగుశ్రుతిసుఖప్రదాన మనుఫలము కొఱఁతపడుటకోర్చి యేదో యొకరీతిని సజాతీయ మనిపించుకొనఁ దగినవర్ణము నాయాచోట్ల నిలుపుచు వచ్చిన మహాకవుల లక్ష్యముల నాధారముగాఁ జేసికొని లక్షణకర్తలు వర్ణసాజాత్యవివరణవిషయమునఁ ద్రొక్కిన మార్గవిశేషములను, వానిలోని భిన్నాభిన్నాభిప్రాయములను వాని యుక్తాయుక్తతలను వివరించినచో నింకను గ్రంథవిస్తర మగునని తలఁచి యింతతో విరమించుచున్నాను.

ఆంధ్రభాషావాఙ్మయముల యభివృద్ధివిషయమునఁ గంకణము కట్టుకొని యత్యుత్సాహముతోఁ బనిచేయుచు లోకోత్తరగ్రంథముల యుత్పత్తికిఁ బ్రేరకులగుచున్న శ్రీసాహిత్యపరిషత్తువారు పై విషయములను బాగుగా విమర్శించి చూపఁజాలు నొకయత్యుత్తమచ్ఛందోలక్షణగ్రంథమును రచింపించు మహాకార్యమునకుఁ గడంగుదురుగాక.

వఝల - చినసీతారామస్వామిశాస్త్రి.

శ్రీరస్తు.

# ఆంధ్ర సారస్వత ప్రశంస.

అగ్రాసనాధిపా! ఆంధ్రసోదరులారా!

పురాభవకృతసుకృతవిశేషంబునఁ బావనగిరినదీవిరాజితంబును, భగవత్ప్రసాదిత సహజసౌభాగ్యానుభవహేతుభూతపరికర విభ్రాజితంబును నగుభారతవర్షరత్నగర్భయందు మనము జనింపఁగల్గితిమి. అందును మృదుమధురహావభావ విశేషభూషిత యగునాంధ్రభాషాయోషామణి నర్తనముసేయు త్రిలింగదేశమున జనించి కృష్ణాతటినీతటంబున నేఁడు మాతృభాషనుగూర్చి ముచ్చటింపఁ దొరకొనుట యెంతయు స్తవనీయము. విజయుని విజయమునకుఁ గారణంబగునీనగరంబున దృఢాభినివేశముతోఁ బూనినపూనికలు తప్పక విజయసాధకంబు లగును. ఇట్టివిద్వన్మహామండలిలో మాతృభాషాప్రశంసనానందమును బాల్గొనుటకు సాహసించితిని.

శ్లో. కాచంమణింకాంచనమేకసూత్రే ముగ్ధాగ్రథంతీతినచేహచిత్రమ్
యత్సర్వవిత్పాణినిరేకసూత్రే శ్వానం యువానమ్మఘవానమాహ.

అనున్యాయమున నీమహోపన్యాసకుల పట్టికలో నా పేరునుగూడఁ జేర్చి యుపన్యసింప దొరకొనిన నన్నుఁ బరిహసింపకుందురుగాక. ఆంధ్ర, తెనుఁగు, తెలుఁగుశబ్దముల నిర్వచనము పలువు రింతవఱక పొనర్చియుండుటచే నే నందుకుఁ గడఁగలేదు. మన తెలుఁగుబాస లాఁతిబాసలవలెఁ గాక తన సొంపునింపు చక్కని యక్కరములును మృదుమధురములై విన సొంపుఁగూర్చు నజంతశబ్దములును గలిగి సులభోచ్చరణీయమై నెగడుచున్నది. ఆంధ్రభాషయందు స్వరములకుఁ బ్రత్యేక సంజ్ఞలు గలవు. సంస్కృతకవనాభిజ్ఞులయ్యును, త్యాగరాజాదులు తెలుఁగుననే కృతులు సేయుటయు, దాక్షిణాత్య గాయకు లాంధ్రకీర్తనలనే తఱచు గానముసేయుటయు, వ్రాయుటయుఁ, జూడఁ త్రిలింగభాష గీర్వాణాది సమస్తభాషలకన్న మార్దవము గల్గునదని తెల్లము గాఁగలదు. మన యాంధ్రభాషయం దనేకము లగుగ్రంథరత్నము లున్నవి. వీనిలో మూఁడువంతు లితరభాషలనుండి యనువాదితములు. ప్రాచీనకావ్యములు చాలవఱకు సంస్కృతమునుండి యాంధ్రీకరింపఁబడినవి. ప్రస్తుతకవులు

పల్వురు ఆంగ్లేయ, హిందీ, మరాఠీ, వంగాది భాషాగ్రంథముల కనువాదము సేయుచుండిరి. అనువాదకుఁడు సంపూర్ణకవిలక్షణములు గల్గువాఁడు గాకపోయి నను నితరభాషాకవి రహస్యములను దెలుపుచు భాషకు మహోపకారి యగు చున్నాఁడు. తిక్కన పోతనాది మహాకవు లనువాదకులయ్యుఁ దమకృతిరత్నము లందు స్వతంత్రశక్తిని జూపి వన్నెకెక్కినారు. కవిబ్రహ్మ నిజహృదయకేదారం బున భావామృతసస్యములఁ బండించి రసికులకు విందుసేయును. అద్వైతి భావ నావశమునఁ దాను బరబ్రహ్మ మగునటులు కవి భావనావశమున సర్వప్రపం చము తా నగును. ఏసమయమం దేయేస్థితిగతులయం దెట్టిరసపోషణమును గావింపవలయునో వానినెల్లఁ జూపట్టును. చిత్రకారుఁడు ప్రకృతిని జిత్రించి యద్భుతానందముల నొందించునటులు కవి స్వభావకల్పనలచే మెప్పువడ యును. హేమంతము వర్ణించుచోఁ దుషారబిందువులచే మేను తడిసినటులే యుండును. వసంతమును నుడువుచో నందనోద్యానమునఁ దాను విహరించు నటులే యుండును. కవి యజరామరుఁడై రసజ్ఞహృదయవీధుల నెల్లపుడు విహరించుచుండును. పురాతనాధునాతన ప్రపంచనాగరకతను జాటుచుఁ బ్రజల యుత్తమజీవనమునకుఁ గవులే కారణభూతులు. "ద్విత్రా ఏవకవయః, ద్విత్రాణ్యేవ కావ్యాని"యని యానందవర్ధనుఁడు వాక్రుచ్చినటులు భాషాప్ర పంచ మంతయు గాలించిచూచినఁ, గొలందిమంది సత్కవులును గొలఁదిగ సత్కావ్యములును జూపట్టును. వ్రాసినవెల్లను గావ్యములు గావు. వ్రాయు వారెల్లరుఁ గవులుగారు. కవి యౌచిత్యవిచారదక్షుఁడును, దీర్ఘదర్శియు, నిర్లో భుఁడును, సత్యవాక్కును, రససిద్ధుఁడు నయియుండవలయును. దేశాటనము, పూర్వకృతి విమర్శనమును, సాధుదుర్జనచేష్టాపరిశీలనమును, ధారణాశక్తియుఁ గవివిజ్ఞానమునకు సాధనములు:—

## ఔచిత్యము.

ఔచిత్యమే కావ్యమునకు జీవితము. వివిధాలంకారములు గాని మిథ్యా కల్పిత గుణగణంబులుగాని యౌచిత్యహీన మగుకావ్యమునకు మృతకళేబర మునకుం బోలె వన్నెఁ గూర్పవు. ఉచితస్థానముల నెలకొల్పఁబడిన యలంకా రములును, గుణములును, కృతికన్యను శోభాధన్యను గాఁ జేయును,

శ్లో. కంఠే మేఖలయా నితంబఫలకే తారేణ హారేణ వా
పాణౌ నూపురబంధనేన చరణే కేయూరపాశేన వా

శౌర్యేణప్రణతే రిపౌకరుణయా నాయాంతి కే హాస్యతా
మౌచిత్యేన. వినారుచింప్రతను తే నాలంకృతిర్నో గుణాః.

అఱుత నొడ్డాణమును, కటిప్రదేశమున ముక్తాహారమును, హస్తముల కందెలును, పాదములకు బాహుపురులును, విసతునిపై బీరమును, అరిపైఁ గరుణయు, నపహాస్యతామూలకంబు లగునటులు, ఔచిత్యశూన్యంబు లగు కావ్యములును భవ్యములు గావు. కాన నిట్టి యౌచిత్యానుభవమునకై కవి దేశకాలజ్ఞానమును లెస్సగ సంపాదింపవలయును. పూర్వకృతులను సవిమర్శముగఁ దిలకింపవలయును. హిమానీదూషితంబు లగునెరోపఖండారామములు పరిణతఫలనతశాఖాయుతచూత శోభితంబు లని వర్ణింపరాదు. హూణాంగనాముఖహేమాంభోజంబు చికురభ్రమరలలితం బని నుడువరాదు. భాగీరథిగ్రీష్మశోషితపయోధార యని పలుకఁగూడదు. కమలాసనాసీనమై భృంగము సంగీతముఁ బాడుచున్న దని కాని, కోయిల కూఁతలకు వెఱచి రాయంచలు మానసకాసారమున కరిగె ననికాని, శంకరుండు శరత్పయోధరగాత్రుఁ డని కాని చెప్పుట యపహాస్యము. కాంతాకేశపాశము మాలకాకి యీఁకెలతోఁ బోల్చుట యుచితమా? ధీరోదాత్తునకు లాఘవముఁ గూర్చుట న్యాయమా? అయ్యది ప్రసంగోచితముగను వన్నెలును జన్నెలును గలిగినదిగా నుండవలెను. పురాతనకావ్యము లాధునికకావ్యము లట్లు కథాప్రధానములు గావు. ఔచిత్యప్రధానములు గనుకనే తృతీయపథమగామి యగుమురారిమహాకవి తననాటకమున రామవాలిసంగ్రామము బ్రత్యక్షముగఁ జూపినాఁడు. కాళిదాసమహాకవి పద్మపురాణమందలి కథ పుచ్చుకొని యభిజ్ఞానశాకుంతల మెంతమనోహరముగ వ్రాసినాఁడు. శకుంతలాదుష్యంతులయౌచిత్యముఁ జక్కఁగఁ బోషించి మూర్తీభవించినవారిప్రేమదేవతను గన్నులకుఁ గట్టినాఁడుగదా? ఇంతయేల! తిక్కనకవిబ్రహ్మ యౌచిత్యమును బాటించియేగదా భారతమును బలుచోట్ల మార్చి వ్రాసినాఁడు. కాన నాధునికకవులెల్లరు నిరర్థకము లగునవధానములందును, ఆశుకవి, బాలకవీత్యాదిబిరుదసంపాదనములందును మనస్సుఁ జొరనీయక పూర్వగ్రంథపరిశీలనమునఁ దమబుద్ధికిఁ బదను వెట్టుచు దేశకాలజ్ఞానసంపాదనమునఁ దమజ్ఞానము నినుమడింపఁ జేయుచు, మఱియుఁ దగినసాధనసామగ్రితో నుత్తమకావ్యనిర్మాణమునకుఁ గడఁగినచో మనయాంధ్రభాషయందుఁ బెక్కు లుత్తమస్వతంత్రకావ్యములు బయలువెడలును. ఇప్పుడు మనయాంధ్రులు ఇంగ్లీషు, బెంగాలీ, మరాఠీ, హిందీ మొదలగుభాషాగ్రంథములను

అనువాదము చేయుచున్నటు లప్పుడు వారే మనయాంధ్రగ్రంథములను వారి వారిస్వభాషలోనికి ననువాదము చేసికొందురు.

కావ్యముల యుద్దేశము.

కాళిదాసమహాకవి పద్మ, విష్ణు, వాయుపురాణములందలి యంశములఁ బుచ్చుకొని రఘువంశమును, శైవపురాణజ్ఞానసంహితయందలి యాశయముం గ్రహించి కుమారసంభవమును, పద్మపురాణస్వర్గఖండమందలి కథాభాగముఁ దీసికొని యభిజ్ఞానశాకుంతలమును రచించె. ఇటులే పలువురు సంస్కృతకావ్యములను రచియించిరి. వీరి యుద్దేశము కథలను దెల్పుట కాదు. విజ్ఞేయాంశములను విముఖులకుఁగూడ నభిరుచిఁ గల్పించి యందములను జంనములను జిత్రములను నీతులను జేర్చి హృదయరంజనముగ నుపదేశించుటయే వీరితలంపు. ఈయాశయమునే కాళిదాసమహాకవి రఘువంశమున సూచించినాఁడు.

శ్లో. అథవాకృతవాగ్ద్వారే వంశేస్మిన్ పూర్వసూరిభిః
మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మేగతిః.

పురాణగాథలు వజ్రముచేఁ దొలిచి వేయఁబడినరత్నములు. తనకావ్యమా యంశముల నేకత్ర కూర్చి ధారణాయోగ్యముగాఁ జేయుసూత్ర మని భావము. కావ్యప్రయోజనముఁగూర్చి కావ్యప్రకాశకారుఁ డిటులు వక్కాణించినాఁడు.

శ్లో. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే.

కావ్యము కీర్తి నొసంగును. కీర్తిమంతు లుత్తమలోకమున నుందురు. పురుషార్థములు బోధింపనికావ్యము లసత్కావ్యములుగఁ బరిగణించుటచే నుత్తమ కావ్యములు పురుషార్థము లొసంగును. దేశకాలజ్ఞుఁ డగుకవిచే వ్రాయఁబడిన కావ్యము లోకవ్యవహారమును బోధించుచు నమంగళములను బోఁగొట్టును. వెంటనే హృదయము గరఁగించి పరులకు సుఖముఁ గూర్చును. మచ్చెకంటుల వలె వలయునంశములను జెప్పకయే చెప్పును.

ధ్వని:—పదగ్రహణమాత్రమే ఫలము గలిగి ధ్వనిరహితంబు లగు కావ్యములు ధ్వనిరహితంబు లగు కాంతానూపురంబులవలె హృదయరంజకములు గావు.

గీ. ధ్వనిరహితము పదగ్రహాపరము నగుచుఁ గేళియందును మంజీరలీలధీర
పదములందును గావ్యమ్ముహృదయమునకు, శ్రవణమునకేని మోద మొసంగ లేదు.
మాశ్శృంగారసప్తశతి.

"అవ్యంగ్యమవరం స్మృత" మని ఆలంకారికులు చెప్పినటు లవ్యంగ్యము లగుకావ్యము లధమములు. ఉత్తమకావ్యములు ధ్వనిప్రధానములు.

రసము:—కావ్యమునకు జీవకళఁ దెచ్చునది రసమే. రసములేక నాలుగు జల్లిపదము లల్లినమాత్రాన నది కావ్యము గాదు. సత్కావ్యములు బహిరంతస్స్ఫురద్రసప్రవాహముల నొప్పారుచుండును.

గీ. అంతరంబున గూఢమౌ నర్థములను, గోచరము సేయక ప్రసాద గుణము లేక
తనరుచుండెడుకావ్యన దమ్ములరస, మరయఁగా రసజ్ఞానంద కరము గాదు.
మాశ్శృంగారసప్తశతి.

పండితపామరాదిప్రజలకే కాక పిపీలికాదిబ్రహ్మపర్యంతము గలజీవరాశికి నాయాసమయములయం దంతరంగములు నార్ద్రములుగఁ గావించి సంతోషవార్ధియం దోలలాడఁజేయుచు సహృదయహృదయకుహరములనుండి వెల్లువలై ప్రవహించునదియే రసము. కావ్యోపాత్తములుగాని యభినయోపదర్శితములుగాని విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావములచే శ్రోతృప్రేక్షకాంతఃకరణములకుఁ బరివర్తనముఁ గలిగించురత్యాదిస్థాయిభావమే రసము. ఉప్పుసంద్రమువలె స్థాయిభావము విరుద్ధావిరుద్ధభావములచే మార్పుఁజెందక యితరభావముల కాత్మభావ మొసంగును.

చ. అసమశరోత్సవంబున గ - తాంశుకయౌ ప్రియమౌడ్కి నుల్లస
ద్రసము చెలంగువాణి ప్రమ - దంబొనఁగూర్చును శుద్ధయయ్యు నీ
రస యగువాణియో కరము రాజదలంకృతియుక్తయయ్యు మా
నసమున సాలభంజివలె నవ్యముదం బొనఁగూర్ప జేరికిన్. మాశ్శృంగారసప్తశతి.

అట్లు రసము చిప్పిలునట్లు వ్రాయఁబడినగ్రంథరాజములే పాఠకులను శ్రోతలను నెక్కువగ సంపాదించుకొనఁగలవు. అప్పుడే విద్యాదేవత శ్రోతల కర్ణరంధ్రములద్వార భావవీధులఁ బ్రవేశించి విముఖులనుగూడ వెంబడించి గంభీర మైనశంఖధ్వనిఁ జేయుచు నవిద్యానిద్రనుండి మూఢులను మేల్కొల్పుచు నజ్ఞానాంధకారమగ్నులకు మంచిత్రోవఁ జూపఁగలదు. రసప్రాధాన్యమునుగూర్చి ధ్వన్యాలోకమున నిట్లు చెప్పఁబడె.

"కవినా ప్రబంధముపనిబధ్నతా సర్వాత్మనా రసపరతంత్రేణ భవితవ్యం; తత్రేతివృత్తే యది రసాననుగుణాం స్థితిం పశ్యేత్తాం భంక్త్వాపి స్వతంత్రతయా రసానుగుణం కథాన్తరముత్పాదయేత్ --నహి కవేరితివృత్తమాత్ర నిర్వాహణేన కించిత్ప్రయోజనం, ఇతిహాసాదేరేవ తత్సిద్ధేః." ప్రబంధము వ్రాయుకవి యన్నివిషయముల రసమునకు లోఁబడి యుండవలెను. ఇతివృత్తమునందు విరసం బగు విషయ మున్నను దానిని మార్చియైనను రసానుగుణంబుగ వ్రాయవలెను. కథానిర్వహణమాత్రమునఁ గవి కేమి యుఁ బ్రయోజనము లేదు. ఇతిహాసము నుండియే యది యలవడునుగదా యని భావము. కనుకఁ గావ్యములు నాటకములు వ్రాయుటయం దభిరుచిగలకవులెల్లరు రససిద్ధికొఱకుఁ బ్రయత్నింపవలెను. ఇట్టిరసవత్తరము లైన గ్రంథముల నిర్మింపదొరఁకొనుటయే గాక

ఆవశ్యకగ్రంథములు.

ఆంధ్రమున నిదివఱకు వెలువడినయుద్గ్రంథములను సదుద్దేశముతో విమర్శింపవలయును. ఉత్తమకావ్యములకు, ఔచిత్యవిమర్శన, రసవివేచన, ధ్వన్యర్థస్ఫుటీకరణపూర్వకముగ వ్యాఖ్యలు రచింపఁజేయవలయును. క్షేమేంద్రుని యౌచిత్యవిచారచర్చ, సువృత్తతిలకము, ధ్వన్యాలోకమువంటిగ్రంథములును, ఆంధ్రభాషకు సంపూర్ణవ్యాకరణమును వెలువడవలయును. ఆంధ్రభాషాప్రాశస్త్యమును దెలుపుగ్రంథములను నితరభాషలందు వ్రాయించి బుద్ధిమంతులు గలదేశములలో వెల్లడిచేయుచు నాంధ్రభాషాప్రచార మచ్చటఁగూడఁ జేయించుటయుత్తరకాలక్షేమకర మని నాతలంపు. మఱియు మనయాంధ్రాక్షరములలోఁ గొన్నింటికి అరవము, బెంగాలీ, మొదలగు నక్షరములపోలిక కలదు. తావత్తు, క్యావడి, క్రావడి మొదలగువత్తులు బెంగాలీవత్తులను బోలి యుండును. ఇ, ఒ, ఖ, ఘ, చ, ర, ద, ధ, ల మొదలగునవి మలయాళాక్షరములను బోలినవి. మఱికొన్ని అరవము, గుజరాతి, దేవనాగరి, మరాఠీవర్ణములను బోలినవిగూడఁ గలవు, గాన నాంధ్రాక్షరముల కితరభాషాక్షరములతోడి సంబంధమును దెలుపుచు నాంధ్రవర్ణోత్పత్తి యనుగ్రంథము వ్రాయవలయును. శ్రీసూర్యరాయనిఘంటువుచే నాంధ్రశబ్దములకొఱత దీరఁగలదు. ఈగ్రంథమువలన నక్షరములకొఱతగూడఁ దీరఁగలదు. ఇట్టియుత్కృష్టగ్రంథముల వెలువరించి యాంధ్రభాషయొక్క కొఱతలఁదీర్చుటకుఁ గంకణముఁగట్టుకొన్నయాంధ్రసాహిత్యపరిషత్సభ్యుల యుద్దేశములు త్వరలో ఫలవంతము లగునటు లనుగ్రహించుటకు భగవంతుని బ్రార్థించుచున్నాను.

జంధ్యాల - వేంకటశాస్త్రి.

శ్రీరస్తు.

# కళాపూర్ణోదయము—అంతరార్థకథలు.

ఆంధ్రకవీశ్వరులలో నొకఁడగు పింగళి సూరనార్యుని జీవితమును గుఱించియు నాయన రచించిన గ్రంథముల గుఱించియు నే నాంగ్లభాషను రచింపఁ బూని చాలభాగముఁ బూర్తిచేసినాఁడను. ముఖ్యముగఁ గళాపూర్ణోదయ మను గ్రంథమును గూర్చి యొకవిపుల మగు విమర్శనము వ్రాసితిని. ఆగ్రంథమును గొలఁదికాలములోఁ బ్రచురింపఁదలఁచినాఁడను. అది యాంగ్లభాషయం దుండుటచేత నాంధ్రజనావళి కందఱకుఁ బఠనసాధ్యము గాదు. కావునఁ బదంపడి యాంధ్రంబునకు భాషాంతరీకరణము గూడఁ జేయ నుద్దేశించుకొని యున్నాను. ప్రస్తుత మాగ్రంథమందలి ముఖ్యవిషయములలో నొకటి యగు "కళాపూర్ణోదయాంతరార్థకథలు" అను శీర్షిక గలవిమర్శభాగమును దెనిఁగించినాఁడను. దానినే యిప్పుడు మీయందఱకుఁ దెలుపనై యున్నాను, గాన దయచేసి వినఁగోరెద.

కళాపూర్ణోదయమందలి యంతరార్థకథ లనుగమించుటకు నందలి మూల కథ ముందుగఁ దెలియవలసియున్నది. కాని యాగ్రంథమందు మిగులఁ జిక్కుగా నల్లి కల్పించినకథ నంతయు మీకు నివేదించుట ప్రస్తుత మనవసరము నసాధ్యమును గావున నవసరమైన కథాభాగమును మాత్ర మిక్కడఁ గ్లుప్తముగఁ బొందుపఱుచుచున్నాను.

కథావిషయము.

అంగదేశమందుఁ గాసారపుర మను నొకపట్టనము గలదు. దానిని బరిపాలించుచుండెడు రాజు చనిపోఁగాఁ బ్రజలందఱు సత్వదాత్ముఁడను వానిని దమ యేలికగా నెన్నుకొనిరి. ఆరాజు రాజ్యము చేయుచుండిన కాలమున మణిస్తంభుఁడు, సుముఖాసత్తి యను నిద్దఱు బ్రాహ్మణదంపతు లాపట్టనమునకుఁ జేరిరి. వారిరువురకుఁ గళాపూర్ణుఁ డను సద్యోయౌవనుఁడైన కుమారుఁ డుద్భవించెను. ఆకళాపూర్ణుఁడు శుక్లపక్షకళాపూర్ణునివలె దినదినప్రవర్ధమానంబుగ వృద్ధినొందఁ బట్టనపురా జగు సత్వదాత్ముఁ డతని గుణాతిశయమును శౌర్యపరాక్రమాదివిశేషములను రూపలావణ్యసంపత్తిని జూచినవాఁడై తనరాజ్యమునకుఁ గళాపూర్ణుఁడే యధిపతిగ నుండనోపును గాని తా నంతగఁ దగియుండఁడని యుద్దేశించి రాజ్యభా

రము సమగ్రముగఁ గళాపూర్ణున కొప్పగించి తా నాతనియొద్ద మంత్రిత్వము వహించియుండెను. ఇట్లిట్లుండ మదాశయుఁడు, రూపానుభూతి యనురాజదంపతులు తమకూఁతురైన మధురలాలసను దోడ్కొని సపరివారంబుగఁ గళాపూర్ణునిపై దాడిసల్పిరి. అప్పుడు స్వభావుఁ డనునొకసిద్ధుఁ డొకమణిశలాకయు ధనుర్బాణంబులను దెచ్చి కళాపూర్ణున కిచ్చెను. వానిసహాయంబున నానృపపుంగవుఁడు మదాశయు నవలీల గెలిచి యాయనను బత్నీపుత్రికాసహితముగఁ దనయాస్థానంబునఁ గొలు వుంచుకొనెను. కొంతకాల మిట్లు గతింప మదాశయుఁడు తనహీనస్థితినిగూర్చి విలపించి భార్యను గూఁతురైను వెంటఁబెట్టుకొని కళాపూర్ణునిరాజ్యము విడి పాఱిపోవుటకు నడుముకట్టి కొంతద వ్వరిగెను, గాని, కళాపూర్ణుఁ డంతలోఁ జారులవలన నీసమాచారముఁ దెలిసికొని వారిని దిరిగి పట్టించి తనయాస్థానమునకుఁ దెప్పించుకొనెను. అప్పుడు మంత్రి యగుసత్వదాత్మునియుపదేశమువలన మదాశయునితోఁ గయ్యముఁ దగ్గించుకొనుటకును నెయ్యము నెలకొల్పుటకును వియ్య మొందుటయే ముఖ్యసాధన మని యోజించి యాతనిపుత్రికారత్న మగుమధురలాలసను బరిగ్రహించెను. తరువాతఁ బ్రసంగవశమున రూపానుభూతి సత్వదాత్మునితోఁబుట్టు వనియుఁ దత్కారణమున మదాశయుఁడు బావమఱఁదియు మధురలాలస మేనగోడలు నైనట్లు కళాపూర్ణుఁడు దెలిసికొని తద్బంధుసమన్వయమునకుఁ జాల సంతసించెను.

అంతకుఁబూర్వ మభినవకౌముది యనునొక (తుషారకరకిరణజాప్సరో జాత) కన్యను గళాపూర్ణుఁడు వివాహమాడెను. జ్యేష్ఠభార్య యగునభినవకౌముదిని ద్వితీయభార్య యగుమధురలాలసను జాల గారవించుచు రుక్మిణీసత్యభామలతోఁ గూడినశ్రీకృష్ణునివగిది వినోదించుచుండెను. జ్యేష్ఠభార్యవలన సుప్రసాదుఁడనియు ద్వితీయజాయవలన సరసుఁ డనియు నిరువురుకుమారులఁ గనెను. ఇట్లతులితంబుగ సౌఖ్యసంపదల ననుభవించుచు సదా విష్ణుసేవాతత్పరుఁడై చాలకాలము ప్రజానుకూలముగ రాజ్యముచేసెను.

ఈకథావిశేషమును గవి బహుచమత్కారముగఁ గల్పించినాఁడు. అది యెట్లన:

ఒకానొకసమయమున ననాదిదంపతు లగుసరస్వతీబ్రహ్మలు శృంగారావిష్టచేతస్కులై తమకేళీకాసారంబున వినోదించుచుండఁ గొండొకకారణంబున వా రిరువురకుఁ బ్రణయకలహము సంభవించెనఁట. ఆసమయమున సరస్వతి తన ముఖచంద్రుని గాసారమువైపు ద్రిప్పుకొని శయనించి యుండెను. విరాళి

గాంచినపద్మయోని సరస్వతీముఖకళాపూర్ణు నుద్దేశించి చెంగట నున్న పెంపుడు చిలుకకుఁ బైనుదాహరించినవిధముగ నొకకథను జెప్పెను. ఆకథనంతయు వాగ్దేవి ముదితస్వాంతయై విని కృత్రిమరోషము నభినయించుచు నిట్లుపల్కె.

'చెల్లఁబో మీ సేవ సేయుచు నింతమాత్రము నెఱుంగఁగ లేన ప్రాణనాథ'

కావునఁ గళాపూర్ణునికథ యంతయు సరస్వతీబ్రహ్మల ప్రణయకలహమం దుద్భవించె ననియు సరస్వతియొక్క శృంగారవిలాసములును జలజభవునిభావ నిరూపణములును నందుఁ గథాపాత్రములుగ నిర్దిష్టము లై కథామూలమునకు నాధారభూతము లైనవని కవి సందర్భవశమునఁ దెల్పినాఁడు.

అందుచేతఁ గళాపూర్ణునికథకు శృంగారరసవిషయిక మగునంతరార్థ మున్నది. దానిని గవియే ప్రత్యవయవము విశదీకరించి గ్రంథమందు రచించెను. అది యెట్లనఁ గాసారపురమందుఁ గళాపూర్ణుఁ డనురాజు రాజ్యముచేయుచుండెను. (అనఁగా) కాసారమందు సరస్వతీవదనప్రతిబింబము చంద్రునివలెఁ బ్రకాశించుచుండెను. కళాపూర్ణునితండ్రి మణిస్తంభుఁడును దల్లి, సుముఖాసత్తియును (అనఁగా) ఆప్రతిబింబము శోభనముఖసామీప్యము కారణంబుగఁ గాసారమధ్యమణిస్తంభగర్భంబున నుదయించెననుట. మఱియుఁ గళాపూర్ణునికి స్వభావుఁ డనుసిద్ధుఁ డొకమణిశలాకను ధనుర్బాణముల నిచ్చె (ననఁగా) భ్రూలతావీక్షణంబులు నధరంబును స్వభావంబుచేతఁ గలిగియున్నవనియనుట. మదాశయుఁ డనురాజును రూపానుభూతి యనునతనిభార్యయుఁ గళాపూర్ణునిపై దాడిసల్పి యాతనిధనుర్బాణంబులచే నిర్జింపఁబడిరి. (అనఁగా) కమలగర్భుఁడు పరిష్వంగచుంబనాదిక మగురసానుభవకాంక్షచే సరస్వతీదేవిముఖబింబముపైఁ గోర్కులు నిగిడింప నామెయొక్క కుటిలభ్రూలతావీక్షణంబులఁ బరాభూతుఁ డగుట, కళాపూర్ణుఁడు కాసారపురంబు నవలి క్రముకకంఠోత్తరపురం బనుపట్టనంబుఁ గట్టికొని దానిచుట్టుఁ బసిండికోట పెట్టించె (ననఁ) వాగ్దేవి తనముఖమును గాసారము వైపునుండిమరలించుటయు నాముఖము పోఁకమ్రాఁకుపలె స్నిగ్ధ మగు నామెకంఠమున కుత్తరభాగమం దుండుటయునని యభిప్రాయము. ఆకళాపూర్ణుఁ డభినవకౌముది యనుకన్యను మొదటిభార్యగా వివాహము చేసికొనెను. (అనఁగా) విరించియొక్క విరహవేదనలఁ జూచి సరస్వతికిఁ జిఱునవ్వు గలుగ నామెముఖము నిండువెన్నెలనిగ్గుతోఁ దేజరిల్లె ననుట, తరువాత మదాశయ రూపానుభూతుల శోభార్తై యగుమధురలాలసను ద్వితీయభార్యగాఁ బాణిగ్రహణ మొనరించె

ననఁగా నంబుజాసనుఁడు తనరాణిముఖబింబము నుపలక్షించి యధరామృత మాధుర్యమును గ్రోలుట యని చెప్పనోపు.

ఇవ్విధంబుగఁ గథనంతయు శృంగారరసభూయిష్ఠ మగునంతరార్థసమన్వితంబుగఁ గవి కల్పించినాఁడు. దీని నంతయు స్థాలీపులాకంబుగఁ గొంతవఱకుఁ జెప్పితిని. విస్తరించి వ్రాసినచోఁ జాలగ్రంథ మగును. కావున నింతటితో నీ విషయమును విరమించెద.

శృంగారరసాత్మక మగునంతరార్థకథయే గాక కళాపూర్ణనికథయందు మఱిరెం డంతరార్థకథ లిమిడియున్నవి. అవి యాధ్యాత్మిక మనియుఁ జారిత్రిక మనియుఁ జెప్పవచ్చును. ఈరెండువిధములకథలను నేను గ్రంధమును బ్రత్యేకముగాఁ బరిశీలించి కనిపెట్టినాఁడను. విపులనిదర్శనములతో నాయాంగ్లేయ గ్రంథమందు వీనినిగుఱించి విస్తరించి వ్రాసితిని. ఇచ్చట వానిని గ్రస్తముగా మాత్రము సూచించి విడిచెదను.

## ఆధ్యాత్మికాంతరార్థకకథ.

అంగదేశ మనఁగా మానవదేహము. అందుఁ గాసారపుర మనఁగా హృదయము. హృదయమును గాసారమున కుపమించుట స్వాభావికమేగదా. మానవదేహమందు హృదయము ముఖ్యస్థానముగఁ జేసికొని ప్రప్రథమమున బుద్ధి యావిర్భూత మగును. అనంతర మంతకంటె నెక్కుడుప్రతిభాశాలి యగు జీవాత్మ శరీరమునం దధిష్ఠించి మనుష్యుని యైహికాముష్మికవిషయములను నిర్ణయించుచుండును. సత్వదాత్ముఁ డనఁగా బుద్ధి. అతఁడు మొట్టమొదటఁ గాసారపురమునకు నేలికయై జీవాత్మ యనఁదగు కళాపూర్ణుని మహత్త్వవిశేషములఁ గాంచి వెఱఁగొంది తనస్థానము నాతని కొప్పగించెనని కవి చెప్పినాఁడు.

i "ఇహైవాంతశ్శరీరే సౌమ్య పురుషో
యస్మిన్నేతాంషోడశకళాః ప్రభవంతి"

ii "షోడశకళంభారద్వాజపురుషం వేత్థ" (ప్రశ్నోపనిషత్తు.)

ఇట్లు శ్రుతులు జీవాత్మ షోడశకళాసమన్వితుఁ డనియు నంతశ్శరీరమందున్నాఁ డనియుఁ జెప్పుచున్నవి. దానినే శ్లేషచక్రవర్తి యనఁదగుపింగళిసూరనార్యుఁడు కళాపూర్ణశబ్దము నాధారపఱుచుకొని కథయందుఁ బ్రతిపాదించెను. కళాపూర్ణుఁ డనఁగా షోడశకళాపూర్ణుఁ డగుచంద్రుఁడు లేక షోడశకళాపూర్ణుఁ

డగుజీవాత్మ. ఈకళాపూర్ణుఁడు, మణిస్తంభసుముఖాసత్తు లను బ్రాహ్మణదంపతులకుఁ బుట్టినవాఁడు. మణిస్తంభ, సుముఖాసత్తు లన, పురుషుఁడు, ప్రకృతి; లేక, యీశ్వరుఁడు, మాయ. వీరితాదాత్మ్యసంబంధముచే జీవుఁ డేర్పడెను. మణిస్తంభుఁడు స్త్రీవేషమును, సుముఖాసత్తి పురుషవేషమును దాల్చినట్లు గ్రంథమం దున్నది. (అనఁగా) ఈశ్వరుఁడు మాయాపరతంత్రుఁ డగుటచే స్త్రీత్వ మారోపింపంబడినది; గాని సర్వస్వతంత్రుఁడగుటచేఁ బురుషత్వము సిద్ధించినది. సుముఖాసత్తి, స్వభావుఁ డనుసిద్ధునికొమార్తె. (అనఁగా) మాయ స్వభావసిద్ధ మని చెప్పుట. ఈస్వభావుఁ డనుసిద్ధుఁడు కళాపూర్ణునికి మణిశలాకయును ధనుర్బాణములును నిచ్చెనఁట (అనఁగా) ధన స్సన మనస్సు. బాణము లనఁగా నింద్రియములు. ఇవి కళాపూర్ణునికి స్వాభావికముగనే కలిగినవి. వీనిసహాయముచే మదాళయ, రూపానుభూతు లను రాజదంపతులను జయించి వశ్యులుగఁ జేసికొనినాఁడు. మదాళయుఁ డన శబ్దరూపగంధస్పర్శాదిక మగువిషయము. రూపానుభూతి యనఁ దద్విషయానుభవము. విషయమును విషయానుభవమును మనసుచే నింద్రియములచే సాధించెను. అందువలన మధురలాలసత్వ మాయనకు సిద్ధించెను. (అనఁగా) వస్త్వనుభూతిసంయోగముచేఁ గలిగినమధురపదార్థాభిరుచి యాతనికి సిద్ధించినది. ఈవిషయమే కళాపూర్ణుఁడు, మదాళయరూపానుభూతుల కొమార్త యగుమధురలాలసను వివాహమాడె ననిచెప్పుట. కళాపూర్ణుఁడు ప్రథమమున నభినవకౌముది యను చంద్రకిరణములవలనఁ బుట్టిన యప్సరఃస్త్రీని వివాహమాడె నని చెప్పఁబడినది. అభినవకౌముది యనఁగాఁ జిచ్ఛక్తి. ఆచిచ్ఛక్తి జీవాత్మ నభేదాధ్యవసాయముగా నాశ్రయించి యుండును, జీవాత్మ యనఁగాఁ గళాపూర్ణుఁడు లేక చంద్రుఁడు. కావునఁ జిచ్ఛక్తి చంద్రునివల్లఁ గలిగినదని చెప్పుట సమంజసము. కళాపూర్ణునకు నభినవకౌముదివలన సుప్రసాదుఁ డనియు మధురలాలసవలన సరసుఁ డనియుఁ బుత్రులు గలిగిరనుట యేమన జీవాత్మకుఁ జిచ్ఛక్తివలనఁ బ్రసన్నత్వమును మాధుర్యాభిరుచివలన రసికత్వమును జేకూరెనని చెప్పుట.

ఇ ట్లనేకసందర్భములతోఁ గళాపూర్ణునికథ నాధ్యాత్మికతత్త్వపరముగా సమన్వయింపవచ్చును. ప్రబోధచంద్రోదయాది గ్రంథములందువలెనే యీ గ్రంథమందును నాధ్యాత్మికతత్త్వ మంతర్లీనముగాఁ గథయం దిమిడియున్న దని పైవిషయములను జక్కఁగ యోజించినఁ దోఁపకమానదు. ఈవిషయ మింతటితో ముగించి చరిత్రకథను బ్రారంభించెద.

## చారిత్రకాంతరార్థకథ.

పైఁ జేర్కొనినకథలవలెఁ జారిత్రకాంతరార్థకథ యెక్కడువిశదముగం గానరాదు, దానిని గనిపెట్టుటలో బహుశ్రమ నొందవలసివచ్చినది. ఏలయనఁ కథాపాత్రములగుఱించియుఁ గథాకార్యములగుఱించియు నక్కడక్కడ నిజమైన చారిత్రకసూచనలుమాత్రము పొడకట్టుచున్నవి. ప్రత్యేకముగా ధారాళ మగు నట్టు లంతరార్థ సమన్వయమునకుఁ దగునంతయాధారము గాన్పింపదు. ఈ కారణములవల్లఁ జారిత్రకాంతరార్థకథ యంత విశ్వసనీయము గాదని స్థూల దృష్టికిఁ దోఁపకమానదు. కాని లోఁతుగఁ బరిశీలించినచోఁ గవి కళాపూర్ణుని గథానాయకునిగాఁ జేయుటయం దొకానొకమహాపురుషుని నుద్దేశించియుండ వచ్చునని దృఢ మైనయనుమానము గలుగకమానదు. అనుమానము కలిగినను బ్రత్యయార్హతకు మఱి యొకయంతరాయముగూడఁ దటస్థించుచున్నది. దక్షిణ హిందూదేశచారిత్రకథావివరణ మింకను బూర్తిగా లేదు. ఇప్పటికిఁ దెలిసినంత వఱకు మధ్యమధ్యను జాల లుప్తభాగములు గాన్పించుచునేయున్నవి. కాల క్రమమున లోపములు పూర్తిచేయఁబడవలసియున్నది. ప్రస్తుత మీయంధకార సంకీర్ణ మగుదక్షిణహిందూదేశచరిత్రకథ విమర్శనవిషయములకు సంతృప్తికర మగుసహాయ మొసంగుట లేదు.

కళాపూర్ణు నభివర్ణించుటలోఁ గవి యెవనినైనను జారిత్రకమహాపురుషుని మనమునం దిడుకొనియున్నచో నాతఁ డెవ్వరైయుండు ననుప్రశ్నను మన మాలోచింపవలసియున్నది. సామాన్యముగాఁ దెలుఁగుకవులుగాని సంస్కృతకవులు గాని తా మేయేరాజులయాస్థానముల నాశ్రయించుకొనియుండిరో ప్రత్యక్ష ముగ నారాజులను గాని లేక వారిపూర్వులను గాని తమకబ్బములయందుఁ బ్రశంసాపాత్రములుగఁ జేసియుండిరని మీకెల్లరకుఁ దెలిసినవిషయమే. ఇమ్మహా కవి యగుపింగళి సూరనార్యుఁడు నంద్యాలపురాధీశుఁ డగునంద్యాల కృష్ణరా యని యాస్థానములో నున్నటులు తనగ్రంథమందు వ్రాసికొనినాఁడు. తన గ్రంథము నాతని కంకితముచేసెను. కావున సూరనార్యుఁడు నంద్యాల కృష్ణరా యని గాని తద్వంశజులలో నొకనిని గాని స్తుతిపాత్రునిగాఁ జేసికొనియుండుట సమంజసము. ఈనంద్యాల కృష్ణరాయఁ డొకచిన్నసంస్థానాధీశుఁడైనను విజయ నగరసామ్రాజ్యాధిపతులవంశములోనివాఁ డగుటచే విజయనగరవంశస్థులలో నొకని గాని నంద్యాలవంశస్థులలో నొకనిగాని కవి ప్రశంసించుట కృష్ణరాయని కిష్టముగా నుండును. సూరనార్యునిజీవచరిత్రము సూక్ష్మముగఁ బరిశీలించినచో

నాతఁడు రాజులయొద్ద నిచ్చకములు చెప్పుటయందుఁ గాని యనర్హస్తోత్రపాఠములు చేయుటయందుఁగాని యిష్ట మున్నవాఁడుగాఁ డనియు యుక్తాయుక్తపరిశీలనయందుఁ జాలసమర్థుఁ డనియుఁ గేవలము ధనసంపాదనతత్పరుఁడై యాత్మగౌరవముఁ బోనాడి తనరాజపోషకులయెదుట నైచ్యస్థితిలో నుండువాఁడు గాఁడనియుఁ దెలియవచ్చుచున్నది. కావున యోగ్యతాయోగ్యతలను బహుసూక్ష్మముగా నిర్ణయించెడుసూరనార్యుఁడు, కళాపూర్ణునివంటి యతిలోకగుణగణాన్వితుఁడును సమస్తదిగ్విజయనిర్వాహకుఁడును జీవాత్మసదృశుఁడును నగుమహాపురుషునికిఁ దుల్యుఁడగునృపతిని నిర్దేశించుటలో సామాన్యులను నుపలక్షింపఁ డని వేఱచెప్పవలయునా? కావునఁ దగినవానినే యుద్దేశించియుండును.

అప్పటికాలపుహిందూరాజులలో సర్వవిధముల యశఃపూర్ణు లగువారు విజయనగరసామ్రాజ్యాధీశులు. వారికిని నంద్యాలవారికిని బరస్పరబాంధవ్యము లుండుటచే విజయనగరచక్రవర్తి నొకని నుగ్గడించినఁ దనపోషకునకు సంతోషదాయకముగానుండునని కవి తలంచియుండును. అందుచే మనము కళాపూర్ణునకుఁ బ్రతిపురుషుని విజయనగరరాజ్యాధిపతులలో వెదకవలసియున్నది.

విద్యానగర మనినామాంతరము గలవిజయనగరమును ముఖ్యస్థానముగఁ జేసికొని రాజ్యపరిపాలన మొనరించినరాజవంశములు చరిత్రలో ౪ (నాలుగు) గాన్పించుచున్నవి.

౧. యాదవవంశము. అది ౧౨-వ శతాబ్దముతో క్షీణించినది.

౨. సంగమవంశము. అది ౧౫-వ శతాబ్దములో మధ్యభాగముతో నంతరించినది.

౩. సాళువవంశము. ఈవంశము సాళువనరసింహరాయల తోఁ బూర్తి నొందెను.

౪. తుళువవంశము. ఆవంశమునందలిరాజులు రాజ్యము విస్తరించుటయందుఁ బ్రతాపశాలులుగాను బ్రజానుకూలముగఁ బరిపాలించుటయందు నీతికోవిదులుగాను నింక ననేకవిధముల మహాయశస్సును బొందినవారు. వారిలో నరసరాయలు మొదటివాఁడు. తరువాత నాతనిపెద్దకొడుకు వీరనృసింహరాయలును, నాతని తరువాత జగద్విఖ్యాతుఁ డగుకృష్ణదేవరాయలును రాజ్యమును జేసిరి. ఈవంశపువారు సూరనార్యునికిని నాతనితండ్రితాతలకును సమకాలికు లగుటచేతను, నంద్యాలవారితో సంబంధబాంధవ్యములు కలిగియుం

గుటచేతను వీరిలో నెవరినో యొకరిని కళాపూర్ణునిగఁ గవి యుద్దేశించియుండ వచ్చు నని చెప్ప సాహసింపవచ్చును.

ఇట్లు నిర్ణయించుటకు గ్రంథమందు వేఱొకయాధారముఁగూడఁ గాన్పించు చున్నది. కళాపూర్ణుఁడు కాసారపురమందు రాజ్యము చేసినాఁడు. చారిత్రి కార్థములోఁ గాసారపుర మననేది? కాసారపురనామము గల్గుటకుఁ గారణము గవి యిట్లు చెప్పినాఁడు.

౧. క. శూరమ్యపరిఖనదుమకా, సారపుశృంగములతోడ సాలము పద్మా
కారత నొప్పఁగ నది కా, సారపురం బండ్రు కొలనిచాడ్పున నునికిన్.

కావునఁ గాసార ముండినకారణమునఁ గాసారపుర మని పేరుపొందినది. విజయనగరమునకు హంపీపుర మనియు, పంపాపుర మనియుఁ బేర్లుండినట్లు చరిత్రశోధకులకుఁ దెలిసినవిషయమే. పంపా యనఁగా పంపాసరస్సు. కాఁబట్టి పంపాసరోవరముదరి నుండుటచే విజయనగరమునకుఁ బంపాపుర మను ఖ్యాతి వచ్చినది. కావునఁ గాసారపుర మని చెప్పుటలోఁ గవి విజయనగరము నుద్దేశించుట యస్వాభావికము గాదు. కావునఁ గాసారపుర మేలెడు రాజనఁగా విజయనగరపురాజొకఁడై యుండవలెను. అతఁ డెవఁడు?

కళాపూర్ణుఁడు సింహాసన మెక్కుటకుఁ బూర్వము కాసారపురరాజ్యవ్యవస్థ యీవిధముగ నుండినట్లు గ్రంథమందుఁ జెప్పఁబడియున్నది; కాసారపురం బేలుచుండినరాజు చనిపోఁగా దేశ మరాజకమైనది. అప్పుడు సత్త్వదాత్ముఁ డను మహారాష్ట్రప్రభువు నొకనిని మంత్రు లందఱు రాజుగా నెన్నుకొనిరి. ఆకారణమున సత్త్వదాత్ముఁ డాదేశమునకు రాజాయెను. అటుతరువాత సత్త్వదాత్ముఁడు కళాపూర్ణుని శౌర్యపరాక్రమాదిగుణవిశేషములఁ జూచి సంతసించి యాతని రాజును జేసి తా నాతనియొద్ద మంత్రియాయెను. విజయనగరరాజ్యములో నరసరాయనికొడుకైన వీరనృసింహరాయలు మరణించినవెంటనే యాతనికుమారులు పిన్నవారైనందున దేశ మరాజకమయ్యెను. అప్పుడు మంత్రియైన తిమ్మరుసు రాజ్యభారము వహించి దేశము దుస్స్థితికి రాకుండఁ గాపాడెను. తరువాత రాజ్యమునకు శత్రురాజులవలన నుపద్రవములు లేకుండ నిర్వహింపఁ గలసమర్థుని గొఱకుఁ బరికించిచూడ సచివవతంసుఁ డగుతిమ్మరుసునకు యౌవనప్రాయమున నున్నకృష్ణదేవరాయ లన్నివిధముల సమర్థుఁ డని పొడకట్టెను. అందుచేఁ గృష్ణదేవరాయని రాజుగఁ జేసి తా నాయనయొద్ద మంత్రిగ నుండెను.

౨. కళాపూర్ణుఁడు కాసారపురము వదలి క్రముకకంఠోత్తరపుర మను పుటభేదనముఁ గట్టి దానిని దనరాజ్యస్థానముగఁ జేసికొనె నని గ్రంథమం దున్నది. కృష్ణదేవరాయలు ప్రస్తుతము హాసపేట యనఁబడు నాగళాపుర మను నామాంతరము గలపట్టణమును గట్టి తనరాజ్యస్థానముగఁ జేసికొనె నని స్వూయెల్ దొరగారు వ్రాసియున్నారు. క్రముకకంఠోత్తరపుర మనఁగాఁ బుర శబ్దము కంఠశబ్దమున కుత్తరభాగముగా నున్నది. నాగళాపుర మనఁగాఁ బురశబ్దము గళా (కంఠమున) కుత్తరపదముగ నున్నది. కావునఁ గ్రముకకంఠోత్తరపుర మనఁగా నాగళాపుర మని యన్వయింపవచ్చు.

౩. కళాపూర్ణుని కిద్దఱు భార్యలు, మొదటిది యభినవకౌముది. ఆమె "తుషారకరకిరణజాప్సరోజాతికన్య". అనఁగాఁ జంద్రకిరణములవలనఁ గలిగినయప్సరః స్త్రీ. లేక చంద్రవంశపురాజకొమార్తె యని చెప్పనొప్పు. ఈమెను, మహిషాసురునిమాతులునకుమారుఁ డగుశల్యాసురుఁడు మొదట వరించెనఁట. అతనిని గళాపూర్ణుఁడు చంపి యామెను బెండ్లియాడెను. రెండవభార్య మధురలాలస. ఈమె మదాళయుఁ డను హైహయవంశజుఁ డగురాజుకొమార్తె. ఈమదాళయుని యుద్ధములో జయించి ఖైదిగాఁ బట్టుకొని యాయనకొమార్తెనుఁ దాఁ బరిగ్రహించెనఁట. కృష్ణదేవరాయల కిద్దఱు భార్యలు. మొదటిభార్య తిప్పాంబ లేక తిరుమలదేవి. ఆమె మహిషాసురపుర మనఁబడు మైసూరుదేశపురాజైనకుమారవీరశ్యామరాయలకొమార్తె. వీరు చంద్రవంశపువారు. కావున నభినవకౌముది తిరుమలదేవి యని చెప్పవచ్చు. కృష్ణదేవరాయని రెండవభార్య అన్నపూర్ణాదేవి. ఆమె కటకపురాధీశుఁ డగుగజపతిరాజుకొమార్తె. గజపతిరాజును యుద్ధమునం దోడించి యాతనికుమారుని నిర్బంధించి కొమార్తె యగు నన్నపూర్ణాదేవిని వివాహమాడినట్లు చరిత్రమందుఁ బ్రసిద్ధమైనవిషయమే గదా. కావున మధురలాలస అన్నపూర్ణాదేవి యని చెప్పఁదగు.

౪. కళాపూర్ణుఁడు జన్మతః క్షత్రియుఁడు కాఁడనియుఁ దరువాత కారణాంతరమున నాతనివంశము క్షత్రియవంశ మయ్యె ననియు గ్రంథమం దున్నది. ఈయంశము కృష్ణదేవరాయలకు వర్తించు నని పలువురకుఁ దెలిసినవిషయమే. కావున నీవృశంబు లగుముఖ్యకారణములచేఁ గళాపూర్ణునియందుఁ గృష్ణదేవరాయలను గవి యారోపించె నని నమ్ముట కవకాశము గలుగుచున్నది. ఐనను నీవిషయ మంతయు భావిపరిశోధనలచే నిర్ణయింపఁబడవలసియున్నది. కళాపూర్ణునికి సమానుఁ డగుచరిత్రపురుషుఁడు కృష్ణదేవరాయలుఁగాని లేక యా

తన తండ్రి నరసరాయలం గాని లేక మఱొకరిం గాని యెవరినైనను నొకమహాపురుషు నుద్దేశించియే తనగ్రంథమందుఁ జరిత్రాంశములఁ గవి యచ్చటచ్చట గుర్తించినాఁడని నమ్ముటకు సందేహ ముండఁగూడ దని నామనస్సునకుఁ దోఁచుచున్నది.

కళాపూర్ణోదయమునం దున్నయంతరార్థకథలు మూఁడును స[illegible]ంకంబుగ సవిశేషంబుగఁ దెల్పినాఁడ. ఇంక నీగ్రంథముయొక్క ప్రాముఖ్యమును గుఱించి యించుక వక్కాణించెద. సామాన్యముగ యుక్తియుక్త మగుకథ నొకటిని గల్పించుటయే కష్ట మైనపని. అం దొకయంతరార్థమునుగూడ మఱుఁగు పెట్టి కల్పించుట యంతకంటెఁ గష్ట మైనపని. కావుననే కదా కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయము—బనియనుయొక్క పిల్గ్రిమ్సుప్రోగ్రెసు—ఇత్యాదిగ్రంథములకుఁ గలిగినలోకప్రశస్తి. మఱియు మూలకథలో రెం డంతరార్థకథలను గల్పించినది భావనాతీత మైనయసాధ్యపుఁగృతి యని వేఱె చెప్పవలయునా? అట్టిగ్రంథ మింగ్లీషుభాషలో స్పెంసరుమహాకవియొక్క ఫైరీక్వీను (Fairie Queen) అనునొకటి మాత్రము కాన్పించుచున్నది.

ఇంక నీకళాపూర్ణోదయము నన్ననో యొకకథను గాదు, రెండుకథలను గాదు, మూఁడుకథలను బ్రత్యేకముగా మూలకథలో నిమిడ్చి యమ్మహాకవి కల్పించినాఁడు. ఇట్టి వాఙ్మయవైపరీత్యము, నిట్టిసారస్వతాద్భుతసంవిధానము, యోజించిచూడఁ బ్రాచీప్రతీచీవాఙ్మయప్రపంచమందు వేఱొకగ్రంథమందుఁ గానరా దని నే నెఱిఁగినంతవఱకు దృఢముగా నిస్సందేహముగాఁ జెప్పఁగలను. ఆహా! ఇట్టియత్యద్భుతకావ్య మాంధ్రవాఙ్మయమందు మాత్రమె చూడఁ గలిగెడు భాగ్యము, ఆకవిపుంగవుండును, రసికాగ్రగణ్యుండును, జ్ఞానవిజ్ఞానపారీణుండును, అతిలోకకార్యనిర్వహణదీక్షాధురంధరుండును నగుపింగళి సూరనార్యునికతమునఁ గాదె మనకు లభించినది! అట్టిమహనీయునికీర్తివల్లికలు దిగంతములకుఁ బ్రాఁకునట్లు చేయుటయే మన మామహానుభావునిపట్ల నొసంగఁ గల కృతజ్ఞతాపూర్వక మగుసేవ!!

టేకుమళ్ల అచ్యుతరావు.

శ్రీః

# పరిషత్పుస్తకభాండాగారము.

---

## ౧. నిఘంటుసారము. గ్రంథసంఖ్య. ౩౨౬.

ఇది యొకచిన్న నిఘంటువు. కృతికర్తపేరు నివాసస్థలము మొదలగునవి తెలియవు. నూటముప్పది గీత, కందపద్యములలో నొక్కొక్కపద్యమునకు నానార్థములు వ్రాయఁబడినవి. వీనిలోఁ గొన్నియర్థములకుఁ బ్రయోగములు మృగ్యములు. కృత్యాదిని గవి:—

ఉ. శ్రీకమలాకళత్ర సరసీరుహనేత్ర సురేశమిత్ర ర
త్నాకరగర్వభంగ కరుణామృతవీక్షణ ధాతృసన్నుతా
నీ కొనరింతు వందనము నీలపయోధరదేహ దేవ న
జేకొను సంస్కృతం బమరసింహము తెన్గున (జేయఁ) బూనితిన్.

క. తెలుఁగులమఱుఁగులు సంస్కృత, కలితములుగ నష్టభాషఁ గలశబ్దములన్
దెలియఁగఁ జెప్పెను ధరపై లలితోజ్జ్వలకావ్యకర్త లక్ష్మణమంత్రి.

అను రెండుపద్యములతో నవతరణిక వ్రాసి గ్రంథారంభ మొనరించెను.

క. రావణుఁ డనఁగను హంసయు, రావణుఁ డన మొసలి మేఘరవములు వనమున్
రావణుఁ డన రజతాద్రియు, రావణుఁ డన గౌరి హస్తి రావణుఁడు భువిన్.

గీ. గోవు పాదరసము కృష్ణమ్ము అమృతము, గోవు పంచదార గొల్లవాఁడు
గోవు యముఁడు దుఃఖకులశైలంబు రవికేరు, గోవు నందవాఁడు గోవు పేరు.

క. పొన్నలు పొగడాలసరులు, పొన్నలు తాఁబేళ్లు పచ్చపోఁగులు పరఁగున్
పొన్నలునిడుదమెఱుంగులు, పొన్నలుభ్రమరములుకురులుపొన్నలుపదియున్

ఇట్లే యంతట నున్నవి.

## ౨. బసవ(వృషాధిప)శతకము. గ్రం. సం. ౩౩౮౩.

పాల్కురికి సోమనాథకవి రచియించిన కృతులలో నిదియొకటి. ఇది వృషభాధిపావతార మగుబసవేశ్వరుని సంబోధించుచు రచియించిన శైవవే

చాంతపద్యశతకము. ఆంధ్రకర్ణాటసారస్వతమునం దీశతకము కర్ణాటభాషానువాదముగాఁ బరిగణింపఁబడినట్లు తోఁచుచున్నది. అది యట్లేని యావ్రాఁత ప్రమాదమని దీనివలనఁ దెలియనగును. ౧౦౭ ఉత్పలమాలావృత్తములు గలవు.

శైలికి:—

ఉ. సాత్త్వికఫలానివాస పరమోన్నతముఖ్యప్రతిభాసభక్తకై
లాస విశేషజంగమవిలాస శివైక్యసమాస సత్కృతా
యాస సమస్తభక్తహృదయాంబుజనిత్యనివాస ధిక్కృత
వ్యాస శరణ్యమందుము బసవా బసవా బసవా నృపాధిపా.

ఉ. ఉత్తమభక్తియుక్త భజనోత్సుకచిత్త యుదాత్తచిత్సుఖా
యత్త క్రియాప్రమత్త నిఖిలాగమవేత్త గుణోపయుక్తస
ద్వృత్త ప్రసాదభోగ సముదీర్ణవిశేషసుఖప్రమత్త భా
స్వత్తమ నీవె దిక్కు బసవా బసవా బసవా నృపాధిపా. శతకాంతమున.

చ. అకుటిలలీల జంగమసమగ్రదయాకలితప్రసాది పా
లకురికి సోమనాథుఁ డతిలౌల్యమునన్ బసవన్న దండనా
యకునకు నొప్పు నీశతక మర్పణచేసె నలిం బఠించువా
రికి వినువారికిం గలుగు శ్రీయును నాయువు భక్తి ముక్తియున్.

3. రామహృదయము. ద్విపద. గ్రం. సం. 3౮—౨౪.

ఈ చిన్నగ్రంథము వేదాంతవిషయమును బోధించునది.

ద్వి. "శ్రీమందిరంబయి చెలువొందు పరశు, రామపంతులవంశ రత్నాకరమునఁ
బొడమిన శ్రీరామమూర్తి యూహించి, పడఁతులు గడతేరుపథ మిది యనుచు
హితముగా శ్రీరామహృదయంబునొక్క, గతిఁ బాటగాఁ జెప్పె ఘనులార వినుఁడి."

అనువాక్యములచే నెవ్వ రేయుద్దేశమున రచించిరో విదితముగదా? ఇది యాఁడువారికొఱ కుద్దేశింపఁబడినది. భాష మృదులముగా సలక్షణముగ నున్నది. శైలిం దిలకింపుఁడు.

"భవ్యుఁ డిట్టులనియె నోపణంతి మము న్నెవ్వ, రవని నీయర్థ మిట్లడుగంగలేదు
నీలసద్భక్తిచే నీవు మమ్మడిగి, తాలపు [illegible]
నడుగంగఁ బడితివి నది యేర్పరింపఁ, గడురహస్యంబును [illegible]

మయినరామునకుఁ జయ్యెన నమస్కృతులు, నియమించి చెప్పెద నీకునాయర్థ
మవధానమతి విను మని పార్వతికిని, శివదేవుఁ డిట్లని చెప్పంగఁ దొణఁగె
సఖియరో వినురామచంద్రుండుపరమ,సుఖమయుండాద్యంతశూన్యుఁడద్వైత
పరిదృశ్యభేదుండబాధ్యుండజుండు, పరమాత్మభూతుండుప్రకృతికిఁబరుఁడు.
ఇట్లే యంతటను మృదుమధురముగ వెలయుచున్నది. ఈకవి జీవితచరిత్ర
మాంధ్రకవులచరిత్రమునందు వివరముగ వ్రాయఁబడియున్నది.

౮. స్వాత్మారామశుకసారము. గ్ర. సం. ౩౮-౨౧.

ఇది గురుశిష్యసంవాదరూప మయిన యొక వేదాంతగ్రంథము. కృతికర్త పేరు తెలియలేదు. మొదటియాకు విఱిగినది. చివరఁ గొంతగ్రంథము లేదు. భాగవిభాగము లేదు. దీనియందుఁ గేవలము గురులక్షణము గురుమహత్త్వము గురుసపర్య, గురువే మోక్షదాత యనువిషయములు గద్యపద్యములలో వర్ణింపఁబడినవి.

సీ. శ్రీగురునాథ నాచేయువిన్నప మొక్క టాలించి వినియు నన్నాదరింపు
తాపత్రయానలతప్తాంగు నన్నావిఁ జేపట్టు గురుభక్తిసీమఁ జేర్చి
యంతట దేశికాచారంధర్మం బిట్టి దని యెఱింగించి యానతి యొసంగి
నట్టిప్రచారంబు నాచరింపంగఁ నీవు డొక్కసంశయమును బిక్కటిల్లె
గురుని నేమనిపూజింతు గురువరేణ్యుఁ, డెట్టివాఁ డని యేనిర్ణయింతుఁ జూతు
నెట్లు భజియింతునిశ్చయం బెఱుక లేక, మానదీతహాతహానాదుమదినిస్వామి.
గీ. అంగముల స్పర్శ లర్పించి నట్టి స్పర్శ, సంగతిన వచ్చు మానససౌఖ్య మైన
ఘనప్రసాదానుభవవార్థిఁగనియానందుఁ, దేలుచును మోదమునను౦డుధీరచరిత.

పద్యములందు ను గద్యములందును వఱచుగా నుస్సంధులు నపశబ్దములును గలవు.

౯. వివేకసారము. గ్రం. సం. ౩౯౯౯.

దీనిని రచించినకవి పరశురామపంతుల రామమూర్తి. సీతారామాంజనేయసంవాదము రచించిన లింగమూర్తి యీకవిజనకుఁడు. తల్లి లింగాంబ. ఈతఁడు తనతండ్రికడనే విద్యాభ్యాస మొనరించినవాఁడు. ఆంధ్రకవులచరిత్రమున నీతని శుకచరిత్రము మాత్రము పేర్కొనఁబడినది. అది కాక యీవివేకసార మొకటియు రామహృదయ మొకటియు (ద్విపద) యీతనివి మఱి రెండగపడుచున్నయవి. ఈతఁడు తనగురుసంప్రదాయము ని ట్లభివర్ణించియున్నాఁడు.

సీ. శ్రీమదఖండసచ్చిత్సుఖాత్ముం డొప్పు సద్వి దత్తాత్రేయయోగి యనఁగ
సద్విదత్తాత్రేయయోగికి శిష్యుఁడై తనరారె శ్రీజనార్దనగురుండు
తనరారు శ్రీజనార్దనగురూత్తమునకు శ్రీమహాదేవమూర్తి శిష్యుఁడయ్యె
క్రమదేవమూర్తిశేఖరునకు (శిష్యుఁ) డైయుండె శ్రీనరహరిగురుండు
అతనిసేవఁ జేసి యవనినాగోరామ, గురుఁడు శిష్యుఁడయ్యెఁ గోరి యమ్మ
హాత్మునకును శిష్యుఁడగుచు శ్రీకోనేరు, గురువరుఁడు వెలసెఁ గోమహిమగులఁ.

గీ. అట్టి కోనేరుగురువరుల నభినుతించి, శ్రీమహాదేవగురుమూర్తి శిష్యుఁడయ్యె
శ్రీమహాదేవగురుమూర్తి సేవఁజేసి, శిష్యుఁడై లింగమూర్తి భాసిల్లె నెపుడు.

గీ. అమ్మహాలింగమూర్తికి నిల్లాలు లింగ, మాంబ వారికిపుత్రకు నేనగ్రజాత్మ
జుండ సంబాలరామాహ్వయుండఁ బరశు, రామపంతులవంశవర్ధనుఁడ నేను.

క. సేవించితి జనకుని గుణి, గావించితి భక్తి గురులఁ గా వారికటా
క్షావేశంబునఁ గంటి మ, హావాక్యార్థానుభవము నపరోక్షముగాన్.

అని పైని వర్ణింపఁబడిన గురుపరంపర కేవలవిద్యాసంబద్ధమే కాక జన్మ సంబద్ధము గూడ నగునేమో యని తోఁచుచున్న యది. ఇతఁడు తనతండ్రిని మహాయోగిగాను ముక్తునిగాను బరమాత్మునిగాను బదిసీసపద్యములలో విశేషించి వర్ణించియున్నాఁడు. అందొకపద్య మీక్రిందఁ జూడనగును.

సీ. వినువాఁడనేఁ గాని వీనులు నేఁగాను వినువాఁడ ననియెడివృత్తిఁ గాను
సోఁకువాఁడను గాని సోఁకుడు నేఁగాను సోఁకితి ననువృత్తిసొబగు గాను
గనువాఁడనేఁ గాని కన్నులు నేఁగాను కనువాఁడ ననువృత్తిగతియు గాను
తినువాఁడనేఁ గాని తినుజిహ్వ నేఁగాను దినువాఁడ ననెడివృత్తియును గాను
మూర్కొనెడువాఁడనేఁగానిముక్కులేను, గానుమూర్కొంటిననువృత్తిగానటంచుఁ
దన్నుఁ గనవలె నని చెప్పు ధరణి నెవ్వఁ, డమ్మహాలింగమూర్తి నేనాశ్రయింతు.

ఈతఁ డీగ్రంథమును శ్రీరామున కంకిత మిచ్చెను. శైలి తెలియుటకై కొన్ని పద్యములు.

క. సతిపుత్రపౌత్రహితసం, తతి తను వెనువెంటఁ దగిలి తగనవ్వుచు వె
ట్రితనంబు సేయఁ బొడఁగని, సతతము గుందించుచుండు జర మై నొదవన్.

క. భోగేచ్ఛలు మదిఁబొడమిన, బాగుగ భుజియింపలేక పలుదుఃఖములన్
దూఁగుచు లోఁగుచు వేఁగుచు, రోగంబుల నీఁగుచును నరోచికము గదే.

క. జలజల నవరంధ్రంబుల, వలసను మలములు స్రవింప వార్ధకమందున్
దలపడి బలుదుర్గంధము, లొలుకఁగఁ గ్రుళ్ళెడునరక మోజగదీశా.

చ. మగువల మేను మటంచు నభిమానము నొందుదు రెప్పు డెప్పుడా
మగువల కెల్ల నాతిశయమూర్ఖములన్ గృహారమ్యంబునన్
దగుపచనక్రియాదికవిధానములం బతి సేవలన్ దృఢం
బగుచుఁ బ్రవృత్తి రాగముఖరాకృతులై కనుపట్టుఁ జూడఁగన్.

ఈగ్రంథము నాలుగాశ్వాసములు, విషయము క్లిష్టమైన దైనను గవి స్వప్రతిభావిశేషమునఁ దేటతెల్లముగ సులభశైలిని రచించెను.

౬. అష్టమహిషీకళ్యాణము. గ్రం. సం. ౩౮—౨౦

ఇది యొకద్విపదకావ్యము. శ్రీకృష్ణుని యష్టభార్యలయొక్క వివాహము లిందు వర్ణింపఁబడినవి. ౫ ఆశ్వాసములకావ్యము. ఈకృతిని తాళ్లపాక చిన్నన్న నాఁబడు తిరువేంగళనాథుఁడు, అలమేలుమంగాంబకు సమర్పించెను. ఈకవినిగుఱించియు నీతనివంశముగూర్చియు లోకమునందు,

క. చిన్నన్న ద్విపద కెఱఁగును, బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱఁగున్.
మిన్నంది మొఱసె నరసిం, గన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్.

అనికలదు. ఇందలిచిన్నన్న యీకవియే. పెదతిరుమలయ్య యష్టమహిషీకల్యాణములోఁ దాళ్లపాకవారిమూలపురుషుఁడగునన్నయాచార్యులుగా,

వనజాతజాతసద్గోత్రేంద్రమూర్తులు, గన లేనివేంకట గ్రావాధినాథు
పదములు శోభనాస్పదము లౌ రనఁగ, పదములు నిజాంఘ్రిపద్మములనఁ
గనఁజేసి పంచమాగమసార్వభౌముఁ, డనఁ బ్రసిద్ధికి నెక్కి యఖిలవిద్యలను
నన్నయాచార్యుండయ్యెఁ దాళ్లపాక, యన్నయాచార్యుఁ డాయనతఁడర్థిఁ జెలఁగ.

అని వర్ణింపఁబడిన యాతఁడా; కాక యిక్కడి యన్నయా; యని సంశయము. తాళ్లపాకవారిపదములు రాగిరేకులమీఁద వ్రాయఁబడినవి శ్రీతిరుమలమీఁద నొకయఱలోఁ భద్రపఱుపఁబడియున్నవి. నరసింగన్న యనువాఁడు.

"పాడఁ జెప్పఁగ వర్ణపద్ధతి నీడు, జోడు లేఁడని సభ జొచ్చి వాదించి
పరఁగినధీశాలి, ప్రతివాదిదైత్య, నరసింహుఁడనఁగల్గె నరసింహగురుఁడు",

అని వర్ణింపఁబడినవాఁడే కావచ్చును. ఈనరసింగన్న కిరువురు భార్యలు. ప్రథమభార్య నాచారమ్మ. ఈమెకు నారాయణుండనను, అనంతాంబయను అక్క

లార్యుండు నన్నయాహ్వయుండనం బుట్టిరి, తరువాతఁ దిరుమలాచార్యుఁడు జనియించెను. ఆతిరుమలాచార్యుఁడు.

వేదాంతవిద్యాప్రవీణుండై యంధ్ర, వేదాంత మొనరించె ద్విపదరూపమున
హరివంశకావ్య మాయుత్తరపుస్ఫూర్తి, హరివంశ మిగులొత్త ననువొందఁ జేసి
చక్రవాళములోన సరి లేనవంగఁ, జక్రవాళముగ మంజరి రచియించి
శ్రుతులచిక్కులు దీర్చు శుకతాతవోలె, సతతశేషఘకారసరణు లేర్పఱిచి
సంగీతసాహిత్యసార్వజ్ఞకత్వ, మంగళసామ్రాజ్యమహితుఁ డై యలరె.

అనునీవిషయము పరిషత్పాఠకులకు విదితమే. తిరుమలాచార్య నిల్లాలు తిరుమలాంబ.

అరుదంద నయ్యింతి యలపంచకన్య, లసువులు నా నొప్పుతనయరత్నములఁ
జాయతరాష్ట్రభాషాచక్రవర్తి, ధీరునిఁ జినతిమ్మదేశికోత్తముని
సన్నిపద్యాలయుం దనరామునున్నింటి, యున్నయాహ్వనిబోలు నన్నయాచార్యు
సాత్త్వికశుభమూర్తి సంగీతసత్కృ, విత్త్వాధికుని దిరువేంగళాహ్వయుని
జయయుతశ్రీలబ్ధసహజకవిత్వ, నయుఁ దిరువేంగళనాథుని నన్ను
సదమలవిద్యావిశారదు లోక, విదితుని గోనేటివేంకటనాథుఁ

గనియె. అనువాక్యములంబట్టి యిక్కవివంశాదికము సమగ్రముగఁ దెలియుచున్నది. ప్రకృత కృతికర్త కగ్రజుఁడగు తిరువేంగళనాథుఁడు "చిన్నన్న ద్విపద" చాటువున వర్ణింపఁబడిన "పెదతిరుమలయ్య" యయినను గావచ్చును.

ఈకవి తన్నుఁగూర్చి ........ కావ్యంబుచెప్పి, యెనలేనిశ్రీవేంకటేశు మెప్పించి
సకలంబు నెఱుఁగ నసాధారణాంక, మకరకుండలము లిమ్మహిఁ గొన్నవాఁడఁ
దినములోననె వేయిద్విపద లింపొంద, వినుతవర్ణనలతో విరచించువాఁడఁ
గవిశిరఃకంపయోగ్యప్రతిద్విపద, నవబిరుదాంకుండ....

ఇట్లని పీఠికయందు నుడివియున్నాఁడు. మఱియుఁ బ్రత్యాశ్వాసాంతము ననుగూడ

"శుంభ; దనుపమశ్రీవేంకటాధీశదత్త,
మకరకుండలయుగ్మమండితకర్ణ, సుకవిజీవంజీవసోమ రాజీవ
సదనావధూలబ్ధసరసకవిత్వ, విదితమానసతిరువేంగళనాథ
విరచితం బగు.

అనియును జెప్పుకొనుటంబట్టి వేంకటాధీశుఁ డితనికి మకరకుండలములిచ్చి నట్లు స్పష్టము. ఈవేంకటాధీశుఁడు చంద్రగిరిప్రభువో, ఘణేంద్రగిరి ప్రభువో,

కవులచరిత్ర మిక్కవి కృష్ణరాయలకాలమునాఁటివాఁ డనుచున్నది. దానినే రామకృష్ణుని చాటువు బలపఱుచుచున్నది.

ఇక్కావ్యమున ద్విపదలక్షణ మీక్రిందిరీతిం జెప్పఁబడియెను.

"వాసవుల్మువ్వురు వనజాప్తుఁడొకఁడు, భాసిల్లునదియొక్కపదము శ్రీకాంత [దు
క్రమమునవీనాల్గుగణములనిడుచుఁ, గ్రమదూరముగఁబ్రయోగము సేయరా
ఆపాదమునకు మూఁడవగణంబు బాది, దీపించు యతి యంబుధిప్రియతనయ
యుపమింప నవి ప్రాసయుతములై రెండు, ద్విపద నా విలసిల్లె వికచాబ్జపాణి
ద్విపదకు ద్విపదకుఁ దెగఁజెప్పనలయు, నెపుడుసంస్కృతమున నితరభాషలను
యతులలోపలఁ బ్రాసయతిదప్పసకల, యతులు చెల్లును బ్రయోగానుసారమున
ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద, మపుడు రెంటను గూర్ప నది యయుక్తంబు
మఱియు సంస్కృతపుసమాసరూపమున, నెఱయ నెన్నిటినైన నిర్మింపఁదగును
దెనుఁగునఁగూర్చిన ద్విపదయంత్యమున, నొనరఁ గ్రియాంతసముచ్చయాంత
దనరున కారముత్వముఁగూడెనేని, వినుతింపనుత్తరద్విపదాదియందుఁ [ముఁలఁ
గొనకొన్న స్వరముతోఁగూడఁగాదంచు, నొనరింపసుకవీంద్రులుత్ఖండమంద్రు
అరసున్న నొనఁగూర్ప నను పైనహల్లు, గరిమ నీద్విపదాదిఁ గనుపట్టెనేని
తొలివిభక్తికిఁదక్కఁ దుదివిభక్త్యంత, ములు నకారములును ముకురబింబాస్య
యానకారము చెల్లు నరసున్నయగుచు, నానీలకచభృంగ యలమేలుమంగ
యనులక్షణంబుల ననువొంది సుకవి, జనసుప్రయోగైకశరణమై నిఖిల
జగదేకనుతవిరాట్ఛందోవతీర్ణ, యగుచు నీద్విపద విఖ్యాతిఁ జెలంగు."

శైలికై కొన్నిద్విపదల నిం దిచ్చుచున్నారము.

మెరుపులు చుట్టిన మేఘపోతముల, మురువునఁ గటిసూత్రములు దేజరిలుచు
సురగిరివళితభాసురతారకాళి, సరవిమై మొలలఁ బూసలపేరు లమర
నాగబాలకులు చందనశాఖలందు, బాగొప్పుగతిఁ గరఫణిపూస లమరఁ
దనయందు నుదయించుధవళాంశుతునుక, లనఁబులిగోరు లింపారంగఁదాల్చి
హరిదశ్వుఁ డబ్దంబులందు బింబించు, గరిమతో రావిరేకలు తేటపడఁగ
ఖరుఁ గరసుఁజంప నేకతమాడుశీత, కరభానులనముద్రికాయులు చెలఁగ. ౧ ఆ.
వ్రజములో వల్లవవ్రజములో నపుడు, వ్రజపతి మనము దేవప్రభుఁ గూర్చి
యాగంబు గావింత మని సర్వవస్తు, యోగంబుకొఱకు నుద్యుక్తుఁ డైయున్న
దేవకీతనయుఁ డేతెంచి యానందు, భావంబుఁ దనయాత్మ భావించి పలికెఁ
గాలాత్మకుఁడు హరిగొనఁ దదాజ్ఞఁ, గాలకాలమునఁ దత్కర్తధర్మములు

చేకూంప నింద్రుఁ బూజించినవిూఁదఁ, గాకతాళన్యాయగరిమ వర్తించు
సురపతిఁ బతి యంచుఁ జూతునుగాని, హరి జగత్పతియని యరయ కెవ్వనను
బరమాత్మ విలసనభవనంబు లైన, సురభుల గిరుల భూసురుల నర్చించు
యాగంబు మేలో యాకాశాధినాథు, యాగంబు మేలో మీఁరరసికగ్గౌనుఁడు,
౨ ఆ.

అరయ నగ్గలమయ్యె నారాత్రి రాత్రి, పరుఁడు వేడుకరవతా వరుఁజూచినిలువ
వనజాక్షు నెదుటజీవనజాక్షి యొకతె, యనువుగానపుడు మోహనముగానిలిచి
మధ్యమాదిగ్రామమండితంబుగను, మధ్యమేళము సింహామధ్యమేళముగఁ
గీలించి యొసఁగెఁకిన్నెరమరుని, వాలుచేతుల నేటవాలుగాఁ బూని
గురునుంజరులఁ దేఁటిగుంపు వైకొసిన, సరవిఁ గిన్నెరకాయ చనుదోయిరాయ
మేలిమియగుతంత్రిమీఁటిచొక్కముగ, నాళవియొనరించియవగడంబుగను
బెళుకుతాళములతో బెడఁయసాంపరయ, బలసోదరునిమీఁదిపదముజక్కిణియు
వన్నెగా మిన్నగా వలువగా మిగులఁ, దిన్నఁగా నున్నగాఁ ఢేటగా మించ
మిన్నగాఁ జల్లఁగా మీటుగా సొలసి, వెన్నునిహృదయంబు వికసింపఁ బాడ
నలరుచు భళి భళి యనుచు నారీతిఁ, బులకింప నొసఁగెఁ గప్పురపువీడియము
విడువక పోరిఁ ద్రివిక్రమాగ్రజుఁడు, కడు రేసి వైరిచక్రంబుపై నుఱికి ఆ.౬.

పటుతరకరిఘటానిటలతటములు, చటులాశుగములచేఁ జక్కుసేయుచును
రంగదుత్తుంగతరంగసంఘముల, బ్రుంగుడుసేయుచు భూపాలవరుల
శిరములు వక్షము ల్చెక్కులుఁ దొడలు, కరవాలశరచక్రగదలఁ జిత్రముగ
దఱిగి నాటించి విదారించి కొంటె, యుఱిముఱి దశదిశలందు నింపుచును [ను
స్ఫుటహాలంబునుబలంబునుజలంబలరఁ, జఱులవహాసలపుఁగౌశలముఁజూపుచు
బ్రథనసంభృతవిజృంభణభీషణాంక, రథులరథాళిసారథులఁ జెండుచును. ఆ.౮.

పరిషత్పుస్తక భాండాగారమున నీపుస్తకములు రెండు గలవు. ఒక్కటి మైసూరులోనుండి శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు పంపించినది. రెండవది, అనంతపురము మండలములో సంపాదింపఁబడినది.

శ్రీరస్తు.

# గ్రంథస్వీకారము.

౧. మాయావిని:—

ఇది పాంచకడీదేవు వంగభాషాగ్రంథమున కాంధ్రీకృతము. ఇదివఱ కాంధ్రప్రచారిణీ గ్రంథమాలలోఁ బ్రకటింపఁబడిన, మాయావి, మనోరమ, యనునవల కుపసంహారమఁట. కావున మూఁడుపుస్తకముల నొక్కసారిగఁ జదివిన సంఘటనావైచిత్రము బోధపడఁగలదు. వె అణాలు ౧౨

౨. శ్యామల:—

ఇది నిడుబ్రోలులో నున్నయొకచింతచెట్టుక్రింద నున్నకొన్నివిగ్రహము లంగూర్చి జను లనుశ్రుతముగఁ జెప్పికొనుకథను మూలముగఁ గొని తగురీతిని గథ కల్పించి పెంచి వ్రాసిననవల. రచయితలు వేంకటపార్వతీశ్వరకవులు. ఇయ్యది ఆంధ్రప్రచారిణీగ్రంథమాలలోని ౨౬వ ప్రచురము. దీనివెల రు. ౧ ౮ ౦. ఈ రెండుపుస్తకములను వలయువారు రాజమహేంద్రవరములో నున్నయాంధ్రప్రచారిణీగ్రంథమాలాధిపతులకు వ్రాసి తెప్పించికొనవలయును.

౩. ప్రణయమహిమ:—

ఈచిన్నపుస్తకము ౧౪౪ గీతపద్యములతో ఒల్లూరి మున్సిపల్ హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయు లగు బ్ర శ్రీ. చింతలపల్లి నరసింహశాస్త్రిగారిచే రచింపఁబడినది. ఒకఁడు చిన్నతనమున ననేకగ్రామములలో ననేకకష్టము లొంది విద్య సంపాదించి యొకపాఠశాలయందు నుపాధ్యాయుఁడై వివాహకాలమున నమరి యనుకూల యగుభార్యతోఁ గాఁపురము చేయుచుఁ బిదప సంతోష మాసన్న మగుకాలమున నాభార్య మరణించుటకు దుఃఖితుఁడై తద్వియోగవేదన సహింపలేక తనబాల్యమునుండి పడినయిక్కట్లను మధ్యకాలమున ననుభవించినసుఖమును బై ననుభవింపవలసినబాధలను గ్రుచ్చిగ్రుచ్చి చూపోయినవిధ మిందు వర్ణితవిషయము.

కరివేముపాడు. ప. ౭౭. కరివేఁపపాడు యనుటకు. ఊరుబిండికిఁదలఁచి నూటల్లూరు. ౩౮౫. తలఁచిన నోట నూటల్లూరుననుటకు. పండ్లమిరప్పడి. ౩౯.

మిరెపపొడి యనుటకు. ఎత్తుకెత్తు పచ్చిమిరపకాయ వేసి. రంప. కాయలు వేసి యనుటకు. ఇట్టినెఱసు లున్నను సామాన్యముగా నెల్లరకు నెంతయో జాలినిం గొలుపువిషయ మిందుఁ గలదు. ఇందలిరసము విప్రలంభశృంగార మని శాస్త్రి గారు వ్రాసిరి. ఆలంకారికు లిట్టిచోటులఁ గరుణరస మని చెప్పిరి. వియుక్తులకుం బునస్సమాగమము గలుగదేని యటఁ గరుణమే రసము. దీనివెల అణాలు, ౨

౪. ఈశ్వరస్తవము:—

ఇదియుఁ బైవారిచేతనే రచింపఁబడిన నూటుప్పత్తపద్యములు గలపొత్తము. భక్తివైరాగ్యాదులం దెల్పును. శైలి కొక్క పద్యము.

శా. ఆరోపించి తదన్యధర్మముల మాయాదూరు నెవ్వాని బల్
ఘోరుం డంధుఁడు మూఁగ మూఢుఁడు గడుం గ్రూరుండు స్థూలుండప
స్మారుండు బధిరుండు రోగి కృశుఁ డున్మత్తుం డటంచున్ భువిన్
సారాసారవిదూరు లంద్రు మము నా సర్వేశ్వరుం దేలుతన్.

దీనివెల అణా ౧. వలయువారు బల్లారిలో నున్న గ్రంథకర్తగారికి వ్రాసి కొనవలయును.

౫. సంగ్రహరామాయణము.—

ఇయ్యది పర్లాకిమిడిలో నున్న శ్రీ. బం. వెంకటరత్నమ్మగారిచే రచింపఁబడిన రామాయణసంగ్రహవచనము. మ శ్రీ. వావిలికొలను సుబ్బారావుగారు రచించినయాంధ్రవాల్మీకిరామాయణముం జదివి బాలురకును స్త్రీలకునుం గూడఁ దెలియునట్లు సులభశైలిని వచనముగా వ్రాసితి నని రచయిత్రి వ్రాసినది. ఆమె తలంపు చక్కఁగ నెఱవేఱినదని మాయూహము. భాష మృదులముగఁ జక్కఁగ నిర్దుష్టముగనున్నది. ఇందలిభాషాశైలి ప్రకృతము గ్రంథకర్త లగు ననేకపురుషుల రచనాశైలికిఁ దీసిపోదు. గ్రంథప్రణేత్రు లగుస్త్రీలలో నీమె కూడ నస్మత్ప్రశంసకుఁ బాత్రురాలు. ఈపొత్తము ప్రణేత్రీతనయుఁడు శ్రీ. బంకుపల్లి శంకరనారాయణ శర్మగారిచేఁ బరిషత్తున కొసంగఁబడినది. దీనివెల అణాలు. ౮ వలయువారు పి. సత్యనారాయణగారు. రాజవీధి. పర్లాకిమిడి, గంజాంజిల్లా. అను చిరునామకు వ్రాసికొనవలయును.

౬. గీతమాలిక.—

ఇది ౬౪ గీతపద్యములతో నొప్పి తేటమాటలతో నీతిని బోధించు చిన్నపుస్తకము. దీనిని రచించినకవి "కార్వేటినగరాస్త్రకవులలోనివాఁ డగు

ముడుంబి వేంకటకృష్ణమాచార్యుల కుమారుఁ డగు వేంకటరమణాచార్యులు, అష్టావధాని మైనంపాటి హనుమంతరావుగారు దీనిని టీకతోఁగూడఁ బ్రకటించినారు. కవనశైలి మృదులము. ఇది రచించుటలోఁ గవి యొక్కొక్కపాదమున నకారాదిగా నొక్కొకయక్షర ముండవలయు ననునియమమవలంబించుటం జేసి కొన్నియలాక్షణికరూపములును గ్లిష్టపదములును నిండఁ బడినవి. వేమనశతకమువలెనే యిందును నన్నియు నీతిబోధకవాక్యములే కలవు. శైలి.

గీ. సరసుఁ డనఁగ మెలఁగ జను నింగితజ్ఞత, సాహసంబుపనికిఁ జనదు కడఁగ
సింధునేను దాఁటఁ జేర్పుము చిత్తంబు, నీను పొగడునట్టిచేఁత యొప్పు.

గీ. టూకిగాక తొలి నుడువఁ దగు విషయంబు, టెంకి నుండఁ జనదు బింక మాడ
టేకుమ్రానునొక్కచీఁకుమ్రానునుజోడె, టోకుగాదుగొప్పమూఁకతోడ.

వీనిలో మొదటిపద్యమున, సింధువేని, యనియు, రెండగుపద్యమున టూకిగాఁగ, టెంకినుండి, యనియు సవరించిన సంశయచిహ్నము లుంపఁ బనియుండదు. వెల అణాలు. ౨ వలయువారు అష్టావధాని మైనంపాటి హనుమంతరావుగారు, కేర్ ఆఫ్ సాల్టు సబ్ ఇన్స్పెక్టరు, కోట, వయా గూడూరు. ఎమ్. ఎస్. ఎమ్. ఆర్. వే. అనువిలాసమునకు వ్రాసికొనవలయును.

౭. ప్రహ్లాదచరిత్ర.—

పిఠాపురములోని ఆర్. సి. హెచ్. హైస్కూలు సహోపాధ్యాయులగు మ.శ్రీ. జనమంచి సీతారామస్వామిగా రీపుస్తకమును రచించినవారు. దీనిపేరివలననే యిందలివిషయము పెల్లరకుఁ దెలియును. ఇందలిభాష పేశల మగువచనరూపమునఁ దేటతెల్లముగా నున్నది నడుమనడుమ నాంధ్రభాగవతములోని పోతనామాత్యునిపద్యములు గలవు. ఈభక్తిపూర్ణమగు పుస్తకమును బ్రకటించుటకై పద్మనాయకవంశ్యులు మహాంధ్రభాషావిశారదులు దేశాభిమానపూర్ణులు నగు శ్రీ. రావు వేంకటరావుగారు ధనము నొసంగిరఁట. గ్రంధము జనాదరపాత్ర మగునది. కవితాశైలి.

శా. నీపద్యావళు లాలకించుచెవులు న్నినాదువాక్యంబులు
న్నీపేరం బనిసేయుహస్తయుగము న్నీమూర్తిపైఁ జూపుల
న్నీపాదంబులపొంత మ్రొక్కుశిరము న్నీసేవపైఁ జిత్తము
న్నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణ న్నీరేజపత్రేక్షణా.

ఈపోత్తము గ్రంథప్రణేతచే నాంధ్రదేశభాషాభివృద్ధులం గోరి స్థాపింపఁబడిన దేశసేవాగ్రంథమాలలోని ప్రథమకుసుమము. ఇట్టిపుష్పము లనేకకములు కమ్మందావుల నెల్లెడల వెదచల్లుచు నీమాలిక చిరకాలము దేశీయుల కంఠముల నలంకరించుఁగాత. గ్రంథము వెల అణాలు ౬. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాసికొననగును.

౮. దీనకల్పద్రుమము:—

ఇది బాలకవి శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారిచే రచింపఁబడిన యిరువదేను పద్యములకూర్పు. ఈ పద్యములకు "దీనకల్పద్రుమా" యను మకుట ముంపఁబడినది. ఈ మకుటమున మహాత్మ్యాతిశయవివక్ష కనఁబడదు. బాలకవికవిత కావున దోషములు గలవు. దీనివెల ౧ అణా. వలయువారు కర్నూలునివాసు లగుకవిగారికి గాని, దోమా గోవిందప్పశ్రేష్ఠిగారికిఁ గాని వ్రాసి తెప్పించుకొనవలయును.

౯. రూపావతీ:—

ఇది సంస్కృతభాషలో ౧౩౨ శ్లోకములతో వ్రాయఁబడిన చిన్నకథ. తిరుపతి హైస్కూలు ప్రధానోపాధ్యాయు లగుశ్రీమాన్ కపిస్థలము కృష్ణమాచార్యులుగారు దీనిని రచించిరి. ఇందు రూపావతి యనురాజకన్యక వనమందు విహరించుచు నందొకక్రీడామంటపమునఁ గల రాజకుమారుల ఛాయారూపములఁ జూచి యందొకసుందరుని వలఁచి యభీష్టసిద్ధి నొందినకథ వర్ణింపఁబడినది. ఇందలివర్ణనములు భాషాశైలియు సముచితములు. మృదులములు. ఉదాహరణము.—వసంతే.

శ్లో. కుసుమేషు కృతనివాసా, ఝుంకారమిషేణ మధులిహో మాలీః
కుసుమేషు కలా మతులా, ముపాదిశత్పథికనిచయానామ్.

శ్లో. మధుభరితకుసుమశోభిత, విటపాగ్రా భూరుహాస్తదా రేజుః
పానీయచషకహస్తా, భృత్యా ఇవ దిక్షు మదనస్య.

వెల ౧ అణా. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాసికొనఁదగును.

౧౦. మృషాముషీ:—

ఇది యొకచిన్నసంస్కృతచంపువు. చిత్తూరుజిల్లా మదనపల్లిలో బోర్డు హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయు లగుబాలకవి కాశీభట్ల కృష్ణరాయశాస్త్రిగారిచే రచితపఁబడి, అనకాపల్లినివాసులు, వైశ్యులు నగు ఉప్పల వెం

వేంకటరమణగారి ధనసాహాయ్యమున ముద్రింపఁబడినది. గణపతిచతుర్థినాఁడు చెప్పికొనుకథయే దీనిలోనివస్తువు. ఈవస్తువునే యీకవిగారిదినఱ కాంధ్రభాషలో శ్రీకృష్ణకవియను పేరితోఁ బ్రకటించియున్నాను. పుటలు ౨౯. రచనము ప్రౌఢముగానున్నది. కాని సందేహము లధికముగఁ గలవు.

ఉదాహరణము:—

౧. ఈశ్వరఃకోపాత్ శేకేనాస్తంగమితవినష్టస్తషుణా ద్బాలస్య ద్వారాలవాలస్య ........శిరశ్ఛిచ్ఛేదహ.

శ్లో. దృశ్యతేహి పురాణేషు, సర్వత్ర తదహంవక్ష్యే
శ్యామంతకంచరిత్రంతు, సంక్షేపతస్సతాం తుష్టమ్.

శ్లో. గుణచ్యుతిశ్చంచలనా న తేషు, బాణే నభూదృష్టిషు కేవలంస్యాత్
దరిద్రతా త్వన్మధ్యసుభాగధేయా, శ్రీద్వారకాధిష్ఠితదేవతా కిమ్.

కవిస్వవిషయమును.

శ్లో. కాశీభట్టకులాంబురాశివిధునా హయాంధ్రగీర్వాణనా
క్స్వారీణేన గజాననస్యచరితం నిందాపహం పుణ్యదమ్
వింశత్యబ్దవయోఽతిబాలకవినా ........

అనుశ్లోకములతో మూఁడుల్లాసములకును జివరలఁ జెప్పికొనియెను. దీనివెల అణాలు. ౬ వలయువారు గ్రంథకర్తగారికి మదనపల్లి వ్రాసికొనవలయును.

# విజ్ఞాపనము.

మహాశయులార!

కఱవు తన మహిమమునంతను ముద్రాక్షరశాలలపైఁ జూపుచున్న యీ దినములలో స్వకీయ ముద్రాయంత్రములుగలవారికే తొట్రుపాటు కలుగుచున్నది, పరవశులగువారి మాట యెత్తనేల. రౌద్రిసంవత్సరము ప్రారంభించిన మూఁడునాలుగు నెలలకుఁగాని సిద్ధార్థి కడపటిసంచిక వెలువడు నవకాశము లేకపోయినది. కాలమును బట్టి నాలుగైదు సంవత్సరములనుండి మాపత్రిక కార్యము లన్నియుఁ జక్కఁ బెట్టుచున్న ముద్రాయంత్రశాలవారిని విడిచి వేఱొక క్రొత్త ముద్రాయంత్రమువారియొద్దికిఁ బోవుట తటస్థించినది. అది పత్రిక యాలస్యముగా వెలువడుచున్నదానికిఁ గారణాంతరమైనది. పాఠకులతి స్వల్పకాలమున సకాలమునకు వెలువడిన సంచికను జదువఁగలరు. వారువారు దయచేయవలసిన చందాలకై జ్ఞాపికలు వ్రాసికొనియున్నారము. ప్రత్యుత్తరము నీయనివారికిని జందాలను బంపనివారికిని మేమీ సంచికను బంపుట నిల్పియుంచితిమి. సొమ్ము పంపించి ప్రత్యుత్తరములు వ్రాసి చేరనివారెల్లరు వారివారి పత్రికలం దెప్పించుకొనఁ గోరుచున్నారము. ఈ రౌద్రిసంవత్సరము కఱవులో నధిక మాసముకూడ వచ్చినది. ధనమునకుఁ జిక్కు కలుగకుండఁ బాఠకులు తమ తమ చందాలను బంపి యెప్పటి యభిమానముఁ బత్రికపైఁ జూపఁ గోరుచున్నారము.

ప. అ.

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితగ్రంథములు.

# చంద్రభానుచరిత్రము.

తరిగొప్పుల మల్లనకవి విరచితము—అచ్చులో నున్నది.

# శ్రీ విజయనాశ్రీయము

| | | రూ. | అ. |
|---|---|---|---|
| పురాతనాంధ్రచ్ఛందశ్శాస్త్రము. వేములవాడ భీమకవి ప్రణీతము. | - - - - - - - | 0 | 10 |

## కావ్యాలంకారచూడామణి.

| | | | |
|---|---|---|---|
| విన్నకోట పెద్దయకవి రచితము. ఛందోవ్యాకరణ భాగములందెలుపు ౬, ౭. ఉల్లాసములు. | - - - - | 0 | 8 |
| విప్రనారాయణచరిత్రము. చదలువాడ మల్లయకవికృతము. | | 0 | 8 |
| జైమినిభారతము. (వచనము) సముఖము వేంకటకృష్ణప్పనాయకునిచే రచింపఁబడినది. | - - - - - | 0 | 12 |
| చంపూరామాయణము. ఋగ్వేదికవి వేంకటాచలపతికవిచే రచింపఁబడినది. | - - - - - - | 1 | 0 |
| నీతిసీసపద్యశతకము. తాళ్లపాక పెద తిరుమలయ్య. | - | 0 | 2 |
| యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనము. | - - - | 0 | 8 |
| జ్యోతిశ్శాస్త్రసారము (వచనము.) శ్రీమాన్ కపిస్థళము కృష్ణమాచార్యులుగారు, బి. ఏ. | - - - - | 0 | 8 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము. (శిష్టు సర్వశాస్త్రి) | - | 0 | 2 |
| సర్వేశ్వరశతకము. యథావాక్కుల అన్నమయ్యగారు. | | 0 | 3 |
| A Defence of Literary Telugu. | - - - | 0 | 8 |

Printed at the British Model Press, Choolai and published at the Telugu Academy Office, 39, Harris Road, Pudupet, Madras.

చందా సం॥ కు రూ. 3. విడిసంచిక అ. ౮.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౯. { రౌద్రిసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక 3.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి: ౧౯౨౧.

# విషయసూచిక.

శ్రీః

# చంద్రభానుచరిత్రము

## తృతీయాశ్వాసము.

క. శ్రీదత్తాత్రేయ సదా, మోదితసకలాదితేయ మునిగేయ చిదా
స్వాదాప్రమేయ యనసూ, యాదేవీశుక్తిముక్తికానఘకాయా. 1

వ. అవధరింపు మానసమయంబున. 2

గీ. అచట హితుఁ జూచి హరిసుతుం డనియె మనకు
కిచట మ్రొక్కంగఁ జన దేవ్రుఁ డెవరునచ్చొ
మునివచనభంగి రెం డొకపనియు గాఁగఁ
[1]దెలిపెఁ గుండినమునకుఁ బోవలయు మనకు. 3

క. మనవీరసేనునకుఁ గుం, డినమునఁ దుంబురుఁడు వీణ నేర్పెడునఁట యా
తనియనుజ యొకతె కుముదిని, యనఁ గలదఁట కార్యసిద్ధి యగు మన కచటన్

[2]ఉ. కావునఁ బంచసాయకుఁడు గంజభవాస్త్రజుచేతఁ గానవి
ద్యావిదుఁడై ప్రసిద్ధిఁ గనునంతకు మున్నగ నేగి గేయలీ
లావిధు లెల్లఁ జాలఁ బదిలంబుగ నేరిచి యొట్టులైన నే
నావనజాక్షిఁ దెచ్చెద సఖా యట కీవును సంభ్రమంబునన్. 5

క. నా వెంటనె రమ్మిఁక మన, మీవిధము పురంబుఁ జేర నేగి హరికి స
త్యావనితకు నెఱిఁగించినఁ, [3]బోవఁగనీ రిదియ వెడలిపోఁ దఱి యనినన్ 6

చ. అతఁడును నట్లకాక యన నప్పుడ వారసహాయశూరులై
ప్రతిదివసప్రయాణములఁ బట్టనపక్కణదుర్గదుర్గమా
యతతటినీవనీగిరు లనంతము లొక్కట దాఁటి పోయి రు
ద్ధతగతి నంత నిచ్చటఁ దదాప్తచమూనివహంబు లెంతయున్. 7

చ. క్రమమున నెల్లెడ న్వెదకి కానక క్రమ్మఱఁబోయి యయ్యదూ
త్తమునకు విన్నవించుటయుఁ దత్ప్రమదాసుతబాంధవాప్తవ
ర్గము లడలొంది భావిశుభకార్యము నారదుచే నెఱింగి హృ
త్ప్రమదముఁ గాంచె నిచ్చట నృపాలకుమారవతంసు లొక్కెడన్. 8

1. చ - దెలిసి. 2. ట-లోలేదు. 3. చ - బోవఁగనీ రిపుడ వెడలిపోవుద మనినన్.

క. కని రలదుర్వాసుతపో, వనము న్సతతోజ్జ్వలత్సవనముం బుణ్యా
వనము న్సంయమివదనా, వనమున్ జనదుష్ప్రియానివహాభావనమున్. 9

క. కనుఁగొని యానందము నె, మ్మనమునఁ దళుకొత్త ధరణిమండలపతు ల
వ్వనమధ్యము దఱియఁగఁ జని, కనుఁగవలకు మోద[1]మిడునొకానొకచోటన్.

ఉ. మార్గాయాసము వో నికుంజపటలీమధ్యంబు సొత్తెంచి యం
తర్గేహంబునయందపోలె సుఖనిద్రం జెంది రుల్లోలసం
సర్గానర్గళభానుజానిలసదాసంఘృష్టరంభావనీ
వర్గోత్తాలపలాశవీజనముహుర్వ్యాధూతఘర్మంబుగన్. 11

ఉ. ఆయెడ నాశ్రమైణయుగ మచ్చట నచ్చట లేఁతపచ్చికల్
మేయుచు సారె నొండొకటి మేనులు మూర్కొనుచు న్రయంబునన్
డాయఁగ వచ్చి యాధరణినాథుల [2]మానిజనభ్రమంబునన్
రాయిడిఁ జేసెఁ బైఁ బడి చిరంతనతాదృశవాసనారతిన్. 12

చ. అలయిక నిద్రవోవుతఱి నాగతి సారెకు రాయిడించినన్
దెలిసి తటాన మేలుకని దిగ్గన లేచి యదూద్వహు ల్దముం
గలఁగుచుఁ జూచి చెంగునను గంతులు వేయుచుఁ బాఱునట్టి జిం
కల బెదరించి జోడు దలఁగం గలగుండువడంగఁ దోలినన్. 13

చ. మిగుల భయార్తి నొండొకటి మించఁగ రెండును రెండుదిక్కులై
తగ బుసకొట్టుచుం బొదలు దాఁటుచుఁ గ్రమ్మఱి చూచు చుప్పరం
బెగయుచు గాలిఁ దీవ చలియించిననైనఁ దొలంగిపోవుచున్
దిగులున వచ్చి యమ్మునిపతిం గని యుల్కుచుఁ జెంత నిల్చినన్. 14

శా. ఆదుర్వాసుఁడు వానిఁ జూచి యపు డత్యంతారుణాపాంగవీ
క్షాధామంబులు దిగ్విటంకముల నుల్కాజాలము న్నింప ను
ర్వ్యాదాలంఘనజాంఘికాగ్రహముతో నారా మదీయైణలీ
లాదాంపత్యముఁ బాపె నెవ్వఁ డని యుల్కన్ ధ్యానసంసక్తుఁ డై. 15

క. యదునాథనందనులఁ గా, మదినెఱిఁగి కటంబు లదర మాని కటకటా
తుదమొద లెఱుఁగకమదమునఁ, జెదరినమదినింత సేయఁ జెల్లునె యనుచున్.

సీ. ఎఱుఁగరే దేవతాధీశుసంపద లెల్లఁ గడలిలోఁ గలిపినగబ్బితనము
మఱచిరే సత్యభామామురారుల బండి[3]గొడ్డులఁ జేసినగొడ్డతనము

---

1. చ - మొసఁగఁగా. 2. చ - మానిభ్రమంబునన్వడిన్. 3. చ - గోలచేసినయట్టి.

తలఁపరే యరవిందధామునిల్లాలి ధాత్రికిఁ గూల ద్రొబ్బినదిట్టతనము
చూడరే రోఁకటిచూలికై సాంబుతోఁ దమునెల్లఁ దిట్టినదంటతనము
పెక్కులేమిటి కరయరే భీషణాక్షి, వీక్షణాత్యుగ్రరూక్షాశుశుక్షణిక్ష
ణోక్షిప్తజ్జ్వలికలలోకమొక్కమొగిన, భస్మముగఁ జేయఁజాలినబంటుతనము.

క. అని శమము లోహోయన ముని, యనిశము లో నడరురోష మగ్గల మగుచుం
గనికరము మాఁపఁ జఱచుఱఁ, గని కరమున శాపజలముఁ గైకొనునంతన్.

సీ. బహుకాలసాధ్యతపస్స్వ మేటికి మంటిపాలు సేసెద వని పలికె నత్రి
యాదవాన్వయులఁట యన్న యీతెగువ నీకనుచితం బనెఁ గర్దమాత్మజాత
సాంజలినై యుపాధ్యాయ యీయొకతప్పు సైరింపు మనియె శిష్యవ్రజంబు
అంతకు నెంత నీ వటువలెఁ గోపింప నది లక్ష్యమా యని రన్యమునులు
మఱియుఁ దలకొకమాటగా మౌనినాథ, తాళుమన నడ్డసేయక తపసి నిజమ్ము
గంబు లెట్లట్లు వారును గవదొఱంగి, కలఁగ నిమ్మని శాపోదకంబు విడిచె.

క. అట్టిమహారభసపుఁదఱిఁ, జెట్టున డిగినట్టు లగ్రసీమ మొలచిన
ట్లుట్టిపడినట్టు [1]మౌనుల, కట్టెదుట న్వ్యాసమౌని గనుఁగొననయ్యెన్. 20

సీ. సత్యవతీమానసము నొందుహంసేంద్రు ముడివడునిడుదకెంజడలవాని
భరతరాజాన్వయోద్ధరణుఁ డైనను సౌమ్యు విరిదమ్మిపూసలసరమువాని
వాసిష్ఠవంశాప్తి వఱలుముక్తాగ్రణి పలుచనినిడుయోగపట్టెవాని
నలఘుభారతకళాకలితుఁ డౌసత్పతిఁ జిఱుత [2]పప్పళివన్నెచేలవాని
బ్రాక్తనవచోవిభాగవైభవధురీణుఁ, గేల మున్నీటిక్రొన్నీటిగిండివాని
నాపరాశరపుత్త్రు నుద్యత్ప్రకోప, రౌద్రతరనేత్రుఁ గాంచి దుర్వాసుఁడపుడు.

క. సవసవవినయముఁ బల్కుచు, నవనతగతిఁ దోడితెచ్చి యాతిథ్యంబుల్
సవరించిన నమ్మునిపతి, యవి గైకొన కనియె భీషణార్భటి మెఱయన్. 22

ఉ. బాలురు పుట్టుభోగులు నృపాలతనూభవు లెండకాఁకచేఁ
దూలినవారు నిద్రతమిఁ దోఁగెడువా రొకతప్పు సేసినం
దాళక యేల కావరమున న్శపియించితి వోయి యిట్టినీ
కేల మునిత్వ మేల జప మేల జటాభర మేల నేమముల్. 23

[3]సీ. మునుమున్న యపకీర్తిజనియించినటియించునామీఁదభ్రూయుగంబౌఁడనుదుట
ముంగలదురితసమూహంబులుదయించునామీఁదఁబులకంబులంకురించుఁ

---

1. చ - తపసుల. 2. చ - పుష్పాడి. 3. ట - లోలేదు.

క. విఱిగె ధర జరిగె నుడుపతు, లొఱఁగె నభం బెరిగె నాగ్ధ లూటాడె గిరుల్
వెఱచె జగ మఱచె దిశ ల, త్తఱి వారలరోషగద్గదధ్వానములన్. 32

ఉ. గ్రక్కున లేచి యంపసెలగల్ దగు పెన్బొదులూని సింగిణీ
లెక్కిడి చేత నాలుగయి దేర్చినతూపులు సంతరించి నల్
ప్రక్కలఁ జూచుచుం గలకలం బుదయించినత్రోవ నిల్చి యా
దిక్కునఁ బాఱుసంయములు దెల్పు నశేషము నాలకించుచున్. 33

మ. చని యగ్గ్రాసని వారు గాంచిరి జటాసంచ్ఛన్న [1]సర్వాంగులన్
జనితేర్ష్యావశులన్ మిథశ్శపనదిత్సాప్రస్ఫురద్వాక్యులం
గనదాలోకవికీర్ణపావకుల హుంకారోర్జితానోన్యనృత
ర్జనులన్ భ్రూకుటిభీకరాకృతులఁ బారాశర్యదుర్వాసులన్, 34

[2]క. కాంచి ప్రదక్షిణవిధు ల, త్యంచితగతి నాచరించి సాష్టాంగము ల
ర్పించి యలమునుల వారు ను, తించిరి గంభీరభారతీగుంభనలన్. 35

సీ. శౌరిపాదాబ్జసంసక్తాయ ముక్తాయ సోమచూడారత్నసోదరాయ
సకలపురాణప్రశంసాయ హంసాయ బలభేదిగర్వవిభంజనాయ
సత్యవతీగర్భజాతాయ పూతాయ కర్దమజానందకందలాయ
శ్రీవసిష్ఠకులప్రసిద్ధాయ శుద్ధాయ శాంభవతేజోంశసంభవాయ
నతిరమర్త్యనుతాయసువ్రతిహితాయ, నతిరవార్యవార్యమద్యుతియుతాయ
నతి రతివివిక్తతనయాయ తతనయాయ, నతి రశేషవిశేషమత్యతిశయాయ.

క. అని యిరువురఁ బొగడిన నం, దనసూయసుతుండు శాంతుండై నిజశాపో
క్తిని శాతశూలకృతశా, తనుల యదూద్వహులఁ జూచి దయతోఁ బలికెన్.

ఉ. మీ రొకయేఁడు జో డెడసి మీఁదటఁ గుండిన[3]పట్టనేందిరా
గారములోన నొండొకని గన్గొని వాంఛితవైభవంబు చే
కూరిన నింపుసొం పెసఁగ గోపవధూపతితోడఁ గూడి మీ
ద్వారవతీపురంబునకు వత్తురుగాని తలంక నేటికిన్. 38

క. అని పలికిన దుర్వాసో, మునిచేఁ బనివిని దయాసమున్నతు వ్యాసుం
గని పునరపనతి సలిపిన, ననుపమవాత్సల్యగరిమ నతఁ డిట్లనియెన్. 39

---

1. క - దివ్యాంగులన్. 2. ట - లో దీనితోఁ బై మూఁడుపద్యములకు మాఱు "చూచి ప్రదక్షిణనమస్కారంబు లర్పించి యున్నంజూచి యనసూయాసుతుండు దయార్ద్రచిత్తుండై" యను వచనముగలదు. 3. చ - పట్టనామరా.

చ. అభిమతకన్యకాపరిణయైకకుతూహలశాలు లై మహా
విభవవిశాలురై మనుఁడు విశ్వధరావలయంబు మెచ్చ నో
శుభమతులారయంచుఁ దముఁ జూచి యనుగ్రహ మాచరింప వా
రభినవధైర్యధుర్యహృదయాంబుజు లై చనుచు న్వనంబునన్. 40

[1]సీ. వనతరుల్మఱువైనఁ గనకపోదుమొ యంచుఁ దమపరస్పరవదనములు గనుచు
గెడవాయఁ దెరువున నెడసిపోదుమొయంచు నన్యోన్యహస్తములలమిగొనుచు
ఘనఝిల్లికార్భటి వినకపోదుమొ యంచు సారె మిథోవాక్యసరణి వినుచు
మదగజాదినిరీక్ష మఱపువచ్చునొ యంచు నితరేతరవిమర్శ మీయకొనుచుఁ
దఱచు వంకల ననుచుమాధవులఁ బెనచు
జమళిమల్లియ లనుచు వాసనలఁ గొనుచుఁ
బొలయుగాడ్పుల నినుచుచల్వలనె మనుచుఁ
గలయఁ దేఁటులఁ బెనుచు మార్గములఁ జనుచు. 41

క. ఈఱములు గుబురుకొను నెడఁ, దాఱుచు వా రేగు తెరువు దప్పి చెమట నై
నేఱులుగఁ గాకి దూఱని, కాఱడవిని బోవుచో నొకానొకచోటన్. 42

ఉ. అధ్వగదత్తతిలాక్షతగ్రహణసంకులమూషికారాజికూజితముల్
శ్లథనవ్రపాషాణసంధిజాతవటావనీరుహాలోలఝిల్లీరవముల్
లూతాఘుటితతంతుజాతాభివృతదారుగోపానసీ[2]నటద్ఘుణరుతములు
ప్రశిథిలప్రాసాదభాగగేహాన్యోన్యనీడభ్రమత్పక్షినిస్వనములు
జీంద్రుమునిమ్రోయఁ జెదరినచిత్తరువులఁ, బడినగోడలనొరగుకంబములఁబట్టు
వదలుగారలతోఁ గానవచ్చె బహుళి, వాలయం బైనశూన్యశివాలయంబు.

మ. ఘనహాళిం బెనఁగొన్నబల్లిపర రేఖాచంద్రుఁ డంగంబుఁ జెం
దినజీర్ణోరగకంచుకచ్ఛటలు తాదృగ్భూష లందంద చిం
దునుసుల్ భూతిరజంబు నై తనర రుద్రుం డట్టిశూన్యాలయం
బునఁ గాఁపుండియుఁ గాంచుఁ బ్రాక్తనమహాభోగంబు లెల్లప్పుడున్. 44

గీ. ఆమిషభ్రాంతిచేఁ జించినట్టిజీర్ణ, చిత్రపటఖండములు పైనిఁ జెదరి రాలఁ
దాల్చి తగు నందు మూషికతతి గణాధి, పతికుధాలంకృతానేకపములనంగ.

సీ. అన్యోన్యనాదకుప్యత్సింహహుంకృతి హోరసురొదఁ దలయేరు వాడమ
భుజగభీమాలయభూమిఁ బేర్కొనిన పిచ్ఛిలవిషంబున నోరు చేఁదుదాల్పఁ

1. ట - లో లేదు. 2. చ - నటద్ఘుణరుతములు.

జటులఝంఝూప్రభంజనమహోద్ధతిఁ గ్రమ్ముసురమంటఁ గనుఁదమ్మిచుఱుకుఁ జూన
సమదవాహారివిషాణఘట్టనభీతి నిగుడఁ నన్నున మేనుసగము గాఁగ
నహహాచట్రాతివంటివాఁడగుటనచట, శంభుఁడొకయించుకేనియుశంకలేక
నిలిచెఁ గాక మఱెవ్వరుఁ దలఁచిరేని, తోలు నెమ్ములుఁ గనుపట్టఁ దూలరెట్లు.

చ. మును గజవైరి యం చడఁగుముట్టఁగ వప్రము ద్రొబ్బి తో గజా
ననజనకత్వ మెంచియొ వనద్విరదమ్ములు దుమ్ముఁ గర్ణచా
లనములఁ ద్రోఁచి హస్తసలిలంబున దాఁచి ఘటించుఁ బద్మినీ
ఘనరసయోగసంతతవికస్వరపుష్కరము ల్తదీశుపైఁ. 47

[1]సీ. చీలలు చెదరి బచ్చెన చిట్లి వానలఁ గూలుకొమ్మలతోడి గోపురములు
పొరుగూరిప్రజపాడుపొలము మేఁపుచు రేలమందలాఁగినభోగమండపములు
నుసిపట్టి పడి నుగునూఁచంబులై బండికండు దక్కఁగ నేలఁ గలియు తేరు
లెడలేక తఱచు ప్రేలెడు జిబ్బటీలచే గబ్బులు వెదచల్లు గర్భగృహము
లొరఁగలుఁజాలువడి తావలూడి ప్రాఁచి, బూరటిలి నీరుగ నీకపూరి మొలచు
బావులును గల్గునచట భూపాలసుతులు, చేరి యొకచోట నలఁతవసించునంత.

క. భీషణతరహయహేషా, ఘోషము వినవచ్చుటయును గుఱఁగట వార
న్వేషించి కాంచి రమ్రవి, శేషోజ్జ్వల మైనయొక్క చిత్రరథంబుఁ. 49

ఉ. కాంచి తదగ్రధీరతురగస్ఫురణంబుఁ దదీయలోహచ
క్రాంచలపాటవంబును దదమ్రసమృద్ధియుఁ దత్పతాకికా
భ్యంచితకాంతియు న్నయనపర్వముగాఁ జెలికాని నూతుఁ గా
వించి ముకుందనందనుఁడు వేడుకఁ దద్రథ మెక్కి తోలఁగఁ. 50

సీ. వంకరకొంకరవలుదకోఱలు మించు సెలవులపొల కీఁగ లలమియూఁగఁ
బెలుచ బీఱనరాలు పెనఁగొన్నముప్పంకబరుసుగుత్తుకఁ బ్రేవుసరులు వ్రేల
నీచపోయినయట్టియూఁచపిఱుందుపైఁ గఱకుతోల్దట్టి పెన్నుజికి వలవ
నిఱుకటంబుగఁ గ్రుంగియొఱగుపోయినగూడమూఁపుపైగదమిన్నుముట్టి వెలుఁగఁ
గోఱమీసల గిజగానిగూఁడుపోని, నోర మానిసితలలు లేనారికెడపుఁ
బొండ్లములవలెఁ బీల్చుచు భువనభయద, కాయుఁడొకరక్కసుఁడువారిఁ గదియవచ్చి.

[2]మహాస్రగ్ధర. కఠినోగ్రగ్రంథిసృక్వగ్రథితపిశితదుర్గంధసంబంధశశ్వ
చ్ఛ్రతనాసాదేశవాసిశ్వసనవిసరసంచారఘోరాననాయః

---

1. ట - లోనిదియు దీని క్రిందిదియు లేవు. 2. ట - లోలేదు.

పితరప్రవ్యాక్తదంష్ట్రాపృథుమథనభవత్ఫేనసంతానకుల్యా
లుఠనాక్రోన్నిద్రజిహ్వాలుఠనభయదఫల్గుధ్వనిన్ రాజుఁ బల్కెన్ .52

ఉ. ఓరి వరాక నేఁడు మది నోడక మామక కాననాంతముం
జేరుట యెట్లు చేరి పయిచేటు గణింపక కండక్రొవ్వునం
దేరిది యెక్కుటెట్లు విధి ద్రిప్పకరాఁ బొలకై కడంగునా
బారికి నగ్గమైతి విదె [1]బల్విడి ద్రుంగెద నీక్షణంబునన్. 53

క. ఎచటికి చరిగెద వని రా, త్రిచరుం డాభీలశూలరేఖఁ [2]జదలఁ ద్రి
ప్పుచుఁ జటులహుంక్రియార్భటి, నచలము లూటాడ నతిరయంబున వైవన్.

[3]స్రగ్విణి. గాఢనక్తంచరగ్రామభస్మీకృతి, ప్రౌఢరుద్రేక్షణప్రాయశృంగత్రయీ
లీఢఘంటారవాళీకరాళాంతకృ, ద్రూఢగర్జాప్రజారుంతుదధ్వాన మై 55

శా. అశూలం బరు దేరఁ గ్రూరతరబాహాగర్వదుర్వారుఁ డై
యాశాభూధరకూటకోటి వడి నూటాడంగ బిట్టార్చి ధా
త్రీశోత్తంసము విల్లువంచి గొనయం బెక్కించి చే మించి నా
నాశాతాశుగము ల్నిగుడ్ప నది సాంద్రజ్వాలికాభీల మై. 56

భుజంగప్రయాతము. కరాళాశుగాఘంబుఁ గైకొక పైపై
నరాళాకృ న్రా మహాబాహువీచీ
మరాళచ్ఛటాస్ఫూర్తిమద్వజ్రహేతి
త్వరాలక్ష్మిఁ దచ్ఛూలదండంబుఁ ద్రుంచెన్. 57

గీ. త్రుంచుటయు నఖర్వదుర్వారకోపుఁ డై, యసుర శక్తి వైవ హరిసుతుండు
దానిఁ బటుకృతాంతదంష్ట్రానితాంతశి, ఖాంతకాంతకుంతహతి నడంచె. 58

క. తనశక్తి యిట్లు వడనం, తన భక్తివహింప కసుర తత్సమరమునం
దనుశయముఁదొఱఁగిక్రమ్మఱ, ననుశయమునలీలనొకమహాగదగొనుచున్.

[4]మత్తకోకిల. రాజరాజయకాంక్ష న న్నెదుర [5]న్నరుం డితఁ డెంత యా
రాజరాజసఖుండు నోపఁ డరాతిఘాతిధృతాసిధా
రాజరాజున కస్మదస్త్రపరంపరల్ జత జంభవి
రాజరాజముఖామరావళి నైన నే [6]నలయింపుదున్. 60

మాలిని. అని యనితరధార్యాహార్యశౌర్యాస్పదం బై
కనకన మని నిప్పు ల్గ్రక్కునుద్యద్గదం గ్ర

---

1. చ - ట - బట్టిమెసంగెద. 2. చ - ట - జెదరఁ. 3. ట-లోలేదు. 4. ట-లో నీక్రింది నాలుగుపద్యములు లేవు. 5. చ - ధరన్నరుఁడెంతయూ. 6. బొలియించెదన్.

క్కనఁ గనలుచు రోషాయత్తచిత్తంబుతో వాఁ
డని ననియతమార్గం జౌచు రాచూలి వైచెన్. ౬౫

ఉ. వైచిన నమ్మహాగద యవార్యగతిం దను డాయ వచ్చినం
జూచి నృపాలుఁ డొరసిలి శూరతమైఁ బరిఘంబు సాఁచి రెం
డై చటులాకృతిం బడ రయంబునఁ ద్రుంచిన నన్నిశాచరుం
డేచినకిన్కతో నొకమహీరుహముం బెకలించి యార్చుచున్. ౬౬

క. బిరబిరనఁ గేలఁ ద్రిప్పుచు, దురదుర నేతేర ధరణిధూర్వహుఁ డతనిం
బరిమార్పఁగరా దొండొక, తెరువున నని యనమనపురవృషసంభ్రమఁ డై.

వ. ఆసమయంబునఁ బగఱపొగ రిగుర నెగుచుతఱి సబలంబు లగుసబళంబు లును విలిప్తహాటకంబు లగుఖేటకంబులును మునురువిసమున నెసకమెసఁగుచి లువపిలుకలఁ గలకల నగుతళతళనిచిలుకుములుకులును నవక్రరుచిక్రమా క్రాంతదిశాచక్రంబు లగుచక్రంబులును బరరాజసమాజంబు నాజిం బరా జయంబు నొందించు తేజంబులు గలనేజంబులును నిజకషణజనితవిస్ఫుటస్ఫు లింగసంఘసంఘృష్టవియత్తలంబు లగునత్తలంబులు మొదలగునానాయుధం బులు గల్గ నాయోధనంబులం బ్రతివీరదరదం బగునరదంబు వఱపి నిరు పమప్రభా ప్రభాతభానుం డగుచంద్రభానుం డాతత కేతనాకుంతఘంటాఘణ ఘణాత్కారంబులును రంగత్తురంగగళకలితకింకిణీక్రేంకారంబులును నధిజ్య కోదండశింజనీటంకారంబులును సైంధవతోలనాలోలవిజయులోలహుంకా రంబులునుం గలసి యుద్వేగకలకలంబుఁ జిలుక నలుక నమిద్ధరయంబున నెదురుపడి కదిసినఁ జుట్టుముట్టి రట్టడియై మట్టుమీఱి నెట్టుకొనిన దిట్టతనం బునఁ బుట్టు నట్టహాసంబున ధరాధరధట్టంబులు బిట్టవియ నొక్కట నొ రక్కసుం డుక్కుమిగిలి ప్రక్కన నక్కుమారశిరోమణి కిరీటపాటవత్వరా పరాయణంబుగా (నుత్తాలసాలం బాఘీలగతి గిరగిరం ద్రిప్పి వైచె వైచిన నుఱక రాజు దాని నఱకె నఱకినం బిఱికిగొనక యయ్యసుర కుప్పించి యెగసి నుగతనంబున సారథి పేరురంబున బోరన ధారాళరక్తంబులు గురియ నురియఁగొని పఱియలువఱ నడిచినప్పు డప్పుడమిఱేఁడు కదువడిం దొవరి కడలుకొను కడిమిం బొడమునిడిముడిఁ దడఁబడక గడిసేరు ననురనిడుద గొడలు నుడివడఁ దొడివడ నలుగడలు గడగడగడ వడంక జడిగొని తెవలు వెడందవాలికడిందియంపఱ నింప నన్నిలింపారి తలంపాఱి కంప

( ) ఈగ్రంథము చ - లో మాత్రమున్నది.

మానవమానసుం డై దరిసి మురిసియు) వివిధసవిధకుధరకూటఝూటంబులు నిరాఘాటపాటవంబున నుత్పాటించి మించినక్రొవ్వున నవ్వీరవరేణ్యు నెడ ఱువ్వి నవ్వుచు నార్చి కార్చిచ్చుపగిదిఁ బేర్చి వికటకటతటనికటదంష్ట్రాపుటంబులు గిటకిట గీఁటుచుఁ గుటిలగతి నుడుమండలంబు సోఁక నేకజాంఘికత లంఘించి మించినం గాంచి యమ్మంచువెలుంగుకొలముదొర మెచ్చి యిచ్చం బొగడున య్యెడన గగనతలంబుననుండి మగిడి రథచక్రంబు లిరుసులకొలఁది దిగఁబడ నొగలిమీఁదికి దుమికి కిఱు కనకుండ సూతు నాతతకరచపేటాస్ఫోటంబుపెల్లునఁ ద్రెల్లి మూర్ఛిల్లం జేసి యుబ్బి బొబ్బ లిడునబ్బలియుని జూచి యద్దానవరిపుసూనుండు నిజనిశితకరకరవాలధార నురంబు చుఱుకుచుఱుకన నఱికినఁ బిఱికితనంబున వెఱచఱచి పిఱుతిగిచి యుఱికి పఱచుటయుఁ దానును వానివెంట నంటి బంటుతనంబునఁ బృథుతరరథావతరణం బొనర్చి యఖండకోదండపాండిత్యంబునఁ దెఱచుమెఱుంగులు గిఱికొన మిఱుమిఱు మెఱయు నుఱిది గొఱక లురవడిం గెరలి సరిపెణంబఱపి నఱుముచుఁ దఱిమినఁ దెఱపి గనలేక నాకిద్వేషి కాలికొలందికి సరిగియుఁ దిరిగి మరలం బిరుదుమెఱసి తరుపరంపరల మాటుగొని సమీపశిలాశకలంబు లదవదం బదంబుల నందికొని యనుపమానగతిఁ జిఱ్ఱుచిఱ్ఱున వైచుచు రాచూలిం గదిసిన నతండు ఖేటంబు చాటుగా వెనుకనడ నడరి తేరెక్కు నెడ నెక్కుడుజవంబున నక్కఱకుఁబొలసుఁదిండి గండుమీఱి యొండెఱుంగక తదీయస్యందనంబు క్రిందికి మోరత్రోపునఁ జొరం బాఱి మాలెచాఁపు గల మూఁపుల నెత్తి నేలఁ గూలంబడ నెట్టిన నట్టులు వీడి పుట్టచెండుమెండున మిక్కుటంబుగఁ బుటంబులెగయ నిజేచ్ఛం జనుహయంబులు తోడివడం బోవుట చూచి రాచవారు రథికప్రమేయులు గాన బెగ్గలి చనుయుగ్యంబులఁ బట్టి యరదంబు మెఱపు మెఱసినచందంబున నందంబుసూప మరల్చి యేపున నసహ్యారంహసింహనాదంబుగఁ గోదండంబు సారించి పేరెంచి యాపిశితాశి నాశీవిషసమాననానానూనబాణసంతానంబుల మానంబు దూలించి కీలాలజాలంబులఁ దేలించిన నించుకవడి బెడఁకువడి యడలున నిడుమకొను బడలిక నొకయనోకహంబునీడ నొఱంగి వెఱఁగుపడి పరికించుతఱి నెడమీఁక పొడమి రథచోదకుం డాదటఁ గ్రుద్ధుండై బిట్టువైరంబునఁ బ్రేంఖత్కంఖాణబాణపుంఖసంఘాతసంజాతజ్యాతలధూళీకాపాళియు నదభ్రభ్రమణవిభ్రమకృత్ప్రభవత్తలాతలకఠినలుఠదయోమయనేమిఘర్ఘరనిర్ఘోషంబును దక్కనొండె

వ్వియుఁ గనవినఁబడకుండఁ బండిత్రోలినంత నంతకాకారుండై పంతంబుమెఱయ సంతమసవతీచరప్రవరుండును గరాళకరాలక్షితకంకాళుండై హుంకరించి యహంకారంబున నీవెందుఁ బోయెద వని యుదుటునం బొదలుమదంబున హత్తి మొత్తుటయుఁ గత్తలానులుం బెగ్గిలి మ్రొగ్గిన సోఁగవాగియలు సారథి నిజభుజాయుగంబునఁ గుదియంబట్టి బిట్టత్తినం దత్తరంబున నుత్తేజకాశ్వరాజీముఖరనూపురపుంశ్చరణఖరఖురశిఖరంబు లంబరంబున బయలువ్రాఁక జోకఁ బిఱిందిపదంబులన కొంతదూరంబు తేరీడ్చికొని తమకంబునన్ దుముకుగమకంబున వియచ్చరు లచ్చెరువడి చూడ నమ్మహీమండలాఖండలుండును నయ్యంతదురంతసాహసబాహాసాహాయ్యంబు నూహించి యహో యని సంతసించి పొంగి యతండు నిండుమనంబున ఘోటకబృందంబుకందంబులు ప్రోదిగ నప్పటప్పటి కప్పళించుచుఁ జెవులు నివిరి మొగంబులు దుడిచిన భూరిఘూత్కారభూషితతాలువుల డిండీరఖండంబులు తండతండంబులుగ వడఁ గఱకఱఁ గళ్లెంబులు కొఱుకుచు జోడనల నవేలంబుగా మగుడుటయుఁ దోడన వెంబడిం బఱచి యురుతరశక్తి నన్నక్తంచరుండు పిఱిందికి వచ్చి భుజార్గళంబున నిరుగడ నిరుసుకొన దివియంబట్టి జంగయిడి త్రుంగి కుతికిలంబడి సాఁగనీక కూఁకలిడ నారాకొమారుండు పెడమరలఁ దిరిగి యత్యాగ్రహంబునఁ బ్రత్యాలీఢపాదుండై వింట నొండొంట మంట లుమియుకుఱుఁ గంటుములుకు లెదురు చిమ్మినకైవడిఁ గణుదురీఁగలు మూఁగిన తెఱంగున నాదారకుం డా పాణిద్వయతలప్రతలంబులు నూటివడ నాట సవ్యసాచియై యేసి యీసు నులుకుఁ బుట్టించినం బట్టువదలి కళవళించి నిలువరింపలేక కదలి పఱచుటయు వెనుకనడ నడరి తేరెక్కి వెంట నంటి కవిసి మనుజపతి ప్రబలం బగుసబళంబు వక్షస్థలంబున గ్రుచ్చినఁ జచ్చినపోల్కి వెలికిలఁబడి పొలిసెఁ బొలిసెఁ బలాశి యనుతఱి నె పొరలి వడి నడలక దిటంబున మచ్చెవుటంబు లెగయుచు · బెగడునఁ గొన్నియడుగులు నిగిడి మగంటిమి మిగుల డగరతనంబున లేచి యాచేరువ గండోపలఖండంబుఁ గేలఁ గైకొనుతఱి సాత్రాజితీపుత్త్రుండు గోత్రనిభగాత్రుం డగునీసత్త్రాశనశత్త్రుండు శరమాత్రభేద్యుండు గాఁ డని యూహించి యానిశాచర వీరుపై సౌరాస్త్రంబుం బ్రయోగించుటయును. 64

క. గిరు లొరఁగఁ దరులు విఱుగ, న్శరనిధులు గలంగఁ దరణి చాయదొలంగన్
హరిదంతంబులు వగులఁగ, న్నురవడి నఱచుచు నిశాటుఁ డుర్వింగూలెన్.

ఉ. కూలినదైత్యుఁ జూచి సురకోటి యుపాంసురరంధ్రబిందువుల్
జాలుగఁ గ్రొవ్విరు ల్గురిసె జంత్రపుబొమ్మలకేళి జక్కిణుల్
కేళిక చేసి రచ్చరలుఁ గిన్నరకన్యక లున్నతశ్రుతిన్
మేళముఁ గూడి పాడి రెలమిన్ యదునాథుని సన్నుతించుచున్. 66

క. కనుపట్టె నగ్రసరణిన్, ఘనదవహతవేత్రిభసితకదళన్యాయం
బున విశిఖవిద్ధదానవ, తనువున నొకయక్షరాజతనయుం డంతన్. 67

శా. ఆయక్షాగ్రణి విస్మితాత్ముఁ డగుపత్యానందనున్ భక్తితో
డాయన్వచ్చి నతాంగుఁడై పటుకిరీటప్రోతరత్నాంకుర
చ్ఛాయ ల్భూమి నలంకరింపఁగ నమస్కారంబు గావించి జే
జే యంచు న్వచియింప నాతఁ డనియెం జిత్తంబు రంజిల్లఁగన్. 68

[1]ఉ. ఎక్కడ నుండు దెవ్వఁడ విదేమికతంబున రక్కసుండ వై
యిక్కడ సంచరించితివి యింతయుఁ దెల్పు మటన్నఁ గృష్ణజున్
మ్రొక్కి యతండు హస్తములు మోడ్చి ఘనాఘనధీరనిస్స్వన
న్యక్కరణైకతానవచనస్ఫురణంబు చెలంగ నిట్లనున్. 69

మ. వెలయుం గాంతిమతీపురంబున మనోవేగుండు నా యక్ష
త్కులనాథుండు తదగ్రసూనుఁడ మణీకోటీరకాఖ్యుండ నే
జలజాతారికళాకిరీటుఁ గొలువ న్సంప్రీతితో నొక్కనాఁ
డలకప్రౌఢిమ మీఱ నింద్రపురినీలాబ్జేక్షణల్ గొల్వఁగన్. 70

సీ. బిందుమాధవుఁ డుండు నెం దద్ధి[2]రిత్తయై ప్రకటఫేనాహికంచుకము లెగయ
విందుమౌళి వసించు నెందుఁ గైలాసంబు పాకై గుహాశ్ఛిద్రసటలిఁ జెంద
నిరవొందు లోలార్కుఁ డెందు దుష్విశరాస్యమై బలుచుక్కగమి బల్లిపజాలుపూన
మందాకిని తనర్చు నెందు మేనువ్రజలంబై పచ్ఛాపప్రాది నాసహింప
నట్టి కాశీపురంబున కరుగుదెంచి, యభినవభవానీసూనజనార్ధనదిత
బహుళగీర్వాణవాహినీభ్రమదవజ్ర, శకలకుట్టిమ[3]వీథికాసరణిఁ జనుచు. 71

శా. కంఠేకాలపదారవిందములపైఁ గైవ్రాలి లోలార్కునిన్
డుంఠీశు న్వినుతించి భైరవుని మోడ్పుంగేలుతో డాసి వై
కుంఠస్వామికిఁ జాఁగి మ్రొక్కి హిమవద్గోత్రాత్మజం జూచి యు
త్కంఠన్ దక్షిణవేల్పులం బొగడి యంతన్మందయానంబునన్. 72

1. ఈపద్యము మొదలు 10 పద్యములు ట-లో లేవు. 2. చ - గుంటర్దయై. 3. చ - వాటికా

సీ. చికిలిచంద్రికవన్నెజీబులేఁగరకంచువలిపెదుప్పటి వల్లెవాటు వైచి
రవసందివండజీరల దోరవాఱినమెడ నిండఁ గస్తూరి మెదిచి మెత్తి
కఠినవక్షోజసంఘట్టనాంకితభుజాంతరమునఁ దుమ్మెద తాళిఁ జేర్చి
నవమాలికాప్రసూనకరంభితం బైనశిఖనిండఁ దాయెతుచేరుఁ జుట్టి
వీటు నెవ్వరిఁ గనుఁగొన్న వెకలిరీతి, నర్మసచివుని గనుఁగొంటి నవ్వుకొనుచు
నారజము మీఱఁ దత్పురాభ్యంతరమున, నల్లనల్లన చనుదెంచు ననసరమున.

క. గంగా హిమగిరితటభా, గంగం బరిఫుల్లహల్లకామోదితహా
రంగ స్విధురుచిరుచిరత, రంగం గనుతెమి హృదంతరంబునఁ జెలఁగన్. 74

శా. ప్రేంఖచ్ఛందనగంధగంధవహనిర్నిద్రోచ్ఛలద్వీచికా
ప్రేంఖోల్లసితఫేనఖండములకుం బెన్నుద్దులై పదభూ
కంఖాణంబులు సంచరింపఁ దగుతద్గంగాస్రవంతీతటిన్
స్యంఖాపత్తకు గాలవాఖ్యమునిఁ గన్గొంటిం బ్రమోదంబునన్. 75

క. కనుఁగొని యువహితమతి నై, వినయంబునఁ జాఁగి మ్రొక్కి వీక్షింప కతం
డనుపమమనుపరనిశ్చల, మనస్కుఁ డై యుండ నయసుమదమున నేనున్.

చ. తొడిఁబడ మాయచేత నతిధూర్తనిశాచరవేషధారి నై
యడరి ఘనాఘనౌఘనిబిడారవభైరవహుంకృతంబుతో
నుడుపథముం గులాచలము లుర్వరయుం గకుబంతసీమలున్
జడనువడంగ నార్చుచుఁ బ్రచండగతిం గనుగ్రుష్టు ద్రిప్పుచున్. 77

శా. కుప్పింతుం దటమానికోటి వెఱవేఁకు లుప్పన ఘోరార్భటిన్
నొప్పింతుం దిగధీశకర్ణములు కన్నుం గ్రేవల న్నిప్పుకల్
రప్పింతు న్వినువీథిఁ గ్రాలుకొన శూలం బుద్ధతిం ద్రిప్పుచున్
విప్పింతుం జనధైర్యసంపద పృథూద్వేలాగ్రహగ్రంథినై. 78

క. ఈగతిఁ [1]దను వెఱపింపం, గా గాలవమౌని యపుడ కన్నుఁదెఱచి మా
యాగౌరవాధికతర, క్షోగాత్రుని నను నెఱింగి క్రోధాన్వితుఁ డై. 79

[2]మహాస్రగ్ధర. అధరం బల్లాడఁగా బిట్టవుడుగఱచి సాహంక్రియామర్షభాషా
బధిరాశాభాగుఁ డై భ్రూభ్రమణపటునటద్భాలఘర్మంబు నిండన్
విధురస్వాంతంబుతో దృగ్వితతరుచి నభోవీథి రంజింపఁ జిత్తా
త్యధికాటోపంబునం బంతము వలుకుచు దుర్ధర్షవేషంబు మీఱన్. 80

1. చ - ట - కదు. 2. ట - లో లేదు.

శా. ఓరీ సంపదఁ గన్నుఁగానక సధూమాయుక్తుండ వై వచ్చి మ
వ్యాపారా యి ట్లడకింపఁ జెల్లునె దురాత్మా యంచుఁ గోపించి నీ
వీరూపంబు వహించి కాన జనతాహింసాది కృత్యంబులన్
నోరారం బొల మేసి త్రుళ్లు మని నన్నుం జూచి శాపించినన్. 81

క. గజగజ వడఁకుచు నే నా, రజనీచరవేష ముడిగి ప్రతిపతిపాదాం
బుజములపై వ్రాలి భయా, ర్తిజదీనాలాపగద్గదిక ని ట్లంటిన్. 82

శా. చేతోవీథి భవన్మహామహిమముల్ చింతింపఁగా లేక యీ
రీతి న్మున్నను మిన్నుఁ గానక మదోద్రేకంబునం ద్రుళ్లితిన్
నాత ప్పొక్కటి సైఁచి శాపవచనాంతంబుం గృపం దెల్పవే
యోతండ్రీ నను బ్రోవవే యనిన నాయోగీంద్రచంద్రుం డనున్. 83

శా. వత్సా మామకశాపవాక్యములు దుర్వారంబు లౌ నైన నే
తత్సంరంభము మాని నీ [1]పడల నార్ద్రం బయ్యె నాచిత్త మీ
కుత్సాపాత్రతనూవియోగ మగు నీ కున్మ్యాన్యదివ్యాపగా
భృత్సద్మాంతరసీమ నొక్కనిశరాత్రిం గొంత కాలంబునన్. 84

క. అనుమాట లోను వెలి గా, ఘనగర్జాతర్జనాదికస్ఫురణవచో
ధ్వని సెలఁగ రక్కసుఁడ నై, చను దెంచితి నిటకు సకలజగములు బెగడన్.

ఉ. నాపిశితాశనత్వమును నాబహుపాతకహేతునిత్యహిం
సాపరతంత్రరోషపరుషత్వముఁ బాఫితి వీక్షణంబునన్
భూపవతంస నీవలనఁ బూర్వ[2]శుభోన్నతి నొందఁ గాంచితిన్
నీపరమోపకారమహనీయత కేఁ బ్రతిసేయ నెత్తునే. 86

[3]క. ఇన నొకమే లొనర్తు మ, హీనాయక మాఱువలుక కియ్యకొనుము ప్ర
జ్ఞానిధులు సత్క్రియాలవ, మేనియ్యును బహూకరింప రే మది నెందున్. 87

చ. అతులితశౌర్య నీతలఁచినప్పుడు వచ్చి సమిజ్జయంబు ల
ద్భుతముగఁ గూర్తు నీయరదముం దఱితోడయి వచ్చు నాయదృ
శ్యతయును గామరూపతయు సంథిలఁ జేయుదుఁ గొ మ్మటంచు నా
క్షితిపతి కిచ్చి యక్షుఁ డరిగెం దదనుజ్ఞ నిధీశుపీటికిన్. 88

శా. ఆసత్యాసుతుఁడుం బ్రియాప్తసహితుం డై యాత్మసారాస్త్ర[4]వి
న్యాసోచ్ఛాసితరాక్షసావయవయక్షాపాదితాత్యంతమై

1. ట - వలన. 2. చ - సుఖోన్నతి. 3. ట - లోత్రేద్ధు. 4. ట - విన్యాసోద్భాసిత.

శ్రీసంపత్తికి సంతసిల్లుచు సముద్వేలాజలీలాభవా
యాసం బాఱంగ నొక్కనిర్మలసరః ప్రాంతంబునం బోవుచున్. 89

క. దరవికచసరసిజాంతర, పరిఖేలచ్చంచరీకపక్షచలితపు
ష్పరజోనితాంతశీతల, మరుత్కిశోరములు మీఁద మల్లడిఁగొనఁగన్. 90

క. తలిరిచి దట్టములై త, జ్జలజాకరశీతవాతసక్తిఁ బొదలి మొ
గ్గలఁబూవులఁబిందెలఁగా, యలఁబండులఁదనరుతరుచయంబున నొకచోన్.

సీ. వాసంతికారసాస్వాదమత్తాంగి యై తెలిసివల్లభుఁ జేరుతేఁటిలేమఁ
బ్రణయకోపంబునఁ బఱచి నాథుఁడు మ్రొక్కఁ గేరడంబులు వల్కుకీరతరుణి
నన్యానుషంగచిహ్నము లెల్లఁ బరికించి వరుని దూఱెడుగోరువంకబోటిఁ
దమి దొలంకఁగ సాము గమిచినచిగురాకుఁ జెలువునకిచ్చుకోయిల వెలందిఁ
గనుఁగొనుచు వచ్చి యొకదివ్యకాంతియుతమ
యూరయుగళంబుఁ గని పట్ట నూహ సేసి
తదనుసరణపరాయణత్వమున వార
లాత్మవిశ్లేషము గణింప కరిగి రపుడు. 92

క. అందు హరిసుతుఁడు పులుఁగుఁబ, డిం దప్పక యరిగె యది వడిం బఱవ నిరా
నందుఁ డయి తిరిగి తత్పద, విం దమ్మునిఁ గానలేక వెదకుచు నార్తిన్. 93

ఉ. అక్కట యున్కిఁ దెల్పు మనుజా మనుజాగమవర్జితోర్వి నే
నిక్కడ నొంటి సైఁపఁగలనే కలనేనియుఁ బాయలేని నీ
వెక్కడు క్రూరవృత్తిఁ దగవే తగ వేమఱుఁ బల్కరించు నన్
మక్కువ తొంగలింపఁ గనుమా కనుమాయలు వెట్ట నేటికిన్. 94

గీ. అనుచు విపినవీథి [1]నరిగెడుగంధాంధ, కరులఁ గిరులఁ బేచకములఁ గీచ
కముల జటులఁ గిటుల ఘనదైన్యభణితితో, ననుజుమార్గమడిగి యడిగియలసి.

చ. యతిపతివల్కలంఘ్యమని యాత్మ నెఱింగి నిజాంతరంగసం
గతధృతి యై యదూద్వహుఁడు కాననవాటము దాఁటి యధ్వగ
ప్రతతుల వెంట నేగి పరపట్టనగర్వవిఖండనంబు దృ
క్కుతుకదసౌధమండనముఁ గుండినముం గనియెం బ్రియంబునన్. 96

మ. కని తత్పట్టనకేళికాననలతాగారైకవాస్తవ్య భో
జనృపాపత్యవిపంచికాభినవశిక్షాకర్మఠున్ విశ్వరం

---

[1] ట - నడెరెడుఁ

జనగీతామృతతోషితవ్వీరవరాట్పుర్ణాంబరుం దుంబురుఁ
విశయప్రౌఢిమఁ జేరఁబోయి నతి గావించెం బ్రమోదంబునన్. 97

చ. అపు డమరేంద్రగాయనుఁ డనన్యజసోదరభావసూచనా
నిపుణతనూవిలాసు నతనిం గని యెచ్చటనుండి వచ్చి తే
నృపతనయుండ వేమికత మిచ్చటికిం జనుదేర నంచు స
త్కృప నడుగ న్యదూద్వహుఁడు దీపితసూనృతసూక్తి నిట్లనున్. 98

సీ. కరగతచక్రుండు హరిబలాన్వితుఁడు సన్మహితవిక్రముఁడు మామకగురుండు
ప్రాణేశకలితసురాగసంస్తుత్యసత్యాఖ్యాతగోత్ర నాయనుఁగుజనని
సరసధర్మధురీణుఁ డురుసుమనోమార్గణావలంబనుఁడు నాయగ్రజన్ముఁ
డక్రూరసుగుణోద్ధవాధారశూరసంతానశేఖరులు మద్బంధుజనులు
పొదలురాలచ్చి యెపుడు మాయదుకులమున
మాకురత్నాకరపురోత్తమము నివాస
మట్టినే నీకు నిచట శిష్యత వహించి
వీణ నేర్వంగ వచ్చితి విమలచరిత. 99

గీ. అనుచుఁ జతురోక్తిఁ దెలిపినవినితదీయ, వృత్తమఖిలముమనమున నెఱిఁగితుంబు
రుం డతని గారవించి యారుక్మబాహు, నృపతనూభవుతో వీణ నేర్చుచుండె. 100

ఉ. అంత దిగంతదంతురలతాంతనితాంతనితాంతకాంతవ
న్యాంతికతాంతపాంథజనతాంతరసంతతకృంతనప్రథా
త్యంతసమంతతస్ఫురదుదంతపరంతపకాంతిసంతతి
క్రాంతపురంతకుంతరతికాంతము వాల్చె వసంత మెంతయున్. 101

[1]క. వనలక్ష్మి మాధవాగతి, కనువుగఁ బూనీట జలకమాడుటకై ముం
దనువుగ నలుఁగిడఁగా ను, ర్లినచిక్కన మనఁగ ధరఁ దొరిఁగెఁ గారాకుల్. 102

ఉ. పూని వసంతహాళికుఁడు పొంగెడురాగరసంబుచేఁ గడు
న్మానుజనాళిమానసపునట్టులు దున్ని మనోజకందళిం
గానఁగఁ జేసి యంత నెగఁగట్టినయట్టిహాలంబులో యనం
గా నెఱసెం బలాశకళిక ల్మనుమున్న వనాంతరంబులన్. 103

క. ఎలఁదీవెచెలులు వలిగా, వ్పులపైఁ దేసియవసంతములు చల్లఁగఁ జే
తులఁ బూనినవేత్రపుఁడి, త్తులు నాఁ దలిరాకుపొదలఁ దోఁచె న్మొగ్గల్. 104

1. ట - లోలేదు.

త్రిక్కుచాటున రాజన్యకన్యఁ గాంచి
యపుడు నరపాలికలు రయంబున నగుచు. 110

క. ఒండొకతె నీలాఱి నృపసుత. నంపకు నేతెంచి మొల్లపువ్వులు విరిపూ
సంపెఁగలుఁ గస్తురిగొజ్జఁగి, చెంగలువఁ గైకానికిచ్చి చేరి హృద్యోక్తిన్. 111

చ. అచట విలాసభూధరము లచ్చటఁ గ్రొన్నెలఁదాలతిన్నె ల
ల్లచటఁ బరాగసైకతము లచ్చటఁ దేనియ యేటినీటిజా
లచటఁ బయోరుహాకరము లచ్చటఁ బూచినకన్నెమావు ల
ల్లచట లతాకృతాలయము లంచుఁ గరంబులఁ జూప వారితోన్. 112

సీ. విందులు గైకొన్న యిందిందిరమ్ములు వాసంతికాప్రసూనాసవముల
దోపటి దొడుకునే ప్రేమఁ గోకిలములు పాటలసహకారపల్లవముల
బువ్వంబు గుడుచునే ప్రోదిరాచిలుకలు పరిపక్వదాడిమీఫలరసములఁ
బొ త్తారగించునే మత్తఖంజనములు చంపకప్రసవజసౌరభముల
నామెతలు సేయునే శారికాస్వయములు
గోస్తనీవల్లికా[1]ఫలగుచ్ఛకముల
నలరువలపులు గాంచునే తలిరుఁబోఁడులు
మలయగిరికందరాయాతమారుతముల. 113

ఉ. అనుచు లతాంగి పూవుఁబోఁడ లారసి పుష్పితశిప్ప లెక్కి కుం
దనమకరందవాహినులఁ దాఁటి సరస్తటిసీమ మట్టి పూ
చినయెలమావిజొంపములఁ జేరి [2]మెలంగుచు నంతఁ జెంగటం
గనుఁగొనియె న్లవంగలతికాపరికల్పితకాయమానముల్. 114

క. కాంచి యచటం దదీయను, మాంచలసంచరణచంచదళిగానకళా
పంచనచుంచువిపంచీ, పంచమనాదంబు చెవులపండువు సేయన్. 115

[3]మ. ఇది నాయన్నవిపంచినాద మనుఁ జుమ్మీ నెచ్చెలీ యింతటా
సదనంబు ల్ప్రతినాద మూనఁదొడఁగెం జప్పెంత మీ యంచు ను
న్మదకాదంబరవానుకారివిచలన్మంజీరశింజారుతం
బొదవం జేరి సహోదరుం గనియె నత్యుత్కంఠ దీపింపఁగన్. 116

క. సోనలుగాఁ గన్నిపూఁ, దేనియతుంపురులు చల్లుతీవలలో న
మ్మానవతి నిలిచి యున్నన్, గానరతుం గాంచి లేచుపకంఠక్షోణిన్. 117

1. ట - స్వచ్ఛ. 2. చ - తొలంగుచు. 3. ట - లో లేదు.

సీ. మేరుసంగతి గేయసారవాహినిమూఁడు తెగలాయెనసఁగఁదంత్రికలు మెఱయ
స్వరదేవతారోహసమవరోహశ్రేణిఁ గట్టు మెట్టికలు   మెట్టు లమరఁ
గరివె ఘణంబుగా గానలోలత డాయుచిలువరా జవ వెండియొళవు మీఁటు
శ్రుతితంత్రికాబినాహ్యాతికి నెఱెంచికకవజక్కవలు నాఁగఁ గాయ లొలయఁ
దసరువీణియఁ జేఁ బూని తంత్రి దీటి
బిరడలు బిగించి శ్రుతిఁ గూర్చి కరివె నివిరి
జాఱుగా మీటి సారెలు చక్కనొత్తి
సారెఁ బలికించునల్యాకుమారుఁ గనియె. 118

క. కనుఱెప్ప లిడక యతనిం, గనుఁగొనియుం దనివిచనక కామిని యస్తం
గనునెపమునఁ బొదవెలువడి, [1]చని నిలిచె న్మోగులు వాయుచంద్రకళ యనన్.

శా. ఆవేళం దుదఱెప్పల న్నిలిచి [2]నేత్రాంతత్రిభాగంబులన్
దావై చెక్కుల జాఱి కర్ణవిచలత్తాటంకహీరప్రభన్
దీవ ల్సాఁగుచు నొయ్య రాకొమరుపై నిండారె రాజన్యక
న్యావీక్షాంకురముల్ స్మరప్రథమముక్తాస్త్రప్రతానం బనన్. 120

గీ. పూపగుబ్బతఁ గన సిగ్గు పొదలుచుండ
రాచకూఁతురు గాన సంకోచ మడర
నన్నసన్నిధి నున్కి భయంబు నిగుడఁ
గలికి గనుఁగొనఁ దలఁచు లోనులుకు నళుకు. 121

క. వనజాస్యకు మై నిండ, న్ననుపారెం బులక లపుడు నిఖిలాంగములం
గనుఁగవసాటికిఁ దారుం, గనఁగఁ గటాక్షాంకురములు గ్రమ్మించె ననన్.

[3]క. తమినేత్రచకోరకయు, గ్మము నరపతివదనచంద్రికల నఱుమ్రోవం
గమిచి యెదఁ బట్టుచాలము, నుమిసెనో యన సశ్రుబిందులొలికెం జెలికిన్.

ఉ. తత్తఱపాటుతోడఁ గనుఁదమ్ములడాలు దిగంతరంబులం
జిత్తరు నింప లేఁజెమటఁ జేల కుచంబులపొంత జాఱ నా
బిత్తరి మ్రానుపాటొదవఁ బిమ్మిటిఁ దా నొకకొంత గొంకి లోఁ
జిత్తము మట్టుపెట్టికొని చేరి సహోదరుదండ నిల్వఁగన్. 124

ఉ. అప్పుడు లేమపాదకటకారవము ల్విజవల్లకీరుతిం
దప్పులు సూప వింతనినదం బిది యెక్కడిదంచు నెల్లెడం

1. చ - చనియె న్జలదంబుఁబాయు శశికళ యనఁగన్. 2. ట - నేత్రాంచద్వ్యభాగంబునన్.
3. ట - లోతేదు.

గ్గల మగుశాతకుంభమునఁ గ్రమ్మక కోసుచున్నపాళిశా
కలితపతంసపక్షనగంధవిశేషము లాఁచి[1] బోవునే. 133

చ. జగములు గెల్వఁగోరి సుమసాయకుఁ డెత్తుపసిండిబొక్కెముల్
మగువకపోలయుగ్మ మనుమానము లే దటుగాక యున్నచో
నగణితకర్ణకుండలసమగ్రమణిప్రతిబింబదర్పణం
బగుచుఁ జెలంగునే మకరికాంకిత మై చెలువంబు సూపునే. 13·

గీ. కమలసూతి సుధాకరుకందుఁ గడపి, బింబమున దీనిమోముఁ గల్పింపనయ్యె
నలికమగ్రంబుపార్శ్వములుగఁ జెక్కె, లంచుబెంచె బాధరంబు బింబాధరంబు.

గీ. మంజుభాషిణికంఠసామ్యము[2] వహింప, నబ్జ మున్తటుసుమనోజ్ఞమయ్యెఁగాక
వార్ధిజాతసజాతీయవస్తు లుండ, సాదరము గాంచు టెట్లు తదాదరంబు. 136

గీ. మధుపసంగతవిటపసన్మూజములును, బల్లవాశ్లిష్టమల్లికాపాళికలును
నవతువచ్చునె యీనతిసకలభువన, వర్ణనీయభుజాకల్పవల్లరులకు. 137

ఉ. మును పాకకృష్ణమూర్తి ఘనము ల్గురియన్ గిరి నెత్తి గోవివ
ర్ధన మొనరింప నత్తెఱఁగు దా నది చిత్రమె యంచుఁ గొమ్మయూ
రని యెదుకృష్ణమూర్తి మదనాశుగవృష్టిఁ దనర్ప గోవివ
ర్ధన మొనరించెఁ దత్కుచధరాధరయుగ్మము నుబ్బు నెత్తుచున్. 138

చ. సరసవయో[3]విభాతమున సారసగంధికభీరనాభి తా
మరసకుటీరము న్వెకలు మంజులరోమలతాళిరాజి బం
ధురతరపక్షవాయువుల నూత్నతదీయపరాగమాలికల్
వరుసనె రాలి రేక లగు వైఖరిఁ బొల్చు వళీవిభంగముల్. ·139

గీ. సుప్రతీకోత్తమాంగ మీసుదతిపిఱుఁదు, గాకయున్న రత్నాకరకాంచికాప్ర
యుక్తిఁ గను నేనితాంతవృత్తోరుసుకర, కాంతిసదపుష్కరస్ఫూర్తిఁ గడలుకొనునె.

గీ. కలమగర్భంబు లబలజంఘల జయింప, మల్లఁబడి నిక్కి కడపటఁ బొల్లువోయి
రాలిపడి కాతికంటకాక్రాంతి విరిసెఁ, బరఁగు నెవివేకమిల జనప్రకృతులకును.

[4]క. [5]తామేటివెన్ను తీవి స, తీమణిప్రపదములు దనరె దివ్యోర్వరుదిశా
సామజకరోపరికటీ, భూమండలి యందుమీఁదఁ బొలుపగు కతనన్. 142

మ. ప్రమదపదంబులం దొరయఁ బంకజముల్ వనమధ్యసీమఁ జ
క్రమ్ములకు నింపుగాఁ దపముఁ గాంచుతఱి న్మధుపాళితోడఁ బా

1. ఛ - బ్రోవునే. 2. ట - వహించి, యబ్జ. 3. చ - వివాసమున, ట - విభాగమున.
4. ట - లోలేదు. 5. తానుగల వెన్నువిటిచి.

యసిమి పలినత్వ ముందియుకు హంసకసంగతిచేతఁ బాదనా
మ్నాయముఁ గని మించె నేటి కమలాక్షులసంగతి ఱిత్తవోవునే. 143

గీ. అలరె వారిజనేత్రాపదాంగుళీన, ఖాళి యకారనవనసీమ నడరునవ్య
విద్రుమలతాగ్రకోరకవితతి నాఁగ, నగ్రలాక్షారసంబు సుమాసవముగ. 144

క. అనుమాన మేల నిజ మిా, సనఁబోఁడియె దుక్షబాహునందన యలనా
వినుకలియునుగనుకలియును, మనమునఁ[1] దలపోయ నైకమత్యముఁగాంచెన్.

మ. అనుచో నాలలితాంగి నొక్కచెలి డాయన్వచ్చి యోనెచ్చెలీ
వననాసంతికకు న్రసాలమునకు న్వైవాహికప్రక్రమం
బొనరింపం జనుదెమ్ము వేగ యన నయ్యోర్వైన మీపాటిమే
లును సైరింపఁగఁ జాలదంచు మది నాలోలత్వముం జెందుచున్. 146

క. ఆపడఁతి యప్పు డలవిరి, తూపులచే డీలుపడుట తోఁబుట్టునకున్
దీపింపకుండఁ జని పు, ష్పాపచయాసక్తిపై మనోంబుజ మడరన్. 147

సీ. కైలాగు జతన మీకలువరాచలువరాల్ జీరుకుల్ వారు [2]రాజీవనయన
పాదావధాన మీపరువంపుమరువంపుఁగనిమలదాఁటుచోఁ గంబుకంఠి
[3]మేలుప్పరంబుతుమ్మెదమందరోద మందటిలుపొదల్ దాఁటుచోఁగలువకంటి
చిత్తేశు చూడు మీచిన్నారిపొన్నారి కేకినీలాస్యము లేక్కరవాణి [డుచు
యనుచుఁదనప్రాణసఖులు నెయ్యంబుమీఱ, నెచ్చరికఁ దెల్పనిచ్చలో జిచ్చువ
వెచ్చనూర్చుచుఁగలఁగుచువిన్ననగుచు, రామవిహరించెఁబుష్పితారామసీమ.

[4]మ. అపరాంఘ్రిద్యుతినారసీకృతసుధీహార్యక్షు హార్యక్షుదో
ర్ధరణార్ధాకృతితాభృతామరకదంబాధ్యక్షు బాధ్యక్షమా
హరణాస్తోకహృషీకచోరకనిరానారక్షు నారక్షమా
శరకోటిప్రతిపాటితాంతరరిరంసల్లక్షు సల్లక్షణా. 149

క. సంసారదూరసరణారి, రంసాధిగతప్రశంసరాగవారిణవై
తంసికసంసన్మానస, హంస మహోహంస పరమహంసవతంసా. 150

స్రగ్విణి. ధ్యానకృత్సేవధీ దంభవిద్యానధీ, దానలక్ష్మీనిధీ దాంతహృత్సన్నిధీ
మౌనభూషావిధీ మంజుభాషానిధీ, జ్ఞానసంమోదధీ సత్త్వనామోదధీ. 151

గద్యము.—ఇదిశ్రీమద్దత్తాత్రేయయోగీంద్రచంద్రచరణారవిందవందనసమాసాదితసరసకవితారసోదాత్త దత్తనామాత్యసోదర్య మల్లనమంత్రివర్య ప్రణీతంబైనచంద్రభానుచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

1. చ - ట - వివరింప. 2. రాజీవగంధి. 3. ట - మేలుప్పరంబీరసాలరసాలంబు పొదరిండ్లు దాఁటుచో. 4. ట-లోలేదు.

శ్రీరస్తు.

# చంద్రభాను చరిత్రము.

———

## చతుర్థాశ్వాసము.

క. శ్రీధర శుభావతార న, గాధాగాధారి వృత్తి విహార చరిత్రా
శ్లోధన నయబోధన వి, ఖ్యాతఘనలక్ష్మీసహాయ సత్త్రాత్రేయా. 1

వ. అవధరింపు మానసమయుంబున. 2

క. ఈరీతి సంచరించుచు, నారామవిహారకేళిలాలసమతి యై
యారామ యంతఁ జెంగట, మారుబిడారంబు లైనమావులదండన్. 3

చ. చలువలు చల్లుగొజ్జఁగులసందులఁ దుమ్మెదఱెక్కసోఁకులన్
వలిపిరిసచ్చు తేనె లిరువంకల జోరనుచోట దట్టమై
బలితపుఁదావు లీనువిరిపందిరి క్రిందటఁ గ్రమ్ము తెమ్మెరల్
తొలఁకెడు కప్రపుంజవికెలో వసియించినఁ దోఁడినెచ్చెలుల్. 4

క. వినయమున వనునయించుచు, నెనరునఁ జేపట్టికుముదినీకన్యకఁ దో
డ్కొని యేగి కేళికానన, వినుతవిశేషములు [1]విన్నవించుచు వేడ్కన్. 5

చ. చిలుకలకొల్కి చూచితివె చెంగట మ్రోయుచుఁ దేంట్లు చుట్టిరా
నలపువునీరు గ్రమ్మజలయంత్రపుఁగంబములందుఁ బైపయిం
బొలయుచు వ్రాలుచు న్నికుచము ల్దగు నీవనలక్ష్మి గాజుచా
లులియఁ జెమర్చు కేలఁ జెలువొందఁగ నమ్మనలాడుకైవడిన్. 6

చ. కను లవమాత్రనిష్ఫలవికాసతృణాకృతు లిక్షువంశముల్
గనుపుల ముత్తెముల్ గురియఁగాఁ దృణరాజములై ఫలోన్నతిం
దనరిన పూగము ల్దమయుపారతకుం దగఁ బెక్కుముత్తెము
ల్చినికినరీతిఁ బొల్చెఁగుమాళిసిపతత్కళికాసహస్రముల్. 7

చ. మఱిఁ దనుకొత్తు రాచిలుకమావులకు న్నేజి మానునట్లుగా
నురవడిఁ దేఁటిక్రొంబొగల హోరను కెంజిగురాకు మావుల
న్బిరుసులదిక్కుఁ జూపి నడపించినఁ ద్రొక్కుచు వచ్చి శంకతే
కిసుగడనల్చె మంజురుతహేషలు విూజులతాంగి చూచితే. 8

1. చ - ట - విన్నవించిరి.

శ్రీరస్తు.

# ద్రావిడభాషలలోని ఉత్తమపురుషవాచక సర్వనామము.

ఏ రెండుభాషలకును గలసంబంధమును గనుఁగొనవలయు నన్న నాభాషలలోని సర్వనామరూపముల కెట్టిసామ్యము కలదో చూచుట యావశ్యకము. భాషయొక్క బాల్యమునందే పుట్టి సాధారణముగ నెక్కుడు మార్పులను జెందక చివరవఱకును భాషలో నిలిచి యుండెడుశబ్దసంగ్రహములోఁ బురుషవాచకసర్వనామములు ముఖ్యమైన వని చెప్పవచ్చును. ఎంతయునాగరకభాషయైనను ఉత్తమమధ్యమపురుషములను సూచించుపదములు లేక యుండదు. కొంచెము హెచ్చుతక్కువగ భాషోత్పత్తితోడనే యవియుఁ బుట్టును. అట్లు పుట్టి భాష యభివృద్ధి చెందినకొలఁది నవియుఁ గొలఁదిగ మాఱుచుండునే గాని, పూర్తిగ మాఱిపోయి భాషయొక్క వేఱువేఱవస్థలలో వేఱువేఱు పురుషవాచక సర్వనామము లుండుట సాధారణముగఁ దటస్థింపదు. ముఖ్యముగ నీనియమ ముత్తమమధ్యమపురుషవాచక శబ్దములకుఁ జెల్లును. కావున వేఱువేఱు భాషలలోని యిట్టిపదములను మనము పోల్చి చూచినయెడల నాయా భాషలకుఁ బూర్వసంబంధము కలదా లేదా యని తెలిసికొనవచ్చును. ఇప్పుడు ముఖ్యముగ ద్రావిడభాషలలోని యుత్తమపురుషవాచకసర్వనామముయొక్క రూపములను గుఱించి విచారింపవలసియున్నది.

తెలుఁగు:--తెలుఁగున నేకవచనమునందు నేను అనురూపమును, బహువచనమునందు మేము మనము అనురూపములును సర్వసాధారణములై యున్నవి. ఇవి వ్యావహారికభాషయందును, గ్రాంథికభాషయందును గానవచ్చును. అట్లే పురాతనకాలపు గ్రంథములందును, నాధునికగ్రంథములందును గలవు. ఇవి గాక ఏను, ఏము, నేము అనురూపములు గూడఁ బూర్వకాల మున్నట్టు మనగ్రంథములవలనఁ గానవచ్చుచున్నది.

శబ్దమునకుఁ జివర నున్నహల్లులకు 'ఉ' కారముచేర్చి వ్రాయునట్టియుఁ బల్కునట్టియు నాచారము మనభాషలో మొదట లేదు. ఇది తరువాత వచ్చిన యాచారము; పూర్వము మనభాషలో హలంతశబ్దములు కలవు. కావున,

ఉత్తమపురుషసర్వనామములు మొదట, ఏకవచనమున ఏన్, నేన్, ఏమ్, మేమ్, మనమ్ అనురూపములు కలిగి యుండెననుట స్పష్టము. మొదట వీని లోని యేకవచనరూపములను గుఱించి కొంచెము విచారింతము.

'నేన్' అనురూపము ప్రథమావిభక్తియందే కానవచ్చుచున్నది గాని మిగిలిన యన్నివిభక్తులందును 'నాన్' లేక 'నన్' అనురూపమే యుపయోగింపఁబడును. ద్వితీయ నన్ను, తృతీయ నాచే, చతుర్థి నాకొఱకు, పంచమి నావలన, షష్ఠి నాయొక్క, సప్తమి నాయందు. ఇట్లు తెలుఁగుభాషయందు 'నాన్' అను రూపమునకే యెక్కుడు వ్యాప్తి గలదు. కావున నీశబ్దముయొక్క మొదటి రూపము 'నాన్' అనునదే యనియుఁ గాలక్రమమునఁ బ్రథమైకరూపము మాత్రము 'నేన్' గా మాఱెననియుఁ దోఁచుచున్నది. ఇందుకు దృష్టాంతముగఁ బూర్వులాంధ్రు 'నేను' అనుటకు మాఱుగ 'నాను' అనియె యనుచున్నారు.

ఇంకను సూక్ష్మముగ నాలోచింపఁగా నీశబ్దము మొదట 'నాన్' అని గాని 'నేన్' అని గాని స్పష్టముగ లేక 'న్యాను' అన్న యుచ్చారణ గలిగి యుండెనని తోఁచుచున్నది. 'న్యాన్' లోని యుచ్చు తెలుఁగునకుఁ గ్రొత్తది కాదు. అది 'తాట్యాకు' 'పుల్ల్యాకు' అనుపదములలోని యచ్చువంటిదే.

ఇఁక 'ఏన్' అనురూపమును గుఱించిన వింత చూడుఁడు. దీనికిఁ దెనుఁగునఁ బ్రథమావిభక్తియందుఁ దప్ప నితర విభక్తులలోఁ బ్రయోగము లేదు. 'ఏన్' పదముయొక్క షష్ఠీరూపము చెప్పు మని యడుగుటకు వీలు లేదు. అప్పుడు 'నాకు' అన్న 'నాన్' పదముయొక్క షష్ఠీరూపము చెప్పవలెనే గాని వేఱురూపము కానరాదు. కావునఁ దెనుఁగున 'ఏన్' రూపము లన్నియు (ఒక్క ప్రథమ తప్ప) నశించినవి. 'నాన్' రూపములే మిగిలి యున్నవి.

బహువచనరూపములను గుఱించియు నిట్టి విశేషములే కలవు. 'ఏము' రూపము ప్రథమయందే కానవచ్చును. ఇతరవిభక్తులలో నీరూపము కాన రాదు. 'నేము' అనునది ప్రాచీనగ్రంథములలోఁ గూడ నరుదుగ వచ్చును. ప్రథమావిభక్తిలో 'మేమ్' అన్న మకారయుక్తరూపమున్నను నితరవిభక్తులలో 'మా' అనురూపమే కలదు. 'మనము' అనునది యుత్తమమధ్యమపురుషులను సూచించును.

ఇఁక నితరద్రావిడభాషలలోని రూపములను విచారించి పోల్చి చూతము.

అఱవము:—అఱవభాషలో మిక్కిలి పురాతనరూపములు ఏకవచనమునందు 'యాన్', బహువచనమునందు 'యామ్', 'నామ్'. ఇవి 'తొల్

గాప్పియమ్' * లోని రూపములు ఇప్పుడు మన తెలుఁగులోని 'ఏన్' 'ఏమ్' అను రూపములకు సంబంధించినవని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. 'నాన్' అను రూపము మొదట నెనిపించిన తొల్లిటి శతాబ్దములలోని వాఙ్మయమునందుఁ గానవచ్చును. ఆభాషయందు మొదట 'నాన్' అనురూపము వ్యావహారిక భాషలో మాత్ర ముండెననియుఁ గొన్నిదినములవఱకు లాక్షణికులు దానిని గ్రహింపలే దనియుఁ బిదప గ్రహించి రనియు, 'యామ్' అనుబహువచనరూపము మొదట గ్రహించి పిదప 'నామ్' అనునేకవచనరూపమును గ్రహించి రనియుఁ దజ్జ్ఞులయభిప్రాయము ‡

ఇట్లు అఱవమునందు 'ఏన్' 'నాన్' అనురూపములు రెండు నున్నను నివి తెలుఁగులోవలెనే ప్రథమావిభక్తియందే కానవచ్చును. ఇతరవిభక్తులందు, ఏకవచనమునందు రెండురూపములు కనఁబడుటకు మాఱుగా, ఒక్క 'ఏన్' రూపములే కానవచ్చుచున్నవి. తెలుఁగులోనువలె 'నాన్' రూపములు కానవచ్చుట లేదు. ఎన్నై, ఎన్నాల్, ఎనక్కు, ఎన్నిడత్తిల్, ఎన్నుడయ, ఎన్నిల్ అనునవి అఱవమునందు, ప్రాచీనగ్రాంథికభాషలలోఁ గలద్వితీయాదిరూపములు. 'నాన్' రూపము లెచ్చటను గానరావు. కావున మూలద్రావిడభాషలో 'ఏన్' 'నాన్' అను రెండురూపము లుండెననియు, నందుండి చీలినప్పుడు అఱవవారు 'ఏన్' రూపమును గ్రహించి రనియుఁ దెలుఁగువారు 'నాన్' రూపమును గ్రహించి రనియు మన మూహింపవచ్చును. ప్రథమావిభక్తియందు నీరెండురూపములు నీరెండుభాషలందు గ్రంథాదులలో నేఁటివఱకును గలవు. కాని వ్యావహారికభాషయందుమాత్ర మీరెండుభాషలలోను 'ఏన్' రూపము లోపించి 'నాన్' 'నేన్' రూపమె నిల్చియున్నది.

ఇఁక ననేకవచనరూపములను విచారింపగా, యామ్, నామ్, నాంగళ్ అనునవి కానవచ్చుచున్నవి. కాని 'యామ్' అనురూపము, అనఁగా మన తెలుఁగులోని 'ఏమ్' అనురూపమునకు సజాతీయమైనరూప మిప్పటిభాషలో

*ఇయ్యది అఱవమందలి మిక్కిలి పురాతనవ్యాకరణము. ఇది క్రి. శ. ౭వ శతాబ్దములోని దని సాధారణముగ నందఱు నొప్పుకొనియెదరు. కాని యిది యింకను బురాతన మనియు క్రి.శ. మునకుఁ బూర్వపుది యనియుఁ గొందఱు పండితు లిటీవల వాదించుచున్నారు. దీనివాద మింకను జర్చింపఁబడవలసి యున్నది. 'తొల్కాప్పియమ్' అను దానిలోని 'గాప్పియమ్' అనునది 'కావ్యమ్' అనుసంస్కృతపదమునకుఁ దద్భవము. తొల్కాప్పియమ్ అనఁగాఁ బ్రథమకావ్య మన్నమాట. అఱవవారి వింతతద్భవముల కిది యొక యుదాహరణము.

‡ Dravidic Studies No. II.

[illegible]. ఇవి పురాతనరూపము, 'నాంగళ్' అనునది ఆధునికరూపము. ఇది యిప్పుడు 'మేమ్' అను యర్థమునందు వాడఁబడుచున్నది. ప్రాచీనము 'యామ్' అనునది వాడఁబడుచుండెను. 'నామ్' అనునది 'మన' అనునర్థమునందుఁ బ్రయోగింపఁబడును. ఇది తెలుఁగు 'నేమ్' అనుదానికి సంబంధించినరూపము. ఇవి ప్రథమావిభక్తికి సంబంధించిన నియమము. ద్వితీయాదివిభక్తుల బహువచనమునందు ఏం, నాఙ రూపములు కలవు. 'ఏం' రూపములన్నియు 'మేమ్' అనునర్థమందును 'నాం' రూపములన్నియు 'మనము' అనునర్థమునందును వ్యవహరింపఁబడుచున్నవి.

కన్నడము:—కన్నడమునందలి మిక్కిలిపురాతనరూపము ఏకవచనము 'ఆఙ', అనేకవచనము 'ఆమ్'. ఇవి తెనుఁగులోని ఏఙ, ఏమ్ తో సజాతీయములు. ఇందువలనఁ జూడ నీశబ్దము ఆఙ, ఆ్యఙ, ఏఙ అని మూఁడువిధముల నుచ్చరింపఁబడుచుండెననియు, ఆఙ అనురూపము కన్నడమువారిదని, ఏఙ అనురూపము తెలుఁగువారిదని ఆ్యఙ అనురూప మఱవవారిదియు నని కానవచ్చుచున్నది. ఈయుచ్చారణములే నాఙ, న్యాఙ, నేఙ లోఁ బ్రతిఫలించినవి. న్యాఙ రూప మిప్పు డేభాషలోను సలక్షణరూపముగ గ్రహింపఁబడుట లేదు. గ్రామ్యభాషయందుఁ గానవచ్చుచున్నది. ఈ 'ఆ్యం' మరల 'ఏఙ' రూపమును గ్రహించెను. ఇట్లు ప్రథమావిభక్తిరూపములను గుఱించి విచారించి ద్వితీయాది రూపములకు వత్తము. 'ఏఙ' అనునది ద్వితీయాదివిభక్తు లన్నిటియందును 'ఎఙ' అను హ్రస్వరూపమును దాల్చును. ఎన్నం, ఎన్నిం, ఎనగె, ఎన్నత్తణిం, ఎన, ఎన్నాళ్, ఇవి పురాతనపు ద్వితీయాద్యేకవచనరూపములు. ఎమ్మం, ఎమ్మిం, ఎమగె, ఎమ్మత్తణిం, ఎమ అనునవి బహువచనరూపములు.

కన్నడమునందు నొకవిశేషము. ద్రావిడులలో భాషావిషయమై అఱవవారు 'ఏఙ' తెగవా రనియు, తెలుఁగుశాఖవారు 'నాఙ' తెగవా రనియు నే నిదివఱకుఁ జెప్పియున్నాను. కన్నడమువారు మొదట 'ఏఙ' తెగలోఁ జేరినవారుగ నుండి తరువాత 'నాఙ' తెగలోనికి వచ్చి చేరిరి. పురాతనకాలపు కర్ణాటకవాఙ్మయమునందు 'నాఙ' రూపము లేదు. అంతటను ఆం, ఆఙ 'ఎఙ' రూపమే కానవచ్చును. ౧౧, ౧౨వ శతాబ్దములతరువాత 'నాఙ' రూపము ప్రవేశించెను. అయినను పెక్కుదినములవఱకును లాక్షణికులు దానిని వెలివేసియే యుంచిరి. ౧౫, ౧౬వ శతాబ్దములలో వ్రాయఁబడిన వ్యాకరణ గ్రంథములలోఁ గూడ 'ఏఙ' రూపములనే యుదాహరించిరి. భట్టాకలంకుఁ

డనువాఁడు కర్ణాటభాషకు సంస్కృతమున శబ్దానుశాసన మన్న గొప్పవ్యాకరణము వ్రాసెను. అది యనేకవిధముల నాంధ్రభాషావిదులకు నుపయోగకరమైనది యని నా తాత్పర్యము. అందు నీ 'ఏఙ్' 'నాఙ్' రూపములను గూర్చి చెప్పఁబడినవిషయము ద్రావిడభాషాచరిత్రపరిశోధకులు చక్కఁగఁ గమనింపఁదగినది. ఇది ౧౬వ శతాబ్దమున వ్రాయంబడిన గ్రంథమైనను, ౨౮౭వ సూత్రమునందు 'ఏఙ్' రూపములే యీయఁబడినవి. కాని యీతనికి 'నాఙ్' రూపములు గూడ సమ్మతములే. అయినను వానిని స్పష్టముగా నొప్పుకొని మూలసూత్రములో వానికిఁ దావిచ్చినయెడల నితరవైయాకరణులు తనను నిందింతు రన్నభయముననో మఱియేహేతువుననో సూత్రములో నీరూపముల నీయక అందుపై తానే వ్రాసినటీకలో మాత్ర మీరూపముల నుదాహరించి, యివిగూడ నంగీకరింపఁ దగినవని చర్చించినాఁడు. అందలి కొన్నివాక్యముల నిచ్చట నుదాహరించుచున్నాను.

"అత్ర తనాదిప్రకరణే అస్మదర్థవాచకో 'నఙ్' శబ్దః కశ్చి దస్తి. ప్రత్యయాపి తస్య తనాది సాధారణోక్తలక్షణేన నవిలక్షణా. రూపనిష్పత్తిశ్చ నాఙ్, నామ్; నన్నం, నమ్మం; నన్నిం, నన్నిందె; నన్నిందం........ఇత్యాది ప్రయోగశ్చ" అని యీరూపములు ప్రామాణికకవులచేఁ బ్రయోగింపఁబడిన వని చూపుటకుఁ గొన్నిప్రయోగములఁ జూపెను. 'ఇతి బహుళ ముపలభ్యతే' అని కొన్ని పూర్వపక్షముల ఖండించి యిట్లనియెను. "అతో ఽత్రాస్మదర్థవాచకో నఙ్ శబ్ద ఏవ అభిమన్తవ్య ఇతి. తథాపి న కైశ్చిదే వాఙ్గీక్రియతే ఉత్తరమార్గానుగామిభిః కవీశ్వరై ర్నాసర్వైః. దక్షిణమార్గానుయాయిభి స్తై రనంగీకారాత్. ఏ న్పక్షపాతినో హి దాక్షిణాత్యాః కవిజనా ఇతి."

పైవాక్యములవలనఁ గన్నడకవులలో నుత్తరసంప్రదాయమువా రనియు, దక్షిణసంప్రదాయమువా రనియు రెండుతెగ లుండె ననియు, వారిలో నుత్తరసంప్రదాయమువారు మాత్రము 'నాను' రూపము నంగీకరించి రనియు, దక్షిణసంప్రదాయమువారికి 'ఎఙ్' రూపమునందే పక్షపాత మనియు స్పష్టపడుచున్నది. కన్నడదేశమందలి యుత్తరభాగము తెనుఁగుదేశమునకు సమీపముం దుండుటయు, దక్షిణభాగ మఱవదేశము నంటుకొని యుండుటయు సువిదితమె. కావున తెనుఁగువారినుండి కన్నడమువారు 'నాఙ్' రూపము నిటీవల— అనఁగా ౧౦, ౧౧వ శతాబ్దములనుండి—గ్రహించిరనియు, నంతకుఁబూర్వము అఱవదేశములో వాడుకలోనున్న 'ఏఙ్' రూపము కొంతకాలము ఆం (ఆఙ్)

రూపముగాను తెలుగుభాష 'ఏన్' రూపముతోను కొంతకాలమునుండి తరువాత క్రమముగ లోపించి, నేఁడు కన్నడదేశమునందు 'నాన్' రూపమే మిగిలిన దనియు 'ఏన్' రూపము పూర్తిగ లోపించిన దనియు మన మూహింపవచ్చును. ఇట్లు తెలుఁగుభాష కన్నడముపైఁ దనముద్ర వేసెను.

మొదట ద్రావిడభాష యనుమహానది రెండుశాఖలుగఁ జీలెను. ఒకటి 'ఏన్' శాఖ, రెండవది 'నేన్' లేక 'నాన్' శాఖ. మొదట కన్నడము 'ఏన్' శాఖలోనుండి చీలిన పాయయే. కాని తరువాత పాఱుచువచ్చి, 'నాన్' శాఖలోనో, అందుండి చీలివచ్చిన పాయలోనో కలిసినది కృష్ణాగోదావరులు స్వతంత్రనదులైనను వానిలోనుండి వచ్చిన కాల్వలు కలిసికొనుట మన మెఱింగినవిషయమే.

మళయాళాదిభాషలు:—మలయాళభాషయందలి యీశబ్దముల రూపములను విచారించినను, అందును నాన్, ఏన్ రూపములు కానవచ్చుచున్నవి. ఏకవచనమునందు 'ఞాన్' అనురూపము గలదు. బహువచనము నామ్, నోమ్, నమ్మళ్, ఞాఙ్ఙళ్, ఏఙ్ఙళ్. చివరరూపమునకు గ్రామ్యమునందు నెక్కుడు ప్రచారమున్నది.

తుళుభాషలో ఏకవచనము 'యాను', బహువచనము 'యెంకుళు'. 'కుళు' బహువచనప్రత్యయము. ఏకవచనమునందలి 'యాను' అనునది పురాతనకాలపు టఱవమునందలి రూపముతో సమానమైనది. బహువచనమునందలి యెంకుళు లోని మొదటియచ్చు ఎత్వము. కావున 'ఏన్' అనుమనభాషలోఁ గలరూపమును, 'యాన్' అనిన అఱవములోఁ గలరూపము 'ఆం' 'ఆన్' అన్న కన్నడరూపములును ఏకశబ్దభవము లనుట స్పష్టము. అట్లే న్యాన్, నేన్, నాన్ అన్నరూపములుగూడ నొక్కటిలో నుండి మఱియొక్కటి జనించిన వనియుఁ జెప్పవచ్చును.

ఇట్లు ముఖ్యములైన ద్రావిడభాషలలో నన్నింటిలోను ఏన్ రూపము, నాన్ రూపము కలదు. కొన్నిటిలో నాన్ రూపప్రాధాన్యమును, గొన్నిటిలో ఏన్ రూపప్రాధాన్యమును గానవచ్చుచున్నది.

ఇఁక ద్రావిడశాఖలోని అనాగరకభాషలను గుఱించి విచారించిన యెడల, కొఱవభాషలలో ఏకవచనము నా, నాను; బహువచనము నాగ. కైకాడిభాష ఏక. నా, నాన్; బహు. నాన్గ్. తోదభాష అన్, ఆన్, ఓమ్, ఎమ్. కురుఖ్ భాష ఏక. ఏన్; బహు. ఏమ్, నామ్. మాల్టోభాష ఏక. ఏన్; బహు. ఏమ్. ద్వితీయాదిరూపములలో ఎన్ రూపము వచ్చును. ఇది అఱవ

సంప్రదాయమునకు వ్యతిరేకము. అందు నాఙ్ రూపము ప్రథమావిభక్తియందు మాత్రము గానవచ్చును. ఇతరవిభక్తులలో ఏఙ్ రూపమే ప్రధానము. కోయ భాష, ఏక. అను, బహు అము, అజు. ద్వితీయాదివిభక్తులలో 'నఙ్, నా' రూపములు. బహువచనమందు మన్, మా. గోండభాషలో ఏకవచనమందు నన్నా, అన్నా అను రెండురూపములు గలవు. బహువచనమందు మమ్మాట్ అను ఒకరూపమే కలదు. ద్వితీయాదిరూపములలో నేకవచనమునందు 'నా' బహువచనమునందు 'మా' రూపములు కలవు.

ఇట్లు వేఱు వేఱు భాషలలోని రూపములను దెలిసికొనిన తరువాత వీనికిఁ గలభేదములను సంబంధములను గుఱించి విచారింతము. ఈరూపము లన్నియు నొక్కచోటఁ గనఁబడుటకై ప్రక్కపుటలోఁ బట్టికగ నిచ్చినాఁడను.

మొదట నేకవచనరూపములను గుఱించి చూడఁగాఁ దెనుఁగు, అఱవము, కన్నడము, మళయాళము ఈనాలుగునాగరకద్రావిడభాషలలోను ఏఙ్ నాఙ్ ఈరూపములు రెండును గానవచ్చుచున్నవి. అఱవమునందు నిప్పుడు ప్రథమైక వచనమునందు 'ఏఙ్' లేకపోయినను పూర్వకాలమునందు 'యాఙ్' అను రూపముండెను. కన్నడమునందు 'ఆఙ్' రూపముండెను.

'ఏఙ్' 'నాఙ్' అనురెండురూపములును మొదటినుండి యుండెనా? లేక యొకదానినుండి మఱియొకటి పుట్టెనా? ఉత్తమపురుషవాచకసర్వనామములు భాషలో నొకటికంటె నెక్కుడుండవలసిన యావశ్యకత లేదు. ఒక్కటి యుండినఁ జాలును. కావున మూలభాషలో మొదట నొక్కటియే యుండె ననియుఁ, దరువాత నందుండి రెండవది పుట్టె ననియు నూహింపవలెను. రెండును స్వతంత్రము లని యనుకొనుటకు వీలులేదు. కాని యీరెండురూపములును మిక్కిలి పురాతనకాలమునుండియుఁ గానవచ్చుచున్న వన్నమాట మఱవరాదు. ద్రావిడభాషాగ్రంథములలో మిక్కిలి పురాతనమైన తొల్కాప్పియము నందు నాఙ్, యాణ్ ఈరెండు రూపములును గలవు. కురళ్ గ్రంథమునందు యాఙ్ నామ్ అనురెండు బహువచనరూపములును గలవు. కావున మొట్టమొదట నొక్కరూప మున్నను ఈరెండురూపములును మిక్కిలి పురాతనకాలముననే యేర్పడిన వని తలంపవలెను. గ్రంథము లేర్పడువఱకు నీరెండురూపములున్నవన్నంతమాత్రమున నవి మొదటినుండియు నుండె నని తలంపఁ గూడదు. తొల్కాప్యం క్రీ. శ. 2వ శతాబ్దపునాఁటి దని కొందఱు చెప్పెదరు. మఱి కొందఱు అఱవభాషలో మిక్కిలి పురాతనకాలముననే వాఙ్మయ ముండె నని

చెప్పువారు, ఈ కావ్యము క్రీ. శ. ౧వ శతాబ్దమునాఁటి దని యనియెదరు. ఈవాద మెట్లున్నను ద్రావిడభాష యంతకుఁ బూర్వము కనీసము ౧౦౦౦ సంవత్సరములక్రింద నైన నుండితీరవలయును. కావున నేకరూపముగల కాలము వాఙ్మయము పుట్టుట కెంతయో పూర్వపుదియై యుండవలెను. వాఙ్మయము పుట్టువఱకే యీ రెండు రూపములు పుట్టియున్నను నందు మొదటిది యెద్ది తరువాతిది యెద్ది యని కనుఁగొనుటకు వాఙ్మయమునందు సూచనలు కలవు.

| భాష. | ఉత్తమపురుషవాచక సర్వనామము. | | ద్వితీయాదికముల ప్రాతిపదికరూపము. | |
|---|---|---|---|---|
| | ఏకవచనము. | బహువచనము | ఏక వచనము. | బహువచన. |
| 1. తెలుగు . | ఏను, నేను. | ఏము, నేము, మేము, మనము | నా. | మా. |
| 2. అఱవము . | యాన్, నాన్ | యామ్, నామ్, నాంగళ్. | ఎన్. | ఎన్, నమ్. |
| 3. కన్నడము . | ఏన్, ఆం, (ఆన్), నాన్. | ఆం, ఆవు, నావు. | ఎన్, నన్. | ఎమ్, నమ్. |
| 4. మలయాళము. | ఞాన్. | నామ్, నోమ్, నమ్మళ్, నుమ్మళ్. | ఎన్. | నన్, నమ్. |
| 5. తుళు . | యాన్. | ఎంకులు, నమ. | యెన్. | నమ్. |
| 6. గోండి . | అన్నా. | అమ్మాట్. | నా. | మా. |
| 7. కోడు . | ఆను. | ఆజు, ఆము. | నన్. | మన్. |
| 8. కురుఖు . | ఏన్. | ఏమ్, నామ్. | ఎన్. | ఎమ్. |
| 9. సంస్కృతము . | అహం. | వయమ్. | మ. | అస్మ. |
| 10. హిందీ . | మైఁ. | హామ్. | మేరా. | హామారా. |
| 11. బంగాలి . | ముయ్, ఆమి. | ఆమరా, మోరా. | ఆమా. | ఆమాది. |
| 12. మరాటి . | మీఁ. | ఆమ్హీఁ. | మా. | ఆమ్. |
| 13. పాలి . | అహం | మయం, అమ్హే. | మ. | అమ్హా. |
| 14. ప్రాకృత . | అమ్మి. | అమ్హే. | మ. | అమ్హా. |

ఇట్లు 'ఏన్' అనునది మూలశబ్ద మని తెలిసికొనినపిదప దీనిస్వరూప మును గుఱించి విచారింతము. అఱవమున యాన్, తెనుఁగున ఏన్, కన్నడ మున ఆన్, అని యిది యుచ్చరింపఁబడును. అఱవమందలి యశ్రుతి లఘువు గాన నది 'ఆ' కారముతో సమానమే. అఱవమందలి ఆకారము తెనుఁగునందు ఏకారముగ మాఱిన యుదాహరణములు పెక్కులు కలవు. ఆఱు, ఏఱు; ఆళు, ఏలు; తా, తే. అఱుక, ఎఱుక; అఱ్ఱు, ఏడు ఇత్యాది. కాని యీయక్ష రము తెనుఁగునందు మాత్రము ఏగా మాఱి యూరకుండలేదు. అఱవమున నే ద్వితీయాది విభక్తులనుండి 'ఏన్' రూపమునే గ్రహించినది. కురుఖ్, మాల్టొ భాషలలో ఏన్ రూపమును బొందినది. కావున మూలభాషలలో నీయక్షరము కేవలము ఆకారముగ మాత్ర ముండె నని తోఁపదు. ఆకారమునకు ఏకార మునకు మధ్యగా నుండియుండవచ్చును. అందుచే నది కొన్నిచోటుల ఆకార ముగను, కొన్నిచోటుల ఏకారముగను మాఱినది. ఒక్కభాషలోనే కొన్నిరూప ములలో ఆకారముగను, కొన్నిరూపములలో ఏకారముగను మాఱినది. తెనుఁగు నందు 'నేను' లో ఏకారముగను నాకు, నాయొక్క యిత్యాదులలో ఆకారము గను మాఱినది. కావున నీ ధ్వనియొక్క మూలోచ్చారణ నేను బూర్వము సూచించినట్లు 'తాట్యాకు' లోని రెండవస్వరములాగున నుండియుండును. భాషకు నాగరకత వచ్చి యక్షరసమామ్నాయాదు లేర్పడు నప్పు డీ ధ్వనిని లక్షణవేత్త లంగీకరింపక విడిచివేసిరి. ఈ యుచ్చారణ యిప్పటికిని గ్రింది తరగతిజాతులవారిలోఁ గానవచ్చుచున్నది. 'నేను' అనుటకుఁ గొందఱు 'న్యాన్' అందురు.

ఇఁక నీ స్వరము హ్రస్వమా దీర్ఘమా యని విచారింపవలెను. కర్ణాట వ్యాకరణాదులలో 'ఎన్' 'నిన్' 'తన్' అనునవి మూలశబ్దములయినట్టును ఏన్, నీన్, తాన్ అనునవి ప్రథమారూపములయినట్టును వ్రాయఁబడియున్నది. అఱవమునందలి ద్వితీయాది రూపములలో హ్రస్వ ఎన్ రూపమె కానవచ్చు చున్నది. ప్రాఁతకన్నడమునందును, తుళువునందును, మాల్టొభాషలోను ద్వితీ యాదుల కీరూపమే కలదు. తెనుఁగున నన్నివిభక్తులందును దీర్ఘముగ నున్నను ద్వితీయయందు 'నను' అను హ్రస్వస్వరము కానవచ్చుచున్నది.

కొందఱిమతమున మొదట ఏన్ అన్న దీర్ఘరూపమె కల దనియుఁ, దరు వాత ద్వితీయాదిప్రత్యయములు తగిలినప్పు డూఁత రెండవయక్షరముపైఁ బడి నందునఁ గ్రమముగ మొదటియక్షరము హ్రస్వమై పోయెననియు ననఁగాఁ

పూర్వము తెనుఁగున నాను అను రూప ముండి తరువాత నను ఆయెను అని. మొదట 'ఎన్' అను హ్రస్వరూపమె యుండెనని కాని, ఏన్ అనుదీర్ఘరూపమె యుండెనని కాని నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేదు. ద్రావిడభాషలన్నిటిలోను రూపములను బరికించిచూడఁగా 'ఏన్' అను దీర్ఘరూపమె మొదటినుండి యుండెనని తోఁచుచున్నది.

ఇఁక మన నిత్యపరిచిత మైన 'నాన్' రూపమును గుఱించి విచారింతము. ఇది 'నేన్' అను ఏకవచనముగలిగి యొక్క తెనుఁగులోనే కానవచ్చుచున్నది. ఇతర భాషలలో 'నాన్' అను ఆకారరూపము గలదు. తెనుఁగునందలి ద్వితీయాది విభక్తిరూపములలోని మూలశబ్దమును జూచినను 'నాన్' రూపమె కానవచ్చును. కావున మొదట 'నాన్' లేక 'న్యాన్' రూప ముండవచ్చును.

'నాన్' లో లేక 'నేన్'లో మొదట నొకనకారమును, చివర నొకనకారమును గలవు. ఇవి రెండు మొదటినుండి యుండెనా? ఇవి శబ్దస్వరూపమునకు నావశ్యకము లని యెంచఁబడుచుండెనా? మొదటిది 'ఏన్, శబ్ద మనియు దానికి మొదట నకారము చేరి 'నేన్' అయ్యె ననియు మన మిదివఱకుఁ దలఁచితిమి. ఇందుకు నింకొక దృష్టాంతము కలదు. ద్రావిడభాషల నన్నింటిలోను క్రియాపదముల చివర ప్రత్యయములు పురుషవాచకసర్వనామములను బట్టి వచ్చినవి. అందు అఱవ, మలయాళ, కన్నడ, తుళు, కుయి, గోండి మొదలయినయన్ని భాలషలలోను ఎన్, గా 'నాన్' గా 'నన్' గా లేదు. తెనుఁగునఁగూడ ఇన్, ఇ, అన్ అను ప్రత్యయములే కలవు. కావున 'న' కారము వెనుకనుండి వచ్చిన దని మనము నిశ్చయింపవచ్చును. ఇట్లు శబ్దారంభమున అచ్చులుగ నున్న యక్షరములకు మొదట నకారము వచ్చి చేరుట మఱికొన్నిశబ్దముల యందుఁ గానవచ్చుచున్నది. మధ్యమపురుషవాచకములు ఈవు, నీవు అనునవి యిట్టివియే. తెనుఁగున 'ఈఁడు' అనుశబ్దము కలదు; దీనికి నఱవమున 'నీన్దు' అన్నరూప మేర్పడినది. ఇట్లే ఏన్ 'నేన్' అయి యుండవచ్చును. ఇందు నొకనియమమె కానవచ్చుచున్నది. మొదటియచ్చు తరువాత నకార మున్నయెడల దానిసాహచర్యమునుబట్టి అచ్చునకుఁ బూర్వమందును నకారము వచ్చిచేరును. 'ఈఁదు' లో నఱసున్న యున్నది. కావున నది మొదట 'ఈన్దు'నడుమనున్న నకారప్రభావమునఁ బూర్వమందు నొకనకారమువచ్చెను. న్ + ఈన్దు = నీన్దు. ఇట్లే ఈవు, నీవుల గుఱించి యెఱుఁగవలెను. ఇందచ్చునకుఁ దరువాత నకారము లేదని చదువరులు సంశయింపవచ్చును. కన్న

మెయుండును ఏకవచనము నీను (నీన్), బహువచనము నీర్. కన్నడమునందలి ప్రాచీనరూపము కూడ నేకవచన మున్నది. మొదట గ్రాంథ్యములో నుండు మధ్యమపురుష బహువచనము గౌరవార్థ మేకవచనముగ మాఱుట పెక్కు భాషలలోఁ గలదు. ఇంగ్లీషునందు యూ (you) అను బహువచనము ఇప్పుడు ఏకవచనార్థమందు వాడుచున్నారు. అట్లే తెనుఁగున మొదట నీన్ అను ఏక వచనమును నీర్ అను బహువచనమును ఉండెనేమో. 'నీన్' యొక్క మొదటి రూపము ఈన్ అనుట స్పష్టము. కన్నడ 'ఈన్' లోని చివరి నకారప్రభావమునఁ బూర్వమందు నొకనకారము వచ్చి చేరెను. కావున నీమూఁ ఉదాహరణ ములవలనఁ బైనియమము మేల్పడుచున్నది.

ఇఁక 'నేన్' లోని రెండవ నకారమును గుఱించి విచారింతము. ఇది శబ్ద స్వరూపములోనిదా? ప్రత్యయములోనిదా? ఇది శబ్దస్వరూపములోనిది కానట్లు కానవచ్చుచున్నది. ఇది యేకవచనమందే కాన్పించును. బహువచనమునందుఁ గాన్పింపదు. నేను నేము మేము. ఏను ఏము. అఱవమునందును మఱికొన్ని ద్రావిడభాషలందును 'న్' అనునది పుల్లింగమును సూచించునట్టి యేకవచన ప్రత్యయము ఏక. రామన్, బహు. రామర్. తెనుఁగున నీనకారము ద్రుతము. అనఁగా నిది లోపించి 'నే' 'ఏ' అనురూపములు మాత్రము నిల్చి యుండుట గలదు. ఇట్టి కారణములఁ బట్టి చూడ నిది మొదట నేకవచనసూచకముగ వచ్చిన దని తోఁచుచున్నది.

ఇట్లు మొదటి నకారమును చివరినకారమును బోఁగా నిఁక మధ్య 'ఏ'కారము నిల్చినది. ఇదియే మొట్టమొదటి యుత్తమపురుషైకవచనసర్వ నామము. ఇది కొన్ని భాషలలో 'ఏ' గను, కొన్నిఁటిలో 'యా' లేక 'ఆ' గను నుండుటచే దీనియుచ్చారణము మొదట 'ఆ' అని గాని 'ఏ' అని గాని స్పష్ట ముగా లేక యీరెండిటికిని మధ్యగా 'ఆ్య' 'యా' అని యుండెడి నని యూహింప వచ్చును. ఈ విధముగ మొదట నుత్తమపురుషసర్వనామమునకు 'ఆ్య' అను అచ్చును మధ్యమపురుషసర్వనామమునకు 'ఈ' అను అచ్చును ప్రథమపురుష సర్వనామమునకు 'ఆ' అను నచ్చును సూచకములుగ నుండినట్లు కానవచ్చు చున్నది.

---

*కొన్ని దినములకు బహువచనమే యేకవచనముగ మాఱి, ఏకవచనరూపము లోపించెను. అంతఁ గొంతకాలమునకు నిది బహువచన మన్న మాట పూర్తిగ మఱుఁగుపడి దానికి 'మీరు' అనిన క్రొత్తబహువచనము పుట్టెను. ఇది ఈర్ శబ్దమునకు మకారాదేశమై పుట్టెను.

ఇంక బహువచనరూపములను గూర్చి విచారింతము. మేము, ఏము నేము, అనునవి బహువచనరూపములు. వీనిలో ఏమ్, నేమ్ అనునవి యిప్పటిభాషలో లేవు. పురాతనభాషయందును వీనిప్రయోగములు తక్కువ. ఇవియైనను ప్రథమావిభక్తియందె కానవచ్చుచున్నవి. కాని యితరవిభక్తులకు సంబంధించినరూపములు కానవచ్చుట లేదు. మేము, మనము అనిన రూపములకే వ్యాప్తికలదు.

'నేము' 'ఏము' లతోఁ బోల్పఁదగినవి అఱవమునందలి 'నామ్' 'యాం' రూపములు. కన్నడమున నీరూపములు కలవు. 'మ'కారము బహువచన ప్రత్యయము. వీనిలో 'యాం' పురాతనము 'నామ్' ఇటీవలది. కాని తెలుఁగున ఈ 'నాం' లేక 'నేమ్' కూడఁ బురాతనమే. ఇట్లు తెనుఁగు 'ఏం' 'నేం' రెంటిని బరిత్యజించి 'మేమ్' 'మనమ్' అను శబ్దముల గ్రహించెను. ఈశబ్దముల విశేషమేమనఁగా బహువచనసూచక మగుచివర మకారముగాక యిందు మొదటి మకారముఁ గలదు. ఇట్టి తొలిమకార మితరద్రావిడభాషలలో నెచ్చటను సర్వనామ బహువచనమునందుఁ గానరాదు. ఇది తెనుఁగునందుమాత్ర మెట్లు వచ్చెను? కొంతశోధించి చూతము.

తెనుఁగునందలి 'మన' శబ్దమును తీసికొందము. ఈపద మెదుటివానిఁ గూడఁ గల్పుకొని మాటాడిన ట్లర్థమిచ్చును. ఇది యుత్తమమధ్యమపురుషసూచకము. ఈయర్థమునందే యఱవమున 'నామ్' శబ్దము వాడెదరు. 'మేము' అన్న యర్థమునందు 'నాంగళ్' రూపము వచ్చును. కన్నడమున నిప్పుడు వాడుకలోని రూపము 'నమ్' అనునదియే (ప్రథమతప్ప). ఈశబ్దముయొక్క వేఱుభాషలలోని యీక్రింది రూపములు చూడనగును.

| | తెలుఁగు. | అఱవము. | కన్నడము. |
|---|---|---|---|
| ద్వి. | మన(ను) | నమ్మ(ఐ) | నమ్మ(న్ను) |
| చ. | మన(కు) | నమ(క్కు) | నమ్మ(గె) |
| ష. | మన | నమ్ | నమ్మ |

ఈరూపములను బట్టి చూడఁగా అఱవములోని 'నమ్' కన్నడములోని 'నమ్మ' శబ్దములే (లేక వీనిపూర్వరూపమగు 'నమ' అనునదియె) అక్షరక్రమము మాఱి తెనుఁగులోని 'మన' అయిన దనుట స్పష్టము. తెనుఁగునను నితరద్రావిడభాషలలోను (కొన్ని యార్యభాషలలోను) షష్ఠీరూపమె ప్రాతిపదికము. దానిమీఁదనే యితరవిభక్తి ప్రత్యయములు వచ్చును. 'మన' అనునది ప్రాతిపదికముగ నేర్పడిన తరువాత సర్వనామసంబంధమైన బహువచనప్రత్యయమగు

'మ్' కూడ దానికిఁ జగిలించిరి. ఇట్లు 'మనము' నందలి రెండుమకారములును దెనుఁగునకు సిద్ధించెను.

ఉత్తరమున "మనము" అన్నశబ్దమునకు వ్యాప్తి కలుగఁగా బహువచనము నందు మొదట 'మ' కార ముండవలయును గాని 'న' కారముండఁగూడ దని తలఁచి 'నేము' శబ్దమును జాఱవిడిచి, 'మేము' శబ్దమును బుట్టించిరి. క్రమముగ మేము 'మీరు' శబ్దములకే వ్యాప్తిగల్గి ఏము నేము శబ్దములు భాషనుండి లోపించెను.

మేము, మనము అను రెండురూపములు తెలుఁగున నున్నటులే అఱవము, మలయాళము మొదలయిన కొన్నిద్రావిడభాషలలోఁ గలవు. కాని కన్నడమునందును, గోండిభాషయందును నిట్టి రూపద్వయము లేదు. సంస్కృతమునందును బ్రాకృతములందును గానరాదు. హిందీలో 'అపణ్' మహారాష్ట్రమున 'ఆపణ్' అనురూపము లీయర్థమునందుఁ గానవచ్చుచున్నవి. కాని మొత్తముమీఁద నీరూపములు గౌడీయభాషలందును విశేషముగ వ్యాపించి లేవు. ఇట్లు ద్రావిడభాషలకుఁ గాని యార్యభాషలకుఁ గాని చెందని యీరూపద్వయ మెచ్చటిది యైయుండును? ఉత్తరమందలి యార్యభాషలకును, దక్షిణమందలి ద్రావిడభాషలకును నడుమ 'ముండ' నామముగల కొలేరియన్ భాషలు కలవు. ఆభాషలలో నుత్తమపురుష బహువచనమందు నీరూపద్వయమును గలదు. కావున వారిసంపర్కమునఁ గొందఱు ద్రావిడులును, ఈరూపమును గ్రహించి యుందు రని కొంద ఱభిప్రాయ మిచ్చియున్నారు.* కొంద ఱార్యులును వారి సంపర్కమున నిట్టిరూపములనే తీసికొనిరని నాతాత్పర్యము. ఇచ్చటఁ దీసికొని రన్నది శబ్దరూపము గాదు శబ్దార్థము.

సంస్కృతముతో సంబంధము.

ఇఁక సంస్కృతమందలి ఉత్తమపురుషసర్వనామమునకును ద్రావిడభాషలలోనిదానికిని నేమైనఁ బూర్వసంబంధ ముండనోపునేమో విచారింతము. హిందూదేశమందలి భాషలన్నియు గౌడద్రావిడభాషలుగాఁ జీలియున్నను నీ రెండుకొమ్మలును మఱియొక పెద్దశాఖలోనుండి చీలియుండిన నుండవచ్చును. ఇప్పుడు సంస్కృతమనుభాషగూడఁ బూర్వమున్న మఱియొక మూలభాషయొక్క వికృతియై యుండనోపు. ద్రావిడభాషలకు మూలమైన భాషకూడ దాని చెల్లెలై యుండ నోపు. నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేదు. అల్పస్వల్పమైన సాదృశ్యము

*Grierson-Linguistic Survey of India Vol. IV.

లున్నందున నిట్టు లూహింపవలసి వచ్చుచున్నది. ఇంక సాదృశ్యకల్పముల వెతకెదము.

'అహమ్' అను పదమునకును, అఱవమందలి 'యాం' కన్నడమందలి 'ఆం' పదమునకును గొంత సామ్యము కలదని కొందఱ అనుకొన వచ్చును. తెలుఁగులోని 'ఏం' దీనిని పోలినది. ఇవి ద్రావిడభాషలలో బహువచనమును సూచించును. 'అహం' ఏకవచనమును బోధించును. కాని హిందీలోని 'హం' మరాటీలోని 'ఆమ్హీం' అనునవి 'అహం' భవములనుట సిద్ధము. అవియు బహుత్వమునె సూచించును.

సంస్కృతమునందు నుత్తమపురుషబహువచనమునందు 'నః' అను ఒక రూపము కానవచ్చును. ఇది ద్వితీయాచతుర్థీషష్ఠీవిభక్తులయందుఁ గాన్పించును. ఈవిభక్తులందైనను ఇది రెండవరూపముగ వచ్చును. ద్వి. అస్మాన్, నః, చ. అస్మభ్యం, నః, ష. అస్మాకం, నః ఈనకారమె ద్రావిడభాషలలోని 'నా' యను దానికి సజాతీయమని కొందఱ అనుకొననచ్చును.

అట్లె సంస్కృతమున ఏకవచనమునందు ద్వి. మా, చ. మే, ష. మే, అను వైకల్పికరూపములు కలవు. అవియే 'మేమ్' 'మా' అను తెనుఁగుపదములకు సంబంధముకలవియని కొందఱ అభిప్రాయపడవచ్చును. ఇచ్చటను వచనవ్యత్యాసము కలదు. సంస్కృతమున 'మా' అనునది ఏకవచనము. తెలుఁగున బహువచనము. కాని యొక్కభాషలోనుండి మఱియొకభాషలోనికి మాఱునప్పుడు వచనములు తాఱుమాఱగుట యొకవింత కాదు. ఇట్టి యుదాహరణము లెన్నియో కలవు.

కాని 'నః' 'మా' అను రూపములు సంస్కృతమున వైకల్పికములు; సహజములు కావు. అపవాదమువంటివి. సహజరూపములుండగా మీఁదుమిక్కిలి తెచ్చిపెట్టుకొనునవి. అన్నివిభక్తులలోను నీరూపము కానరాదు. అహంయొక్క విభక్తిరూపములన్నియుఁ గ్రింద నిచ్చుచున్నాఁడను.—

| | | | |
|---|---|---|---|
| ప్ర. | అహం | ఆవాం | వయం |
| ద్వి. | మాం, మా | ఆవాం, నౌ | అస్మాన్, నః |
| తృ. | మయా | ఆవాభ్యాం | అస్మాభిః |
| చ. | మహ్యాం, మే | ఆవాభ్యాం, నౌ | అస్మభ్యం, నః |
| పం. | మత్ | ఆవాభ్యాం | అస్మత్ |
| ష. | మమ, మే | ఆవయోః, నౌ | అస్మాకమ్, నః |
| స. | మయి | ఆవయోః | అస్మాసు |

కావున నీరూపములు సంస్కృతములోనికిఁ గ్రొత్తగ వచ్చినవనుట స్పష్టము. మొదట నుండినవి కావు. అందుచే ద్రావిడులయొద్దనుండియె సంస్కృత మీరూపములను గ్రహించెనని యేల తలంపరాదు? ద్రావిడభాషలలో నీరూపములు సహజములు. ఇవితప్ప వేఱు రూపములు లేవు. సంస్కృతమున వేఱు రూపములున్నవి. ఇవి మూఁడు విభక్తులందు మాత్రము సహజరూపములకు జతగానున్నవి. 'నః' అనునది మూఁడువిభక్తులందును నేకరూపమునె కలిగియున్నది. ఇది సంస్కృతమందలి మూలరూపమె యయినయెడల దీనికి భిన్నవిభక్తులలో భిన్నరూపము లుండవలెను. కావున వీనిని సంస్కృతము, ప్రాకృతమునుండియైనను గ్రహించియుండవలయును; లేదా యీరెండుభాషలకు జననియైన మఱియొక పురాతనభాషలోనుండియైనను నివి పుట్టియుండవలెను.

మఱియొక సాదృశ్యము. పైసాదృశ్యముగాక సంస్కృతమందలి యేకవచనరూపములను జూచితిమేని, ప్రథమావిభక్తియందుఁ దప్ప, నితరవిభక్తులన్నింటియందును 'మ'కారము ప్రాతిపదికముగఁ గానవచ్చును. గౌడభాషలలోను నీయక్షరము ప్రాతిపదికముగఁ గానవచ్చును. కొన్నిటిలో 'మ'కారముగను, మఱికొన్నిటిలో 'మె'కారముగను నుండును. మరాటి మలా (నాకు), మాఝేఁ (నా). హిందీ మేరేకో (నాకు), మేరా (నా). ఈమకార మితరార్యభాషలలోను గలదు. తుదకింగ్లీషులోని మీ (me), మై (నా) అనురూపములు మనకుఁ బరిచితములే. కాని యీరూపములన్నియు నేకవచనమందే కానవచ్చును. తెలుఁగులోనువలె బహువచనమునందుఁ గానరావు. తెనుఁగుబహువచనమందలి యీ 'మ'కార మార్యభాషలలోనుండి వచ్చినదనుకొనిన యెడల, నేకవచనము ద్రావిడభాషలలోనుండియు, బహువచన మార్యభాషలలోనుండియు వచ్చినదనుకొనవలెను. అది యంతగ నొప్పుకొనఁ దగినది కాదు. కావున నీసాదృశ్యము సహజమైనదా, లేక యసహజమైనదా యని చర్చఁ జరగవలసియున్నది. ఇందునుగుఱించి పండితు లెవరును నింకఁ జర్చించినట్టు లేదు.

కో. లక్ష్మణరావు.

౧

# చంద్రమండలము.

సర్వకాలములయందును మన కాహ్లాదము కలుగుటకు నీభూమిపైఁ గల సృష్టిచిత్రములె చాలును. ఐనను నిరంతరపరిచయమువలనను, వానియందె పుట్టి వానియందె పెరుఁగుటవలనను, వానియందుఁ గలగుణములను గ్రహింపఁ జాలము. నానావస్తువిశేషముల సౌభాగ్యములను దెలిసికొన లేము. అంతేకాక వ్యాపారములు హెచ్చినకొలఁది, పారిశ్రామికవ్యవస్థలు పెరిఁగినకొలఁదిని నెంతకు మనమె మనవ్యాపారములె సర్వప్రపంచము నగుటవలనఁ దదితరము లందు మనసు చొరకున్నయది. కావుననే నాగరికత హెచ్చినకొలఁది, మానవుని యధికారము పెంపొందినకొలఁదిని, ప్రకృతినిరీక్షాలసమో, దానియుపేక్షయో వృద్ధిపొంది, కృత్రిమపరిస్థితులందె యాసక్తిహెచ్చి, జనులు వానియందె మునిఁగి తేలి, తుదకు విసుపుఁజెంది ప్రకృతిసన్నిధికి మరల నివర్తించుచుండుట కళాచరిత్రలచేఁ బ్రసిద్ధమై యున్నది. అవిధమునఁ బ్రకృతినిరీక్షణము లెరుఁగకుండునటులు, చిత్తోన్మీలనము కలిగించి యంగుళిన్యాసములచే వీణాతంత్రులు కంపించి ధ్వనించునట్లుగా నాప్రకృతిసందర్శనమున మనస్సు జవజవఁ గంపించునట్లు మార్దవపఱచుటయె సంస్కారమువలని ప్రయోజనము. ఆవిధమునఁ గానినాఁ డెన్నిచదివినను, మఱెంతచదివిన నాచదువు చదువు గానేరదు. ఆ సంస్కారము సంస్కారమును గానేరదు.

పైని జెప్పిన ట్లెప్పుడెప్పుడు ప్రకృతినిరాసనము పెరుఁగుచుఁ దిరిగి దాని యం దాసక్తి కలుగుచు వచ్చుచున్నను బ్రపంచ మంతయు నొకవిధముననె యుండుట లేదు. మఱియు నట్టియుపేక్ష సర్వవస్తువుల నాక్రమించుటయు లేదు. వల దన్నను వానిమహత్త్వముచే మనల నరికట్టు మహాపదార్థములు సృష్టి యందుఁ గలవు. సూర్యుఁడు చంద్రుఁడు, నక్షత్రములు, సముద్రములు, పర్వతములు, నదులు నెట్టివాని మనసునేని యాక్రమింపక మానవు. అందుఁ గృత్యాద్యవస్థయందు శాసనములు, సంఘములు, వ్యవస్థాభేదములచే జటిలమ్ములై లోకుల మనమ్ముల సిందికొనకున్న యప్పుడు, మానవులు సృష్టిఁ బ్రతిసృష్టి జేసియుఁ, దమనిర్మాణములచే నీశ్వరసృష్టిం బరిణామము నొందించియు నున్న

లించియుఁ బ్రపంచమునకు నూతనవేష మారోపించుటకుఁ బూర్వము ప్రకృతి చిత్రముచే చిత్తవిజృంభణమునకుఁ గారణములై యుండెను. ఆకారణముననే, ఋగ్వేదాదులయందుఁ బ్రకృతివర్ణనాపరత గానిపించు సూక్తము లనేకములు గలవని పాశ్చాత్యపండితు లభిప్రాయపడుచున్నారు. బాల్యమునందుఁ బూవుల యందుఁ దీఁగెలయందు నక్షత్రములయందుఁ బ్రతివానికిని దృష్టి నిలుచుట యనుభవమె. ఆవిధముననే యాద్యమానవులకు ఖగోళ మెంతయు విస్మయ హేతువై యున్నట్లు ప్రాచీనగ్రంథములవలన స్పష్ట మగుచున్నది.

ఈసందర్భమునఁ జంద్రునిగూర్చిన పురాణగాథ యొకటి ప్రశంసింప నగు. నేత్రానందకర మగుచంద్రమండలము దినముకన్నదినము నభోమండలమునఁ బ్రాఁకుచు, నక్షత్రము నక్షత్రముఁ జేరుచు, నదృశ్యమగుచుఁ దిరిగి తిరిగి మరలఁ బునరావృత్తిగాఁ బ్రతిమాసము నటులె జరుగుచుండుటఁ జూడఁ బ్రాచీనుల కెంతయు వింతగఁ జూపట్టి యుండవలయు. గృహమునకు యజమాని చేరువడువున నిరాతంకముగఁ జంద్రుఁడు ఋతుమాత్మకం బగుప్రతిగ్రహము సేరుటఁ జూచిన భావోన్మేషము గలిగి సహజముగా మనస్సుల నంతర్గతంబై యున్నకవితారసము విజృంభించుటయుఁ జంద్రుఁడు పురుషుఁ డైనట్లును మినుకుమినుకు రనుచిన్నచుక్కలు ప్రియురాం డ్రైనట్లును, తారాకాంతుఁ డా కాంతలతో వరుసవెంబడి వసించునట్లు నుత్ప్రేక్షించిరి. ఈనక్షత్రము లిర్వదేడును సర్వసృష్టికారణుం డగుదక్షప్రజాపతి కూఁతులనుటయు సహజంబె కాఁదగు. ఈచిన్నకథ ప్రకృతిచిత్రము మనస్సు నెంతయాకర్షించునదియు సూచించుచున్నది. శ్రీవీరేశలింగముపంతులువారు తాము కవులనిపించుకొనియు సంఘతమోవిమర్దనాధికోత్కంఠయం దిందలిస్వారస్యము మఱచి యీకథఁ గల్పించిన యపరాధమునకుఁ బూర్వుల నొకనైజారుపోటు పొడిచినఁ గాని సంతుష్టి నెందరైరి.

మన దేశీయు లీతెలుఁగునఁ జంద్రునందుఁ బుంస్త్వ మారోపించినను పాశ్చాత్యులు మాత్రము స్త్రీత్వము నే యారోపించుచుండిరి. అందుకుఁ గారణ మాహ్లాదజనకత్వమె యని యూహింపఁదగు. కాని యనుభవము పెరిఁగిన కొలఁది వస్తుతత్త్వము తెలిసినకొలఁదిఁ గొన్నికొన్ని యోషధులు పెరుఁగుటయు నశించుటయును మానవశరీరములందుఁ గొన్నికొన్ని పరిణామములు కలుగుచుండుటయుం జాలవట్టునకుఁ జంద్రకళతో ననుబంధము గలిగి యున్నట్లు తెలిసికొనిరి. సూర్యుఁడు బలమునకు నారోగ్యమునకుఁ గారణమైనటులె

చంద్రుఁ డోషధీగణము మొలకెత్తుటకుఁ గారణం బని కనిపట్టిరి. ఆవిధముననే ప్రత్యేకప్రత్యేకాంశముల నుండి తర్కించి తర్కించి సామాన్యాంశము సాధించి సూర్యుఁడు పితృకారకుఁ డనియుఁ జంద్రుఁడు మాతృకారకుఁ డనియు నేర్పఱచి, తమయనుభవము నెప్పటియలవాటుచొప్పున 'సూర్యచంద్రవ్రతం' బనుపేరం బరఁగు నొకవ్రతవిధానంబున నిమిడ్చిరి. దీనింబట్టి మనవారు సేయువ్రతము లన్నియు నేదో యొక సార్థక్యము గలిగియే యుండు నని నేను వాదించువాఁడం గాను కాని కొన్నిటికైన నేజ్యోతిర్విషయమో బీజమై యుండు ననియు, మన కర్థము దెలియని గాథ లనేకములు గల వనియు, బురాణములు వట్టి పెంట యని త్రోసివేయక విచారించుచుండఁ దగు నవసరము కలదనియుఁ జెప్పెదఁ జదువరులు మౌఢ్యముగాఁ దలంప రని నమ్మెద.

మఱియు సూర్యసిద్ధాంతాది గ్రంథములు రచించిన మేధావంతులె జాతకభాగములు సైతము రచించియుండిరి. కావున వారియభిప్రాయములు గొంతవఱకైన మన్నింపఁదగినవె యగు. ఆసందర్భములందుఁ జంద్రునకుఁ గలప్రాముఖ్యత జాతకభాగమునందుఁ గొంచెమైనఁ బ్రవేశము గలవా రందఱకుఁ దెల్లము.

ఇవన్నియుఁ జంద్రమండలము గుఱించి మనవారలకు గలయభిప్రాయములు.

ఆకాశమునందుఁ గలనక్షత్రముల నన్నిటిని దనవెలుఁగుచేఁ బూర్ణిమాచంద్రబింబము మఱుఁగుపఱుచుచుండుటయు నది కొంచెము కొంచెముగ క్షీణించి తుద కమావాస్య నాఁటికి నదృశ్య మగుటయు మరలఁ బున్నమకు నిండుచుండుటయు బాలురకుసైతము తెలిసి యున్నది. అంతే కాక చంద్రుని యందు మచ్చలు వట్టికన్నులకును గన్పించును. అమావాస్యనాఁడు గానిపింపని చంద్రుఁడు విదియనాఁడు సాయంతనము పడమటిదెస సన్నని రేకువలెఁ గానిపించును. మఱునాఁడు మఱికొంచె మెత్తుగ మఱికొంత వెడల్పుగఁ గనఁబడుచుండు. ఈవిధముగ నష్టమినాఁడు సూర్యాస్తమయసమయము దాఁటిన తరువాతఁ జంద్రుఁడు నెత్తిమీఁదను, బున్నమనాఁడు సాయంకాలమునకు సరిగాఁ దూర్పున నిండువెన్నెలతోడను గనిపించును. ఈదినము లన్నియు శుక్లపక్ష మని చెప్పెదరు. అటుతరువాత వచ్చుపదునైదుదినములందును గలుగు మార్పులు పైవానికి విపర్యయములై యుండును. ఇదియే కృష్ణపక్షము.

ఇవి స్థూలాంశములు. శ్రద్ధతోఁ బరిశీలించిన నిందును విశేషములు

[illegible] ౯. ఒకటవ పటమునందు [illegible] పూర్ణిమనుండి పై [illegible] చంద్రుని [illegible] చూచుచుండుటయైన, రేఖాగ్రము [illegible] పైపునకును [illegible] దింకొకవైపునకు నుండునట్లు తెలియును. అమావాస్య వెళ్లిన విదియనాఁడు పడమరఁ గనిపించిన చంద్ర రేఖ రేఖాగ్రములు తూర్పునకుఁ దిరిగియుండును. మఱియు విదియ తదియలయందుఁ దెల్లని నెలవంక మాత్రమే కాక తక్కిన బింబముయొక్క యాన వాలుం గానంబడు. దినము కన్న దిన మాచంద్రరేఖామధ్యము పెరిఁగి పెరిఁగి యష్టమికి రేఖాగ్రము లదృశ్యములగును. అటుపైఁ బూర్ణిమవఱకు నానాఁటికి వృత్తసమగ్రతం గాంచుచుండును. పున్నమనాఁడు బింబము సరిగా గుండ్రముగా నుండును. మఱునాఁటినుండి చంద్రుఁడు క్షీణింప మొదలుపెట్టి తిరిగి సప్తమివచ్చుసరికిఁ గొంచెము కొంచెము తగ్గి సగమగును. అటుపైని బూర్వము వలె రేఖాగ్రము లేర్పడును. ఈమాఱు రేఖాగ్రములు తూర్పునకుఁ గాక పడమరకుఁ దిరిగి యుండును. మఱియుఁ జంద్రుఁడానాఁటికన్న నానాఁడు ప్రొద్దుపోయి యుదయించుచుండును. శుక్లపక్షమునందైన నానాఁటికన్న నానాఁ కెక్కువసేపు నిలిచియుండును.

ఈవిధమున రేఖాగ్రము లొకపక్షమున నొకవైపునకును, రెండవపక్షమున మఱియొకవైపునకు నుండుటకుఁ జంద్రుఁడు సూర్యునివలె నిజమైన కాంతి గలిగి యుండక తనపైఁబడిన సూర్యరశ్మి నద్దము వలెఁ బ్రతిఫలించుచుండుటయె కారణము. చంద్రమండలమును భూమివలెనె యొకపెద్దమట్టియుండ యనుకొనవచ్చును. దానిపై నెంతవఱకు వెలుఁగుపడునో యంతయే తెల్లగాఁ గానిపించి తక్కినభాగము తేజోవిహీన మగుట మాటువడియుండును.

భూమిపైనుండి చూచువారలకు సూర్యచంద్రు లేకసూత్రమున నున్నపుడె యమావాస్యయగును. ఆయమావాస్యపై ననుదినముఁ జంద్రుఁడు కొంచెముఁ గొంచెము సూర్యునిదాఁటి ముందునకు నడచును. అప్పుడు చంద్రుని వెనుకభాగమున సూర్యకిరణములు పడి ప్రతిఫలించుఁ గావున సూర్యాస్తకాలానంతరము సూర్యమండలమునకుఁ జేరువనున్న పార్శ్వము ప్రకాశమానమై యుండి తక్కినభాగము నల్లగ నుండుటచేఁ జంద్రరేఖాగ్రములు తూర్పునకుఁ దిరిగియుండును. ఆవిధమునసే పక్షార్థమువఱకుఁ జంద్రబింబమునందు పశ్చిమునకుఁ దక్కువ పాలు సూర్యుని వెలుఁగులో నుండుటవలన సప్తమిపర్యంతమైన చంద్రరేఖ మొనలు తేలి యుండును. మఱియుఁ గ్రమక్రమముగాఁ

చంద్రునకును సూర్యునకుఁ గలయెడము పోనుపోను పెరిఁగి పెరిఁగి పూర్ణిమ నాఁడు తక్కినసమయముల కంటె నెక్కువగ నుండును. నాఁడు సూర్యాస్తమ యము వెంబడినె చంద్రోదయ మగును.

చంద్రుని వృద్ధిక్షయముల స్వరూపము విచారించిన మఱియొక విశేషము తెలియవచ్చును. చంద్రబింబమునం దడుగున నొకభాగ మున్నదనుకొందము. అమావాస్య వెళ్లినమఱునాఁడు మొద లాభాగమునకుఁ బ్రతిదినమును బ్రతి క్షణమును సూర్యరశ్మి తగులుచునే యుండును గాని పూర్ణిమ దాఁటినమఱు నాఁడు చంద్రబింబమందలి యపరభాగము సూర్యునికిఁ గొంచెము చేరిక యగుటవలన నీపంచ నెండ తగులకుండును. అనఁగా నాభాగమునకుఁ బదు నైదుదినము లెండతగులును. ఆవిధముననే ప్రతిభాగమునకుఁ బదునైదుదినము లెండ తగులుచుండుటయుఁ, దరువాతఁ బదునైదుదినము లెండ లేకుండుటయు సంభవించుచుండును. కావునఁ జంద్రమండలమునందుఁ బ్రత్యేకప్రత్యేక ముగఁ బ్రతిభాగమునకును బదునైదుదినములు వెలుఁగును, మఱిపదునైదుదిన ములు చీఁకటియుఁ గలుగుచుండును. దీనింబట్టి మనపదునైదుదినములు కలసి చంద్రమండలమునం దొకపగ లగును. ఆవిధముననే మఱియొకపదునైదుదిన ములు గలసి యొకరాత్రి యగును. చంద్రమండలమునం దెవ్వరైన నుండిరేని నీపదునైదుదినములపవ లెంతభారముగ నుండునో యాయెండ కెంత తెక తెక యుడికిపోదురో యెట్లూహింపనగును?

శుక్లపక్షములోనివిదియతదియలందుఁ గన్పించుచంద్రునందుఁ దెల్లనినెల మాత్రమెకాక తక్కినబింబము నీడయుఁ గన్పించుచుండు నని తెలిసికొని యుంటిమి. చంద్రునందలిప్రకాశమాన మగుభాగము సూర్యరశ్మి పడుటవలన వెన్నెల నిచ్చును. నీడవలెఁ గన్పించుతక్కుంగలభాగ మన్ననో, సూర్యరశ్మి భూమిపైఁ బడి, భూమినుండి చంద్రునిపైఁ బడుటవలన దృష్టిగోచర మగు చున్నది. సూర్యతేజోనుబింబనమువలన వెలుంగు చంద్రబింబము, భూమి నుండి వచ్చు వెలుఁగులోఁ గన్పింపవలయు నన్న భూమిపైనుండి చంద్రునిపైఁ బడువెలుతురు, చంద్రునినుండి భూమిపైఁ బడువెన్నెలను మించియుండవల యును. నిజము నంతియ. భూమండలము చంద్రమండలముకంటెఁ బదిరెట్లెక్కువ వెలుతురు గలిగియున్నట్లు లాకాశమందలి గోళములకుఁ జూపట్టును, మఱియు భూమి సూర్యునిచుట్టు దిరుగుచుండుటవలనఁ జంద్రునియందు వృద్ధిక్షయములు గన్పించునట్లు, చంద్రమండలమునం దెవ్వరైన నున్నచో వారికి మనభూమియుఁ,

జంద్రునిచుట్టుఁదిరుగుచున్నట్లును వృద్ధిక్షయములుకలిగియున్నట్లును జంద్రునిచే మనకు వచ్చువెన్నెలకంటెఁ బదిరెట్లెక్కువవెన్నెల గలిగి యంతకునెక్కువ చల్లఁదనము గలయట్లు దోఁచును. మఱియు వారు గణితజ్ఞులగుదురేని, చంద్రునివృద్ధిక్షయములఁబట్టి మనవారు పంచాంగముల గుణించినట్లె వారును, మహాక్లిష్టగణితవ్యవహారములచే భూగతి నిశ్చయించుచుఁ దిధివారనక్షత్రముల సాధించుచుండవలయును. ఇంతేకాక వారియం దెక్కువశ్రద్ధ గలవారు భూమండలమును దూరదర్శనయంత్రములచే వేధించి, కొన్నిభాగములు నల్లగనున్నవనియు, మఱికొన్నిభాగము లద్దమువలెఁ దళతళ మెఱయుచుండు ననియు నీనల్లనిభాగమును తెల్లనిభాగములు స్థిరముగ నిలిచియుండక మహావేగమునఁ జలించుచున్నట్లును, వచ్చినపొడలుసుమా రిరువదినాలుగుగంటలకుఁ దిరిగి గన్పించుచున్నట్లును దెలిసికొని, భూమియుఁ జంద్రునివలెనే యిరువదినాల్గుగంటలలోఁ గదురువలెఁ దిరుగుచుండుటవలనఁ దమకు సర్వకాలములం దొకభాగమే వెలుఁగుగాఁ గన్పించుచుండు నని నిశ్చయించుకొనఁగలుగుదురు. ఏదియెట్లున్నను భూబింబమునందలి వృద్ధిక్షయములు వారికిఁ గాలనిర్ణయసాధనము లై యుండఁగలవు. వారికిని యంత్రసహాయమువలన మనభూగోళమునందలి, పర్వతములయు, నదులయు, సముద్రములయు, మేఘములయుఁ జిహ్నములు విస్పష్టములుగా నోపును. ఆవిధముననే, సాధనాంతరములచే మనభూమిచుట్టు గాలికూడఁ గలదని వారికిఁ దెలియఁగలదు.

చంద్రమండలము భూమికంటె మిగులఁ జిన్నది. భూవ్యాసము దాదాఁపు ౮౦౦౦మైళ్లు. చంద్రవ్యాసమున్ననో ౨౧౬౦మైళ్లు దీనింబట్టి భూమండలము చంద్రమండలముకంటెఁ బదునాలుగురెట్లెక్కువవిస్తీర్ణము కలిగియున్నది. ఆకారణమువలననే చంద్రాతపముకంటె భూమ్యాతపమెక్కువగ నుండును. సూర్యునితోఁ బోలికయె లేదు.

సూర్యునిచుట్టు భూమి తిరుగుచుండునట్లె భూమిచుట్టు చంద్రుఁడును దిరుగుచుండును. భూమి సూర్యునిచుట్టు నొకప్రదక్షిణము'చేయుట కొకసంవత్సరము పట్టును గాని భూమిచుట్టు జంద్రుఁడు తిరిగివచ్చుటకు నిరువదియేడునఱ దినములు పట్టుచున్నది. ఈవిధముగఁ జంద్రుఁడు తనచుట్టుఁ దిరుగుచుండ భూమి యాచంద్రుని వెంటఁగొని సూర్యునిచుట్టుఁ దిరుగుచున్నది. అందుచేఁ జంద్రగతి విమర్శించునపుడు రెండుకక్షులు విచారింపవలయు. అందు భూమికి సర్వకాలములయందును రెండులక్షలముప్పదియెనిమిదివేలయెనిమిదివందలమైళ్లదూ

రమునఁ జంద్రుఁడు చరించుటచే నేర్పడువృత్తమొకటి, భూమి సూర్యునిచుట్టుఁ జేయుసంచారమున నేర్పడిన దొకటి. ఈరెండువృత్తములు నొకక్షేత్రముననె యుండిన నుండవచ్చును, భిన్నములైన భిన్నములు గావచ్చును. ప్రకృతాంశమున భూకక్ష్యచంద్రకక్ష్యలకు నైదుభాగ లంతరాయము కలదు కావున నీకక్ష్యాద్వయక్షేత్రము లొకదాని నొకటి ఛేదించుకొని పోవును. అట్లు ఛేదించుకొనుటచే నేర్పడినరేఖయందలికొనల రెండింటి నొకదాని రాహువనియు రెండవదానిఁ గేతు వనియుఁ జెప్పిరి. చారవశంబున నీరాహుకేతువు లొకానొకప్పుడు సూర్యునితో నేకసూత్రమున నుండుట సంభవించుచుండును. ఆసమయముల రాహువు సూర్యునికిఁ జేరువ నుండెనేని, మాఱి యాఱుమాసములకుఁ గేతువు సమీపమునకు వచ్చుచుండు. ఈరాహుకేతురేఖయుఁ గ్రమక్రమముగాఁ జనించి పదునెనిమిదిసంవత్సరముల పదునెనిమిదిదినములలో నొకభగణముఁ బూర్తిచేయును.

చంద్రుఁడు భూమిచుట్టు నిరువదియేడునఱదినములలోఁ దిరుగుచుండుట వలన నాదినముకంటె నాదినము రెండేసిఘటికల లాలస్యముగ నుదయించుచు నస్తమించుచు నుండును. అయినను గొన్నిసమయములయందు భూమికిఁ జేరువగుచుఁ గొన్నిసమయములందు దూరమగుచు నాయతవృత్తాకృతిగ సంచరించుచుండుట సర్వకాలములయందు నీరెండుఘటికలే భేద ముండుననుటకు వీలులేదు. అయినను శీఘ్రముగ నుదయించినపు డాలస్యముగ నస్తమించుచుండును. అనఁగా దినముకంటె దిన ముదయించుటయందుఁ గలభేదము తక్కువగునేని యస్తమయమునకు నస్తమయమునకుఁ గలభేద మెక్కువగ నుండును.

పైయంశము లన్నియుఁ జంద్రమండలము యంత్రసహాయముచే శోధింపకయే తెలియుందగు. ఇఁక నక్షత్రశాలలయందుండు మహాయంత్రములతోఁ జంద్రుని జూచినచో మఱికొన్నివింతలు గానంబడును. మనదృష్టికిఁ జంద్రబింబము మచ్చలు గలభాగముతక్కఁ దక్కినదంతయు నొకవిధముగానే కనంబడునుగాని యద్దము (యంత్రము) లోఁజూచినపుడు బింబముపైభాగ మంతయు నందం దూఁడ్చివైచినట్లు దోఁచును. అట్టినున్ననిచాఱికెలు బింబాగ్రమందు "టైఖో"యని పేర్కొనంబడునొకస్థానమునుండి ప్రక్కలకు వ్యాపించియున్నట్లు జూడంబడును. ఈచాఱికలు చుట్టుపట్టులకంటెఁ దేటగాఁ గన్పించును. బింబమధ్యమం దచ్చటచ్చట నల్లనిమచ్చ లుండును. అందుఁ గొన్నికొన్నిట వెలుఁగుపొడలుం గన్పించును. అట్టి దొకటి బింబమధ్యభాగమందుఁ గలదు. దీని

కాంతి పూర్ణిమ వెళ్లినరెండుమూఁడుదినములలో విశేషముగాఁ దగ్గునట్లు తెలిసినవి. దీనినిబట్టి చంద్రునియస్తకొలఁత యక్షముకంటె నెక్కుడని గ్రహింపం గలిగిరి.

అనఁగాఁ జంద్రమండలము సరియైనయుండవలె నుండక యడుగునను పైన నడఁచిన ట్లుండి నడుమ నుబ్బియుండున ట్లూహింప నగు. ఈయుబ్బియున్న భాగమె భూమివైపునకుఁ దిరిగియున్నది.

ఇట్లు చంద్రమండలాయతవృత్తదీర్ఘతరవ్యాసము భూమివైపునకుఁ దిరిగి, సూర్యునిచుట్టు భూమి తిరుగునట్లె భూమిచుట్టుఁ జంద్రుఁడుఁ దిరుగువాఁడనిన సామ్యమునుబట్టి చంద్రుఁడు తనచుట్టుఁ దాను దిరుగుచుండవలయు నని యనుమానింపందగు. ఈసందియము దూరదర్శినీయంత్రము వదల్చినది. చంద్రునిఁ బ్రతిదినము యంత్రముతోఁ బరీక్షించి చూచినయెడల సర్వకాలములయందించుమించుగ నొకభాగమె కనిపించుచుండును గాని మార్పు చూపట్టదు. దీనినిబట్టి చంద్రుఁడు దనచుట్టుఁ దాను దిరుగుచుండుట లేదని యనుకొనరాదు. చంద్రుఁ డాత్మప్రదక్షిణము లేక త్రాడునకు రాయిఁ గట్టి త్రిప్పినట్లు భూమిచుట్టుఁ దిరుగుచుండె నేని క్రమక్రమముగాఁ జంద్రగోళము నందలిప్రతిభాగము నెప్పుడో యొకప్పు డొకమాఱు తిరిగివచ్చులోపునఁ గన్పించితీరవలయు. ఆవిధముగఁ గన్పింపనికారణమునఁ జంద్రుఁడు దనచుట్టు దాను దిరుగుచుండవలయు ననియు, నట్లు తిరుగుటకుఁ గొంచెము తక్కువగ నొకదినము పట్టుచున్న దనియు నా హేతువుననే సర్వకాలములయందు మనయంత్రమునం దొకభాగమే యెదురుగఁ జూపట్టు ననియు గ్రహింపవలయును.

భూమియాత్మప్రదక్షిణమును జంద్రునాత్మప్రదక్షిణము నేకదినవ్యాప్తము లే యైనను, రెండింటికిని గొంచెము భేద ముండుటవలన యంత్రమందుఁ జంద్రమండలోపరితల మచంచల మై చూపట్టక ప్రతిస్థలమును గొంచెము వెనుకకు నూఁగుచున్నట్టులు గన్పించును. ఈపార్శ్వచలనము మధ్యస్థితి కిరుదెసల నేడెనిమిదియంశలు. ఇంతేకాక చంద్రమండలము నిలువునఁగూడ, వెనుకకు ముందునకు నూఁగుచున్నది. ఈచలనము చంద్రమండలధ్రువద్వయమునకు మధ్యస్థితినుండి యఱువదియంశలవఱకు నున్నందున గోళాపరార్ధమందలి కొన్నిభాగములు చూడ వీలగుచున్నది. ఈపార్శ్వచలనముచేతను, ధ్రువచలనముచేతను, చంద్రగోళమునందుఁ బదింట నాఱువంతులు చూడఁగలము. తక్కుంగలనాలుగువంతులు మన మెన్నఁడుఁ జూడఁజాలము.

నున్నదియుఁ గొలువవలయు నని గణితజ్ఞులు మహాప్రయత్నములు సేసిరి. భూమండలమునందలిపర్వతములఁ గొలుచుటకు సముద్రోపరితలము ప్రధానముగాఁ గొని లెక్కలు వేయఁదగుఁ గాని చంద్రప్రపంచమున నట్టిసముద్రము లేనికారణముచేఁ బర్వతము లొకదానితో నొకటిఁ బోల్చుటకు వీలులేకున్నది. పర్వత మింతయెత్తని చెప్పినఁ దత్పరిసరసమప్రదేశమునుండి చూచి చెప్పిన లెక్క యని గ్రహింపవలయు. ఆవిధముగ యంత్రసాహాయ్యమునఁ జూచి, చంద్రునియందలి మెట్టలు మూఁడువేలయడుగులు మొదలుగ నిరువదివేల పర్యంత మౌన్నత్యము గలిగియున్నట్లు నిశ్చయించిరి. ఇంతవఱకుం గొలిచి చూచినవానిలో నున్నతతమం బైనది యిరువదినాలుగువేలయడుగులు పొడవు గలిగియున్న దని చెప్పుచున్నారు.

పైని జెప్పినట్లు చంద్రమండలమునందలి యగ్నిపర్వతములు ప్రజ్వలించుటవలన నందలిజలము గోళాంతర్లీన మై యుండనోపు నని యూహించి యుంటిమి. అగ్నిపర్వతప్రాంతములందలిజల మంతర్లీన మైపోయిన నితరస్థలములం దైనఁ గలదా యని శోధించి చూచిరి కాని యెంతశోధించినను, బ్రవాహములు గాని సముద్రములు గాని యం దున్నట్లు గన్పింపలేదు. కొందఱు, జల మంతయుఁ బైనిజెప్పిన ట్లగ్నిపర్వతములమూలమున నశించె ననియు, మఱికొందఱు చంద్రమండల మతిశీతలం బగుట, నీ రంతయు ఘనీభవించిపోయె ననియుఁ జెప్పిరి.

అంతేకాక, యందు గాలియైన నున్నట్లు దోఁపదు. అంగారకాది గ్రహములు చంద్రునికంటె బహుదూరమం దున్నను, వాని నావరించి యున్న గాలివలన నవి నక్షత్రముల కభిముఖము లైనపుడు, నక్షత్రకిరణములు వక్రించినట్లు యంత్రగోచర మగుచున్నది. చంద్రమండలమునందును గాలి యుండెనేని చంద్రనక్షత్రసమాగమములందు నక్షత్రతేజోవక్రణము చూపట్టియుండవలయు. అట్టి వక్రణము గన్పట్టకున్నందునఁ జంద్రునికి వాతావరణమును లేదని నిశ్చయింపఁబడినది. కొందఱు శాస్త్రజ్ఞులు జలమువలెనే చంద్రునియందలిగాలియు ఘనీభవించిపోయె ననుచున్నారు. అది యట్లుండ మఱికొందఱాగాలి యంతయు, గోళాపరార్థమునకుఁ బోయె ననిరి. ఇది విశ్వసించెద మనుకొన్నను, చంద్రుఁడు నిలువున నూఁగునపు డపరార్థమునందు మనకుఁ గన్పించుచున్నభాగమం దైనను, వాతావరణము సూచింపమి నీయభిప్రాయము

సేకొన వీలులేకున్నది. కావునఁ బైనిజెప్పినట్లు జలమును, వాయువుం గూడఁ జంద్రమండలమున ఘనీభవించిపోయి యుండవలయు.

ఆవిధముగాఁ జంద్రమండలమునందలి గాలియు, నీరును గడ్డకట్టుకొని యున్నచోఁ బంచదశవాసరపరిమితం బైనయాపగటివేఁడిమికిఁ గరఁగకుండునా యని తలంపవలదు. హిమాలయపర్వతములయందు మంచుబయళ్లు సూర్య కిరణములచే మిక్కిలి వేఁడెక్కియుఁ గరఁగకుండుట యనుభవసిద్ధమై యున్నం దునఁ జంద్రమండలము నావిధముగనే, యెండకు వేఁడెక్కుచున్నను* జలము విశేషముగ నేర్పడ దని చెప్పవచ్చును. కరఁగినజల మేమైన నున్న నది యావిరి యై యుపరితలము నంటికొనియుండి యింక మంచుగరంగనీయకుండును.

ఆవిరి యేర్పడుచున్న నది గాలిలేనికారణమునఁ బైకి లేచి మేఘములు గా నవకాశము లేనందునఁ జంద్రమండలమునం దొక్కవానబొట్టైనను బడదు. ఈవిధముగా నీరు, గాలి, వర్షము లేనియవస్థకుఁ దోడుగాఁ జంద్రధ్రువము తిన్నఁగా సూర్యునివైపునకే తిరిగియున్నందునఁ దత్ప్రపంచమున ఋతుభేదము లును గలుగనేరవు. ఇట్టి ఋతుభేదములు, జీవాధారము లైనసలిలవాయువు లయు నభావంబునఁ బ్రాణులు గావు సరిగదా, వృక్షలతాదులుసైతము తల లెత్తనేరవు. అందమును జూచి మన మింతసంతోషించుచున్న యీపైపైమె ఱుఁగులచంద్రమండల మెంత గొడ్డుపోయియున్నది!

ధేరం వేంకటాచలపతి.

*వాస్తవమునఁ జంద్రునివలన వచ్చువేఁడిమినిబట్టి చూడఁగా నాచంద్రమండలము నూఱు కప్రమాణాంశ లుష్ణముగ నుండవలయు.

వాల్మీకిచరిత్రము.—ఇది తంజావురాంధ్రేశ్వరుఁ డగు విజయరఘునాథ భూపాలునిచే మూఁడాశ్వాసములుగ రచింపఁబడినది. ఇందలికథ శ్రీమద్రామాయణమును రచించిన వాల్మీకిమహర్షి చరిత్రమే. ఆదికవి యగు నాతనిచరిత మగుటచేఁ గావలయు నిందలి భక్తివైరాగ్యాదిరసములును శృంగారాది రసములునుగూడ నెంతయు మనోరంజకములుగా నలరారుచున్నవి. కవిత్వశైలి విషయమై వేఱ వ్రాయనక్కఱలేదు. ఈకవిరాజు చేమకూరపాకమును బరికించి విజయవిలాసముం జేకొన్నవాఁడు. ఈ గ్రంథమును దీనిక్రింది రెండుగ్రంథములును, అముద్రితాంధ్రగ్రంథసర్వస్వమున మ-రా-శ్రీ, చెలికాని లచ్చారావుగారిచేఁ బ్రకటింపఁబడినవి. ఈగ్రంథము మొదటి ముప్పదిరెండుపుటలభాగము వెనుకఁ గాకినాడలో సరస్వతీపత్రికలో ముద్రింపఁబడినది. అవశిష్టభాగము శ్రీ లచ్చారావుగారిచే ముద్రింపఁబడి భాగద్వయమును బ్రకటింపఁబడినది. ఈ గ్రంథమునకు మాతృకను బ్ర. శ్రీ. మానవల్లి రామకృష్ణకవిగారు మొదట సరస్వతీపత్రికకును దరువాత వీరికినిగూడ నొసంగిరి. శ్రీ శతావధాని తిరుపతి శాస్త్రిగారు కోరినందున శ్రీ రామకృష్ణకవిగారివలనఁ బుస్తకము సంపాదించి పరిషత్కార్యాలయమందే ప్రతివ్రాసి పంపఁబడినది. రాజకీయ పుస్తకాగారము నుండి రప్పింపఁబడుట వాస్తవముకాదు. ఈగ్రంథము వెల, రూ. 0—8—0. శైలికి,

ఉ. బడిఁజనుదెంచుచాయ ధరఁ బాంథులతాపము తీఱ నక్కడ
క్కడఁ దరుజాలమూలములఁ గ్రమ్ముచు నిల్వఁగ దానిఁ గ్రుచ్చుకో
వడిఁ గరపాళి యెత్తి దినవల్లభుఁ డల్లన సాఁగెనాఁగన
వెల్వడ నతిదీర్ఘభావము వహించె నహంబు లహో మహాగతిన్.

సీ. జడధిభంగములతోఁడ జనియించినట్టి నీకేభంగమునకు నింకేలతలఁక
జడనిధిశాయికి జనియించినప్పుడే భంగంబునీకుఁ జొప్పడకయున్నె
దళమెత్తియాడినఁ దలవంచెదవునీవు రంభ యిందులకు సంరంభమేల
దళమైన విద్యయందము చూపకుండినఁ దలవంపు నీకె పోతలిరుఁబోఁడి
యూర్ధ్వపతిపట్టిఁ జేపట్టినట్టికతన, నిట్టిగర్వంబుపుట్టెనో యిడిసహజమొ
యూర్ధ్వవంతునివిద్యయే యతిశయించు, సర్ధమూలంబు జగమెల్ల ననఁగవినవె.

విజయరంగవిలాసము.—రంగకవి అనంతకవి ప్రణీతము. ఇందు మూఁడాశ్వాసములు గలవు. ఇందలికథ యభిమన్యునకును బలరామునికూఁతు రగు శశిరేఖకును జరిగిన వివాహము. ఈకవి కవిత హృదయమధుర మగునది. గ్రంథము వెల, రూ. ౦—౧౦—౦. శైలి.

ఉ. వెంకటఁదెబ్బిసిల్పిఁ బాలిచెంగ[illegible]ాచలుఁడుప్రస్తుతోత్తరా
రంగము పుష్కరాంబుకణరాజి నిరంతరరాజమానమా
రంగ మునగ్రశోణ రుచిరాంకనదీప్తిసుధాభిరామమా
రంగ మహానకౌతుకతరంగతి సర్వజనాంతరంగమై.

రంగనాథరామాయణము:—ఉత్తరకాండము. ఇది కాచవిభుఁడు, విఠల రాజు ననునిరువురన్నదమ్ములచే రచింపఁబడినది. ఈగ్రంథము నీకవులు తమ తండ్రికే యంకిత మొనర్చి రనియు నీకృతిం గొన్నయాతఁడే రంగనాథపూర్వ రామాయణమును రచించె ననియు నీకవులు మువ్వురును ౧౩-వ శతాబ్దమం దున్నవా రనియు నీగ్రంథము పీఠికలో శ్రీబచ్చూరావుగారు వ్రాసియున్నారు. రంగనాథరామాయణము పూర్వోత్తరభాగముల యొక్క వివిధప్రతులందు వివిధ రీతుల పాఠము లుండుటచే నేది వాస్తవమో నిర్ధారణము సేయ వలనుగాకుం డుటచేతను గాలనిర్ణయము శాసనములకు విరుద్ధముగా నుండుటచేతను బైవిష యముల నింతలో సిద్ధాంతీకరించుట కనువు లేదని మాయూహ. ద్విజు లగు క్షత్రియులనే యనేకులు చతుర్థులుగఁ బరిగణించుచుండ వీరిని క్షత్రియులని పరిగణించుటకుఁ బ్రమాణ మగపడకుండుటయే కాక బుద్ధరెడ్డి కోనగన్నరెడ్డి మొదలగు రెడ్డిపదము నుపయోగించిన శాసనములకు విరుద్ధముకూడ నగును, క్షత్రియులకు రెడ్డిశబ్దము వాడుట యప్రసిద్ధమేకదా? ఈగ్రంథము ౧౮౦ పుటలు గలది. అందు ౧౨౮ పుటలు సరస్వతీపత్రికలో ముద్రింపఁబడినది. మిగిలినభాగము, అముద్రితాంధ్రగ్రంథసర్వస్వమున ముద్రించి భాగద్వయము నేకముగఁ బ్రకటింపఁబడినది. గ్రంథము వెల, రూ. ౧—౦—౦. శైలి.

ద్విపద. "వర్ణింపనెత్తమ్మినదనమైకలువ, కర్ణావతంసమైకదియుజక్కవలు
కుచములైపొదిఁగొన్నకొదవతుమ్మెదలు, కచభారమైచారుశైవలస్ఫురణ
దరహాసమైతుంగతరసైకతంబు, భరితనితంబమై పరఁగుఫేనంబు
వెలిపట్టుపుట్టమై వెఱవాఱమెఱయు, కలహంసమాలికకాంచియైపోలుచు
నధికారుణద్యుతినమరుబంధూక, మధరమైసుడినాభియైతరంగములు

భ్రూలతలైలీలఁబొరలుమీనంబు, లాలోలనయనంబులైతావులెసఁగు
హల్లకంబులమీఁద నందంపటెరుగు, నొల్లనితనివాయువూర్పులైకవియు
రోలంబములచేసరోరుహావళుల, రాలుపుప్పొడియంగరాగమై మెఱయఁ
బైకొన్న కేసరపంక్తులుతోడవు, లైకనుఁగొన నుత్తమాంగనభంగి
వివిధవిలాసములివ్వింతలైమెఱయు, నవపద్మగంధి నాననర్మదఁగనియె.

పైమూఁడుగ్రంథములును వలయువారు, అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము, చిత్రాడ, పిఠాపురముపోష్టు, గోదావరిజిల్లా. అను పైవిలాసమునకు వ్రాసికొననగును.

మాతృమందిరము:—ఇది యొకచక్కనినవల. వేంకటపార్వతీశ్వరకవులచే స్వకపోలకల్పితముగ రచింపఁబడినది. కథ మనోహరము. కృష్ణాగోదావరీమండలములం దీకథ జరిగినట్లు కల్పింపఁబడుటచేఁ గొంత దేశవిషయము గూడఁ దెలియుచున్నది. ఇట్టి కేవలకల్పితములచేత నేకాక కొంచెముగఁ జరిత్రాంశములనుగూడఁ దెలియఁజేయుచుండునవల లనేకము లాంధ్రదేశమున బయలువెడలవలయును. దీని వెల, రూ. ౧—౮—౦.

నీలాంబరి:—ఇదియుఁ బైకవులచేతనే వంగభాషనుండి యనువదింపఁబడినది. ఇతివృత్త మపరాధపరిశోధనవిషయము. వెల, రూ. ౧—౮—౦.

ప్రణయప్రతిమ:—వంగభాషలో శ్రీయరవిందదత్తుగారిచే రచియింపఁబడిన గ్రంథమునకు మ-రా-శ్రీ, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారిచేఁ జేయఁబడిన యాంధ్రానువాదము. ఇందు విశేషముగ దాంపత్యధర్మములును బ్రేమస్వరూపమును నెఱుంగఁబడును. శైలియు భాషయుఁ జక్కఁగ నున్నవి. వెల, రూ. ౦—౧౨—౦.

తులసీమాహాత్మ్యము:—ఇయ్యది యేకాశ్వాస ప్రబంధము. కవి నరసింహాచార్యుఁడు. కథ సత్యభామ కృష్ణుని నారదునకు దానమిచ్చి తిరిగి కొనుటకెల్లధనమునుంచినను నాతనియెత్తునకుఁ జాలమి దుఃఖించి సవతి యగురుక్మిణిని బతిమాలి యామెసాయమున నొక్క తులసిదళమునుమాత్రమే నారదునకొసఁగి తిరిగి శ్రీకృష్ణుని విలుచుట. కవనము మంచిది. వెల, రూ. ౦—౬—౦.

మచ్చునకు.

చ. ధనమతివిస్తరంబుగ మొదంబునభామ యొసంగగౌరవం
బునఁగనుపట్టెరుక్మిణివిభుండుకృపన్ మముఁజూచిగారవిం

చిననిదెచాలునంచుఁ దులసీదళ మొక్కటి నైవలాఘవం
బునఁగనుపట్టె శౌరి ధనమూలములా లఘుతాగురుత్వముల్.

ఉ. మెట్టులకీర్తిద్రవ్యమును మిక్కిలి భామ యొసంగెదానికిన్
రెట్టిగ వ్రాలఁగల్గిన యరిందముఁడిం దులసీదళంబుతో
మట్టముగాఁగఁ జేసితివి మానినిశౌరిమనం బెనీకయిః
బట్టెనుగానియన్యులకుఁ బట్టునెయింతటి భాగ్యమిందిరా.

పైనాలుగుగ్రంథములును రాజమహేంద్రవరములోని ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలయందుఁ బ్రకటింపఁబడినవి.

శ్రీగణేశ్వరీయము:—ఇయ్యది మూఁడాశ్వాసముల ప్రబంధము. కథ యాంధ్రదేశమందు వినాయకచతుర్థినాఁడు గణేశ్వరుని పూజించు వేళ నశేష జనులు చెప్పికొనునదియే. వర్ణనములు నంకలికల్పనములును జక్కఁగ నున్నవి. శైలి కొంచెము క్లిష్టముగ నుండును. అటనటఁ గొన్ని దోషములునుం గలవు. దీని వెల గ్లేజు. రూ. ౧—౦—౦. రఫ్. రూ. ౦—౧౨—౦.

వలయువారు గుంటూరులోని అగ్రహారమువీధిలో నున్న గ్రంథకర్తయగు మ-రా-శ్రీ, భువనగిరి విజయరామయ్యగారికి వ్రాసికొనవగును. శైలికి.

తరల. పొరుగువాఁ డతిమాత్రమైన విభూతిఁబొయిఁ జెలంగెడున్
ధరణినాకిటు లేమిగల్గఁ గతంబదేమి యటంచు త
ద్ధరణమందె చరించిజన్మ నిరర్థకం బొవరించెడిన్
నరుఁడసూయకులోఁగి శ్రీగణనాథ చెప్పెడి దేమిఁకన్.

చ. తరువులనీడ వాహినుల దాఁపునఁ బర్వతకందరంబులన్
దొరకిన లేశమాత్రఁ దన తోడులతో క్షుధ వాపుకొంచునెం
దఱు సుఖతృప్తిఁగాంచరు వృథాతృషఁ దుచ్ఛుఁడ హీనసంపదో
ద్ధరితుఁడెయయ్యుఁ బాపముల బొల్పడునాశల నోగణాధిపా.

చమత్కారరత్నావళి:—ఇయ్యది వాస్తవమున రత్నావళి యగును. ప్రతిపద్యమునందును నప్రకృతవర్ణనమువలనఁ బ్రకృతార్థము స్ఫురించును. కవనశైలి మనోహరము. దీనికర్త మ-రా-రా-శ్రీ సత్యవోలు సోమసుందర కవిగారు. వీ రాంధ్రదేశమునకుఁ జిరపరిచితులే. ౩౮ పుటల గ్రంథము. వెల, రూ. ౦-౪-౦.

శైలి.

మిడుత—పరస్త్రీకాముకుఁడు.

క. మండుచునుండెడి దీపము, పండనుచును భ్రమసి మిగులఁ బైకొనెదవు నీ
తిండికిఁ దగదిది తెలుపుదు, చండకిరణములు దహించు శలభాధమమా.

నల్లజీడిగింజ—మేలుసేయు నీచుఁడు.

గీ. కాలిలోముల్లు దాఁకిన కాలమునను, మేలు సేసెదవని సర్వకాలములను
ప్రాణినిముఁగొని తిరిగెడు వానిమేని, పోడిమిని బాపెదవు నల్లజీడిగింజ.

ముదుసలి గంగిరెద్దు—ఉద్యోగము చేసిన వృద్ధుఁడు.

చ. తొలుతను గొన్నినాళ్లు ఘనతూర్యరవంబుల నాటపాటలన్
మెలఁగిన గంగిరెద్ద యిటుమెండుగ వృద్ధతఁ గాంచి యెచ్చటో
పొలములమేయుచుం బుడిసి మ్రొగెడు పీరణమాలకించి నీ
తలనిటుత్రిప్పుచుంటివి వృధాగతి నెవ్వరుమెత్తు రిత్తఱిన్.

శ్రీరామశతకము:—ఇది బ్ర॥ శ్రీ. సత్యవోలు సోమసుందరకవిగారిపుత్త్రులగు రాధామాధవరావుగారిచే రచింపఁబడి మలిపెద్ది ముత్యాలు అండ్ సన్సు వారి ద్రవ్యసాహాయ్యమున ముద్రింపఁబడినది. కవితావైచిత్రి యిందు బాగుగనున్నది. వెల, ౦—౨—౦ ఇదియును జమత్కారరత్నావళియును గావలయువారు

సత్యవోలు రాధామాధవరావుగారు,
క్రొత్తపల్లి, పిఠాపురము, గోదావరిజిల్లా
అను చిఱునామాకు వ్రాసికొననగును.

శైలి,

క. నారదపారదశారద, శారదశరశారదాతుషారసురఝురీ
హీరహారదరమరాళ, క్షీరపయోరాశివిశదకీర్తిరామా.

క. వరశరణాగతభరణా, భరణాకరుణారసాతి పరిపూరణమం
ధరధరణీధరధరణా, హరిణాహరణారమావిహారణారామా.

భీష్మమహిమ:—ఇది దేశసేవాగ్రంథమాలలోని ద్వితీయ పుష్పము. రచయిత పీఠికాపురమందలి బ్ర॥ శ్రీ. జనమంచి సీతారామస్వామిగారు. దీని పేరునుబట్టియే యిందలికథ తేటతెల్లమగుచున్నది. బాలురకును స్త్రీలకును దెలియునట్టి సులభశైలితో నొప్పారుచున్నది. వెల, ౦-౫-౧. వలయువారు గోదావరిజిల్లా, పిఠాపురములో నున్న గ్రంథకర్తగారికి వ్రాసికొననగు.

౨ క్ష.

# ప్రాకృతభాషోత్పత్తి.

(పాలీభాషోత్పత్తి)

ఆర్యమహాశయులార!

ప్రస్తుతము పాలిభాష చిరకాల ముచ్ఛిన్నస్థితిలో నున్న దైనను బ్రకృత మందలి బౌద్ధ ప్రవచనములు లేక ఖిలమయి యుండుటఁ గని దొరతనమువారు కలకత్తా మొదలగు గొప్పపట్టణములయం దున్న యాంగ్లేయ కళాశాలలలోఁ జదువు విద్యార్థిసంఘమునకు సంస్కృతము మొదలగుభాషలనువలెనె దీనిని గూడ రెండవభాషగా నేర్పాటుచేసియు, నీభాషలో వ్రాయఁబడిన ప్రాచీన గ్రంథముల నచ్చొత్తించియు దీని నుద్ధరించుచున్నారు. ఈభాషయందుఁ గొంత కృషి చేయవలయు నని నాకు నభిలాష గలుగుటచేఁ గొన్నాళ్లనుండి యీభాషా గ్రంథములను సంపాదించి చదివి యిపుడు దానిస్వరూపనిరూపణమును దెలియఁ జేయునొకవ్యాసమును వ్రాసితి. నావధానమనస్కులై చిత్తగింపుఁడు.

మనమతగ్రంథములు, పురాణములు, ఇతిహాసములు, మన్వాదిస్మృతులు, న్యాయవైశేషికాదిశాస్త్రములు, కావ్యములు, చంపువులు, నాటకములు మొదలగునవి యన్నియును సంస్కృతభాషలో వ్రాయఁబడియున్నవి. ప్రతిదినమందును మన మాచరించుసంధ్యావందనాది నిత్యకర్మలయందును, శ్రౌతస్మార్తాది కర్మవిశేషంబులయందును సంస్కృతభాష యే వాడుక చేయఁబడుచున్నది. విద్వాంసులు తర్కవ్యాకరణాదిశాస్త్రములయందు వాదములఁ జేయునపుడు సంస్కృత భాషతోనే వాదింతురు. భాషాపాండిత్యము గలవా రిప్పటికిని సంస్కృతభాషలోఁ గావ్యనాటకాదులను రచించుచున్నారు. ఈసంస్కృతభాష మన మెఱింగినస్థితి నొందునప్పటికి బహుకాలము పట్టినది. తొల్లి యీభాష యార్యుల భాషయై వెలసెను; గావున నార్యభాష యని పేరొందెను. ఈయార్యభాష చిరకాలము లోకమందు జనులు మాటలాడుభాషయై యుండె నని సమర్థించుటకనేకగ్రంథనిదర్శనము లున్నవి. అట్టినిదర్శనములలోఁ బ్రథమగణ్యా మగుపాణిని సూత్రసమూహమువలన నే యీయంశము స్పష్ట మగుచున్నది. ఆకాలమందు

వాడుకలో నున్నభాషకే సంబంధించిన నియమములను విధించు ననేకసూత్ర ములు పాణినికృతాష్టాధ్యాయిలోఁ గానవచ్చుచున్నవి. ఎట్లన; వాక్యస్యటేః ప్లుత ఉదాత్తః (౮-౨-౮౨) ప్రత్యభివాదేఽశూద్రస్య (౮-౨-౮౩) దూరాద్ధూతేచ (౮-౨-౮౪) హైహేప్రయోగేహైహయోః (౮-౨-౮౫) గురోరనృతోఽనంత్యస్యాప్యేకైకస్యప్రాచామ్ (౮-౨-౮౬) అప్లుతవదుపస్థితే (౬-౧-౧౨౯) ఇత్యాది సూత్రకదంబములో దూరాహ్వానమందు, అభివాదనమందు, వాక్యావసానమం దుండు నచ్చునకుఁ బ్లుతము వచ్చు నని చెప్పఁబడెను. ఆకాలమందు జనులు దూరస్థు లగువారిని బిలుచునపుడు, నభివాదన మొనర్చునపుడు, నిట్టినియమము లుండవలయు నని విధింపఁబడెను. మహాభాష్యమందుఁ బతంజలి వ్యాకరణమును జదువుటకు ముఖ్యప్రయోజనములఁ జెప్పుచు నసురులు "హేలయో హేలయః" అని యపశబ్దమును బ్రయోగించి పరాజయము నొందిరి. గావున "బ్రాహ్మణేన నమ్లేచ్ఛితవై - నాపభాషితవై, మ్లేచ్ఛోహవా ఏషయ దపశబ్దః" మ్లేచ్ఛమన నపశబ్దము గావున మనము మ్లేచ్ఛుల మనఁగా నపశబ్దముల సంభాషించువారలము కాకుండ వ్యాకరణముఁ జదువవలయు నని వ్రాసెను. ఇంతియకాక "వేదాన్నో వైదికాశ్శబ్దా స్సిద్ధాః లోకా ల్లౌకికాః" వేదమునుండి వైదికశబ్దములు, లోకమునుండి లౌకికశబ్దములు సిద్ధించినవి. "ఆహితాగ్నిరపశబ్దం ప్రయుజ్య సారస్వతీమిష్టిం నిర్వపేత్" ఆహితాగ్ని యపశబ్దముఁ బ్రయోగించినయెడల నందుకుఁ బ్రాయశ్చిత్తముగా సారస్వతేష్టి నొనర్పవలయు నని చెప్పియున్నాఁడు. క్రీస్తుశకమునకుముందు రెండవశతాబ్దములో వింధ్యహిమాచలములకు నడుమ నున్న "ఆర్యావర్త" మనుభూభాగమందు సంస్కృతభాష జనులవాడుకలో నున్నట్లుకూడ గ్రంథప్రమాణము కానవచ్చుచున్నది. ఈభాషను దప్పులు లేకుండ శుద్ధముగా భాషించువారు బ్రాహ్మణులు. వీరికే పతంజలి శిష్టు లని పేరిడెను. ఇది కాక మఱియొకవిశేషము కలదు. ఈసంస్కృతభాష గ్రంథములు వ్రాయుట కుపయోగింపఁబడుభాష (literary language) గా నుండుటయే కాక దీనిలోఁ బూర్వకాలమం దవాంతరభాషాభేదము లుండెనని (Dialectic variations) గూడ నూహించుటకుఁ గొన్నిగురుతులు కానవచ్చుచున్నవి. పాణినిసూత్రములలో "ఉదీచాంవృద్ధాదగోత్రాత్ (౧-౪-౧౫౭) ప్రాచామవృద్ధాత్ఫిన్బహులమ్(౪-౧-౧౬౦)బహ్వచఇఞః ప్రాచ్యభరతేషు(౨-౪-౬౬) అలంఖల్వోః ప్రతిషేధయోః ప్రాచాంక్త్వా(౩-౪-౧౮) ఉదీచాంమాఙోవ్యతీహారే(౩-౪-౧౯) ప్రాచాంష్ఫతద్ధితః (౪-౧-౧౭) ప్రాచాం

కఠాదేః (౪-౨-౧౩౮) మాతరపితరావుదీచామ్ (౬-౩-౩౨) ప్రాచాంక్రీడాయామ్ (౬-౨-౭౪)" అని యుత్తరీయపౌరస్త్యశాబ్దికుల భాషాభేదనియమములను దెల్పుచున్నాఁడు. "శీలికామిభక్ష్యాచరిభ్యో ణః ఈక్షిక్షమిభ్యాంచేతివక్తవ్యమ్ అలస్యసుఖాహరణయోరితివక్తవ్యమ్ కప్రకరణేమూలవిభుజాదిభ్య ఉపసంఖ్యానమ్" ఇత్యాది వార్త్తికములయందుఁ గాత్యాయనుండు తా నున్నదేశములోఁ దనకాలమందు వాడుకచేయఁబడుభాషను గుఱించిననియమములను దెలుపుచున్నాఁడు. పతంజలి మహాభాష్యములో "శవతిర్గతికర్మాకంబోజేష్వేవ భాషితో భవతి. వికార ఏనమార్యాభాషంతే శవఇతి. హమ్మతిస్సురాష్ట్రేషు; రంహతిఃప్రాచ్యమధ్యేషు. గమిమేవత్వార్యాః ప్రయుంజతే. దాతిర్లవనార్థేప్రాచ్యేషు దాత్రముదీచ్యేషు" "నడచుట" అను నర్థము గల శవధాతువు కంబోజదేశమందే వాడుకచేయఁబడుచున్నది. అది యశుభ మని యార్యులు విడిచిరి. గత్యర్థకము లగుహమ్మధాతువు రహిధాతువు యథాక్రమముగా సౌరాష్ట్రదేశమందుఁ బ్రాచ్యమధ్యదేశమందు వాడుకచేయఁబడును.

ఆర్యు లీయర్థమందు "గమ్" ధాతువునే వాడుకచేయుచున్నారు. అశ్వపాలకుఁ డొకఁడు "సారథి" యను నర్థ మిచ్చుసూతశబ్దముయొక్క వ్యుత్పత్తిని గుఱించి యొకవైయాకరణునితో వాదించినట్లు పతంజలి మహాభాష్యములో వ్రాసెను.

ఇదికాక సంస్కృతనాటకములలో నుత్తమమధ్యమనీచపాత్రలకు భాషాసంవిభాగముం జేయుటలో "పురుషాణామనీచానాం సంస్కృతంస్యాత్కృతాత్మనామ్। శౌరసేనీప్రయోక్తవ్యా తాదృశీనాంచ యోషితామ్। ఆసామేవతు గాథాసు మాహారాష్ట్రీంప్రయోజయేత్। అత్రోక్తా మాగధీభాషా రాజాంతఃపురచారిణామ్। చేటానాం రాజపుత్రాణాం శ్రేష్ఠినాంచార్ధమాగధీ। ప్రాచ్యా విదూషకాదీనాం ధూర్తానాం స్యాదవంతికా." సాహిత్యదర్పణము.

ఉత్తములు విద్వాంసులు నగువారలు సంస్కృతమును, తత్సదృశ లగు స్త్రీలు శౌరసేనీభాషను, వీరే సంగీతగోష్ఠియందు మహారాష్ట్రభాషను రాజాంతఃపురచారులు మాగధీభాషను, చేటులు రాజపుత్రులు వణిగ్జనులు నర్ధమాగధిని, విదూషకాదులు ప్రాచ్యభాషను, ధూర్త లవంతికను మాటలాడవలయు నని నియమము కలదు. ఈనియమము నాటకప్రణయనకాలముకంటెఁగూడఁ బ్రాచీనమైనట్లు మఱికొన్నిగ్రంథనిదర్శనములవలనఁ గానవచ్చుచున్నది. కా

పుసః జైనిప్రాసిన వాలెంప్రాసపట్టి చూడఁగా సంస్కృతభాష చిరకాలము లోకవ్యవహారభాషగా నుండె నని నిస్సంశయముగాఁ జెప్పఁగలము. ఏకాలమం దైన నేదేశమందైనను జనులవాడుకలో నుండుభాష దానిస్వభావమునుబట్టియు జనులయుచ్చారణసౌష్ఠవమునుబట్టియుఁ గాలక్రమమున మార్పు నొందును.

పూర్వము ఋగ్వేదభాషలో వాడుకచేయఁబడినహంతవే, జీవసే, పిబధ్యై మొదలగు తుమున్నంతరూపములు, కరత్, పతత్, తారిషత్ మొదలగు లట్ రూపములు, వ్యోమన్, నాభా మొదలగు సప్తమ్యేకవచన రూపములు, దేవాసః, విప్రాసః అను ప్రథమ బహువచన రూపములు, దేవేభి స్సుగేభిః మొదలగు తృతీయ బహువచనరూపములు నిప్పటిలౌకికసంస్కృతభాషయం దదృశ్యము లయినవి. పైనుండి వచ్చినయార్య్యులీభరతఖండమునందు వ్యాపించినతరువాత వీరితోఁ దఱచుసంబంధము గలిగియుండునీదేశపు టాదిమనివాసులు వీరిభాష నుచ్చరించుట కష్టముగాఁ గాన్పించుటచేఁ బలుకవలసిన విధముగాఁ బలుకలేక వర్ణలోపవర్ణవ్యత్యయాదులచే నాభాషను వికృతి నొందింపసాగిరి. ఇట్లు నా నాఁటికి మాఱుచుండెడి తమభాషాస్థితిని జూచి సంస్కరింపఁ దలంచి కొందఱు ఋషులు వర్ణోచ్చారణ, వర్ణసంధి మొద లగువానికి విశేషనియమముల నేర్ప ఱచి ప్రాతిశాఖ్యలను, మఱికొందఱు శబ్దవ్యుత్పత్తులను దెల్పునిఘంటువులను, మఱికొందఱు వ్యాకరణములను వ్రాసి యప్పటికి నిల్చియున్నభాష కంతకును నియమము లేర్పఱచి పునర్నవీకృతముగా సంస్కరించిరి. ఇది సంస్కరింపఁబడిన భాష యగుటచే "సంస్కృతభాష" యని పేరొందెను. ప్రాచీనార్యభాష యగు వైదికభాషకంటెఁ గొన్నివిషయములలో నిది విభిన్న మైనది గావునఁ బాణిన్యా చార్యుఁడు దీనికి లక్షణముఁ జెప్పునపుడు తన యష్టాధ్యాయిసూత్రములలోఁ బలుచోట్ల దీనిని భాష యనియే వాడెను. ఎట్లన; భాషాయాం సదవసశ్రువః, భాషాయాం శాసియుధిదృశిధృషిమృషిభ్యో యుజ్వాచ్యః, విభాషా భాషా యామ్, మయతై ర్వేతయో ర్భాషాయామభక్ష్యాచ్ఛాదనయోః (౪-౩-౮౩) పూ ర్వంతుభాషాయామ్, విభాషా భవద్భగవదఘవతా మోచ్చావస్యేఛందసిభాషా యాంచ." ప్రాచీనభాషను జెప్పునపుడు "మతువసోరుసంబుద్ధౌ ఛందసి (౮-౩-౧) ఛందసివా, ప్రామ్రేడితయోర్నిత్యంఛందసి (౬-౪-౮) అని ఛంద శ్శబ్దమును బ్రయోగించెను. హర్షచరిత్రమందు బాణకవి స్వీయచరిత్రమును జెప్పుటలో "అభవంశ్చాస్యవయసా సమానాస్సుహృదస్సహాయాశ్చ। భ్రాతరౌ పారశవౌ చంద్రసేనమాతృషేణౌ। భాషాకవి రీశానః పరం మిత్రమ్" ఇచ్చట

భాషయనఁగాఁ బైని చెప్పఁబడినదానికే పేరు. శబ్దశాస్త్రతత్త్వనిర్ణేతయు వేదవ్యాకరణాది బహుగ్రంథకర్తయు నగు Macdonel మహాశయుఁడు తాను వ్రాసిన సంస్కృతవాఙ్మయచరిత్రము (History of Sanskrit Literature) లో నీభాషనుగుఱించి యిట్లు వ్రాసియున్నాఁడు.

"The later phase of the ancient language of India was stereotyped by the great grammarian Panini towards the end of the 4th century B. C. It came to be called, 'Sanskrit' the refined or elaborate, a term not found in the older grammarians but occurring in the earliest Epic, the Ramayana, Sundarakanda, 30th Sarga, 17th verse."

"అహం త్వతితనుశ్చైవ వానరశ్చ విశేషతః। వాచం చోదాహరిష్యామి మానుషీ మిహ సంస్కృతామ్। యది వాచం ప్రదాస్యామి ద్విజాతి రివ సంస్కృతామ్। రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి" సంస్కృతాం—గీర్వాణాం గీర్వాణభాషయా వ్యవహారే దోషమాహ యదీతి.

(శ్రీధరీయ గోవిందరాజీయ వ్యాఖ్యానములు.)

The older grammarians, themselves from Yaska onwards, speak of this classical dialect as Bhasha, the speech, in distinction from Vedic." *Weber's History of Sanskrit Literature.*

వీబరుపండితుఁడుగూడఁ దాను వ్రాసిన సంస్కృతవాఙ్మయచరిత్రములో "సంస్కరింపఁబడిన యొకభాష యుండె ననియు దానినుండి ప్రాకృతభాషలు పుట్టిన" వనియు వ్రాసియున్నాఁడు.

"In this way there gradually arose new vernaculars, proceeding directly from the Bhasha, specially so called down even to modern times; whereas the grammatically refined Bhasha afterwards lost this title and substituted for it the name Sanskrita-bhasha.

*Weber's History of Sanskrit Literature pp. 177.*

పైని జెప్పినరీతిగా నీభాష కాలక్రమమున ననేకవిధములుగా మాఱినది. సంస్కృతవాఙ్మయములోని ప్రాచీనగ్రంథములను నవీనగ్రంథములను బాగుగ విమర్శించినచోఁ బ్రాచీనభాషకు నవీనభాషకు మిగుల వ్యత్యాసము గానవచ్చును. నవీనులలోఁ గొప్పనైయాయికుఁ డనుప్రసిద్ధిఁ గాంచిన గదాధరభట్టాచార్యునిగ్రంథములశైలికిని న్యాయవైశేషికతంత్రకర్త లగుకణాదగౌతమ వాత్స్యాయనుల శైలికి నెంతవ్యత్యాసము గానవచ్చుచున్నదో, శబరస్వామి రచించినపూర్వమీమాంసాసూత్రభాష్యమునకుఁ బార్థసారథిమిశ్రి వ్రాసిన

శాస్త్రదీపికకు నెంతయంతరమో, పతంజలిమహాభాష్యమునకు నాగోజీభట్టుని గ్రంథభాషకును నెంతభేదమున్నదో బహుశ్రుతు లగుమిముబోటిబుధవర్యులే యెఱుంగుదురు.

భాషను వ్యవహరించుమనుష్యులయుచ్చారణాసామర్థ్యము, అనవధానత, అజాగరూకత, అశిక్షితత్వము మొదలగునవి భాషను మార్చుటకు ముఖ్యమయినహేతువులు. ఇట్లొకభాష యుచ్చారణాసౌష్ఠవముచే వికృతినొంది మఱియొకభాషగా నగుటకుఁ గొన్నిస్వరనియమము లున్నవి. దీనికే స్వరశాస్త్ర (Phonology) మని పేరు. ఇది శబ్దశాస్త్రము (Philology) లో నేకదేశము. నేనిఁక ముందుఁ బ్రతిపాదింపఁబోవు వైకృతభాషోత్పత్తి కిదియేమూలము గావున నాయక్షరములమార్పులు, నాస్వరనియమములను గొన్నింటి నిచట నుదాహరించుచున్నాఁడను. “ఊరినడుమ” అని చెప్పుటకు “గ్రామ”, “మధ్య” అను రెండుపదము లుండవలెను. ఈపదద్వయమును సమాసముగాఁ జేసినచో “గ్రామమధ్య” అని యగును. యుక్తముగా నుచ్చరించుట కలవాటు లేనివాఁడు, అశిక్షితుఁడు, ప్రమాదముతో నుచ్చరించువాఁడు “మధ్య”కు “మజ్ఝ” యనికాని “మద్ధ” యనికాని పలుకును. మరల నీశబ్దరూపము, “మాఝ” లేక “మాధ” యని మాఱి యంతతో నిలువక “మా” లేక “మహ” యయి కొనకు “మా” లేక “మే” యయినది. ఇట్లు గ్రామమధ్యశబ్దము “గామమా” లేక “గామమే” యని మాఱినది. గూర్జరీ, హిందీ, మహారాష్ట్రీభాషలలో నిదియే రూపము. ఇట్లే కుంభకారశబ్దము తప్పైనయుచ్చారణచే “కుంభార” యయినది. ఈకుంభారశబ్దమును వాడుకచేయుమనుష్యులు, కుంభ మనఁగా, కడవ, కార యనఁగా దానిని జేయువాఁడు ననుజ్ఞానము లేనివారై “చేయువాఁడు” అనునర్థ మిచ్చునొకప్రత్యయ మని తలంచెదరు. పైనిజూపించిన “గామమే” అనుదానిలో మే అనునది, “కుంభార” అనుదానిలో “ఆర” అనునదియుఁ బూర్వము స్వతంత్రశబ్దములై యుండి కాలక్రమమున నొకరీతిప్రత్యయము లయిపోయినవి. ఈరీతిగా నొకప్పుడు భిన్న మయినయర్థము గలస్వతంత్రశబ్దములు కొంతకాలమునకుఁ దరువాతఁ బ్రత్యయత్వము నొందినవి. సంస్కృతభాషలలోఁ గూడ నిట్టిశబ్దరూపము లున్నవి. ఎట్లన; గోష్ఠ మనఁగా గోవు లుండుస్థానమునకుఁ బేరు. కాలక్రమమున నిది “గోష్ఠజాదయఃస్థానాదిషుపశునామభ్యః” అని పశువాచకము లగుశబ్దములకంటెఁ బరమైన “గోష్ఠచ్” ప్రత్యయము మునుపటియర్థమును బరిత్యజించి “అశ్వగోష్ఠమ్”, “ఖరగోష్ఠమ్”

ఇత్యాదులయందుం గేవలస్థానపరముగా వాడుకలోనికి వచ్చెను. అట్లే "ద్విత్వే గోయుగచ్" గోయుగ మనునది రెండుగోవు లనుతొంటియర్థమును విడిచి ప్రత్యయమయి ద్విత్వమును దెలియఁజేయునది యయ్యెను. ఉదా. "ఉష్ట్రగోయుగమ్" "షట్త్వేషడ్గవచ్". అశ్వషడ్గవమ్ - ఆఱుగుఱ్ఱము లని యర్థమిచ్చుచున్నది. (అష్టాధ్యాయి ౫-౨-౨౯) ఏభాషలోనైనను సుబంతప్రత్యయములను గాని తిజంతప్రత్యయములను గాని సరిగా విమర్శించి చూచినయెడల నవి యన్నియు నీరీతిగానే పుట్టిన వని నిశ్చయింపవచ్చును. మనప్రాచీనులు "నే నిపుడు చేయుచున్నాను" అని చెప్పవలసి వచ్చినపుడు (కృ = చేయుట, ను = ఇపుడు, మి = ఉత్తమపురుషప్రత్యయము) అను నీమూఁడుపదములను గలిపి "కృనుమి" అని పలుకుదురు. తరువాతఁ జెవి కింపుగా నుండుటకు దానిని "కృణోమి" అని మార్చిరి. ఇట్లు కృణోతి, కృణోషి, కృణుతః మొదలగు రూపములు సిద్ధించినవి.

సంస్కృతములో లుడర్థమందు (భవిష్యదర్థకము 2nd future) ధాతువునకు "స్య" అనునది చేర్పఁబడును. దా+స్య+తి, ఈ స్య యనునది ప్రాయికముగా 'అస భువి' 'యా ప్రాపణే' అనుధాతుద్వయసంమేళనమువలనఁ బుట్టినదని మన మూహింపవచ్చును. భవిష్యదర్థకమును దెలియఁజేయుటకు మనప్రాచీను లూహించిన యుపాయమిది. 'దాస్యతి' అనుతిజంతరూపమునకు మొదటి యర్థము "వాఁ డిచ్చుచుండుటకుఁ బోవుచున్నాఁడు". వాఁ డింక నియ్యలేదు; ఇచ్చుటకుఁ బోవుచున్నాఁ డని యర్థము. ఆంగ్లేయభాషలోఁ గూడ నీజాతీయము (idiom) ప్రచురముగా నున్నది. ఎట్లనిన:— I am not going to stay here to-morrow. (రేపు నే నిచట నుండఁబోను).

ఈసంస్కృతధాతురూపము, ప్రకృతి యగుసంస్కృతమునుండి వికృతి నొంది పుట్టినభాషలలో, దాస్సతి, దాస్సది, పిమ్మట దాస్సఇ, మఱికొంతకాలమునకు దాసఇ, దాహఇ, దాఇ, దే అని క్రమముగా మాఱినది. ఇట్లు సంభవించెడు నీస్వరనాశము (phonetic decay) మొట్టమొదట దిద్దఁబడకపోయిన యెడలఁ గ్రమముగా బలిష్ఠమయి కొంతకాలమునకు భాషను శుద్ధముగామార్చి పైవారి కెవ్వరి కర్థముకాకుండఁ జేయును. కావున మనుష్యులు స్వభాషను మాటలాడునపు డుచ్చారణలో మిక్కిలి జాగరూకు లయి యుండవలెను. కొన్ని తెగలవారు స్వభాషను గుఱించి మిగుల జాగ్రత్త గలవారై మార్పున కెంత మాత్ర మెడ మియ్యరు. ఒకజాతివారు మఱియొక జాతివారితో గాఢ మగు

సంబంధమును గలిగి యున్నచో వారిభాష వీరికి వీరిభాష వారికి నన్యోన్యము సంక్రమింప నాయాయిభాషాపదముల నుచ్చరించుట వారి కలవాటు లేక మఱి యొకరీతిగా నుచ్చరింపఁగా భాషకు వైరూప్యము సంభవింపక మానదు.

కావునఁ బై నుపపాదింపఁబడిన రీతిగా స్వరవ్యత్యాసము (Phonetic change) స్వరభ్రంశము (phonetic decay) మొదలగువానిచే సంస్కృతశబ్దములు మాఱిమాఱి కాలక్రమమునఁ గ్రొత్తభాషలుగా నేర్పడినవి. ఇవి గూర్జరి, మహారాష్ట్రి, మాగధి, శౌరసేని యని పలుతెఱఁగులుగా నున్నవి. ఆయాయి దేశములయం దవి వ్యవహరింపఁబడుటచే వాని కాదేశనామములు కలిగెను.

ఈభాష లన్నిటిలో "పాలి" యనునది వ్యాకరణనియమములయందు శబ్దసాదృశ్యమందుఁ దక్కినప్రాకృతభాషలకంటె సంస్కృతభాషకు మిక్కిలి దగ్గఱగా నున్నది. ఈ భాష పూర్వకాలమందు హిందూదేశములో నార్యులు వాడుకొనుభాషలలో నొక టని గాని లేక ప్రాకృతభాషలలో నొక టని గాని చెప్పవచ్చును. దీనిస్వరూపమును విమర్శింపఁగా నిది సంస్కృతభాషనుండి మొదట వెలువడిన భాషగాఁ గానవచ్చును. ఇది మగధదేశవాసుల భాష కావున మాగధి యని కూడ వ్యవహరింపఁబడుచున్నది. సంస్కృతభాషలో పాలీ శబ్దమునకుఁ బంక్తి యని కాని పరంపర యని కాని యర్థము. కొందఱీ శబ్దము పఠ్ ధాతువునుండి పుట్టిన దనియు· మఱికొందఱు ప్ర + ఆళి = ప్రాళి (ప్రకృష్ట మగుసమూహము) యనుశబ్దము చెడి పాలీ యయిన దనియును జెప్పుదురు. దక్షిణమం దుండుబౌద్ధులు తమ పవిత్రమతగ్రంథములకు పాలీ యని పేరిడిరి. ఈ సంజ్ఞ మొదట వారివేదగ్రంథములకే వర్తించి కొంతకాలమునకుఁ దరువాత మూలగ్రంథములకు వ్యాఖ్యానగ్రంథములకుఁ గూడ వ్యాపించెను. ఇపుడు పాలీభాష యనఁగా మూలగ్రంథముల భాష యని పేరు. పాలీశబ్దము ప్రాచీనకాలమందుఁ గేవలమతగ్రంథపరమై యుండెను. ప్రాచీనదక్షిణబౌద్ధమతగ్రంథములయం దీమతభాషకు మాగధి యనియే పేరు కానవచ్చుచున్నది. ఏకాలమం దేదేశమం దీభాష పుట్టెనో యాసంగతి కూడ నిశ్చయముగాఁ దెలియదు. ఇప్పటికి నాయంశము వివాదాధ్యాసిత మై యున్నది. ఈ విషయమయి Oldenbery, Westergard అను పాశ్చాత్యమహాపండితుల యభిప్రాయము మన కవశ్యముగా స్వీకరణీయము. ఇది సంస్కృతమునుండి పుట్టిన యొకవైకృతభాష యనియు నశోకుని పుత్త్రుఁడగు మహేంద్రపాలుని రాజ్యపరిపాలనకాలమందు మాళవదేశమునకు రాజధాని యైనయుజ్జయినీపట్టణమందు

వ్యవహరింపఁబడుచుండెననియు నీభాషలో వ్రాయఁబడిన "వినయపిటక" మను బౌద్ధమతగ్రంథ మశోకపుత్త్రుఁ డగుమహేంద్రపాలునికి ముందు నూటయేఁబది సంవత్సరము లనఁగాఁ గ్రీస్తుకు ముందు నాల్గవశతాబ్దమం దున్నట్లు బౌద్ధమత గ్రంథనిదర్శనము కల దనియుఁ బూర్వోక్తు లగు నావిద్వద్వరులు సోపపత్తికముగ సమర్థించిరి. ఎట్లైన నీభాష రెండువేలసంవత్సరములనుండి వాడుకలో లేనిభాష (dead language) యయ్యెను. పాలి, మాగధీభాషలోనుండి పుట్టిన యొక యవాంతరభాష యనియుఁ బూర్వము గౌతమబుద్ధుఁ డీభాషలోనే తనశిష్యులకు స్వమతమును బోధించె ననియు నొక సంప్రదాయము కలదు. మొదట గ్రామ్య భాషగా నున్నయామాగధీభాషను ధర్మమతోద్ధారకుఁ డైనబుద్ధుఁడు తనబుద్ధి ప్రభావముచే శ్రేష్ఠ మగునభాషగాఁ జేసె నని బౌద్ధు లందఱును, యూదియా దేశస్థులు బైబిలులోని మొదటి యధ్యాయపంచకము (pentatench) నెంతభక్తి గౌరవములతోఁ జూతురో యంతభక్తితో నీభాషను జూతురు. వాఙ్మయము వలననే కదా భాష కౌన్నత్యము కలుగుట. ఇప్పు డున్నపాలీవాఙ్మయ మతివిస్తృతముగా నున్నది. శబ్దశాస్త్రజ్ఞుని (philologist) కిఁ జరిత్రకారుని (historian) కిఁ బ్రాచీనకథావళీతత్త్వజిజ్ఞాసువు (student of comparative mythology) నకును నిది మిక్కిలి వినోదకరముగా నుండును. ఇంత వాఙ్మయములో నైరోపాదేశస్థు లెఱింగినది స్వల్పమే. ౧౭వ వర్షశతకమందు లాలోబిరీ యను ఫ్రెంచిదేశపు విద్వాంసుఁ డొకఁ డిట్టిభాష యొక టున్న దని మొదటఁ గనుఁగొని తక్కిన పాశ్చాత్త్యపండితుల కందఱకుఁ దెలియఁజేసెను. ఈపాలీవాఙ్మయమును మూఁడు పెద్దతరగతులుగా విభజింపవచ్చును. మొదటిది బౌద్ధులవేదములు, ఇవి ప్రాచీనతమములు; రెండవది క్రీస్తువెనుక నయిదవశతకమందు బుద్ధఘోషుఁ డనువాఁడు వ్రాసిన సర్వబౌద్ధగ్రంథముల వ్యాఖ్యానములు; మూఁడవది చరిత్రగ్రంథములు మొద లగునవి. క్రీస్తువెనుకఁ ద్వితీయశతకము మొదలుకొని నేఁటివఱకు వీనికాలము.

బౌద్ధవేదములకు "త్రిపిటిక" లని పేరు. త్రిపిటిక లనఁగా మూఁడు గంపలు. అవి వినయపిటక, సూత్రపిటక, అభిధర్మపిటకయు నని మూఁడు. ఈమూఁడింటిలో వినయపిటకము బౌద్ధమతగురువుల నియమములను దెలుపునది. ఇది మఠాధిపతు లెట్లు నడచుకొనవలయునో యాయంశములను దెలియఁజేయుటయే కాక గౌతమబుద్ధుని చరిత్రమును గూడ విపులముగాఁ జెప్పుచున్నది. గౌతమబుద్ధుఁడు నతనిమతబోధకులుఁ బరుల కుపదేశించిన ధర్మ

ములు, జాతకకథలు, తక్కినమతగురువు లప్పు డప్పుడు రచించిన సూత్రములు మొద లగునవి సూత్రపిటకములో నున్నవి. మతాచారనిరతి కపేక్షిత మగు నాన్వీక్షకీవిద్య నభిధర్మపిటక వివరించుచున్నది. ఈత్రిపిటకల కనేకప్రతు లున్న వనియు వానిలోఁ గొన్ని క్రీస్తుకు ముందు ౩౦౯వ సంవత్సరములో నశోక చక్రవర్తి యధ్యక్షతక్రింద జరుపఁబడిన మూఁడవబౌద్ధమతసభలో సరిగా దిద్దఁబడె ననియు బౌద్ధచరిత్రకారులు వ్రాసియున్నారు.

త్రిపిటకలకుఁ దరువాతఁ బ్రధానబౌద్ధమతగ్రంథములు బుద్ధఘోషుని వ్యాఖ్యానములు. మతబోధకుఁ డగుమహేంద్రుఁడు క్రీస్తునకు ముందు ౩౦౭వ సంవత్సరములో సింహళద్వీపమునకుఁ బోవునపుడు త్రిపిటకలనే కాక "అర్థకథ" యనుపేరుగల బుద్ధఘోషవ్యాఖ్యానములను గూడఁ దనతోఁ దీసికొని పోయెను. మహేంద్రుఁడు సింహళద్వీపవాసుల నందఱు బౌద్ధమతములోఁ గలిపినపిమ్మట నీపాలీగ్రంథముల నన్నింటిని సింహళభాషలోనికి మార్చెను. ఇట్లు మార్పఁబడిన యీగ్రంథము లనేకాబ్దశతములకాలము సింహళద్వీపవాసులచేఁ జదువఁబడినవి. ఈహేతువుచేఁ గాలక్రమమున పాలీగ్రంథము లంతరించినవి. బౌద్ధమతస్థులలో లోకాతిశాయి పాండిత్యము గలబుద్ధఘోషుఁడు క్రీస్తుతరువాత నయిదవశతమందు మహేంద్రుఁడు సింహళభాషలోనికి మార్చిన వ్యాఖ్యానముల నన్నింటిని మరల పాలీభాషలోనికి విపరిణామము చేసెను. కొంతకాలమున కాసింహళభాషానూదితగ్రంథములు నశింపఁగా బుద్ధఘోషుఁడు మార్చినపాలీభాషాగ్రంథములే యిప్పటికిని మిగిలినవి. పాలీవాఙ్మయములోని శేషించిన గ్రంథములు మీఁదఁ జేర్కొనఁబడిన వానివలె నంత ప్రధాన మయినవి కావు. వానిలో ముఖ్యము లయినవి "దీపవంశము" "మహావంశము" నని ప్రసిద్ధమైన చరిత్రగ్రంథములు. ఇవి క్రీస్తుశకమునకు ముందిభరతఖండపు చరిత్రమును దెలుపుటకు మూలప్రమాణభూతము లయినవి. దీనితరువాతఁ జెప్పఁదగిన గ్రంథము "మిళిందపన్హా" (మిళిందప్రశ్న) ఈప్రసిద్ధగ్రంథ మెట్లు పుట్టినదో మనకుఁ దెలియదు గాని యిది మిగులఁ బ్రాచీన మైన దని నిశ్చయముగాఁ జెప్పఁగలము. ఎట్లన; బాక్ట్రియాదేశపు రాజైన "మియాండ"రే యితఁ డని నిశ్చయింపఁబడినది. మిళిందుఁ డనురాజు బౌద్ధమతమును దెలిసికొనఁ గోరి నాగసేనుఁ డనుబౌద్ధమతపండితు నడిగినప్రశ్నలు, వానిసమాధానములు, గ్రీకుదేశపురాజుల నామధేయములు, మొద లగునవి దీనిలో సవిస్తరముగాఁ బ్రతిపాదింపఁబడినవి. ఈమిళిందుఁడు క్రీస్తుకు మున్ను ద్వితీయశతకాంతమందు

భరతఖండములోఁ గొంతభాగమునకుఁ బరిపాలకుఁడై యుండెనని గ్రీకుచరిత్రకారులు వ్రాసియున్నారు. తరువాతఁ జెప్పఁదగ్గ మరుగ్రంథము బుద్ధఘోషుని “విశుద్ధిమార్గము”. ఇది బౌద్ధమతసిద్ధాంతములను సాకల్యముగ బోధించెడు నొకనిఘంటు వని చెప్పవచ్చును. ఈపాలీభాష కనేకగ్రంథకర్త లనేకవ్యాకరణములను వ్రాసియున్నారు. వానిలోఁ గాత్యాయనవ్యాకరణము ప్రాచీనమైనది ముఖ్యమైనది. ఈకాత్యాయనునికాలము నిర్ణయించుట కాధారము లెవ్వియుఁ గానరావు. ౧౨వశతకమందు సింహళదేశపు పండితుఁ డొకఁ డమరసింహుని నామలింగానుశాసనము ననుసరించి “అభిధానప్రదీపిక” యను నొకనిఘంటువును వ్రాసెను. ఈభాష కిదొకటియే నిఘంటు.

పాలీపద సమూహమును సంస్కృతపదసమూహమును నొకచోటనిడి బాగుగఁ బరీక్షించినయెడల నైదువంతుల పాలీశబ్దజాలమునకు రెండువంతులు శుద్ధసంస్కృతశబ్దములే కానవచ్చును. ఎట్లన; నిదాన, నాగ, బుద్ధ, అనట, అవి, జనపద, గంగ, గంధ మొద లగునవి. సుత్త (సూత్ర) పజాపతి (ప్రజాపతి) నగ్గ (నగ్న) సామగ్గి (సామగ్రీ) గిద్ద (గృధ్ర) మిత్త (మిత్ర) మొదలగునవి యించుకంత మార్పుఁ జెందినవి. హేత్థ (అధస్తాత్) పారుపతి (ప్రావరతి) అల్లా (ఆర్ద్ర) తాలిస (చత్వారింశత్) మొద లగుశబ్దము లేమూలము నుండి పుట్టినవో మనము పోల్చుకొన లేనంత వికృతి నొందినవి. మొదటి రెండుతరగతుల శబ్దములే పాలీభాషలో హెచ్చుగా నున్నవి. కాని మన యిప్పటి సంస్కృభాషాపదములకంటె మిగులఁ బ్రాచీన మైనవియు, వేదభాషలోఁ గనఁబడునవియు నగు కొన్నిశబ్దరూపము లీపాలీయందుఁ గానవచ్చుచున్నవి. అవి యెవ్వియన, తుమర్థే సే, సేన్, అసే, అసేన్, క్సే, కసేన్, అధ్యై, అధ్యైస్, కధ్యై, కధ్యైన్, శధ్యై, శధ్యైన్, తవై, తవేజ్, తవేనః. వేదభాషలో నీప్రత్యయములు తుమర్థమందు ధాతువులకుఁ బరముగా వచ్చును. అట్లు రాఁగానే తవే, కేతవే, హేతవే యనురూపములు సిద్ధించును. ఇట్టి తుమున్ప్రత్యయరూపములు, త్వానప్రత్యయాంతములగు కత్వాన, సుత్వాన మొదలగు ల్యబంతరూపములు, అదశ్శబ్దమునకు షష్ఠ్యేకవచనరూప మగు ఇమస్య (ఇమస్స) అనునది, గోశబ్దమునకు గోనామ్ అనుషష్ఠీబహువచనరూపము, త్రి అను దానికి త్రీణామ్ అనుషష్ఠీబహువచనరూపము, కృధాతువునకు “కరత్” అను లజ్ప్రథమపురుషరూపము, బుద్ధేభిః, దేవేభిః అనుతృతీయాబహువచనరూపములు, దీనిలోఁ దఱచుగా వాడుక చేయఁబడు చున్నవి. ప్రాచీనసంస్కృతభా

షలో గురుశబ్దమునకు "గరు" అని రూపాంతరము కలదు. పాలిలోఁ గూడ నీశబ్దరూప మున్నది. ఈరూప మెట్లు వచ్చెనో యని మాకు విచికిత్స జనించినచో సకలభాషలకు మాతృస్థానాపన్న యగు హిందూజర్మానిక్భాషవలనఁ (Indo-Germanic) బుట్టినవి. దీనికి సోదరీభూతములు నైన Latin, Greek, Lethunian, Gothee మొదలగుభాషలలో నీగురుశబ్దరూప మెట్లుండునో విచారింపుఁడు. Greek-Barus, Lat-grarus ఇత్యాదిశబ్దములయం దకారము కానవచ్చుచున్నది. మొదట లోపించిన అకారముయొక్క జాడ గురుశబ్దమునుండి పుట్టిన గరీయస్, గరిష్ఠ, గరిమ మొదలగు రూపములయందుఁ గానవచ్చుచున్నది. పాలీలో "అస్స" అనునది విధిలిఙ్రూపము (Potential mood) వాఁడుండవలె నని యర్థము. అర్థమందు శబ్దరూపమందు దీనితో సరియైనది అకారము లోపింపనిది యగు గ్రీకుభాషాపదరూపము "అసీ" అనునది "స్యాత్" అనుసంస్కృతధాతురూపమం దున్న అకారము లోపించినది. ఇట్లు మిగులఁ ప్రాచీనము లయిన యీపాలీశబ్దవిశేషములు పరసంబంధము గలహిందూజర్మానిక్భాషలసహాయమువలన విమర్శించినచో శబ్దతత్త్వము స్పష్ట మగును. మొదట బుద్ధుఁడు తనశిష్యుల కీభాషలో స్వమతధర్మముల నుపదేశించుటచే నీభాష కిట్టి పావనత్వము, శ్రేష్ఠత, ఔన్నత్యము కలిగిన దని బౌద్ధులు దీనిని శ్లాఘింతురు. Latin భాషతో సంబంధించిన ఇటాలియన్భాషకు సంస్కృతముతో సంబంధించినపాలీభాషకుఁ గలవింత యగుసాదృశ్యము నీప్రస్తావనయందుఁ గొంత వర్ణింపక విడువరాదు. పదుమూఁడవహాయనశతకమం దిటలీదేశములో Latin భాష అత్యుచ్చదశలో నుండెను. దానిలో నగణేయము లగుకావ్యములు నాటకములు శాస్త్రములు మొదలగునవి వ్రాయఁబడెను. చిరకాల మది పండితసంఘము మాటలాడుభాష యై యుండి కాలక్రమమున నాయుచ్చస్థితిని గోల్పోయి యప్పుడప్పుడు రాజాస్థానములయందు మతకర్మానుష్ఠానసమయములయందు వినియోగింపఁబడునవస్థకు వచ్చెను. ఇట్లు కొంతకాలము కడచినపిమ్మట Piedmontisa భాషయొక్క పారుష్యము, Neapolitan భాషయొక్క అనునాసికవర్ణముల యుచ్చారణదుశ్శకత్వము టస్కన్భాషయొక్క సారళ్యము, మార్దవము, ధారావాహిత్వము మొదలగు సదసల్లక్షణములతోఁ గూడిన యనేకగ్రామ్యభాషలసమూహ మొకటి ఇటలీదేశపుఁబ్రజలు మాటలాడుభాషగా నేర్పడెను. Latin భాష క్షీణదశ నొందఁగా నీయవాంతరభాషలు చిరకాలము వృద్ధినొందినవి. ఇంతలో గ్రంథములు వ్రాయుటకుఁ దగిననూతనభాషయొక్క జనన

సమయము ప్రత్యాసన్నమాయెను. ఆసమయమునందు Dante కవీశ్వరుఁ డనశ్వ రయశఃప్రదాయి యగు Divina Commedia అను నుత్తమగ్రంథమును వ్రాయుటకుఁ దగిననాగరకత, మార్దవము, కోమలవర్ణసందర్భము గలయొకభాష నెంచుకొని దానిని ఘనత నొందించెను. ఆ Latin భాషయే సంస్కృత మనియు, Tuscan భాషయే పాలీ యనియు, ఆ Dante కవిపుంగవుఁడే గౌతమబుద్ధుఁ డనియు నా Divina Commedia అనుగ్రంథమే యాత్రిపిటక లనియు నూహించుకొనుఁడు. బుద్ధునికాలమునందు మగధదేశ మిండియాలో గొప్పనాగరక దేశములలో నొకటియనియును, ఇటలీదేశపుభాషలలో Tuscan భాష యెట్లు సర్వజనాదరణీయ మయ్యెనో యట్లే ప్రాకృతభాష లన్నిటిలో మగధదేశపుభాష సర్వజనశ్లాఘాపాత్ర మయ్యె ననియుఁ జెప్పుటకుఁ బ్రబలప్రమాణములు కలవు.

## పాలీకి మాతృభాషాత్వసమర్థనము.

పాలీ, మాతృభాష (vernacular) యని యిదివఱకు మనము చరిత్రము వలనఁ దెలిసికొని యున్నాము. ఇఁక నాభ్యన్తరప్రామాణ్యము (internal evidence) వలన నాయంశము స్థిరీకరింపఁబడును. దీనివ్యాకరణమును శబ్దజాలమును సూక్ష్మదృష్టితో విమర్శించినయెడల దీనిమాతృభాషావిశేషలక్షణము రుజువుచేయఁబడును. ఈభాషను మాటలాడుజనులు తఱచుగా అత్రజ (ఆత్మజ) వీమాంస (మీమాంస) నిసదా (దృషద్) జలాబు (జరాయు) పారుపన (ప్రావరణ) మకస (మశక) అగ్గినీ (అగ్ని) పింజ (పిచ్ఛ) భము (భ్రూ) సుంసుమార (శింశుమార) మొదలగుశబ్దములను వ్యవహారములో నుపయోగించుట వలనను, ఒకరీతిసంధి యున్నను, సంస్కృతసంధికిఁ గల యక్షరవ్యత్యాసము కఠిననియమములు దీనిలో లేకుండుటవలనను, అగ్గిని, అగ్గి, గిని, సాన, సోన, సూన, స్వాన (శ్వాన) చతుద్దశ, చుద్దశీ, చద్దశ (చతుర్దశ) సునిసా, సుంహా, హుసా (స్నుషా) భవిస్సతి, హెస్సతి, హేహితి, భొస్సతి, హొస్సతి (భవిష్యతి) మొదలగు శబ్దములలో నొక్కొకదానికి మూఁడేసినాలుగేసిరూపము లుండుట వలనను, నీభాష మాతృభాష యని దృఢముగా సమర్థింపఁబడుచున్నది. వీని యందు జాతీయపౌష్కల్యము, జనవ్యవహారోచితసరణియుఁ గూడఁ గలదు.

సంస్కృతవాఙ్మయమందుఁ గావ్యములు, నాటకములు, పురాణములు, శాస్త్రములు, వీనివ్యాఖ్యానములు మొదలగునవియే విశేషముగా వ్రాయఁబడియున్నవి; కాని ప్రాచీనవాస్తవచరిత్రమును దెలియఁజేయు సుబోధ మగు

సాఖ్యాయికలు, సంవాదములు, నీతికథలు, నుపాఖ్యానములు నంతగా వ్రాయఁబడియుంటలేదు. పాలీవాఙ్మయము దీనికిఁ గడువిజాతీయ మయినది. ఇందులో మూఁడువంతులకంటె నెక్కుడుగా బుద్ధునిచరిత్రము, అతఁడు స్వమతమును శిష్యులకు బోధించినక్రమము, అతనిశిష్యులకథలు, నీతులు, అప్పటిసాంఘికస్థితి, ధర్మము, వైరాగ్యము బోధించెడునుపాఖ్యానములు, ప్రతిమనుజుఁడు ముఖ్యముగాఁ జదివి తెలిసికొనఁ దగినవి విస్తారముగా వ్రాయఁబడియున్నవి. సంస్కృతభాషలోఁగూడఁ గానరాని కొన్నినూతనశబ్దము లిందులోఁ గానవచ్చుచున్నవి. అవి యెవ్వియనిన:—

1. పణ్ణాకార = కానుక.
2. సంగనికా = సభ.
3. సంప్రవక్త్ర = మిత్త్రుఁడు
4. వివచనం = పర్యాయపదము.
5. అన్యవస్తు = నిశ్చయముగా.
6. కథికా = సంభాషణము
7. సహావ్యతా = సహవాసము.
8. సప్రాయ = ఉపకారకమయిన.
9. విభాషా = మాటలచేభయపెట్టుట.
10. ఏకాంసిక = నిశ్చయము.
11. ప్రణీత = మధురమైన.
12. ఆలోకసంధి = గవాక్షము.

మొదలగునవి.

ఈభాష శబ్దజాలమందే హెచ్చుమార్పు నొందినది. దీనియందు ఋ, ౠ, ఌ, ౡ వర్ణములు ఐ ఔలు, హల్లులలో శషసలు, విసర్జనీయమును లేవు. క్రియలయందు నామవాచకములందు ద్వివచనము లేదు. లుట్, ఆశీర్లిఙ్లు లేవు. సన్నంతరూపములు, కృదంతరూపములు మృగ్యములు. సంయుక్తాక్షరములలో వర్ణసమీకరణము (assimilátion) దీర్ఘాచ్చులు హ్రస్వము లగుట, సంయుక్తములలో నొకవర్ణము లోపించుట మొదలగువికృతులచే నీభాష క్షీణదశ నొందెను.

పైని వ్రాసిన వర్ణవ్యత్యయములఁబట్టి వేఱగు రెండుమూఁడుసంస్కృతశబ్దముల కీభాషలో నొక్కరూపమే కానవచ్చుచున్నది.

| | | | |
|---|---|---|---|
| దోష, దోష | .... దోస. | వర్షతి, వాస్యతి | .... వస్సతి. |
| ఉష్ట్ర, ఓష్ఠ | .... ఒట్ఠ. | కవి, కపి | .... కవి. |
| దృష్ట, దృష్ట | .... దిట్ఠ. | పత్త్ర, పాత్ర, ప్రాప్త | .... పత్త. |
| వృక్ష, రూక్ష | .... రుక్ఖ. | శాస్త్ర, శస్త్ర, సార్థ | .... సత్థ. |
| అర్థ, ఆర్త | .... అత్థ. | | |

క్రీస్తునకు మున్ను ౨౬౯సంవత్సరమందుఁ బాటలీపుత్రమం దభిషిక్తుఁడై భారతభూమి నంతయును నలువదిసంవత్సరము లనర్గళప్రతాపముతో నేలిన మౌర్యవంశప్రదీపకుఁడు బిందుసారునికుమారుఁడు నగునశోకుఁడు బౌద్ధమతమం దతిమాత్రభక్తి గలవాఁడై యాసమయమం దున్నతస్థితిలో నున్న యీపాలీభాషలో శాసనములను వ్రాయించి పలుచోట్ల నిలిపెను. అశోకుఁడు తనప్రజల కుపదేశించినమతనియమములు, మతధర్మములు నీశాసనములలోఁ దెలుపఁబడియున్నవి. దేశములో నచ్చటచ్చట శిలాస్తంభములపయిఁ జెక్కఁబడి, అయిదుతరగతులుగా విభజింపఁబడిన యీశాసనములు కొన్ని ప్రచురింపఁబడినవి. కథెవార్ ద్వీపకల్పమందు జూనఘాట్ దగ్గఱనున్న గిర్నరులో నొకటి, కటకమునొద్ద ధాలీలో నొకటి, ఆఫ్గనిస్థానమం దున్న కపదగిరిలో మఱియొకటి, గిర్నర్ శాసనపుభాష, అంతయు సుమారు పాలీభాషయే. ధాలి, గంజాము, ఖాల్సి మొదలగుస్థలములలోఁ గనిపెట్టఁబడిన శాసనములభాషలో రేఫకు లకారము, ఓకారస్థానమం దెకారము, సప్తమ్యేకవచనమునకు సింఅనునది వాడుకచేయఁబడియుండుటచేఁ దరువాత నుత్పన్నమయినప్రాకృతములఁ బోలి యున్నది. అశోకుని యిట్టిశాసనములలో నొకదాని నాదర్శకముగా నిచటఁ గనఁబఱుచుచున్నాను.

"అతిక్కాంతంఅంతరం రాజానో విహారయాతాం ఞాయాసు । ఎతమగవ్యాఅఞానిచ ఏతారిసానిఅభిరమకాని అహుంసు । సోదేవానం పియోపియదశీరాజా దసవసాభిసితోసంతో అయాయసంబోధిం । తేనేసాధం మయాతాఏత యసంహోతిబామ్హణ సమణానందసణేచ దానేచ థైరాణందసణేచ హిరంణపటి విధానేచ జానపదస్సచ జనసదసనంధంమానుసట్టీచ ధంమపరిపుచ్ఛాచ । తదోపయా ఎసాభూయరతిభవతి దేవానంపియసపియదసినో రాఞో భాగేఅఞ.

ఛాయా। అతిక్రాంతమంతరం రాజానో విహారయాత్రాం నిరయాసిషుః। అత్ర మృగయాన్యాని చైతాదృశాన్యభిరామకాణ్యభూవన్ । స దేవానాం ప్రియః ప్రియదర్శీ రాజా దశవర్షాభిషిక్తః సన్నయాసీత్సంబోధిం । తేనైషా ధర్మయాత్రా । అత్రేదంభవతి బ్రాహ్మణశ్రమణానాందర్శనంచ దానంచ స్థవిరాణాం దర్శనంచ హిరణ్యప్రతివిధానంచ జానపదస్యచ జనస్య దర్శనం ధర్మానుశాస్తిశ్చ ధర్మపరిపృచ్ఛాచ । తదాపర్యా దేషా భూయోరతిర్భవతి । దేవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞో భాగేఽన్యస్మిన్"

గజకుంభజాతకములలోని మఱియొకవాక్యకదంబమును జూడుఁడు.

"అతీతేవారాణసి యంబ్రహ్మదత్తేరజ్జంకారేన్తే బోధిసత్తోతస్స అమచ్చరతనంఅహోసి। వారాణసీ రాజ ఆలసియజాతికోఅహోసి। బోధిసత్తో రాజానంబోధేస్సామితి ఏకంఉపాయం ఉపధారేంతోచరతి। అధఏకదివసం రాజాఉయ్యానంగంత్వా అమచ్చపరివుతోతత్థవిచరంతో ఏకంగజకుంభం ఆలసియంపస్సి। తథాహంపాకిరఆలసియాసకల దివసంగచ్ఛంతాపి ఏకాంగులద్వంగులమెత్తం ఏవగచ్ఛన్తి। రాజా తందిశ్వావయస్స కోనామ ఏసోతిపుచ్ఛి। బోధిసత్తో గజకుంభోనామ ఏసమహారాజ ఆలసియో। ఏవరూపో సకలదివసంగచ్ఛన్తోపి ఏకాంగులద్వంగులమత్తం ఏవగచ్ఛతీతి వత్వాతేనసద్ధింసల్లపంతో। అమ్భోగజకుంభ తుమ్హాకంగన్ద్ద గమసం ఇమస్మిం అరణ్ణేదావాగ్గిమ్హి ఉట్ఠితేకింకరేధాతి వత్వావముథమంగాథం ఆహ"

పాలీ, దేశభాషగా నుండుట చాలించిన తరువాతఁ గ్రీస్తువెనుక నైదవ శతాబ్దమునఁ వ్రాయఁబడిన "ధమ్మపాద" మనుగ్రంథమునుండి కొన్నిశ్లోకములను బుద్ధఘోషుఁ డనుపాలీగ్రంథకర్త వ్రాసినగ్రంథములనుండి మఱికొన్ని వాక్యములను నిందు వ్రాయుచున్నాను. వీనిలో నీభాషయం దగువర్ణవిపర్యాసములు స్పష్టముగాఁ గానవచ్చును.

౧. సబ్బే తసంతి దండస్స సబ్బే భాయంతి మచ్చునో। అత్తానం ఉపమం కత్వా నహనేయ్యనఘాతయే। ఛాయా॥ "సర్వే త్రసంతి దండస్య సర్వే బిభ్యతి మృత్యోః। ఆత్మాన ముపమాం కృత్వా నహన్యా న్నఘాతయేత్.

౨. సుఖకామాని భూతాని యోదండేన విహింసతి। అత్తనో సుఖమేసానో పేచ్చసోనలభతే సుఖమ్। ఛాయా॥ సుఖకామాని భూతాని యోదండేనవిహినస్తి। ఆత్మన స్సుఖమిచ్ఛ న్ప్రేత్య సనలభతే సుఖమ్.

3. మావోచం పరుసం కంచి వుత్తాపటివదేయ్యుతం। దుఃఖాహి సారంరంభకథా పటిదండా ఫుసేయ్యుతమ్॥ ఛాయా॥ మావోచః పరుషం కంచిదుక్తాః ప్రతివదేయుస్త్వాం। దుఃఖాహి సంరంభకథా ప్రతిదండాస్స్పృశేయుస్త్వామ్.

౪. సచే నేరేసి అత్తానం కం సో ఉపహాతో యథా। ఏస పత్తేసి నిబ్బానం సారంభో తేన విజ్జతి॥ ఛాయా॥ సచే న్నేరయస్యాత్మానం కాంస్య ముపహాతం యథా। ఏషప్రాప్తోసి నిర్వాణం సంరంభస్తే నవిద్యతే।

"సావత్థియం కిరఅదిణ్ణపుబ్బకో నామ బ్రాహ్మణో అహోసి। తేన కస్సచి కించిదదిణ్ణపుబ్బం తేన తంఅదిణ్ణపుబ్బకోత్వేవ సంజానింసు। తస్సే కపుత్తకో అహోసి పియోమనాపో। తస్ససోళసవస్స కాలే పండురోగో ఉదపాది। మాతా

(సశేషము.)

# ప్రకటన.

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమున చెన్నపురిలో విక్రయింపఁబడు గ్రంథములు.

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| ౧. | జైమినిభారతము (వచనము) (సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకుఁడు) | ౦ | ౧౨ | ౦ |
| ౨. | విప్రనారాయణచరిత్రము (చెదలువాడ మల్లయకవి) | ౦ | ౮ | ౦ |
| ౩. | కవిజనాశ్రయము (వేములవాడ భీమకవి) | ౦ | ౧౦ | ౦ |
| ౪. | చంపూరామాయణము (ఋగ్వేదికవి వేంకటాచలపతికవి) | ౧ | ౦ | ౦ |
| ౫. | నీతిసీసపద్యములు (తాళ్లపాక పెదతిరుమలయ్య) | ౦ | ౨ | ౦ |
| ౬. | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | ౦ | ౮ | ౦ |
| ౭. | జ్ఞానప్రసూనాంబికాశతకము (శిష్టు సర్వశాస్త్రి) | ౦ | ౨ | ౦ |
| ౮. | Defence of Literary Telugu | ౦ | ౮ | ౦ |
| ౯. | జ్యోతిశ్శాస్త్రసారము (వచనము) (కపిస్థళము కృష్ణమాచార్యులుగారు, బి.ఏ.) | ౦ | ౮ | ౦ |
| ౧౦. | కావ్యాలంకారచూడామణి (పెద్దయకవి) | ౦ | ౮ | ౦ |
| ౧౧. | సర్వేశ్వరశతకము (యథావాక్కుల అన్నమయ్యగారు) | ౦ | ౩ | ౦ |
| ౧౨. | అకారాద్యముద్రితాంధ్రగ్రంథసూచిక | ౦ | ౮ | ౦ |

కావలసినవారు—

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు,

చెన్నపురము. వ్రాయవలయును.

తెలుఁగులోఁ జిరకాలమునుండి వాంఛితమయ్యు నిట్టి గ్రంథ మిదివఱకు లేదు.

# ఆంధ్ర వాఙ్మయ చరిత్రము.

మొట్టమొదటిసారి సభలో నింద్రకీలపర్వతముపై నాంధ్రులు కల్పించినది.

రెండుభాగములు; 5:6 పుటలు; 20 చిత్రపటములు;

సిల్కు క్యాలికో బైండింగు; అంటిక్ కాగితములు; బంగారక్షరములు.

వెల రు 5-0-0 లు. వి. పీ. గా రు 5-10-0 లు.

ఆంధ్రసాహిత్యపరిషదధ్యక్షులును, మైసూరుప్రభుత్వమువారి విద్యాశాఖాధికారియగు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు పీఠికవ్రాసి మెచ్చుకొనిరి. శ్రీయుత చెలికాని లచ్చారావుగారిచే రు ౧౧౬ లు బహుమానమందినది. విపులమైనపీఠికలు, ఇండెక్సు, ను గలవు. పండితులును, పత్రికలును మెచ్చినగ్రంథము.

ఇది కవులచరిత్రముకాదు. పురాణములు, ప్రబంధములు, శతకములు, మొదలగు వాఙ్మయస్వరూపములు, వానియభివృద్ధిక్షైణ్యములు, మతము, కాలము, ప్రభువులు, వీనికిని వాఙ్మయమునకును గలపరస్పరసంబంధములును విపులముగఁ జర్చనొందినవి.

## పండితుల యభిప్రాయములనుండి నాయకవాక్యములు.

(1). మహోపాధ్యాయులగు వేదం వేంకటరాయశాస్త్రిగారు—

" * * వీనికన్న ముందుపుట్టిన కవిజీవితములు (బాషాకల్పవల్లికి) కుసుమములుగాను ఇవి ఫలములుగాను భావింపవచ్చును. దివ్యదృష్టియుంబోలె నేతద్గ్రంథము ప్రాక్తనవాఙ్మయమునందు ఇతఃపూర్వము పెక్కింటి నద్భుతములను గోచరింపజేయును. గ్రంథము బహుగుణము. దీనిని బహూకరించువారు కృతార్థులు."

(2). విజ్ఞానసర్వస్వసంపాదకులగు కె. వి. లక్ష్మణరావుగారు ఎం.ఏ.—

" * * ఇట్లుండ మీరు వాఙ్మయమును బట్టువలతో సంగ్రహించి, అచ్చుపడినగ్రంథములను, అచ్చుపడనివానిని ఓపికతోఁ జదివి సుసంబద్ధమైన వాఙ్మయచరిత్రము ఆంధ్రులకొసంగుట యెంతయు శ్లాఘాపాత్రము. * * "

(3). ప్రాచ్యలిఖితపుస్తకాగారమున నసిస్టెంటు క్యూరేటరును విపులపరిశోధకులు నగు మానవల్లి రామకృష్ణకవిగారు ఎం.ఏ.—

" * * మీగ్రంథము నాకమితానంద మొదవించినది * * * పరమేశ్వరుండును, ఆంధ్రులును మీరింకను ఘనకార్యములను జేయునటుల మీకు బలమును బ్రోత్సాహమునొసంగూర్చెదరని నమ్ముచున్నాను."

(4). MADRAS TIMES—

" ... ... has done a great service to the Telugu speaking public by bringing out his highly informing 'History of the Telugu Literature' ... .. " 30—12—1920.

(5). HINDU—

" ... ... We hope the book will be well appreciated by the Telugu Literary public and the educational authorities ... ..." 14—1—21.

ఇంక ననేకములున్నవి.

వలయువారు "ఆంధ్రపత్రిక ఆఫీసు, 6 & 7, తంబుశెట్టివీధి, చెన్నపురి" అని వ్రాయవలెను.

---

Printed at the British Model Press, Choolai and published at the Telugu Academy Office, 39, Harris Road, Pudupet, Madras.

చందా సం॥ కు రూ. 3. విడిసంచికి అ. ౮.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము ౯. { రౌద్రిసంవత్సరము. ఆశ్వయుజ——పుష్యమాసములు. } సంచిక ౪-౫.

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి. ౧౯౨౧.

# విషయసూచిక.

పుత్తం ఆలోకేత్తా బ్రాహ్మణ పుత్తస్స తే రోగో ఉప్పణ్ణోతి చికిత్సా వేహి నంతిఆహ । భోది సచే వెజ్జం ఆనేస్సామి భత్తవేతనం దాతవ్వం । భవిస్సతి । త్వం మమ ధనచ్ఛేదనం నఅలోకేసి . అథం కిం కరిస్ససి । బ్రాహ్మణాతి । యథా ధనచ్ఛేదో నహోతి తథా కరిస్సామిహాతి । సో వెజ్జానం సంతికం గన్త్వా అమూకరోగస్సనామ తుమ్హే కిం భేసజ్జం కరోథాతి పుచ్ఛి । అథస్స తేయం వాతంవారుక్ఖతం చాదింఆచిక్ఖంతి । సోతం ఆహరిత్వా పుత్తస్స భేసజ్జం కరోతి । తం కరోంతస్సేవస్సరోగో బలవా అహోసి॥

ఛాయా॥ శ్రావస్త్యాంకిల అదత్తప్రాప్వకోనామ బ్రాహ్మణోఽభూత్ । తేన కస్మైచిత్కించి దదత్తప్రాప్వం తేన త ముక్తాప్రాంకక్త్వేన సమజ్ఞాపత । తస్యైకపుత్రకోఽభూత్ప్రియోమనాపః । తస్య షోడశవర్షాణాం కాలె పాండురోగ ఉదపాది । మాతా పుత్ర మవలోక్య బ్రాహ్మణ పుత్రస్య తే రోగ ఉత్పన్నః । చికిత్స్యైన మిత్యాహ । భవతి సచేద్వైద్యమానేష్యామి భక్తవేతనం దాతవ్యం భవిష్యతి । త్వం మమ ధనచ్ఛేదనం నావలోకయసి । అథ కింకరిష్యసి బ్రాహ్మణేతి । యథా మే ధనచ్ఛేదో నభవతి తథా కరిష్యామీతి । స వైద్యానా మంతికం గత్వా అముకరోగస్య నామ యూయం కింభైషజ్యం కురుధ్వే త్యప్రాక్షీత్ । అథాస్య తే యద్వాతద్వా వృక్షత్వగాద్యాచక్షతే । స తదాహృత్య పుత్రస్య భైషజ్యం కరోతి । తత్కుర్వత ఎవాస్య రోగో బలవానభూత్॥

శబ్దరూపములను మార్చుటకు ముఖ్యహేతువు లగుస్వరవ్యత్యయము (Phonetic change) స్వరనాశము (Phonetic decay) స్వరవికృతి (Phonetic corruption) మొదలగునవి పైవాక్యములయం దెంతమట్టుకుఁ బనిచేసినవో యిటుపైని గొంత విచారించి చూచెదము.

పూర్వోక్తవాక్యములలో నున్నపుత్ర, భక్త, ప్రాప్త, అనుశబ్దములలో నున్న "త్ర", "క్త", "ప్త", అనుద్విత్వాక్షరములు "త్త" గాను "ఉత్పన్న" శబ్దములలో నున్న "త్ప", "ప్ప" గాను, "పూర్వ" అనుపదములో నున్న "ర్వ" "వ్వ" గాను, "కస్య" అనుదానిలోనున్న "స్య" "స్స" గాను మాఱినవి. ఈ మార్పునకు శబ్దశాస్త్ర (Philology) మందు హల్సామ్యాపత్తి (Assimilation of consonants) అని పేరు. సాధారణముగాఁ బ్రాకృతభాష లన్నింటిలో నిట్లు సంయుక్తములలోఁ బైనున్నవర్ణము లోపించి శేషించిన క్రిందియక్షర మిను మడించును.

1. ఉపరిలోపః క గ డ త ద ప ష స నామ్ (వరరుచిప్రాకృతప్రకాశిక ౩ పరి. ౧ సూ).

ద్విత్వాక్షరములలోఁ బైనున్న క గ డ త ద ప శ ష స అనువానికి లోపము కలుగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| క | భుక్తం | భుత్తం. | ద | ముద్గః | ముగ్గో. |
| గ | దుగ్ధం | దుద్ధం. | ప | సుప్తం | సుత్తం. |
| డ | షట్పదః | సప్పఓ. | శ | నిశ్చలః | ణిచ్చలో. |
| | ఖడ్గః | ఖగ్గో. | ష | గోష్ఠీ | గోట్ఠీ. |
| త | ఉత్పలం | ఉప్పలో. | | | |

2. మధ్య, వధ్య, అధ్యాయ, ఉపాధ్యాయ, నిధ్యానం, ఇత్యాదిశబ్దముల యందున్న ధ్య అనుదానికి, "ధ్యహ్యయోర్ఝః" అను సూత్రప్రకారము ఝకారము రాఁగా మజ్ఝ, వజ్ఝ, ఉవజ్ఝాయ, అజ్ఝాయ, నిజ్ఝాణ, ఇత్యాదిరూపములు వచ్చును.

3. సంస్కృతపదములలో రేఫతోఁ గలిసియున్న దంత్యవర్ణములకు మూర్ధన్యాక్షరము లాదేశ మగును. ఉ "వర్ధతే - వడ్ఢతి - వర్తతే - వట్టతి, ఛర్దయతి - చడ్డేతి.

4. సంయుక్తాక్షరములలో ద్వితీయవర్ణము 'యరలవ' లలో నొకటిగాని "మ, న" మొదలగు ననునాసికవర్ణములలో నొకటిగాని యున్నయెడల నది దుర్బల మయి ప్రథమాక్షరమునకే ప్రాధాన్యము కలుగును. ఉ. పుత్ర - పుత్త, కల్య - కల్ల, యుగ్మం - జుగ్గం, నగ్న - నగ్గో.

5. స్క, ష్క, శ్చ, ష్ట, స్త, స్ప, ష్ప అనుద్విత్వాక్షరములలో నుండు క చ ట త పలు ఖ ఛ ఠ, థ, ఫ లుగా మాఱును.

పృశ్చేయుః=పుచ్ఛేయ్య. పశ్చాత్=పచ్ఛా. పుష్ట=పుట్ఠ.
పుష్కరి=పొక్ఖరి. ఆశ్చర్య=అచ్ఛరియ. మస్తక=మత్థక.

6 శ్న, ష్ణ. స్న, శ్మ, ష్మ, అనుద్విత్వాక్షరములకు ణ్హ, మ్హ అనునవి ఆదేశ మగును. ఉ. ప్రశ్న - పణ్హ, ఉష్ణ - ఉణ్హ, అస్మి - అమ్హి, అశ్మ - అమ్హ, గ్రీష్మ - గిమ్హ.

7. సంస్కృత యకారమునకు జకారము వకారమునకు బకారము వచ్చును ఇట్టివాడుక తఱచుగా బంగాలీభాషలోను, హిందీభాషలోను గలదు. యమునా-జమునా, వంశ - బాంస, సంధ్యా - బాంఝ.

సంస్కృతములోని యచ్చులు పాలీభాషలో నీక్రీతిగా మాఱును.

1. అకారము.—1. ఎకారముగాను: అత్ర - ఎత్థ, శయ్యా - సెయ్యా, ఫల్గు - ఫెగ్గు, 2. ఇకారముగాను: త్రపు - తిపు, పలాల - పిలాల, తమస - తిమస, తమిస్రా - తిమిస్సా, 3. ఉకారముగాను: సమ్మార్జనీ - సమ్ముజ్జనీ, అర్జక - అజ్జుక, 4. ఓకారముగాను: తిరస్క - తిరోక్ఖ, అంతర్ - అం మాఱును.

2. 1. ఆకారము.—ఎకార మగును. ఉ. మాతృక - మెత్తిక, పారావత - పారేవత, 2. ఓకార మగును. ఉ. పారావార - పారోవార, ధావతి - ధోవతి, 3. ఉకార మగును. ఉ. వదాన్య - వదాన్ను.

3. ఇకారము.—1. ఇకార మకార మగును. ఉ. గృహిణీ - ఘరణీ, పతంగ - పదింగ, పుష్కరణీ - పోక్ఖరణీ, 2. ఎకార మగును. ఉ కిరాత-కెరాత, విహార - వెహార, విమతికా - వెమతికా, 3. ఉకార మగును. ఉ. కిష్కు - కుక్కు, రాజిల - రాజుల, 4. ఏకార మగును. ఉ. క్రీడా - ఖేల, ఆపీడ - ఆవేలా,

4. ఈకారము.—1. ఈకార మకార మగును. ఉ. కౌసీద్య - కోసజ్జ, భీష్మ - భస్మ, 2. ఆకార మగును. ఉ. తిరశ్చీన - తిరశ్చాన, 3. ఏకార మగును. ఉ. క్రీడా - ఖేలా, ఆపీడా - ఆవేలా, 4. ఉకార మగును. ఉ. ష్ఠీవు - థుబు.

5. ఉకారము.—1. అకార మగును. ఉ శష్కులీ - శక్ఖలీ, దుందుభి - దుద్రభి, 2. ఇకార మగును. ఉ. శుక్తి - సిప్పి, శువతి - ఖివతి, 3. ద్విత్వాక్షరము ముందటివర్ణము ఒకార మగును. ఉ. ఉల్కా - ఒక్కా, పుష్ట - పోత్థ, ప్రముఖ్య - పమోక్ఖ, అనూపమ - అనోపమ.

6. ఊకారము.—1. ఊకార మకార మగును. ఉ. మసూరక - మసారక, భ్రూకుటి - భాకుటి, 2. ఇకార మగును. ఉ. భూయస్ - భియో, నూపుర - నియుర, 3. ఓకార మగును. ఊర్జస్ - ఓజ.

7. ఏకారము.—1. ఏకార మకార మగును. ఉ. మ్లేచ్ఛ - మిలక్ఖ, 2. అకార మగును. ఉ. కేయూర - కాయూర, 3. ఒకప్పుడు ద్విత్వాక్షరములకు ముందు ఇకారముగా మాఱును. ఉద్వేల - ఉబ్బిల్ల, ప్రతివేశిక - పతివిస్సక, 4. కొన్నిచోటుల ఓకారముగాఁగూడ మాఱును. ఉ. మత్కృతే - మంకతో.

8. ఓకారము.—ఇది ద్విత్వాక్షరమునకు ముందు ఉకారముగాను, విడియక్షరములముందఱ ఊకారముగాను మాఱును. ఉ. జ్యోత్స్నా - జుహ్నా, తోత్ర - తుత్త, విశోక - విసూక, ఆరోగ్య - ఆరూగ్య.

ఈభాషలో పనుస్వారమునకు "నిగ్గహీత" అని పేరు. ఇది ప్రతిహల్లు నకు ముందుండవచ్చును. కొన్నిహల్లులముందు దానర్గములోని యనునాసికముగా మాఱును. ఉ. "కుంకుమ" అనుశబ్ద మనుస్వారముతోను జకారముతోనుగూడ వ్రాయవచ్చును. కుఙ్కుమ.

పదమధ్యమందున్నయచ్చు లోపించును. ఉ. దుహితా - ధీతా, మహేశ - మ్హేశ. పదాదియందుండు నచ్చు లోపించును. ఉ. అలంకార - లంకార, అనుమతి - నుమతి. పదాదియందచ్చు చేర్పఁబడుశబ్ద మొక్కటియే కలదు. స్త్రీ - ఇత్థీ, ఇది యుత్తరీయబౌద్ధుల గాథాభాషలోనిది.

ఇటుపై హల్లులకుఁ గలుగుమార్పులు నిరూపింపఁబడును.

1. కకారమునకు చకారము వచ్చును. ఉ. కుంద - చుంద.

2. తాలవ్యము కంఠ్య మగును. భిషజ్ - భిషక్కు, మ్లేచ్ఛ - మిలక్ఖు, ప్రభంజన - ప్రభంగున.

పాలీభాషలోనే కాక తక్కినప్రాకృతములలోఁగూడఁ దాలవ్యములు దంత్యములుగా మాఱుట ప్రచురముగా నున్నది. ఉ. సంసృజ్ - సంశ్రిద్భిః.

సింహళదేశపుభాషలో జకారము దకారముగాను, చకారము సకారము గాను మాఱును. ఉ. జుగుప్సతి - దిగుచ్ఛతి, సముచ్ఛ్రిత - సముస్సిత, ఉచ్ఛ్రిత - ఉస్సిత, ఉచ్ఛ - ఉస్స

తక్కిన ప్రాకృతభాషలయందువలె నంతవిస్తారముగా లేకపోయినను బాలీభాషలో మూర్ధన్యములు దంత్యములుగా మాఱుట కలదు. ఉ. క్రోష్టు - కొత్థుక, కుర్వాణ - కుబ్బాణ, ఘ్రాణ - ఘాన.

దంత్యలకారముకంటె వేఱైనమూర్ధన్య మగుళకార మొకటి వేదభాష యందువలె దీనిలో నున్నది. రెండచ్చులమధ్యమున నుండెడునీళకారము డకారఢకారములఁ దెలియఁజేయును. ఉ. గాళ - గాఢ.

పదస్థ మగురేఫను నిమిత్తముగాఁ జేసికొని దంత్యము మూర్ధన్య మగును. ఉ. పర్జన్య - పజ్జణ్ణ. కొన్నిచోట్ల రేఫనిమిత్త మపేక్షింపకుండ దంత్యము మూర్ధన్యమగును. ఉ. సూనా - షూనా, దత్త - దిణ్ణ, శోభన - సోభణ.

తఱచుగా దకారము లకార మగును. ఉ. కోవిదార - కోవిలార, ఉదార - ఉలార.

కొన్నిచోట్ల ధకారమునకు లకారము వచ్చును. ఉ. గృహగోధికా - ఘరగోలికా.

1. రకారము లకార మగును. ఉ. ఏరక - ఏల. 2. దకారమునకు యకారము ఉ. స్వదతే - సయతి, గోదాన - గోయాన. 3. పకారమునకు మకారము ఉ. ధూపాయతి - ధూమాయతి, స్వపంతి - సుపంతి. 4. యకారమునకు వకారము ఉ. కంఠాయతి - కంఠావతి. 5. కొన్నిచోట్ల యకారము రేఫమగును. ఉ. బాహ్య - బాహిర, అంతరయతి - అంతరరతి. 6. నకారము యకారమగును ఉ. దాన - దాయ 7. రేఫకుఁ దఱచుగా లకారము ఉ. పారిభద్ర - పాలిభద్ద, అగరు - అగలు. 8. రేఫకు దకారము ఉ. పురందర - పురిందద. 9. లకారమునకు నకారము ఉ. లలాట - నలాట, లాంగూల - నంగల, దేహాళీ - దేహనీ. 10. శవర్ణమునకు చకారము ఉ. శవ - చవ, 11. హకారమరుదుగా సకార మగును ఉ. గోలిహా - గోలిస.

సంస్కృతవర్ణము లీరీతిగాఁ బాలీభాషలో మాఱినవి ఈభాషలో హ్రస్వము లగు ఏ ఓ లుండుట, వానియం దీభాషావ్యాహర్తల కున్నయభిమానము, తన్నిమిత్తముగా దంత్యవర్ణములు మూర్ధన్యములుగా మాఱుట మొదలగునవి మనుష్యుల యుచ్చారణాస్థానములవలనఁ గలిగిన వని మన మూహించుకొన వచ్చును. ఈధ్వను (sounds) లీభాషయం దనాదికాలమునుండి రూఢమూలము లయి యుండవచ్చును. కావుననే యీభాష మాటలాడువారు తమకంటె నెవ్వ రెక్కుడునాగరకత కలవారో యెవ్వరితోఁ దాము నిరంతరసహవాస సల్లాపనిరతులై మెలంగిరో యట్టి యార్యులభాషఁ దాము నేర్చుకొని స్వభాషఁ బరిత్యజించినను "ఎ ఒ" అనుధ్వనులను సవాసనగా విడువఁ జాలరైరి. ఆదిమపాలీభాషావ్యవహర్త లిప్పటిదక్షిణహిందూస్థానమందు నివసించుద్రావిడులకు సజాతీయులయినచో వారిభాషలో నీయక్షరము లున్నవని మనము నమ్ముటకు వీలున్నది. ఏల యన నీయక్షరములు ద్రావిడభాష (Tamil)లో నున్నవి. ఉ. ఎఴిల్, తోఴిల్.

ఈభాషలో మఱియొకవిశేషము కలదు పైనుదాహరింపఁబడిన వాక్యములలో సంస్కృతభాషలో లేనివి, సంస్కృతధాతునిష్పన్నము లయినవి యగు కొన్నినూతనశబ్దములు కానిపించుచున్నవి. ఇందు కుదాహరణముగా "తస్సైకపుత్త్ర ఆసీత్పియోమనాపః" అనువాక్యములో "మనాపః" అనుశబ్దము "మనః ఆప్నోతీతి" అని నిష్పన్నమయి, "హృద్యుఁడు, మనోజ్ఞుఁడు"ననునర్థ మిచ్చుచున్నది. అట్టులే సంతికశబ్దము మఱియొకటి తస్సఅంతికం, బ్రాహ్మణస్సఅంతికం అని సర్వనామశబ్దముయొక్కగాని షష్ఠీవిభక్తిప్రత్యయముతోఁ గలిపి పలుకఁగాఁ

నొన్నాళ్లకు ముం దున్నశబ్దము లోపింపఁగా «సంతిక» అని యయినది. ఇది కాలక్రమమున స్వతంత్రశబ్దముగ నుండి ప్రయోగసరణి నారోహించెను. ఫాసుక (స్పార్శుక) అనుశబ్దము కూడ సిద్ధపదము. ఇది «లష పత పద స్థా భూ వృష హన కమ గమ శౄభ్య ఉకఞ్ (౩-౨-౧౫౪) అనుసూత్రప్రకారము సిద్ధించిన లాషుక, పాతుక, పాదుక, కాముక ఇత్యాదిశబ్దములయొక్క సాదృశ్యము (false analogy) ననుసరించి స్పృశ్ ధాతువునుండి నిర్మింపఁబడినశబ్దము. స్పర్శకు మనోహర మయిన దని దీని యర్థము.

ఇట్లు సంస్కృతభాషాతత్సమములు, సంస్కృతభాషయందు వాడుకలో లేనివి యగు నత్తక, (మలినవస్త్రము) చివాటికా (కట్టెమొలు, వస్త్రసన్న (వస్త్రము) మొదలగు క్రొత్తశబ్దము లీపాళీభాషలోఁ గానవచ్చుచున్నవి.

ఇటపైఁ నీభాషావ్యాకరణాంశములఁ గూర్చి కొంత చర్చింతము. నామ వాచకములకుఁగాని క్రియలకుఁగాని ద్వివచనము లేదు. సంస్కృతములో నికారాంతోకారాంతనపుంసకలింగములు కజాదిప్రత్యయము పరంబగునపుడు మధ్యను నకారము చేర్పఁబడును. ఉ. వారిణః - మధునః, ఈభాషలోఁ బుంలింగములకుఁగూడ నట్లె రూప మగును. పూర్వోదాహృతవాక్యములో «మచ్చునో» (మృత్యోః) అనురూపముం జూడుఁడు. అకారాంతనపుంసకలింగ ములకు «అతోఽమ్» అనుసూత్రమునుబట్టి ప్రథమావిభక్తికి (సంస్కృతము లో) «అమ్» వచ్చినట్లు యద్, తద్ అనువానికిఁ బ్రథమవిభక్తిలో «యమ్» అని యగును. సంస్కృతభాషలో శబ్వికరణీయం దున్నధాతువులకు లట్, లఙ్, లోట్, విధిలిఙ్ లయందు మి - వస్ - మస్ - మొదలగుప్రత్యయములు పర మయినపుడు ధాత్వంగము (Base)నకు అకారము చేర్పఁబడును. శ్యన్వికరణిలో (దివాది) యకారము, శ్నువికరణిలో «ను», శవికరణిలో «అ», శ్నవికరణిలో «న», మొదలగు వికరణసంజ్ఞలను జేర్చుట విధి. ఇందుకుఁ గ్రమముగా పఠతి, తుదతి, పశ్యతి, అనక్తి, చినోతీత్యాదు లుదాహరణములు.

ఈ భాషలోఁ గ్రియల కట్టివికరణసంజ్ఞాప్రత్యయము లేమియుఁ జేర్పఁ బడవు సరే కదా సకలధాతువులు భ్వాదిధాతురూపసామ్యము నవలంబించి హింస్ ధాతువునకు హినస్తియనుటకు బదులుగా హింసతి అనియు, పశ్యతి అను దానికి మాఱుగా పస్సతి అనియు నగును. క్ర్యాదులలోనిది యగు 'జ్ఞా' ధాతు వునకు «క్ర్యాదిభ్యశ్శ్నా (౩-౧-౮౧) అనుసూత్రముచే విధింపఁబడిన - నా - కారము రాఁగా «జానా» అని యంగ మేర్పడును. దీనికి మివస్ మస్ మొద

లగునుత్తమపురుషాదిప్రత్యయములఁ జేర్పఁగా జానామి, జానీవః, జానీమః అని రూపము లగును. ఇట్టిరూపము లీధాతువునకు సార్వధాతుకములలోనేగాని (Conjugational tenses) ఆర్ధధాతుకములయందనఁగా లిట్, లుఙ్, మొదలగు వానియం దుండవు ఈపాలిభాషలో నన్నిలకారములలో నిదియే (జానా) అంగముగా నేర్పడి యన్నిరూపములు దీనిపైనే పుట్టును. ఉ. సంజానింసు - లుఙ్ప్రథమపురుషబహువచనము. లృటులో జ్ఞాస్యతి అనురూపమునకు బదులుగా “జానిస్సది” అని యగును. భిన్నవికరణములధాతువు లగు ఇచ్ఛ, పశ్య, శృణ, బుధ్య, మొదలగువాని కన్నిటికి ఇస్సది, పస్సతి, సుణాతి, బుజ్ఝతి, అని భ్వాది రూపములే వచ్చును. సంస్కృతభాషలో ణ్యర్థమందు అర్తి హ్రీవ్లీ రీక్నూ యీక్ష్మా య్యాతాం పుక్ణౌ (౭-౩-౩౬) అనుసూత్రమునుబట్టి ఋహ్రీ, వ్లీ, రీ, క్నూయీ, క్ష్మాయీ అనుధాతువులకు దాధా మొదలగు ఆకారాంతధాతువులకు ‘ణి’ పరమయియుండఁగా పుగాగమము వచ్చునని విధింపఁబడెను. ఉ. అర్పయతి - హ్రేపయతి, దాపయతి ఇత్యాదులు. ఈశాస్త్రవిధానము నవలంబించి పైవాక్యములో నుండెడుచికిత్సాపేహి అనురూపము సిద్ధించినది. ఈభాషలోఁ జతుర్థికి మాఱుగా షష్ఠియును, పంచమికి మాఱుగాఁ దృతీయయును వాడుక చేయఁబడును. అజంతపుంలింగనపుంసకలింగముల సప్తమ్యేకవచనమునకు సర్వనామములకువలె స్మిన్ అనునది, స్మాత్ అనుదానిరూపాన్తరము లయిన “స్మా”, “మ్హా” అనునవి పంచమికిఁ జేర్పఁబడును. అకారాంతపుంలింగశబ్దముల ప్రథమైకవచనము తక్కిన ప్రాకృతభాషలయందువలె ఓకారాంతమై యుండును. ఉ. దేవో, ద్వితీయాబహువచనము ఏకారాంతమై యుండును. ఉ. బుద్ధే-తృతీయాబహువచనము వైదికతృతీయాబహువచనరూపమే. ఉ. దేవేభిః- బుద్ధేభిః, ఇకారాంతోకారాంతశబ్దములకుఁ బ్రథమాద్వితీయాబహువచనరూపములు రెండు. ఉ అగ్గీ - అగ్గయో, భిక్ఖూ - భిక్ఖవో.

అగ్గినో - అగ్గిస్స, భిక్ఖునో - భిక్ఖుస్స—షష్ఠ్యేకవచనరూపములు.
అగ్గిని - అగ్గిస్మిం, భిక్ఖుని - భిక్ఖుస్మిం—సప్తమ్యేకవచనరూపములు.
అగ్గయో - భిక్ఖవో —సంబోధనప్రథమవిభక్తి.

ఋకారాంతశబ్దములకొన్నిరూపములు సంస్కృతఋకారాంతశబ్దరూపమువలె. ఉ. సత్థా - సత్థారో, (శాస్తా - శాస్తారః) ప్రథమాద్వితీయాబహువచనముల కొక్కటియే రూపము. ఉ సత్థారో - సత్థారో, షష్ఠీబహువచనము సత్థానం (శాస్తౄణాం) తృతీయైకవచనము సత్థారా - సత్థు, సత్థుస్స - సత్థునో

ఈమూడును షష్ఠ్యేకవచనరూపములు. ద్వితీయైకవచనము షష్ఠ్యేకవచనము సంస్కృతభాషయందువలెనె సత్థారం - సత్థరి - సత్థ - సత్థా - సంబుద్ధి.

ప్రకృతిహలంతశబ్దములకును గానను హల్లు తప్పక లోపించుటచే నీ భాషలో నజంతములేగాని హలంతములు తఱచుగాఁ గానరావు. "ఆత్మన్"శబ్ద మొకటి హలంతముగా నుదాహరింపఁబడవచ్చును. ఈశబ్దమునకు అత్త - అత్తన - అని రెండురూపములు కలవు. వీనిలో అత్తయనురూపము ద్వితీయైకవచనమందు షష్ఠీ సప్తమీ బహువచనములయందును వచ్చును.

అత్తా - ప్ర. ఏ. వ. | అత్తణో - పం. షష్ఠ్యేకవచనము.
అత్తానో - ప్ర. ద్వి. బ. వ. | అత్తానం - షష్ఠీబహువచనము.
అత్తానం - ద్వితీయైకవచనము | అత్తని - సప్తమ్యేకవచనము
అత్తనా - తృతీయైకవచనము. | అత్త - అత్తా, సంబుద్ధి.
అత్తనేహి - అత్తనేభి, తృతీయాబహువచనము.

అజంతశబ్దములలో అకారాంతములు.

ధమ్మో (పుంలింగము) అకారాంతము.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్రథమ. | ధమ్మో | ధమ్మా, ధమ్మాసే. |
| | ధమ్మమ్ | ధమ్మే. |
| తృతీ. | ధమ్మేన | ధమ్మేభి, ధమ్మేహి. |
| చతు. | ధమ్మస్స (ధమ్మాయ) | ధమ్మానమ్. |
| పంచ. | ధమ్మా, ధమ్మస్మా, ధమ్మమ్హా | ధమ్మేభి, ధమ్మే[illegible]. |
| షష్ఠీ. | ధమ్మస్స | ధమ్మానమ్. |
| సప్త. | ధమ్మే, ధమ్మస్మిమ్, ధమ్మమ్హి | ధమ్మేసు. |
| సంబో. | ధమ్మ, ధమ్మా | ధమ్మా. |

అకారాంతనపుంసకము—రూపశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | రూపమ్ | రూపాని, రూపా. |
| సంబో. | రూపమ్ | రూపాని, రూపా. |
| | రూపమ్ | రూపాని, రూపే. |
| తృ. | రూపేన | రూపేభి, రూపేహి. |
| చతు. | రూపస్స (రూపాయ) | రూపానమ్. |

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| పంచ. | రూపా, రూపస్మా, రూపమ్హా | రూపేభి, రూపేహి. |
| షష్ఠీ. | రూపస్స. | రూపానమ్. |
| సప్త. | రూపే - రూపస్మిమ్, రూపమ్హి | రూపేసు. |

ఆకారాంత స్త్రీలింగము—కన్యాశబ్దము.

| | | |
|---|---|---|
| ప్రథ. | కఞ్ఞా | కఞ్ఞా, కఞ్ఞాయో. |
| సంబో. | కఞ్ఞే | కఞ్ఞా, కఞ్ఞాయో. |
| ద్వితీ. | కఞ్ఞామ్ | కఞ్ఞా, కఞ్ఞాయో. |
| తృతీ. | కఞ్ఞాయ | కఞ్ఞాభి, కఞ్ఞాహి. |
| చతు. | కఞ్ఞాయ | కఞ్ఞానమ్. |
| పంచ. | కఞ్ఞాయ | కఞ్ఞాభి, కఞ్ఞాహి. |
| షష్ఠీ. | కఞ్ఞాయ | కఞ్ఞానమ్. |
| సప్త. | కఞ్ఞాయమ్, కఞ్ఞాయు. | కఞ్ఞాసు. |

ఇకారాంతపుంలింగము—అగ్నిశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | అగ్గి | అగ్గయో, అగ్గీ. |
| ద్వి. | అగ్గిమ్ | అగ్గీ, అగ్గయో. |
| తృ. | అగ్గినా | అగ్గీభి, అగ్గీహి. |
| చతు. | అగ్గినో, అగ్గిస్స | అగ్గీనః |
| పంచ. | అగ్గినా, అగ్గిస్మా, అగ్గిమ్హా | అగ్గీభి, అగ్గీహి. |
| షష్ఠీ. | అగ్గినో, అగ్గిస్స | అగ్గీనమ్. |
| | అగ్గిస్మిమ్, అగ్గిమ్హి | అగీసు. |

నపుంసకము—అక్ఖి (అ

| | | |
|---|---|---|
| ప్ర. | అక్ఖి, అక్ఖిమ్ | అక్ఖీని, అక్ఖీ. |
| ద్వి. | అక్ఖిమ్ | అక్ఖీని, అక్ఖీ. |
| | అక్ఖినా | అక్ఖీభి, అక్ఖీహి. |
| చతు. | అక్ఖినో, అక్ఖిస్స | అక్ఖీనమ్. |
| పంచ. | అక్ఖినా, అక్ఖిస్మా, అక్ఖిమ్హా | అక్ఖీభి, అక్ఖీహి. |
| ష. | అక్ఖినో, అక్ఖిస్స | అక్ఖీనమ్. |

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| సప్త. | అక్కిస్సిమ్, అక్కిమ్మి | అక్కీసు. |

ఇకారాంత స్త్రీలింగము—రత్తి (రాత్రిః)

| | | |
|---|---|---|
| ప్ర. | రత్తి | రత్తిఓ, రత్తీ. |
| ద్వి. | రత్తిమ్ | రత్తీ, రత్తిఓ. |
| తృ. పం. | రత్తియా | రత్తీభి, రత్తీహి. |
| చ. ష. | రత్తియా | రత్తీనమ్. |
| సప్త. | రత్తియమ్, రత్తియా | రత్తీసు. |

ఈకారాంత స్త్రీలింగము—నదీశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | నదీ | నదిఓ, నజ్జో, నదీ. |
| ద్వి. | నదిమ్ | నదీ, నదిఓ, నజ్జే. |
| తృ. పం. | నదియా, నద్యా, నజ్జా | నదీభి, నదీహి. |
| చ. ష. | నదియా, నద్యా, నజ్జా | నదీనమ్. |
| సప్త. | నదియం, నజ్జం, నదియా | నదిసు. |

ఉకారాంతపుంలింగము—భిక్ఖు (భిక్షుః)

| | | |
|---|---|---|
| ప్ర. | భిక్ఖు | భిక్ఖవో, భిక్ఖూ. |
| సంబో. | భిక్ఖు | భిక్ఖవో, భిక్ఖవే, భిక్ఖూ. |
| ద్వి. | భిక్ఖుమ్ | భిక్ఖూ, భిక్ఖవో. |
| తృ. | భిక్ఖునా | భిక్ఖూభి, భిక్ఖూహి. |
| చ. ష. | భిక్ఖునో, భిక్ఖుస్స | భిక్ఖూనమ్. |
| పం. | భిక్ఖునా, భిక్ఖుస్మా, భిక్ఖుమ్హా | భిక్ఖూభి, భిక్ఖూహి, భిక్ఖుమ్హా. |
| సప్త. | భిక్ఖుస్మిమ్, భిక్ఖుమ్హి | భిక్ఖూసు. |

ఉకారాంతస్త్రీలింగము—ధేనుశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | ధేను | ధేనువో, ధేనుయో, ధేనూ. |
| ద్వి. | ధేనుమ్ | ధేనూ, ధేనుయో. |
| తృ. పం. | ధేనుయా | ధేనూభి, ధేనూహి. |
| చ. ష. | ధేనుయా | ధేనూనమ్. |
| సప్త. | ధేనుయమ్ | ధేనుయా, ధేనుసు. |

ఓకారాంతము—గోశబ్దము.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| | గో | గవో, గావో. |
| ద్వి. | గవమ్, గావమ్, గావుమ్ | గవో, గావో. |
| తృ. | గవేన, గావేన | గోభి, గోహి. |
| చ. ష. | గవస్స, గావస్స | గవమ్, గవామ్, గున్నమ్ |
| పంచ. | గవా, గావా, గవస్మా, గావస్మా, గవమ్హా, గావమ్హా | గోభి, గోహి. |
| సప్త. | గవే, గావే, గవస్మిమ్, గావస్మిమ్, గవమ్హి, గావమ్హి | గోసు, గవేసు, ఆవేసు. |

హలంతశబ్దములు—అత్తన్ (ఆత్మన్.)

| | | |
|---|---|---|
| ప్ర. | అత్తా | అత్తానో. |
| సం. | అత్త, అత్తా | అత్తానో. |
| ద్వి. | అత్తానమ్, అత్తమ్ | అత్తానో. |
| తృ. | అత్తనా, అత్తేన | అత్తనేభి, అత్తనేహి. |
| చ. ష. | అత్తనో | అత్తానమ్. |
| పంచ. | అత్తనా | అత్తనేభి, అత్తనేహి. |
| సప్త. | అత్తని | అత్తనేసు. |

నకారాంత పుంలింగము—రాజన్ శబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | రాజా | రాజానో. |
| సం. | రాజ, రాజా | రాజానో. |
| | రాజానమ్, రాజం | రాజానో. |
| తృ. | రాఞ్ఞా, రాజేన | రాజాభి, రాజాహి, రాజేభి, రాజేహి. |
| చ. ష. | రాఞ్ఞో, రాజినో, రాజస్స | రాజానమ్. |
| పంచ. | రాఞ్ఞా | రాజాభి, రాజాహి. |
| సప్త. | రఞ్ఞే, రాజని | రాజాసు. రాజేసు. |

యువన్ శబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | యువా | యువానో, యువానా. |

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| సం. | యువ, యువా, యువాన, యువానా | యువానో, యువానా. |
| ద్వి. | యువానమ్, యువమ్ | యువానే, యువే. |
| తృ. | యువానా, యువానేన | యువానేభి, యువానేహి, యువేభి, యువేహి. |
| చ. ష. | యువానస్స, యువస్స | యువానానమ్, యువానమ్. |
| పంచ. | యువానా, యువానస్మా, యువానమ్హా | యువానేభి, యువానేహి, యువేభి, యువేహి. |
| | యువానే, యువానస్మిమ్, యువే, యువస్మిమ్, యువమ్హి | యువానేసు, యువానసు, యువేసు. |

మతుబంతము లగుగుణవత్, ధీమత్ ఇత్యాదిశబ్దముల ప్రథమా, ద్వితీయా, షష్ఠీ వీని యేకవచనములందు, ద్వితీయా, తృతీయా, షష్ఠి, సప్తమీ వీనిబహువచనములందు, అకారాంతశబ్దమునకువలెనె రూపములు. ఉ. గుణవంతో, గుణవంతం, గుణవంతస్స, గుణవంతె, గుణవంతేభి, గుణవంతానం, గుణవంతేసు, గుణవంతేన, గుణవంతస్మి.

సర్వనామములు.

సర్వనామప్రత్యయములు నామవాచకములకు నామవాచకప్రత్యయములు సర్వనామములకుఁ బరస్పరవినిమయము నొందుటచే నీరెంటికిని రూపనిష్పత్తి యేకరూపముగా నుండునని యెఱుంగునది.

అస్మచ్ఛబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | అహమ్ | వయం, మయం, అమ్హే. |
| ద్వి. | మం, మమం | అస్మే, అమ్హే, అమ్హాకం. |
| తృ. పం | మయా | అమ్హేభి, అమ్హేహి. |
| చ. ష. | మమ, మమం, మహ్యం, అమ్హం | అమ్హాకం, అమ్హం. |
| సప. | మయి | అమ్హేసు. |

యుష్మచ్ఛబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | త్వం, తువం | తుమ్హే. |
| | త్వం, తువం | తుమ్హే, తుమ్హాకం. |

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| తృ. పం | త్వయా, తయా | తుమ్హేభి, తుమ్హేహి. |
| చ. ష. | తవ,తవం,తుభ్యం,తుమ్హం | తుమ్హాకం, తుమ్హం. |
| సప. | త్వే, తయి | తుమ్హేసు. |

తృతీయా. చతుర్థీ, షష్ఠీవిభక్తుల యేకవచనమం దస్మచ్ఛబ్దమునకు 'మే' అనియు, యుష్మచ్ఛబ్దమునకు 'తే' అనియు, ద్వితీయా, చతుర్థీ, షష్ఠీవిభక్తుల బహువచనమం దస్మచ్ఛబ్దమునకు 'నో' అనియు యుష్మచ్ఛబ్దమునకు "వో" అనియు రూపములు కలవు.

తచ్ఛబ్దము (మూఁడులింగములు)—ఏకవచనరూపములు.

| | పుం. | నపుం. | స్త్రీ. |
|---|---|---|---|
| ప్ర. | సో, స | తం, తద్ | సా. |
| ద్వి. | తమ్ | తమ్, తద్ | తమ్. |
| తృ. | తేన | తేన | తయా. |
| చ. ష. | తస్స | తస్స | తస్సా, తస్సాయా, తిస్సా, తిస్సాయా. |
| పంచ. | తస్మా, తమ్హా | తస్మా, | తాయ. |
| సప. | తస్మిఀ, తమ్హి | తసిఀ | తస్సమ్, తిస్సమ్, తాయమ్. |

బహువచనరూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. ద్వి. | తే | తాని | తా, తాయో. |
| తృ. పం | తేభి, తేహి | తేభి, తేహి | తాభి, తాహి. |
| చ. ష. | తేసమ్, తేసానమ్ | తేసమ్, తేసానమ్ | తాసమ్, తాసానమ్. |
| సప. | తేసు | తేసు | తాసు. |

ఇదంశబ్దము—ఏకవచనరూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | అయం | ఇదం, ఇమం | అయం. |
| ద్వి. | ఇమం | ఇదం, ఇమం | ఇమం. |
| తృ. | ఇమినా, అనేన | ఇమినా, అనేన | అమాయా. |
| చ. ష. | ఇమస్స, అస్స | ఇమస్స, అస్స | ఇమిస్సా,అస్సా,ఇమాయ, అస్సాయ. |

| | పుం. | నపుం. | స్త్రీ. |
|---|---|---|---|
| పంచ. | ఇమస్మా | అస్మా, ఇమహ్మా | ఇమాయ. |
| సప్త. | ఇమస్మి, ఇమహ్మి | అస్మిఁ, ఇమహ్మి | ఇమిస్సం, ఇమాసం, ఇమాయం. |

బహువచనరూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. ద్వి. | ఇమే | ఇమాని | ఇమా, ఇమాయో. |
| తృ. పం. | ఇమేభి, ఇమేహి | ఏభి, ఏహి | ఇమాభి, ఇమాహి. |
| చ. ష. | ఇమేసమ్ | ఇమేసనాం | ఇమాసం. |
| సప్త. | ఇమేసు | ఇమేసు | ఇమాసు. |

యచ్ఛబ్దము — ఏకవచనరూపము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | యో | యమ్, యద్ | యా. |
| ద్వి. | యమ్ | యమ్, యద్ | యమ్. |
| తృ. | యేన | యేన | యాయ. |
| చ. ష. | యస్స | యస్స | యస్సా, యాయా. |
| పంచ. | యహ్మా | యహ్మా | యాయా. |
| సప్త. | యస్మిఁ, యహ్మి | యస్మిఁ, యహ్మి | యస్సం, యాయం. |

బహువచనరూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | యే | యాని | యా, యాయె. |
| ద్వి. | యే | యాని | యా, యాయో. |
| తృ. | యేభి, యేహి | యేభి, యేహి | యాభి, యాహి. |
| చ. ష. | యేసమ్ | యేసమ్ | యాసమ్ |
| పంచ. | యేభి, యేహి | యేభి, యేహి | యాభి, యాహి. |
| సప. | యేసు | యేసు | యాసు. |

అజంతము లగువిశేషణములలోఁ గొన్నింటికి తరప్, తమప్ ప్రత్యయములు మఱికొన్నిటికి ఇయో, యో, ఇట్ఠ ప్రత్యయములును జేర్పంబడును. ఉ. పాప, పాపతర, పాపతమ, పాపీయో, పాపిట్ఠ.

మత్, వత్, విఁ మొదలగు మతుప్ప్రత్యయము లంతమందుఁ గల విశేషణములకు ఇయో, ఇట్ఠ ప్రత్యయములు చేర్చునపు డామతుప్ప్రత్యయ

ములు లోపించును. ఉ. గుణవా, గుణీయో, గుణిట్ఠ; మేధావీ, మేధయో, మేధిట్ఠ. తారతమ్యవివక్షయందుఁ గొన్నివిశేషణవాచకములకు భిన్నరూపము లాదేశమగును.

అంతిక . నేదియో, నేదిట్ఠ. అప్ప, యువ . కనీయో, కనిట్ఠ.
బాఢ . సాధీయో, సాధిట్ఠ. ప్రశస్థ సయో, సేట్ఠ.
వృద్ధో . జెయ్యో, జేట్ఠ.

ప్రశ్నార్థకసర్వనామములు—వీనిలో "కిమ్" శబ్దము ప్రధానము. దీనికి యచ్ఛబ్దమునకువలెనే రూపనిష్పత్తి. నపుంసక ప్రథమవిభక్త్యేకవచనము "కిమ్" పుంలింగ నపుంసకలింగములలోఁ జతుర్థ్యేకవచన షష్ఠ్యేకవచనముల యందు కస్స, కిస్స అనియును, కస్మిమ్, కమ్హి, కిస్మిమ్, కిమ్హి అని రూపములు.

సంఖ్యావాచక సర్వనామములు.

1. ఏక, 2. ద్వి, 3. తి, 4. చతు, 5. పంచ, 6. ఛ, 7. సత్త. 8. అట్ఠ, 9. నవ, 10. దశ, 11. ఏకాదశ, 12. ద్వాదస, 13. తెరస, 14. చతుద్దస, 15. పంచదశ, 16. సోడశ, 17. సత్తదస, సత్తరస, 18. అట్ఠాదస, అట్ఠారస, 19. ఏకానవింసం, ఎకానవిశతి, 20. వీసమ్, వీసతి. 30. తింసం, తింసతి, 40. శత్తారింసమ్, సతలిసమ్, తలిసమ్, 50. పన్నాసమ్, పన్నాస, 60. సట్ఠి, సట్ఠిమ్, 70. సత్తతి, సత్తరి, 80. అసీతి, 90. నవతి, 100. శతమ్, 1000. సాహస్సమ్.

ఏకశబ్దమునకు సర్వనామములవలె నిష్పత్తి.

ప్ర. ద్వి. ద్వె, దువె. చ. ష. ద్విన్నం, దువిన్నమ్.
తృ. పం. ద్విభి, దూహి. సప్త. ద్విసు.

ఉభశబ్దము.

ప్ర. ద్వి. ఉభో, ఉభె. చ. ష. ఉభిన్నమ్.
తృ. పం. ఉభోభి, ఉభోహి, ఉభేభి, సప్త. ఉభోసు, ఉభేసు.
ఉభేహి.

త్రిశబ్దము.

| | పుం. | నపుం. | | పుం. | నపుం. |
|---|---|---|---|---|---|
| ప్ర. ద్వి. | తయో | తీని. | చ. ష. | తిన్నమ్ | తిన్నన్నమ్. |
| తృ. పం. | తీభి | తీహి. | సప్త. | తిసు | తిసు. |

### త్రిశబ్ద స్త్రీలింగ రూపములు.

ప్ర. ద్వి. తిస్సో. చ. ష. తిస్సన్నమ్.
తృ. పం. తిభి, తిహి. సప్త. తీసు.

### చతుశ్శబ్దము.

| | పుం. | నపుం. |
|---|---|---|
| ప్ర. ద్వి. | చత్తారో, చతురో. | చత్తారి. |
| తృ. పం. | చతుభి, చతూహి, చతుహి. | చతుభి, చతూహి, చతుహి. |
| చ. ష. | చతున్నమ్. | చతున్నమ్. |
| సప్త. | చతసు. | చతసు. |

### స్త్రీలింగరూపములు.

ప్ర. ద్వి. చతస్సో. చ. ష. చతస్సన్నమ్.
తృ. పం. చతూభి, చతుభి, చతుహి. సప్త. చతూసు.

పంచ అనుదానికి తృతీయాపంచమీవిభక్తులలో "పంచహి" అనియు, చతుర్థీషష్ఠీవిభక్తులలో "పంచన్నమ్" అనియు, సప్తమిలో "పంచసు" అనియు రూపములు. అకారాంతము లగుసంఖ్యావాచకముల కన్నిటికి నీతీరుననే రూపనిష్పత్తి యని యెఱుంగవలయును. ఇకారాంతసంఖ్యావాచకములు సంస్కృతభాషలో నికారాంతస్త్రీలింగశబ్దములవలెను, శతమ్, సహస్సం మొదలగునవి అకారాంతనపుంసకలింగములవలెను రూపనిష్పత్తి.

సంధి—అచ్ సంధి మిశ్రసంధి యని పాలీభాషలో సంధి రెండువిధములు. ఈభాషలో హల్సంధి లేదు. అచ్చుతో నచ్చున కైనసంధి అచ్ సంధి యనంబడును. అచ్చునకు హల్లునకు నైనసంధి మిశ్రసంధి. ఈసంధిప్రకరణమందుఁ జెప్పవలసిన దంతయు బాహ్యసంధిని (exteranal sandhi) గుఱించియే కాని ఆంతరసంధి (internal sandhi) నిగూర్చి కాదు. లోఁగడఁ బ్రతిపాదింపఁబడిన యక్షరశిక్షలోనే (phonetics) యాంతరసంధి సూచింపఁబడినది. సంస్కృతభాషలోవలె దీనియందుఁ బదసంధి ముఖ్యము కాదు. కాదాచిత్కముగా నుండును. గద్యభాగములయందుఁ గ్రియాపదములకు నామవాచకములకు, నవ్యయములకు సర్వనామములకుఁ దఱచుగా సంధి చేయఁబడును. ఉ. తస్స + ఏవ = తస్సేవ, యద్ + నూన = యన్నూన. చ, ఇతి (తి) అపి (పి) ఏవ మొదలగునవి ముఖ్యముగా సంధిలోఁ గానవచ్చును. ఉ. కించిద్ + ఎవ = కించిఎవ. తథా + అపి=తథాపి. కథం + చ=కథంచ. నఞ్ తరువాత నచ్చు వచ్చినయెడల నఞ్ లో అకారము లోపించును. ఉ. న + అత్థి = నత్థి, న + ఎవ = నేవ.

మఱికొందఱు వైయాకరణులు పదసంధిని మూఁడుతరగతులుగా విభజించిరి. ఎట్లన:

1. అజాది యగుసంబోధ్యవాచకమునకుఁ బూర్వమం దజంత మగుపద మున్నచో సంధి యగును. ఉ. గచ్ఛ + వృష = గచ్ఛావృషో.

2. క్రియాపదమునకు ముందుగాని వెనుకఁగాని నామవాచక మున్న యెడల సంధి యగును. ఉ. ఉత్థాయ + ఆసన = ఉత్థాయాసనా, ఆసన + ఉత్థాయ = ఆసనావుత్థాయ.

3. పరస్పరసంబంధము గలరెండునామవాచకములకు సంధి యగును. ఉ. దుఃఖస్స + అంతం = దుఃఖస్సాంతం.

అచ్ సంధి—1. అకారమునకు అకారము పరమగునపుడు ఆకార మేకాదేశ మగును. ఉ. న + అసక్ఖి = నాసక్ఖి.

2. అకారమున కికారముగాని ఈకారముగాని పరమగునపుడు ఏకార మేకాదేశ మగును. (సంస్కృతభాషలో దీనికి గుణసంధి యని పేరు). ఉ. కోకిలాయ + ఇవ = కోకిలాయేవ. అకారముకంటె "ఇతి" అనునది పర మగునపుడు ఏకారము రాక ఆకారమే వచ్చును. ఉ. తిస్స + ఇతి=తిస్సాతి.

3. అకారమునకు ఉకారము పరమగునపుడు ఓకారము వచ్చును. ఉ. న + ఉపేతి = నోపేతి. పక్ఖందితా + ఉదధిం = పక్ఖందితోదధిం.

4. ఇకారమునకు ఓకారమునకుఁ బూర్వమం దున్న అకారము తఱచుగా లోపించును. ఉ. గహ్నాత + ఎతమ్ = గహ్నాతేతమ్, ఇ + ఓతతమ్ = ఇవోతతమ్.

5. ఇకారమున కికారము పరమైనపుడు ఈకార మేకాదేశ మగును. ఉ. పలుజ్జి + ఇతి = పలుజ్జీతి.

6. అచ్చుముందఱి ఉకారము లోపించును. ఉ. సమేతు + ఆయస్మ = సమేతాయస్మ.

7. దీర్ఘాచ్చునకుఁగాని హ్రస్వాచ్చునకుఁగాని ముందున్నఎకారము లోపించును. ఉ. మే + ఆసి = మాసి

మిశ్రసంధి—1. పదాదియందు హల్సామ్యాపత్తివలన నేకాక్షరము లయినద్విత్వాక్షరములు అజంతము లయినపదములతరువాత మరల ద్విత్వాక్షరము లగును. ఉ. యత్ర + స్థితం = యత్రథితమ్ = యత్రత్థితం.

2. కొన్నిస్థలములయందు లోపించినకొనహల్లు నకుముందొకహల్లుముం డిన మరల నుండియుండును. ఉ. యావాక్ + చ -- ఇదమ్ = యావాచఇదమ్ = యావాక్చిదమ్.

3 వృత్తపాదము దీర్ఘమగుటకు లఘువుగా మార్పబడినచ్చినప్పుడు హల్లుముందటి యనుస్వారము లోపింపఁజేయఁబడును. ఉ. ముంచెయ్యామ్ (ముంచేయమ్) అనుటకు - నోచెముంచెయ్యాచండిమమ్ - ఇచట ముంచెయ్యాం అనువిధిలిఖితపాఠము దున్నయనుస్వారము లోపించి ముంచెయ్యా యని యైనది.

4. మఱికొన్నిచోట్ల యనుస్వారమునకుఁ బరముగానున్న యచ్చు లోపించును. ఉ. సోవన్నమయం, అనున్నతమ్ - అనునది సోవన్నమయంనున్నతమ్ - అని మాఱినది.

క్రియలు—పాళీభాషలోనిధాతువులు సంస్కృతధాతువులవలెనే విభజింపఁబడి యున్నవి. ఇవి యేడు తరగతులు. వీనిలో మొదటిది నాలుగు తరగతులుగా విభజింపఁబడియున్నది. ఈనాలుగుతరగతులు క్రమముగా భ్వాది అదాది జుహోత్యాది తుదాది. మిగిలిన ఆఱుతరగతులు శేషించిన రుధాది, దివాది, స్వాది, క్ర్యాది, తనాది, చురాది.

౧. 1. మొదటితరగతిధాతువులకు ఈకారముగాని ఊకారముగాని హల్లుగాని అంతమం దుండును. వీనికి గుణము వచ్చును. అకారము (వికరణ సంజ్ఞ) చేర్పఁబడును. ఉ. భూ - భవామి.

2. ఈతరగతిలోనిహలంతధాతువులకు అకారము చేర్పఁబడునుగాని గుణము రాదు. ఉ. తుద్ - తుదామి.

3. ఈతరగతిలోనిధాతువు లజాదిధాతువులు. గుణము వచ్చును గాని వికరణసంజ్ఞ రాదు. ఉ. ఇ - ఎమి.

4. ఈతరగతిధాతువులప్రథమాక్షరమునకు ద్విరుక్తి (reduplication) వచ్చును. ఉ. హు - జుహోమి.

౨. 1. రెండవగుంపులోనిధాతువులు కొనహల్లునకు ముందు నకారము కలిగియుండును. అకారము చేర్పఁబడును. ఉ. రుధ్ - రుంధామి.

2. మూఁడవగుంపులోనిధాతువులకు య, యా అనునవి చేర్పఁబడును. ఉ. దివ్ - దిబ్బామి.

3. నాల్గవగుంపులోనిధాతువులకు నా, నూ, ఉనా, మొదలగునవి చేర్పఁబడును. ఉ. శ్రు - సునామి - లేక సునోమి, ఆప్ - పాపునామి.

4. అయిదవగుంపులోనిధాతువు లజంతములు 'నా' అనువికరణ సంజ్ఞ చేర్పఁబడును. ఉ. క్రీ - నామి.

5. ఆఱవగుంపులోనిధాతువులు హలంతములు. ఉ అనువికరణ సంజ్ఞ చేర్పఁబడును. ఉ. తన్ - తనోమి.

6. ఏడవగుంపులోనిధాతువులకు "అయ" అనునది చేర్పఁబడును. ఉ. చుర్ - చోరయామి చోరేమి. పాలీధాతువులు పరస్సపదములు (పరస్మైపదములు) లేక సకర్మకము లనియు, అత్తనోపదములు (ఆత్మనేపదము) లేక అకర్మకము లనియు రెండుతెగలు. సంస్కృతభాషకంటె నీభాషలో నాత్మనేపదధాతువుల వాడుక తక్కువగా నున్నది. తఱచుగా నీభాషలో నాత్మనేపదములకుఁ బరస్మైపద ప్రత్యయములు చేర్పఁబడును.

సంస్కృతమందువలెనే యీభాష యందును సార్వధాతుకములు ఆర్ధధాతుకములు నని రెండువిధముల లకారములు కలవు. సార్వధాతుకములలో లట్, లోట్, ఆశీర్లిఙ్, విధిలిఙ్, మొదలగునవి యంతర్భాగము లయియున్నవి. ఆర్ధధాతుకములలో లిట్, లుఙ్, లృట్, లుట్, మొదలగునవి.

లట్ప్రత్యయములు.

| పరస్సపద. | | అత్తనోపద. | |
|---|---|---|---|
| ఏక. | బహు. | ఏక. | బహు. |
| మి | మ. | ఎ | మ్హే. |
| సి | థ. | సే | వ్హే. |
| తి | ని. | తే | న్తే, రే. |

సంస్కృతభూధాతువు హుగా మాఱఁగా—హోమి - హోమ, హోసి - హోథ, హోతి - హోన్తి, అని రూపము లగును.

ఈతరగతిలోని తక్కినధాతువులు యా, వా, మొదలగువానివలె నాకారాంతములు. యాధాతువు లట్టు ప్రథమపురుషబహువచనమందు "యాంతి" అనుటకు బదులుగా "యంతి" అగును. ఠా (స్థా) లట్టు ప్రథమపురుషైకవచనము, ఠాతి, దాధాతువునకు దాతి;

బ్రూ ధాతువు.

| పరస్మపద. ఏక. | బహు. | ఆత్మనేపద. ఏక. | బహు. |
|---|---|---|---|
| బ్రూమి | బ్రూమః. | బ్రవే | బ్రూమ్హే |
| బ్రూసి | | బ్రూసే | బ్రూహ్వే. |
| బ్రూతి, బ్రవీతి | బ్రువంతి. | బ్రూతే | బ్రవన్తే. |

అస్ ధాతువు.

| | ఏక. | బహు. | | ఏక. | బహు. |
|---|---|---|---|---|---|
| ఉ - పు | అస్మి, అమ్హి | అస్మ, అమ్హ. | ప్ర - పు | అత్థి | సన్తి. |
| మ - పు | అసి | అత్థ. | | | |

హుధాతువు.

| ఏక. | బహు. | ఏక. | బహు. |
|---|---|---|---|
| జుహోమి | జుహోమ. | జుహోతి, జుహ్వతి | జుహోన్తి, జుహ్వన్తి |
| జుహోసి | జుహోథ. | | |

గాథాభాష.

మనము పైనిఁ జేసిన విమర్శమువలనఁ దక్షిణప్రాకృతభాషలకంటెఁ బాలీభాష సంస్కృతమునుండి మొట్టమొదట వెలువడినభాష యని కొంత కాలముక్రిందటివఱకు శబ్దశాస్త్రజ్ఞులు కృతసిద్ధాంతులైయుండిరి. కాని విద్వద్వర్యుఁడగు Hodgson మహాశయుఁడు నేపాళ దేశములో నున్న సంస్కృతబౌద్ధమత గ్రంథములను గ్రొత్తగాఁ గనిపెట్టి పాలీభాషకంటెఁ గూడ సంస్కృతముతో నధికతరసాదృశ్యము గలమఱియొకభాషను లోకమునకుఁ బ్రకాశింపఁజేసెను. ఈభాషకు గాథ యనిపేరు. "ఉషికుషి గర్తిభ్యః స్థన్" అను ఔణాదికసూత్రముచే "గైశబ్దే" అనుధాతువునకు స్థన్ ప్రత్యయము రాఁగా "గాథ" అని అయినది. "గాథా వాగ్భేదవృత్తయోః" అని మేదిని. పరిశుద్ధ మగుసంస్కృతభాషలో వచనరూపముగా వ్రాయఁబడినబౌద్ధమతగ్రంథములలో నచ్చటచ్చట గీతరూపముగాఁ గొంతగ్రంథము వ్రాయఁబడియున్నది. నేపాళదేశచరిత్రకారు లీ జాతి కావ్యములకు గాథ లని పేరిడిరి. పూర్వకాలమం దివి వందులచే గానముచేయఁబడునవి. వ్యాకరణనియమములను ఛందోనియమములను నతిక్రమించి గ్రంథకర్తలు గ్రంథరచనముఁజేయుటచే నీ భాష చెడినది. బుద్ధునిచరిత్ర మగులలిత విస్తరము, ప్రజ్ఞాపారమిత, మహావైపుల్యసూత్రము, కారండవ్యూహము మొద

లగు గ్రంథము లీగాథాభాషలో వ్రాయఁబడియున్నవి. ఈ భాషాస్వరూపమును విమర్శించిచూడఁగాఁ గ్రొత్తగా మార్పు మొదలిడినస్థితిలో నున్నట్లు కాన్పించును. తాను సంస్కృతశబ్దమయ మయియున్నను శాస్త్రనియమములకుఁ గట్టువడదు. కొన్నిచోట్ల శ్లోకములయందు ఛందోభంగము, కొన్నిచోట్ల హ్రస్వములకు దీర్ఘము, కొన్నిచోట్ల దీర్ఘములకు హ్రస్వము, అచ్చులు లోపించుట, హల్లులు లోపించుట, ద్విత్వాక్షరములకు ద్విత్వభ్రంశము, మొదలగునవి లలితవిస్తరాది గ్రంథములయందు మెండుగాఁ గానవచ్చుచున్నవి.

1. ఛందోభంగమున కుదాహరణము బుద్ధుని జన్మసమయవర్ణనలోని మాలినీవృత్తము.

ఋతుప్రవరవసంతో యోషితాం మండనీయో భ్రమరవరవిఘుష్టాః కోకిలాంబర్హిగీతాః। సుచిరచిరవిచిత్రా భ్రామ్యతే పుష్పరేణుః సాధువదథతిహి ఆజ్ఞాం గచ్ఛామో మావిలంబమ్" "ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః" అని మాలినీవృత్తలక్షణము; ప్రతిపాదమునకు రెండు నగణములు, ఒకమగణము, రెండు యగణములు, ఎనిమిదవయక్షరమందు, 1,7వయక్షరమందు యతియు (విరామము) నుండవలెను. ఈవృత్తలక్షణము పైశ్లోకములోఁ బ్రథమచతుర్థచరణములయందుఁ బట్టలేదు. ఇంతియకాక రేణుశబ్దము పుంలింగమైనను దానివిశేషణ మగు "సుచిరచిరవిచిత్రా" అనునది స్త్రీలింగములోనున్నది. "భ్రామ్యతి" అనుటకు "భ్రామ్యతే" అని ప్రయోగింపఁబడెను.

2. హ్రస్వమునకు మారుగా దీర్ఘము—కోటీశతంగంగాస్రోతసామ్. ఇచట "కోటిశతమ్" అని యుండవలయును. వ్యాధీభయముపగతః అనుచో "వ్యాధిభయ" మని యుండవలెను.

3. దీర్ఘాక్షరము లుండవలసినచోట హ్రస్వము—ఉ. వదతథమమశీఘ్రం సర్వమేతద్విదాయ. ఇచట తథా అనుటకు "తథ" అని యున్నది. తపోవనంప్రవిష్టోమాయదేవీంపృచ్ఛతి. మాయాదేవీ అనుటకు "మాయదేవీ" అని యున్నది.

4. బహువచనమున కేకవచనము—సురవధుగగనేఽస్మింస్తంరథంప్రేక్షయంతే. ఇచట సురవధ్వః అనుటకు "సురవధు" అని వ్రాసినాఁడు.

5. అచ్చులు హల్లులు లోపించుట—ఇమదృష్టవస్థామ్. ఇది "ఇమాం దృష్ట్వా అవస్థామ్" అని యుండవలెను. జానామి అనుటకు జానమి.

6. ద్విత్వాపేక్షసంభ్రంశము—ఏషోహి దేవపురుషః పరమం గిలానః. ఇచట గ్లాన అనుటకు "గిలాన" అని ప్రయోగింపఁబడినది. పూజార్హాన్ అనుటకుఁ

7. లింగవచనవిభక్తుల నుపేక్షించుట—

(i) లింగవ్యత్యయము—కృత్వాత్రిలోకీం దుఃఖితాంహ్యనాథామ్ అనుటకు "కృత్వాత్రిలోకం దుఃఖితం హ్యనాథమ్" అని ప్రయోగింపఁబడినది.

నపుంసకలింగబహువచనమునకు స్త్రీలింగైకవచనము. కారణాని అనుటకు "కారణా".

(ii) వచనవ్యత్యయము—తానపిజహిత్వనిర్గతః. ఇచట తావపి యనుటకు "తానపి" యని యున్నది.

(iii) విభక్తివ్యత్యయము—నచ ఉత్థితు ఆసనినాచభూమిా. ఇచట ఆసనాత్ అనుటకు "ఆసనినా" అని యున్నది.

నామవాచకములకుఁ గ్రియాపదములకు నంతమందుఁ జేర్పఁబడుప్రత్యయములకు బదులుగా ననేకస్థలములయందు "ఉ"కారము చేర్చుట యీభాషలోఁ బ్రసిద్ధమైనవైచిత్రి. దిగువను వ్రాసినయుదాహరణములలోఁ జూడుఁడు.

1. లఘుప్రజద్రుమవరుస్పృశయ 4. నృపనచమనుతుభితో
2. సుతృషితనరవరుజినగుణరహితా 5. కృతుస్మరిపురిమాం
3. జగతియహితకరుజినగుణ

పై వాక్యములలో నామవాచకములగు "ద్రుమవరు, నరవరు, హితకరు, మను శబ్దములకు, కృతు అను క్రియాపదమునకుఁ గొనను "ఉ"కారము చేర్పఁబడినది. కాని సంస్కృతభాషాజ్ఞాన మల్పముగాఁ గలవారి కిట్టివి యర్థము కావు. ఈభాషలో సప్తమ్యేకవచనప్రత్యయ మగుఇకార మెప్పుడును మాఱదు. సంబోధనప్రథమైకవచనమునకు "ఆ"కారము వచ్చును. కొన్నిశబ్దముల కంతమందు విభక్తిప్రత్యయములు లోపించును. ఉ. 1. అమోఘదర్శిసాలపుష్పపూజితోవైరోచనఃప్రసన్నచిత్త ప్రేక్షితత్ క్షణాంతరమ్. 2. సమస్తదర్శిదృష్ట్వవాచభాషి. తామహార్షిస్కంధి.

పైవాక్యములలో అమోఘదర్శి అనుచో "అమోఘదర్శినా" తృతీయావిభక్తిప్రత్యయము లోపించినది; ప్రసన్నచిత్త అనుచోట సప్తమీవిభక్తి లోపించినది. ప్రేక్షి అనుదానికి ప్రేక్షితవాన్ అని యుండవలెను మహార్షికి బదులుగా మహార్షిషి యని యుండవలెను.

లలితవిస్తరమందుఁ బ్రయోగింపఁబడిన సర్వనామరూపము లెట్టివికృతిని జెందెనో చూడుఁడు.

| సంస్కృతమ్. | గాథా. | సంస్కృతమ్. | గాథా. |
|---|---|---|---|
| మమ, మత్తః | మహ్య. | మహ్యాం, మయా | మి. |
| త్వయా, త్వాం, తవ | తుభ్య. | త్వయా | తి. |
| ఏషః | అయు. | తస్య | తసా. |
| తాః | తే. | ఏభిః | అనభిః. |
| కుత్ర, కేన | కహిం. | | |

క్రియలు—ఈభాషలోని క్రియాపదముల కొకనియమము శాస్త్రము లేదు. ఈభాష నుచ్చరించువారలు శబ్దములను బలుకలేక తమయిచ్చకొలఁది

| సంస్కృతమ్. | గాథా. | సంస్కృతమ్. | గాథా. |
|---|---|---|---|
| దదామి | దదమి, దేమి. | బుద్ధ్వా | బుద్ధిత్వా. |
| భవతి | భోతి. | శృణ్వంతి | శణువంతో. |
| భవసి | భోసి. | పశ్యామి | ప్రేహామి. |
| భవంతి | భోంతి. | శ్రుత్వా | శుణియ. |
| అభూః | అభూవిః | దర్శయంతి | దర్శేంతి. |
| భవేత్ | భవియ. | దదస్వ | దద. |
| భవ | భోహి. | జనయ | జనేహి. |
| అవరుహ్య | ఓరుహిత్వా. | ఉపయన్తి | ఉపేంతి. |
| భూత్వా | భవియా. | పూరయ | పూరేహి. |

కొన్నిహలంతశబ్దముల కజంతరూపములు కానవచ్చుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| జగతః | జగస్య. | అనంతయశసం | అనంతయశం. |
| జగతి | జగే. | కర్మణః | కర్మస్య. |
| నామ్నా | నామేన. | దుహితరం | దుహితామ్. |
| మహాత్మానం | మహాత్మం. | | |

పాలీభాషయందువలెనే యీభాషయందును సప్తమ్యేకవచనమం దుండు "ఏ"కారము తఱచుగా "ఇ"కారముగా మాఱును.—ఉదరే - ఉదరి. గేహే - గేహి. లోకే-లోకి. ఈరీతిగాఁ బైనుదాహరింపఁబడినవికృతిరూపము లాకాలమం దుత్పత్స్యమానము లగుప్రాకృతభాషాపదముల కగ్రగాములని (precursors)

యూహింపఁబడుచున్నవి. ఎట్లన; సంస్కృతభాషలో భూధాతువునకు లట్టు
లోఁ బ్రథమపురుషైకవచనము భవతి, గాథాభాషలో నారూపము హోతి అయి
నది బహువచనము హోంతి, మధ్యమపురుషైకవచనము హోసి, ఈరూపములనుండి
హోతి - హోసి, హోన్తి అని మాగధీభాషలోను, అహే, అహేత్ - అహేస్,
అని మహారాష్ట్రభాషలోను, రూపములు పుట్టినవి. హిందీలో హోతాహే;
శ్రుత్వా అనుదానికి సునిత్వా అని ప్రాకృతభాషారూపము. ఇదియే సునియ
అనుసంగభాషాపదమునకు మూలము.

గాథాభాష, పదరచనయందు సంస్కృతకారకనియమములను సరిగా
ననుసరించియున్నను సమాసవిధానమందుఁ బాణినిసూత్రముల కత్యంతవిరుద్ధ
ముగా నున్నది. ఇట్టివి క్రియ, శీఘ్రోచ్చారణము, అజాగరూకత, గ్రామ్యత
మొదలగువానిచేఁ గలిగినవిగాని భాషావైచిత్రి యనఁగూడదు. ఛందోభంగ
దోషమునకుఁగూడ నిదియే కారణము.

గాథాభాషోత్పత్తినిగుఱించి నిశ్చయముగా మన కేమియుఁ దెలియదు.
వైపుల్యసూత్ర మనుగ్రంథముయొక్క యన్నిభాగములభాషాభేదముఁ బరిశీలిం
పఁగా నిట్టిదోషములతోఁ గూడిన యీశ్లోకరూపగ్రంథమును వ్రాసినగ్రంథకర్త
సూత్రములు వ్రాసినవానికంటె భిన్నుఁ డని స్పష్టమగుచున్నది, గాని, యిట్టి
భాషాభేదము గలయీగ్రంథభాగములవలన దీనియుత్పత్తిని దెలిసికొనుట కవ
కాశము లేదు. శాక్యముని స్వమతబోధ నారంభించినతరువాత సంస్కృత
భాషకుఁ బాలీభాషకు మధ్య నొకదేశభాషగా నేర్పడిన దని మన మూహింప
వచ్చునా లేక సంస్కృతభాషతో మంచిపరిచయము లేనివారు కొందఱు
సంస్కృతములో గ్రంథములు వ్రాయుటకుఁ బ్రయత్నింపఁగా నవి యీరీతిగాఁ
జెడినవని మన మూహింపవలయునా? ఈరెండంశములలో నేది నిజమో దాని
నేర్పఱుచుట చరిత్రవలనఁ గావలెను. ఆలోచింపఁగా నాబుద్ధికి రెండవపక్షమే
సంభావ్యముగా నున్నట్టు తోఁచుచున్నది. నేపాళదేశాధిగతగ్రంథసంచయమం
దీసంగతు లెవ్వియుఁ గానరావు. ఈవిషయమును బాగుగఁ దెలిసికొనవలయు
నన్నచో దక్షిణబౌద్ధుల మతసంప్రదాయములను, సింహళదేశపుగ్రంథములను,
మొదటఁ జక్కఁగాఁ దెలిసికొనుట యావశ్యకము. అట్లొనర్చినచో నామత
గ్రంథములు బ్రాహ్మణులభాష యగుసంస్కృతమునుండి పుట్టిన "పాలీ" యను
నొకభాషలో వ్రాయంబడిన వనియు, నాభాషకు బౌద్ధులచెత్యాలయముల
యందు వ్రాయంబడినభాషకు లేశము భేదము లేదనియు మనము తెలిసికొనఁ

గలము. వైపుల్యసూత్రములో నున్నశ్లోకగ్రంథభాగ మీభాషలోనే వ్రాయఁబడినది. ఇందుకు సందేహము లేదు. నానావిధదోషములతోఁ గూడిన సంస్కృతపదములు పాలీపదములు సంకరముగాఁ గలియుటచేఁ బుట్టినయొక విధ మగుభాషలో నీశ్లోకగ్రంథభాగము వ్రాయఁబడినది. ఇట్టిభాష కిడఁదగిన దేశనామ మెద్దియుఁ గానరాదు. కట్టుపాటుతో సంస్కృతము కృషి చేయఁబడనిస్థలములలో నట్టియపభ్రంశభాష పుట్టింపఁబడవచ్చునని మనము తెలిసికొనఁగలము. సింధునదికిఁ బశ్చిమభాగమున నునఁగాఁ గాశ్మీరదేశమం దీసూత్రములు వ్రాయఁబడియుండు నని నానమ్మకము. ఏలయనఁగా నచ్చట నీసంస్కృతభాష మధ్యహిందూస్థానమందువలె నంత బాగుగఁ గృషి చేయఁబడదు. బౌద్ధమతము హిందూస్థానమం దభివృద్ధిలో నున్నసమయమం దీశ్లోకభాష పుట్టిన దనుట యసంభవముగాఁ గానవచ్చుచున్నది. ఏల యనఁగా నాదేశమం దుండుమతగురువులు సంస్కృతభాషనో లేక పాలీభాషనో కృషిచేసియుందురుగాని వీనిని విడిచి యింకొకదాని నెఱుంగరు. అని Bournouf పండితుఁడు Royal Asiatic Journal అనుమాసపత్రికలో గాథాభాషనుగుఱించి వ్రాసియున్నాఁడు. దీనిని Rajendra Lal Mitra అను మఱియొకమహాపండితుఁడు Indo-Aryans అను తనగ్రంథములో నిట్లు ఖండించియున్నాఁడు. "గాథలయం దున్నసంస్కృతభాషాశైలినిగుఱించి Bournouf పండితుఁడు చేసినయెన్నిక తప్పని నాయభిప్రాయము. గాథాకావ్యము దున్నకవనశిల్పము, పదలాలిత్యము, కడు మెచ్చుకొనఁదగినది. ఇది వ్యాకరణనియమానభిజ్ఞులచే వ్రాయఁబడె నన్నచో నెవరు విశ్వసింతురు ఆకావ్యకర్తలు గొప్పవైదుష్యము గలవారు. వీ రతిసూక్ష్మబుద్ధిగ్రాహ్యము లయినతర్కవేదాన్తాంశములను మిక్కిలి విశద మయినభాషలోఁ దెలియఁజేసియున్నారు. ఆర్యావృత్తములను దోటకవృత్తములను సొగసుగా రచించియున్నారు. ఇట్టిమహావిద్వాంసులు భూధాతువునకు లట్టులో రూపము నెఱుంగరని చెప్పుటకంటె సాహసమేమున్నది. దేశీయములు గాని అపశబ్దములు గాని లేశము లేని శుద్ధమగుసంస్కృతభాషలో వ్రాయఁబడియుండుట, యీగాథలలో నానావిధాపశబ్దములు దేశీయము లుండుట పరస్పరవిరుద్ధముగాఁ గానవచ్చును. ఈరెంటిని సమన్వయింపఁజేయుట మిక్కిలి దుష్కరము. సంస్కృతమం దపరిపూర్ణజ్ఞానము గలవారై సింధునదికిఁ బైఁగా నున్న దేశములో నున్నవారిచే నీసూత్రములు వ్రాయఁబడినచో వీనిలో నొకభాగ మన్నివిషయములయం దతిశుద్ధముగా నుండుట మఱి

యొకభాగము నానావిధదోషదుష్టముగా నుండుట యెట్లు సంభవించును. ఒక గ్రంథములోనే కొంతభాగము నిర్దుష్టముగాను మఱికొంతభాగము సదోషముగాను వ్రాయుటయం దా గ్రంథకర్తలయుద్దేశ మేమై యుండును? అని ప్రశ్నింపఁగా నీరెండుభాగములును భిన్నకాలికగ్రంథకర్తలచే వ్రాయఁబడిన వని సమాధానము చెప్పవలసియున్నది. అట్లయినచోఁ దుష్టభాషతో వ్రాయఁబడిన యీగ్రంథభాగమును శుద్ధమైనశేషగ్రంథములతోఁ గలుపుట కాగ్రంథకర్త లెట్లొప్పుకొన్నారు? వారిమతభక్తి, వారికి మతమం దుండెడియథార్థవిజ్ఞానము, వారి కాగ్రంథమందుఁ గలప్రామాణ్యబుద్ధి మొదలగువానినిబట్టి వారు కలుపుకొన్నా రని మనము చెప్పవచ్చును. శాక్యమునికి సమకాలికులు స్తుతిపాఠకులు నగువందిజనులు బౌద్ధభక్తసమాజములయందు బుద్ధుఁ డుపన్యసించిన సూక్తములను, అపుడొవచ్చిన లోకోత్తరకార్యములను, జను లందఱుఁ దెలిసికొనఁగల సులభశైలితోఁ గూడినపద్యములచే వర్ణించి రనియు, బుద్ధునితరువాతివారి కీపద్యములు బుద్ధునివృత్తాంతమును దెలియఁజేయు పరమప్రామాణికగ్రంథ మయ్యెననియు మన మూహించుట న్యాయ్యముగా నుండును.

హిందూదేశమందు వందులు కూర్చినపాటలయందుఁ బద్యములయందు విశేషించి బౌద్ధగ్రంథములయందు జనులకుఁ గలగౌరవ మీయూహను బలపఱుచుచున్నది. లలితవిస్తరమం దెల్లెడల గద్యప్రతిపాదితకథాంశములకు సందర్భానుసారముగా నీగాథలు “అత్రేదముచ్యతే” అనువాక్యముచే నవతరింపఁజేయఁబడుట పైయూహకు నమ్మఁదగినసాక్ష్య మిచ్చుచున్నది. బుద్ధఘోషుఁడు సింహళదేశపుభాషలో వ్రాయఁబడినపిటకత్రయమును బాలీభాషలోనికి మార్పఁగల నని చెప్పినపుడు అనూరాధాపురవిహారమం దున్నబౌద్ధాచార్యు లందఱు నీతనిపాండిత్యముఁ బరీక్షించుటకై రెండుగాథలఁ జదివి “వీనికి నీ వర్థముఁ జెప్పఁగలిగితివేని నీ వాగ్రంథరచనకు సమర్థుఁడ వని మేము నమ్ముదు” మని పలికి రఁట. ఈవృత్తాంతము మహావంశ మనుగ్రంథములో ముప్పదియేడవ యధ్యాయములో నున్నది.

బుద్ధుఁడు నిర్వాణము నొందినపిదప నాతనియందు దృఢభక్తి గలవారలందఱు నామతమును దేశమందు వ్యాపింపఁజేయుచు నతఁ డుపదేశించిన మతధర్మములను గద్యరూపముగాను బద్యరూపముగాను రచించిరి. ఈగాథ లట్టి బుద్ధభక్తులచే రచింపఁబడిన వని మన మొప్పుకొనక తప్పదు. పూర్వకాలమందు బౌద్ధమతమును బ్రవర్తింపఁజేసిన వారిచరిత్రమునుబట్టి విచారింపఁగా వా రథమ

జాతులవా రనియు, సంస్కృతములోఁ దప్పులు లేకుండఁ గవనముఁ జెప్పనేరని యసంస్కారు లనియు నూహించుట మిగుల నసమంజసముగాఁ గానవచ్చును. వారిలో ననేకులు మంచివైదుష్యము జ్ఞానము సామర్థ్యము గలబ్రాహ్మణులు, కొందఱు క్షత్త్రియులు, బౌద్ధమతగ్రంథములను వ్రాసినతరువాత, వారు పూర్వకాలపుగ్రంథకర్తలగ్రంథములనుండి కొన్నివచనములను బ్రమాణముగా నుదాహరించుట సహజమైనసంగతి గాని జాతియందుఁ బాండిత్యమందుఁ దమకంటె మిక్కిలి నికృష్టు లగువారు వ్రాసినవచనములను బ్రమాణముగా గ్రహింతురని తలంచుట యుక్తము కాదు. కావున గాథాకవనకర్తృత్వమును నీహీనజాతివారి కారోపించుట న్యాయ్యము కాదు. ఇట్లయినచో నీగాథాకవనమం దున్న యీతప్పులకుఁ గారణ మేమనఁగా నీగాథలు వ్రాయఁబడినకాలమునం దున్నభాషావైచిత్రిని దెలియఁజేయు దేశీయములు, ఆర్షప్రయోగములు మొదలగువానిచే నీతప్పులు కలిగినవి. ఒకదానితో మఱియొకదానికి సందర్భము లేనికవనము చెప్పెడు నీసందులభాష ఐరోపాఖండమునందుఁ గాని హిందూదేశమందుఁ గాని గ్రామ్యపదభూయిష్ఠమై యుండుట సుప్రసిద్ధమే. అప్పటి కప్పుడు పాటలను బద్యములను గవనము చెప్పువారిభాష నిర్దుష్టముగా నుండనేరదు. ఇట్టివాక్సరణియే పామరులకందఱకు హృద్యమై మనోరంజకముగా నుండునుగాని శుద్ధభాషానిబద్ధకావ్యపద్ధతి వారికి బధిరశంఖధ్వనిమాడ్కి నుండును. మన దేశమందు బిచ్చమెత్తుకొనుట కింటింటికిఁ దిరుగు బట్టులు చదువు పద్యములచేఁ బామరులు రంజిల్లినట్లు మనుచరిత్రాద్యుత్తమాంధ్రకావ్యములలోని పద్యములచే రంజిల్లుదురా? అట్లే యీగాథలుకూడ సులభముగా నర్థమయి సామాన్యజనులను రంజింపఁజేయుట కిట్టియసంస్కృతభాషలో వ్రాయఁబడిన వని మన మూహింపవలెను.

## ప్రాకృతభాష.

ఈరీతిగాఁ బాలీగాథాభాషలఁ బరీక్షింపఁగా వానిలోఁ బదము లధికముగా శుద్ధసంస్కృతపదములుగా నున్నట్లు, శేషించినపదజాలము స్వరనాశనియమముల (laws of phonetic decay) ననుసరించి మార్పునొందినట్లు మనము తెలిసికొంటిమి. అశోకుని శాసనములలోఁ గొన్నిటియందు శుద్ధపాలీభాషయు మఱికొన్నిటియందుఁ గొంచెము మార్పుఁజెందిన భాషయును గానవచ్చుచున్నది. **మాతృభాష యగుసంస్కృతమునుండి పుట్టినను బై నుదాహరింపఁబడినరెండు భాషలకంటె నధికతరవిపర్యయము నొందినమఱికొన్నిభాషల నిపుడు పరీక్షించి**

చూతము. వీనికే ప్రాకృతము లని పేరు. జైనపండితుఁ డగునాచార్యహేమ చంద్రుఁడు "ప్రకృతే రాగతం ప్రాకృతమ్" ప్రకృతి యగుసంస్కృతము నుండి యీభాష పుట్టినది కావున ప్రాకృత మనఁబడు నని ప్రాకృతశబ్దము నకు వ్యుత్పత్తిని జెప్పియున్నాఁడు. మొట్టమొదల సంస్కృతము నుండి యుత్పన్నము లయినమాహారాష్ట్రీ, శౌరసేనీ, మాగధీ మొదలగునానావిధభాషలకుఁ బ్రాకృత మనునది సాధారణనామము ఆధునికశబ్దశాస్త్ర వేత్తలు (Philologists) ఈభాషలన్నియుఁ దిన్నఁగా సంస్కృతమునుండి సంజాతము లయినవో లేక తద్వికృతు లయిన మఱికొన్నిభాషలనుండి పుట్టినవో యనునీవిషయమును దృష్టికరముగా నిర్ణయింపఁ జాలకున్నారు పాళీభాషను ద్వారముగాఁ జేసికొని యీ భాషలన్నియుఁ బుట్టిన వని కొందఱు. ఇవి యన్నియు సంస్కృతమునుండి యే పుట్టినవని చెప్పుట న్యాయ్య మని మఱికొందఱు వివదించుచున్నారు. నేను లోఁగడఁ జెప్పిన ట్లార్యు లందఱు తమనివాసస్థాన మగుబ్రహ్మావర్తమునుండి చలింపక స్థిరముగా నచట నివసించియున్నంతకాలము వారిభాష కెట్టివిధ మైనవిప్లతియు సంభవింపలేదు. వారు భరతఖండములోని యితరభాగములకుఁ బోవుట యెపుడు ప్రారంభించిరో యప్పటినుండి వారు వెళ్లియున్నప్రదేశముల శీతోష్ణ స్థితి, యితరహేతువులు మొదలగువానివలన వారిభాష వికరింపనాగెను. ఇట్లు పరస్పరసూక్ష్మభేదములతోఁ గూడినవియుఁ బ్రాకృత మని సాధారణనామము గలవియు నగు నవాంతరభాషలు కొన్ని పుట్టినవి. ఆర్యులు స్వస్థానమును విడిచి పరదేశాటనముల హెచ్చించినకొలఁది నీ భాషలసంఖ్య హెచ్చయ్యెను. ఇందుకు నిదర్శనముగాఁ బ్రాకృతవ్యాకరణములను వ్రాసినవారిలోఁ బ్రాచీనతముఁ డగువరరుచి తాను రచించిన ప్రాకృతప్రకాశికలో మాహారాష్ట్రీ, పైశాచీ, శౌరసేనీ, మాగధీ, అనునీ నాల్గుభాషలకే లక్షణముఁ జెప్పియున్నాఁడు. అర్వాచీనగ్రంథకర్త లగు త్రివిక్రముఁడు, మార్కండేయుఁడు, మొదలగువారు మాగధ్యవంతికాప్రాచ్యాశౌరసేన్యర్ధమాగధీ బాహ్లీకా దాక్షిణాత్యాచసప్త భాషాః ప్రకీర్తితాః॥ అని యేడుభాషలకు లక్షణము వ్రాసిరి. దీనినిబట్టిచూడఁ గాఁ గాలక్రమమున నీభాషలసంఖ్య హెచ్చినట్లు కానవచ్చుచున్నది. ఆదిమ నివాసులభాషాపదములు విదేశ భాషాపదములుఁ గాలక్రమమున నీభాషలోఁ బ్రవేశించినవి. ఈదిగువకాలమం దీప్రాకృతభాషలు "తద్భవస్తత్సమో దేశీత్యనేకః ప్రాకృతక్రమః" అని దండికావ్యాదర్శమందుఁ జెప్పినట్లు తద్భవ మనియుఁ, దత్సమ మనియు దేశ్యి యనియు మూఁడుతెరగతు లయ్యెను. తద్భవ మనఁగా

సంస్కృతమునుండి యవ్యవహితముగాఁ బుట్టినభాష, తత్సమ మనఁగా సాంస్కృతికస్వరూపము సర్వము కలశబ్దములు, దేశి యనఁగా దేశమందు వాడుకచేయఁబడుభాష. దీని కాదిమనివాసులభాషయే మూలము. ప్రాకృతభాష లన్నిటిలో "మహారాష్ట్రాశ్రయాంభాషాం ప్రకృష్టంప్రాకృతంవిదుః । సాగరస్సూక్తిరత్నానాం సేతుబంధాదియన్మయమ్" అని దండి చెప్పినట్లు ప్రాకృతభాష లన్నిటికంటె మహారాష్ట్రభాష శ్రేష్ఠమయినది. ఈభాషలోఁ బ్రవరసేనుఁ డనుకాశ్మీరదేశపు రాజు సేతుబంధ మనుప్రాకృతకావ్యమును రచించెను. తక్కినప్రాకృతభాషలు కొన్ని యవాంతరసూక్ష్మభేదములను విడిచిపెట్టి తక్కినవిషయములయందు మహారాష్ట్రభాష ననుసరించునవి యైయున్నవి.

ప్రాకృతభాషకు వ్యాకరణములను వ్రాసినవారిని మార్కండేయకవీంద్రుఁడు తనప్రాకృతసర్వస్వమం దిట్లు వాక్రుచ్చుచున్నాఁడు, "శాకల్యభరతకోహళ వరరుచి భామహ వసంతరాజాద్యైః ప్రోక్తాన్గ్రంథాన్నానాలక్ష్యాణిచనిపుణమాలోక్య, అవ్యాకీర్ణంవిశదంసారంస్వల్పాక్షరగ్రథితపద్యం, మార్కండేయకవీంద్రః ప్రాకృతసర్వస్వమారభతే" శాకల్యభరతకోహళభామహులు వ్రాసిన గ్రంథము లెచ్చటను మనకుఁగానరావు వరరుచికృతప్రాకృతప్రకాశిక, మార్కండేయుని ప్రాకృతసర్వస్వము, వసంతరాజప్రణీతప్రాకృతసంజీవినిని మన మెఱుఁగుదుము. ఈ గ్రంథము లన్నింటిలో హేమచంద్రుఁడు వ్రాసిన ప్రాకృతవ్యాకరణము విపులతరముగా నున్నది. ఇతఁడు పదుమూఁడవయబ్దశతకమందు మిక్కిలి ప్రసిద్ధిని గాంచిన జైనపండితుఁడు. ఇతఁ డేడధ్యాయములు సంస్కృతశబ్దానుశాసనమును నెనిమిదవయధ్యాయములోఁ బ్రాకృతవ్యాకరణమును వ్రాసెను. ఇతఁడుతనగ్రంథముయొక్క యధ్యాయాంతములయందు "ఇత్యాచార్యహేమచంద్రవిరచితాయాం సిద్ధహేమచంద్రాభిధానస్వోపజ్ఞ శబ్దానుశాసనవృత్తౌ" అని వ్రాసియున్నాఁడు. వరరుచి వ్యాకరణసూత్రసహాయనిర్వ్యపేక్షుఁడై తన గ్రంథమును స్వతంత్రముగా వ్రాసెను. ఆకాలమున కున్నప్రాకృతవాఙ్మయము నంతయును దనగ్రంథమందు సంగ్రహించెను. ఇతఁడు దేశినామమాల యను నొకనిఘంటుగ్రంథమునుగూడ వ్రాసెను. వరరుచి తనగ్రంథమందు మాహారాష్ట్రీ శౌరసేనీ, పైశాచీ, అపభ్రంశ, అనునాలుగుభాషల లక్షణములను జెప్పెను. హేమచంద్రుఁడుగూడ నట్లే వ్రాసెనుగాని మహారాష్ట్రభాషనుగుఱించి విశేషముగఁ జెప్పలేదు. వీరుభయులు శౌరసేనీభాష సంస్కృతమునుండి పుట్టినదనియును, మాగధీపైశాచీభాషలకు శౌరసేని ప్రకృతియనియుఁ జెప్పుటలో నేకీభవించు

చున్నారు. శౌరసేని పూర్ణముగాఁ బెరిఁగిన భాష. ఇది మిక్కిలి ప్రాచీనమైనది. నాగరకులచేతను విద్యావంతులచేతను వ్యవహరింపఁబడునది; మాగధీపైశాచీ భాషలు నికృష్టసాంఘికస్థితి గలజనులచే మాటాడఁబడునవి. ఇవి కొంతమట్టుకు శౌరసేనీభాషాసాదృశ్యము గలిగినవై యయినమహారాష్ట్రభాషతోఁగంటె దీనితో నెక్కుడుసంబంధము గలిగియున్నవి. హేమచంద్రుఁడు చూళికాపైశాచి, అపభ్రంశ అను మఱిరెండుభాషలలక్షణములు జెప్పియున్నాఁడు. అభీరి గొల్లల భాషయని దండి వ్రాసెను. త్రివిక్రముఁ డనుపేరు గలమఱియొకప్రాకృతవ్యాకరణకర్త తాను వ్రాసినప్రాకృతసూత్రవృత్తియం దీయాఱుభాషలనే వ్యాకరించెను. ఇతఁడు స్వగ్రంథోపోద్ఘాతమునందు హేమచంద్రుని బేర్కొనియుండుట చేతను విశేషముగా నితఁడు వ్రాసినగ్రంథము హేమచంద్రునిగ్రంథమును బోలియుండుటచేతను వీ రుభయులు సమకాలికు లనికాని లేక త్రివిక్రముఁడు హేమచంద్రుని తరువాతివాఁ డనికాని యూహింపవచ్చును. చంద్రుఁ డను వాఁడు వ్రాసినషడ్భాషాచంద్రిక యనుమఱియొకప్రాకృతవ్యాకరణము కలదు గాని యది నిస్సారమైనది.

దండి చెప్పినట్లతివిస్తృతము సారవత్తరము నగువాఙ్మయమునుబట్టి మహారాష్ట్రభాష కట్టిమహత్త్వము కలిగినది. కాళిదాసునియందు గ్రంథకర్తృత్వ మారోపించి ప్రవరసేనమహారాజు వ్రాసినరావణవధ యనునామాంతరము గల సేతుబంధకావ్యము మహారాష్ట్రభాషలో వ్రాయంబడి యున్నది. హర్షచరిత్రములో బాణుఁడు "కీర్తిః ప్రవరసేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా। నాగరస్య పరంపారం కపిసేనేవ సేతునా" అని శ్లాఘించియున్నాఁడు. కాశ్మీరదేశము నేలిన రాజులలో నలుగురు ప్రవరసేను లున్నట్లు కల్హణునిరాజతరంగిణివలనఁ దెలియవచ్చుచున్నది. వీరిలో నేప్రవరసేనుఁ డీగ్రంథమును రచించెనో నిశ్చయింప శక్యము కాదు. శాతవాహనుఁ డనునామాంతరము గలశాలివాహనుఁడు వ్రాసినగాథాసప్తశతి (ఏడువందలప్రాకృతశ్లోకములు) అనుమఱియొకప్రాకృత కావ్యము కలదు. ఎనిమిదవశతాబ్దమునందుఁ గాన్యకుబ్జాధిపతి యగుయశోవర్మ భూపాలుని యాస్థానమం దున్నవాక్పతిరా జనుమహాకవి రచించినగౌడవధ యనుప్రాకృతకావ్యము మఱియొకటి. ఇది సుమారు రెండువేలప్రాకృతశ్లోకములు గలకావ్యము. ఇట్లనేకప్రాకృతకావ్యములు కలవు. గ్రంథవిస్తరభీతిచే వాని నన్నింటి నిచట వ్రాయుట మానితిని.

బౌద్ధులకుఁ బాలీ యెట్లు పవిత్ర మగుమతభాష యయియుండెనో.

యట్లే జైనులకుఁ బ్రాకృతము మతభాష. జైనమతగ్రంథము లన్నియు నీప్రాకృతములో వ్రాయఁబడియున్నవి జైనమతగ్రంథము లేప్రాకృతభాషలో వ్రాయఁబడెనో యాప్రాకృతభాష పాలికిఁ దరువాతిది. శేషించినప్రాకృతభాషల కన్నింటికి మొదటిది. దీనికి జైనమాగధి యని పేరు. స్వమతగ్రంథనిష్ణాతుఁడు గొప్పప్రాకృతకవియు నగు హేమచంద్రుఁడు ప్రాకృతభాషలలోఁ బ్రధానతమ మగునీమహారాష్ట్రభాషను దనవ్యాకరణమందు విపులముగాఁ బ్రతిపాదించెను. ఇది తనమతభాషగావున దీనియందుఁ దన కున్నగౌరవమును బ్రకాశింపఁజేయుటకు బ్రాహ్మణులు సంస్కృతభాషకు బేరిడినట్లు "ఆర్షం ఋషీణామిద మార్షం। ఆర్షే ప్రాకృతం బహులం భవతి, తదపి యథాస్థానం దర్శయిష్యామః ఆర్షేహి సర్వేవిధయోవికల్ప్యంతే" అని దీనినార్షమని వ్యవహరించెను. జైనమతగ్రంథములు వ్రాయఁబడియున్న యర్ధమాగధికిఁ బాలికి మహారాష్ట్రభాషకుఁ గలభేద మల్ప మని యీదిగున వ్రాయఁబడినరీతిగా హేమచంద్రుఁడు తనవ్యాకరణమందు వ్రాసియున్నాఁడు

1. మహారాష్ట్రభాషలోఁ బదాదియం దుండని క్, గ్, చ్, జ్, త్, ద్ మొదలగుహల్లులు లోపించి వానిస్థానమం దచ్చు నిలుచును. పాలిలో హల్లులుండును. జైనప్రాకృతములో నచ్చునకు బదులుగా యకారము వ్రాయఁబడును.

| మహా రా. | పాలీ. | జైనప్రాకృత. |
|---|---|---|
| ఉ. ఫురిఅ (స్ఫురిత) | ఫురిత. | ఫురియ. |

2. మహారాష్ట్రములో నకారము ణకార మగును. పాలిలో మాఱదు. జైనప్రాకృతమందుఁ బదాది నున్ననకారి మట్టులే యుండును. ఉ. మాహారాష్ట్రీ సందాణిఅ (సందానిత). పాలీ - ఆలింపన (ఆదీపన). జైనప్రాకృతము - నగ్గో (నగ్నః)

3. అకారాంతశబ్దముల సప్తమ్యేకవచనప్రత్యయము సిం - లేక - సి. ఉ. దేవస్సి - దేవస్సిం. పాలీ—దేవమ్హి - దేవస్మి జైనప్రాకృతము—దేవమ్మి.

హల్లు లోపింపఁగా వచ్చినయకారమునకు బదులుగా వచ్చినయకార మిప్పటి దేశభాషలలోఁ గూడఁ గాన్పించుచున్నది. ఇది యుచ్చారణసౌష్ఠవము కొఱకయినది. ఉ. ప్రాకృ. పాఅ (పాద). మా. రా. పాయ - రాఅ (రాజక) రాయ, సోఅర (సోదర) సోయర - ఈయకారము జైనగ్రంథములలోనే కాక గౌడవధకావ్యమందుఁగూడ ననేకస్థలములయందుఁ గానవచ్చుచున్నది. దీనికి హేమచంద్రుఁడు "అవర్ణోయశ్రుతిః" అని సూత్రించెను. పైనిఁ

సశేషము.

# యుద్ధమల్లుని శాసనము.

(తెనుఁగున ఴ ధ్వని.)

బెజవాడలోనున్న యుద్ధమల్లశాసనమునందు ఴ అను నొకయక్షరము కలదు. దీని యుచ్చారణ మప్పటి యాంధ్రకర్ణాటలిపిలో నఱవమందలి ఴవలె నగుచుండెను. ఏశబ్దములలో నీయక్షరము వచ్చెనో యవి పూర్వము ఇప్పటికి నఱవమునందును, పూర్వము కన్నడమునందును ఴకారయుతములు కావున నాకాలపు తెనుఁగునను గూడ నీయక్షరమునకు ఴ ఉచ్చారణ ముండెనని యెంచవలెను, అని శ్రీయుత కొమర్రాజు లక్ష్మణరావుగారొక వ్యాసము పరిషత్పత్రికలో (ఆశ్వయుజకార్తికమాససంచికలో) వ్రాసియుండిరి. దాని నాక్షేపించుచు శ్రీయుత కాశీభట్ట బ్రహ్మయ్యగారు చైత్రవైశాఖమాససంచికలో నొక దీర్ఘ వ్యాసము వ్రాసిరి. వ్యాసము ౧౮ పుటలు నిండియున్నను, అందలి ముఖ్య విషయముమాత్రము రెండుమూఁడుపుటలకంటె నెక్కుడుండదు. దానికి శ్రీలక్ష్మణరావుగారే ప్రత్యుత్తరము వ్రాయుదు రని తలంచి నేను వారికి జాబు వ్రాసితిని. ఇందుకుఁ బ్రత్యుత్తరముగా వారు నాకుఁబంపిన జాబులో నిట్లున్నది. "శ్రీయుత రామయ్యపంతులుగారు నాకు వ్రాసిన జాబులో 'ఈయక్షరమునకు మొదట కన్నడములోవలెనే తెలుఁగునను ఴ ఉచ్చారణ బహుశః ఉన్నను, యుద్ధమల్లునిశాసనమువఱకు నదిమాఱి, యప్పటినుండి యిది డకారమునకు అభేదభావముతోఁ నితరడకారముతోఁబాటు వాడఁబడుచుండెను, అని నా అభిప్రాయము. నేను ఇందునగురించి వ్యాసము వ్రాయనున్నాను.' అని యుండుటచే వారివ్యాసము వచ్చినతరువాత నావశ్యకమేని నేను జవాబు వ్రాసెదను. శ్రీయుతబ్రహ్మయ్యశాస్త్రిగారి వ్యాసమునకుఁ బ్రత్యుత్తరము నే నీయవలసినట్టి శాస్త్రీయవిషయ మందు నాకు నేమియుఁ గానరాలేదు."

ఇందువలన శ్రీలక్ష్మణరావుగారు బ్రహ్మయ్యగారి లేఖకుఁ బ్రత్యుత్తర మీయ రనుట స్పష్టము. కాని శ్రీబ్రహ్మయ్యగారి వ్రాఁతలోని కొన్నివిషయముల యసత్యత్వము పరిషత్పత్రికాపాఠకులకుఁ దెలియుట యావశ్యక మని నా తాత్పర్యము. అవి వెల్లడికానియెడల సామాన్యపాఠకులభ్రమ దూరము

కానేరదని యీలేఖ వ్రాయుచున్నాను. సంపాదకులు నిష్పక్షపాతబుద్ధితో దీనిని ప్రకటింతురుగాక.

శ్రీబ్రహ్మయ్యగారి వ్యాసముయొక్క యుద్దేశమును, అర్థమును బూర్తిగఁ దెలిసికొనుటకును, నీశాసనమునకును, వీరికిని గల సంబంధముః మనకుఁ దెలియ వలయును.

యుద్ధమల్లుని శాసనముపై బ్రహ్మయ్యగారికిఁ గలవిరోధభక్తి.

రావణునకు రామునియెడ విరోధభక్తి యుండెనని చెప్పుదురు. అట్లే బ్రహ్మయ్యగారికి నీశాసనమునెడ విపరీతభక్తి మెండు. మొదటనుండియు నీశాసనమన్న వారికి బెదరు విశేషము ఇందుకుఁ గారణముః లేకపోలేదు. నన్నయభట్టునకుఁ బూర్వము తెలుఁగునఁ బద్యరచన లేనేలేదనియు మొట్టమొదటఁ దెనుఁగునఁ బద్యమును నన్నయయే పుట్టించెననియు నొక విపరీతమును, అసంభవమును ౹యిన సిద్ధాంతమును ౹ బ్రహ్మయ్యశాస్త్రిగారు నన్నయభట్టారక చారిత్రమునందుఁ బ్రతిపాదించిరి. దానికి మూలేకుఠార మన్నట్లు లీయుద్ధమల్లునిశాసనము వెలువడెను. అంత శ్రీబ్రహ్మయ్యగారు జంకిన ట్లగపడక శాసనమందలి విషయము గద్యమయమే యనియుఁ బద్యమయముకాదనియు గట్టిగ వాదింపఁ దొడంగిరి!! కాని కొందఱు యతిప్రాసములను జూపిరి! అప్పుడు శ్రీబ్రహ్మయ్యగారు విధిలేక శాసనమునందుఁ బద్యములు కల వని యొప్పుకొనక తప్పకపోయెను. శ్రీబ్రహ్మయ్యగారు ఛందోజ్ఞానము కలిగియుఁ దమవాదసౌకర్యార్థమట్లు ప్రతిపక్షులను దబాయించిరి.

ఇట్లు యుద్ధమల్లశాసనవిషయమైన మొదటి కుస్తీపట్టున శ్రీబ్రహ్మయ్యగారు పూర్తిగ 'చిత్' అయినను, అధైర్యముఁ జెందక, శాసనమునందుఁ బద్యము లున్ననేమి? అది నన్నయకుఁ బూర్వకాలపుది కాదు, తరువాతకాలమున వ్రాయఁబడినది యని వాదింప దొడఁగిరి! ఈమతమును శ్రీయుత చిలుకూరివీరభద్రరావుగారును, "యుద్ధమల్లునిబెజవాడశిలాశాసనము" అనువ్యాసమునందు శ్రీయుత జయంతిరామయ్యపంతులుగారును సప్రమాణముగ ఖండించియున్నారు.

ఇప్పుడు శ్రీబ్రహ్మయ్యశాస్త్రిగారీశాసనమునుగుఱించిన వాదరంగమున మూఁడవ కుస్తీపట్టునకు లేచిరి. ఱఅను పురాతనాక్షర మీశాసనమునందుఁ గలదని తేలెనేని దానికిఁ బురాతనత్వము వచ్చునేమోయన్న శ్రీబ్రహ్మయ్యగారి భీతియే యీలేఖకుఁ గారణము.

ఇట్లు బ్రహ్మయ్యగారికిని, ఈశాసనమునకునుగల పూర్వానుబంధము దెలిసికొని ప్రస్తుత మనుసరింతము.

మూలవాదమునకుఁ బ్రారంభింపకపూర్వము శ్రీ బ్రహ్మయ్యగారిచే నవలంబింపఁబడిన రెండు ప్రబలములయిన వస్తువిపర్యాసములను వెల్లడిచేసి చూపవలెను. వారి వ్యాసమంతయు వీనిపై నాధారపడియున్నందున వానిని మొదటఁజూపుట యావశ్యకము. ఇట్టి పొరఁబాటులను వారెట్లు చేసిరో తెలియదు.

రెండుప్రబలమయిన వస్తువిపర్యాసములు.

ఒకటవ వస్తువిపర్యాసము.

ఱ అను నక్షరమును నిడిన కన్ని శాసనములలోను బూర్వలిపిజ్ఞులందరును 'డ' అని చదువుచువచ్చిరనియు, దానిని శ్రీలక్ష్మణరావుగారు మాత్రము ఱ అని చదివిరనియు వ్యాసమునందంతటను బ్రహ్మయ్యశాస్త్రిగారు మరలమరల వ్రాసియున్నారు. ఉద్దేశమేమనఁ బూర్వలిపిజ్ఞు (Epigraphists) లెవ్వరును శ్రీ లక్ష్మణరావుగారి కనుకూలురుకారు, శ్రీరామయ్యగారికే యనుకూలురు, అని చదువరులకు సూచించుట—ఇది నిజముకాదు, కేవలము రామయ్యగారు, వేణుగోపాలచెట్టిగారు* తప్ప మఱియందఱు పూర్వలిపిజ్ఞులును, ఈయక్షరమును బూర్వపశ్చిమ చాళుక్యరాజుల శాసనములలోనన్నింటిలోను ఱ అనియే చదివిరి గాని, 'డ'అని యెవరును చదివియుండలేదు. అట్లు తజ్జ్ఞులచేఁ జదువఁబడిన కొన్ని శాసనముల నిందు నుదాహరించుచున్నాను:—

(1) Ep. Ind. V p. 118 l. 25 బోటిమనామ.

(2) Ep. Ind. XI p. 337 బోఱు, ఏఱు.

(3) Do. p.345 l. 1 బోఱు, l. 8 ఏఱు.

(4) Ep. Ind. VII p. 177 l. 35 ధఱగం, l. 37 బోఱపం.

(5) Ep. Ind. IX p. 317 l. 11 పఱకివిషయ.

(6) S. S, 1. I p. 44 l. 15 తాఱపరాజా.

(7) Ep. Ind. V p. 134 మేఱాంబా.

---

* వీరు పురాతనశాసనములను ఆధునికాంధ్రలిపితో వ్రాసినందునను, ఆధునికాంధ్రలిపిలో 'ఱ'అను నక్షరము లేనందునను దీనిని 'డ'అని వ్రాసిరో, లేక యాకాలమందు 'ఱ'కు'డ'అను నుచ్చారణయుండెనన్న యభిప్రాయముతో డనట్లువ్రాసిరో చెప్పలేము. ఎన్నియోశాసనముల పటముల నీయక యీశాసనములపటములను మఱికొన్నిశాసనముల పటములను నిచ్చిరి. కారణ మేమో? ఎట్లయినను చెట్టిగారు రామయ్యగారియభిప్రాయముగలవారేయని యనుకొందము.

(8) S. 1. 1. I. p. 36. l. 45 కాఴకకంపఇతి.

(9) Ep. Ind. V. Masulipatam plates of Amma I l. 32 తాఴుగొమ్మి.

ఆంధ్రదేశములందలి శాసనములె యిచ్చినాను. శాలివాహనశకమందలి పదవశతాబ్దమునకుఁ బూర్వమున్నవానినే యుదాహరించితిని. ఒకటిరెండు తప్ప యివన్నియు శ్రీలక్ష్మణరావుగారిచే నుదాహరింపఁబడినవియే. ఈశాసనములను జదివి ప్రకటించిన పండితులు సామాన్యులుకారు. దక్షిణదేశమునకు సంబంధించిన పూర్వలిపిశాస్త్రమును (Epigraphy) అభిమానశాస్త్రముగ నభ్యసించినవారు. ప్రభుత్వమువారి పూర్వలిపిశాస్త్రశాఖలో ముఖ్యాధికారులును, మహామహోపాధ్యాయులును నగు హుల్‌షు, కీల్‌హార్న్, వెంకయ్యగారు, కృష్ణశాస్త్రిగారు, రైస్ మొదలైనశాస్త్రజ్ఞులు. ఇట్టివారందఱును నెన్నఁడును 'డ'అని చదువక, యెల్లప్పుడును ఴయనియె చదువుచుండ శ్రీబ్రహ్మయ్యగారు "ఇట్టివ్రాఁత శాసనములం దక్కడక్కడఁ గాన్పించుచుండుట కలదుగాని పూర్వలిపిజ్ఞులు 'డ'యని చదువుచువచ్చిరి. పాశ్చాత్యపండితులును మనపండితులును 'డ'గ నుచ్చరించుచువచ్చిన యీ (ఴ) యక్కరమును శ్రీలక్ష్మణరావుగారు క్రొత్తగ ఴగా నుచ్చరించుటకుఁ దగినకారణము కాన్పింపదు" అని వ్రాయుట యాధారశూన్యము.

ఇఁక రెండవ వస్తువిపర్యాసము.

"ఈ రూపము కన్నడములో లేదు గదా ఇఁక దీనిని ఴకారముయొక్క ప్రతిరూపముగా వీరెట్లుగ్రహించిరో!" ఈయొక్క వాక్యమునందు నెన్నియసత్యము లిమిడియున్నవో చూడుఁడు. ఈరూపము అనఁగా రెండుసున్నలుకలిసి ఴకారమైనరూపము కన్నడమున లేదన్నది యొక యసత్యము. ఇట్లు కన్నడమున లేనియక్షరమునుగూడ బలవంతముగఁ దెలుగునఁ దెచ్చిపెట్టిరన్నయారోపణము రెండవయసత్యము. ఇందుకు నాశ్చర్యవాచకచిహ్నమును (!) కూడ నుపయోగించిరి. 'ఈరూపము కన్నడములో లేదుగదా' అని వ్రాయుటకుఁ బూర్వ మెవ్వరినైన నడుగవలదా? తమకుఁ దెలియనివిషయమన్యుల నడుగుట తప్పా? ఇట్టి రూపము కన్నడమున నున్నది. దానిని పండితులు ఴ అనియే చదివిరి. అనేకోదాహరణము లీయవచ్చును. కాని బ్రహ్మయ్యగారు చూడనిగ్రంథమునుండి చూపిన నేమి ప్రయోజనము? కావున వారు చూచినట్టు వ్రాసిన బర్నెల్‌యొక్క పెలీయాగ్రఫీ గ్రంథమందలి ౨౬-వ పట

ముఁ జూడనగును. అందు ''శకనృపకాలాతీతసంవత్సరంగళ్ ఏఴ్ నూఱేరిప్పత్తాఱ నేయ" అనువాక్యమందలి ఱకారము సరిగ రెండుసున్నలుకలిసి శ్రీ బ్రహ్మాయ్యగారాక్షేపించిన తెలుఁగుశాసనములోని దానివలెనే యుండుటయేగాక బండి ఱ కూడ నా రెండుసున్నలకునడుమ నడ్డుగీటుగీయగా సిద్ధించినది. బర్నెల్ కూడ ఆయక్షరములను ఴ అనియే, ఱ అనియే చదివినాఁడు. అయినను శ్రీలక్ష్మణరావు గారిని 'తేలిపోయిర'ని వికటహాస్యముచేసిన బ్రహ్మాయ్యగారిట్లు ప్రబలాసత్య పంకములో మునిఁగిపోయినందుకుఁ జింతిల్లుచున్నాను.

ఇట్లు బ్రహ్మాయ్యగారి వాదమందలి యీ రెండు వస్తువిపర్యాసములు వెల్లడియైనతోడనే వారి వాదమంతయు నిరాధారమైన దనియు, వస్తువిపర్యాసములతోను హేత్వాభాసములతోను గూడుకొనినదనియు స్పష్టపడుచున్నది.

నాలుగు అద్భుత హేత్వాభాసములు.

ఴ అనువర్ణము పూర్వపు తెలుఁగులో నుండియుండదనుటకు వీరిచ్చిన హేతువులలో నీక్రిందినాలుగు హేతువులు కాన వచ్చుచున్నవి:—

1. తెనుఁగు తేనెవంటిది గనుక ఴవంటి 'వింత' వర్ణమందుండనోపదు!

2. ఇప్పటిభాషలో లేదు గనుక పూర్వ మున్నదని యనఁగూడదు!

3. ఇప్పటికాలపు తెలుఁగువారీ యుచ్చారణను జూపవలసి వచ్చినప్పుడు అఱవమునందలి ఴఅను నక్షరమును వ్రాయుదురు. కావునఁ బూర్వము కన్నడమందలి ఱ వాడుకలోనుండెనని యనఁగూడదు.

4. పూర్వలాక్షణికు లెన్నఁడును నున్నదని చెప్పలేదుగనుక నున్నదని యనఁగూడదు.

వీనిలో మొదటి మూఁడును కేవలబాలిశహేతువు లనుట స్పష్టము.

1. 'వింత'యన నేమి? ఇప్పటి తెలుఁగువారికి నపరిచితము అని. ఇంత మాత్రముచేత నీయుచ్చారణయెడఁ గర్కశత్వ మేర్పడునా? ళకారమునకు, బండి ఱాకు లేని కర్కశత్వము దీని కెట్లారోపింపవచ్చును? కేవలాసూయచేఁ దమకుఁ దెలియని పరులభాషను వర్ణోచ్చారణను నిందించిన నది హేతువగునా? సంస్కృత మందలి ఠకారఢకారంబులు తెలుఁగు తేనెలోఁగలిసిపోఁగా సంగీతమునకుఁ బ్రఖ్యాతిఁజెందిన కన్నడమందలి ఱ (ఴ)కారము తెలుఁగువారిగొంతులో నడ్డు పడునా? అట్లుచెప్పుట యొకయుక్తియా?

2. ఇప్పుడు లేదు గనుక నెప్పుడును లేదఁట. ఈభావము బ్రహ్మాయ్యగారి

వ్యాసమునంతటను నిండియున్నది. ఈవింతవిపరీతవాదమే నిజమైనయెడల నేఁటికన్నడమునందు ఱకారము లేదు ఱ లేదు, కావునఁ బూర్వమెన్నఁడును లేవు అని చెప్పవలసియుండును. ఇది యనుభవమునకును శాస్త్రమునకును విరుద్ధము గదా!

3. నేఁటి సీతారామాచార్యులవారు, నేఁటి తెలుఁగున ఴఉచ్చారణగల గుర్తు లేనందున, దానిని సూచించుటకు నఱవమందలి యక్షరమునె వాడినంత మాత్రమున ౧౨-వ శతాబ్దమునకుఁ బూర్వముకూడఁ దెలుఁగులో నీయుచ్చారణ కావలసివచ్చినప్పుడు, అఱవయక్షరమునే వాడుచుండిరి, వేరుగుర్తులేక యుండెను, అని వాదించుట యేతర్కశాస్త్రమో, మీమాంసయో మే మెఱుంగము. ఱ అనుగుర్తు భాషనుండి ౧౨, ౧౩-వ శతాబ్దమునుండియే లోపించినప్పుడు, నేఁటివా రాగుర్తు నుపయోగించుట యెట్లుసంభవించును?

4. నాల్గవది మొదట హేతువుగఁ గాన్పించునుగాని కొంచెము విచారించినయెడల నది హేత్వాభాసమని తెలియఁగలదు. లక్షణవేత్తలు దీనిఁ జేర్పరైన లేఁదట. ఏ లక్షణవేత్తలు? ౧౩-వ శతాబ్దమునకుఁ బూర్వపువారా? తరువాతి వారా? తరువాత నీయక్షరమే భాషనుండి లోపించినపుడు, తరువాతి లాక్షణికులు చెప్పకపోవుట సహజముకదా?

అంతకుఁ బూర్వపులాక్షణికులు చెప్పలేదందురా? వారెవరు? కేతన యొక్కఁడే. అతఁడు తన 'ఆంధ్రభాషాభూషణము' నందు, ఆంధ్రాక్షరముల వివరము వేఱుగఁ జెప్పనేలేదు. సంస్కృతవర్ణములే చెప్పెను. గాన ఱ నుగుఱించి మాత్రము చెప్పలేదనుటకు వీలులేదు.

నన్నయభట్టకృతమనఁబడు నాంధ్రశబ్దచింతామణిలోఁ జెప్పఁబడియుండ లేదందురేమో. ఆగ్రంథముయొక్క కర్తృత్వమును గుఱించియుఁ, గాలమును గుఱించియుఁ శ్రీవీరేశలింగము పంతులుగారు ప్రబలమైనపూర్వపక్షము చేసియున్నారు. దాని నెవరును సప్రమాణముగ నేఁటివఱకు ఖండించియుండలేదు. వీరేశలింగముగారి వాదమే నేఁడు సిద్ధాంతముగ నున్నది. కావున నాగ్రంథమును బ్రమాణముగ నిచ్చి యేమిప్రయోజనము? ఆమతము మాకు సమ్మతము కాదు. పూర్వమతమునే యంగీకరింతు మని శ్రీబ్రహ్మయ్యగా రందురేమో. అనవచ్చును. అభ్యంతరము లేదు. అట్లయినను బ్రతిపక్షు లొప్పని గ్రంథమునుండి ప్రమాణము చూపిన నేమిలాభము? సామానాధికరణ్యములేనిది వాదమెట్లు జరుగును? చింతామణిలో లేదు గాన నా కాలపు భాషలో ఴ లేదని మీరన్నయె

డల, శిలాక్షరములతో వ్రాయఁబడిన ఱకారమును చింతామణి చెప్పలేదు గాన నాగ్రంథ మప్పటిది గాదు, ఇటీవలది యని వారందరు. ఇట్లు బ్రహ్మయ్య గారు లాక్షణికుల పంచఁజేరుటవలన వారికిఁ గలుగు లాభ మేమియులేదు.

వారి విచిత్రయుక్తివాదము.

ఇట్లు బ్రహ్మయ్యగారి వాదమందలి మూలప్రమేయములు నిలువఁదగి నవికా వని చూపి యిఁక వారి విచిత్రయుక్తివాదముఁ బరిశీలింతము.

సమకాలికములైన కన్నడశాసనములలో ఴ అను నుచ్చారణను జూపు ఱ అను నక్షరమొకటి లక్ష్మణరావుగారు యుద్ధమల్లుని శాసనమునఁ గాంచిరి. మఱి శోధించి యితరశాసనములలోఁ గూడ నున్నట్లు కనుఁగొనిరి. దానిని శ్రీరామయ్యగారు 'డ'అని చదివినందున యుద్ధమల్లునిశాసనమునందే 'డ'అని యందఱును నొప్పుకొను మఱియొకయక్షరము పెక్కుపర్యాయములు వచ్చినదని చూపి, యదివే రిదివే రనిచెప్పిరి. దానికి నొప్పక బ్రహ్మయ్యగా రిట్లు లాక్షేపించిరి.

1. కన్నడములో నొకానొక యక్షర మొకవిధముగా నుచ్చరింపఁబడి నందునఁ దెలుఁగులో నదేవిధముగ నుచ్చరింపఁబడుచుండె ననఁగూడదు. ఇది ద్రవిడభాషాశాస్త్రజ్ఞులు వారివలనఁ గ్రొత్తగ నేర్చుకొనవలసిన విషయము. ఇప్పుడు హిందీమహారాష్ట్రభాషలు భిన్నములైనను, నొక్కనాగరలిపితో వ్రాయఁబడుచున్నట్లు, పూర్వకాలము. ఆంధ్రకర్ణాట భాషలొకలిపితోనే వ్రాయఁబడుచుండెను. కావుననే దీనికిఁ దజ్ఞులైనపండితులు "తెలుఁగుకన్నడలిపి" యన్నపేరు పెట్టిరి. ఈలిపి పశ్చిమచాళుక్యులు పూర్వచాళుక్యుల కొసంగిరా, పూర్వచాళుక్యులు పశ్చిమ చాళుక్యుల కొసంగిరా యన్నమాట, అనఁగాఁ గన్నడులయొద్దనుండి తెలుఁగువారు గ్రహించిరా. లేక తెలుఁగువారే కర్ణాటకుల కొసంగిరా యన్న మాట విచారణీయము. ఎట్లయిననేమి? ఈలిపి ౧౦వ శతాబ్దమువఱకు నొక్కటిగనేయుండి తరువాతఁ గొంతమాఱినది. ఈరెండును నచ్చువచ్చినతరువాత నింకను గొంచెమధికముగా మాఱినవి. అయిన నీయక్షరములపోలిక యిప్పటికిని ౧౦౦కి ౯౦వంతులు కలియుచునే యున్నది. ఈసంగతి యందఱకుఁ దెలిసినదే యని లక్ష్మణరావుగారు విడిగఁ జర్చింపక తమసిద్ధాంతమును మాత్రము తెల్పిరి. కాని బ్రహ్మయ్యగా రీసంగతి యెఱింగినవారైకూడ, "అఱవమునందలి 'ఴ'కారము తెలుఁగునందలి లకారపు పోల్లువలెనుండును. అంతమాత్రముచే మనము 'బ'ను 'డ'యనియు, !ల'ను 'ఴ'యనియు నుచ్చరింప వలసియుండునా?" మొద

లయిన యసంబద్ధయుక్తులువ్రాసి సంబంధములేని యఱవభాషలోని యక్షరములతోఁ దెలుఁగక్షరముల లక్షణరావుగారు పోల్చుచున్నారన్న దురభిప్రాయము చదువరులకుఁ గలుగునట్లును, ఆంధ్రకర్ణాటలిపుల పూర్వైక్యము వారికిఁ దోఁపకుండగను అదరగొండము చేసిరి.

౧౨వ శతాబ్దమునకుఁ బూర్వపు శాసనములలోని యాంధ్రకర్ణాటాక్షరము లొక్కటియే యని చెప్పవచ్చును. ఇందుకు దృష్టాంతము శాసనములే. దానినిగుఱించి యధికము వ్రాయ నక్కఱలేదు. కావునఁ గర్ణాటాక్షరముల యుచ్చారణ ననుసరించి యాకాలపు టాంధ్రాక్షరముల యుచ్చారణ నిర్ణయించుట సర్వశాస్త్రసమ్మతమైన పద్ధతి. ఇట్టి యుత్కృష్టమైన యుపమానప్రమాణమును నంగీకరింపనివారి నేమనవచ్చును.

ఇఁక బ్రహ్మయ్యగారి విపరీతవాదముఁ జూడుఁడు. ఈయక్షరమును శ్రీరామయ్యగారు 'డ'అని చదువఁగా నది 'డ'కాదనుటకు నీశాసనమునందే మఱియొక 'డ'కారము రమారమి ౩౦ పర్యాయములు వచ్చినది. అది వేఱుగను, ఇప్పటి డకారమునకుఁ బూర్వరూపముగను నున్నది. కావున దీనిని (ఱను) డకార మనుటకు వీలులేదు—ఏలయన నొకలేఖలోనే యొక యుచ్చారణకై లేఖకుఁడు రెం డక్షరముల నుపయోగించెననుట సమంజసము కాదు, అని వ్రాసిరి. దానికి శ్రీబ్రహ్మయ్యగారు "ఒకభాషలో నొకధ్వనిని దెల్పుటకు రెండు, మూఁడు సంజ్ఞలుండుటయును గలదు. లేఖకులు వానిని స్వేచ్ఛగా వాడుటయుఁ గలదు. కాని యొక్కదానినే పట్టుకొని ప్రాకులాడుట లేదు." అని జవా బొసంగిరి! ఒక్కయుచ్చారణకు నొకయక్షరమే యుండుట ప్రాకులాడుట కాదు. భాషావైభవమును, దాని యౌన్నత్యమును జూపుట. ఈకారణముచేతనే ఇంగ్లీషు వర్ణసమామ్నాయము లోపముకలది యనియు, హైందవవర్ణసమామ్నాయము లోపరహితమైనదియనియు ననిపించుకొనుచున్నది. అది యట్లుండనిండు.

ఒకశాసనమునం దొకయుచ్చారణకు నొకసంజ్ఞయే యుండు ననుకొనినఁగాని దానిని జదువుటకు వీలే యుండదు. ఒకధ్వనికి పెక్కక్షరము లుండు ననియు, నొక యక్షరమే పెక్కుధ్వనులను సూచించుననియు, జదువ మొదలిడినయెడల అనవస్థాప్రసంగము రాదా? 'డ'కారమునకే రెండు రూపము లున్న వనుకొన నేల? 'ల'అను నక్షరమునకు రెండురూపము లున్నవనుకొని 'లస్సి' 'అలిసిన' 'అలపుట' అనఁగూడదా? లేక యిది 'ణ'కారమున కన్యరూపమని 'ణస్సి' 'అణిసిన' అణపుటఅని చదువఁగూడదా? ఇట్టి శబ్దముల కర్థ

ములే దండుచేమో? ఇప్పు డక్షము లేసందుక ఇప్పు డక్షము లేదని యెట్లు చెప్ప వచ్చును? ‘ఴస్సి’ ఇప్పుడు సక్రమముగ నున్నదా? ‘లింగంబడిసిన’ అని యిప్పుడెవ రైనఁ బ్రయోగము చేయుదురా? పూర్వ బ్రహ్మయ్యగారి సంతవాదమునే గ్రహించితిమా, యనవస్థా ప్రసంగము ప్రాప్తించును. ఆకాలమునందే కన్నడ శాసనములలో ఴకు గాను వ్రాయఁబడిన ఱఅను నక్షరమును, తెలుఁగులో ‘డ’గ నెంచుటయెందుకు? అందుమూలకముగ శాసనములో రెండువిధము లయిన డకారము లున్నవన్న విపరీతవాద మెందుకు?

సరే వాదమునకై, లేఖకుఁడు స్వేచ్ఛగా రెండువిధములైన ‘డ’కారముల వాడె ననుకొందము. అట్లయిన ౩౦-చోట్ల నందఱు నొప్పుకొనునట్టి ‘డ’కారము వ్రాసి, మూఁడుచోట్ల మాత్రము వేఱు ‘ఴ’ఏల వ్రాసె? వాని స్వేచ్ఛయందురా? తథాస్తు. ఆమూఁటిలోను రెండు, అఱవమందును, కన్నడమందును నాకాలమునందు నదేయర్థమందు ఴకారయుతములైయున్న శబ్దములే యేల యగుట తటస్థించె? రెండు ‘డ’కారముల యుచ్చారణ యొకటియేయైనయెడల ‘అడిగిన’ ‘అడపుట’అను నొకధాతువుయొక్క రెండురూపములలో నొకటి యొక ‘డ’కారముతోను మఱియొకటి మఱియొక ‘డ’కారముతోను వ్రాయఁ గూడదా? ఒక్కయక్షరమే రెండింటిలోను నుండవలెనా? ఇదియు స్వేచ్ఛ-సహజము - కాకతాళీయన్యాయము (chance) అందురా?

ఈశబ్దమందలి ‘ఴ’కారము, ఇతర ‘డ’కారముకంటె భిన్నమైనదని పై హేతువులనుబట్టి, పక్షాభిమానరహితుఁ డెవఁడును నొప్పుకొనక తప్పదు. ఇంకను ఋజువుకావలెనన్న నితరములైన తెలుఁగుశాసనములందు నీయక్షర మేయేశబ్దములలో వచ్చినదో చూచినయెడల నిది ‘డ’ కాదని స్పష్టపడఁగలదు.

“ఴకారము రెండువిధముల వ్రాయుచుండిరి. లేఖకుని యిష్టమువచ్చినప్పుడు ఇది వ్రాయుచుండెను, లేనప్పుడు అది వ్రాయుచుండెను” అనువాదము చేయువారు, భిన్నశాసనములలో ఒకటేశబ్దము ‘ఱ’ అను ఴకారముతోడనే వ్రాయుట ఎట్లు సంభవించునో చెప్పెదరా? చూడుఁడు:—

(*a*) ఱస్సిఅనుశబ్దము యుద్ధమల్లుని శాసనములోఁ గలదు. దానిమూలము మనకింకను నితరద్రావిడభాషలలో దొరకలేదు. కాని యది ఴకారయుక్తమని చెప్పుటకు సంశయము లేదు. ఏల యన నెల్లూరుజిల్లాలోని తెలుఁగుశాసనములలో నది మూఁడుసారు లీరూపముతోడనే వచ్చినది.

(1) Nellore Inscriptions Vol. II. p. 676.

18 దీ [ని] ఱచ్చిన 21 ఱచ్చినపాపం
19 వానికిచకఱు 22 బగు. వ . .
20 శ్రీపర్వతంబు 23 ఘ్రాళుకొడ్డుకు.

(2) Nellore Inscriptions Vol. II. p. 606.

9 దీని (చె) ఱు(ఞ్చు) వారు(గో)ళినోటి(ఘా)ర(ణో)సిఱచినవారు.

ఇట్లు భిన్నస్థలమందలి యీమూఁడుశాసనములలో 'ఱయ్యు' ధాతువు యొక్క రూపము లీరెండవ 'డ'కార (ఱ) యుతములుగనే యేల యుండవలెను? ఇతరశబ్దము లితర 'డ'కారయుతములై యేల యుండవలెను? ఇది లేఖకులందఱి స్వేచ్ఛ కాఁబోలును! ఏమి యీ వింతస్వేచ్ఛ? ఏకనియమము ననుసరించునట్టి స్వేచ్ఛ!!

ఇంకొకవింత. పై నీయఁబడిన నెల్లూరుశాసనములోని మొదటిదాని ౨౩-వ పంక్తి చూడుఁడు. అందు ఱ, డ, ళ అను మూఁడక్షరములును గలవు. ఈమూఁడును భిన్నాక్షరములని యీ లేఖకుని మతమనుటకు నింతకంటె వేఱేమి కావలెను? స్వేచ్ఛయనఁగాఁ బిచ్చి కాదుగదా? ఒకపంక్తిలోనే ఒకేయుచ్చారణసూచించుటకుఁ బిచ్చివాఁడుతప్ప భిన్నాక్షరము లెవఁడు వ్రాయును? రెండవశాసనమందలి ౯-వ పంక్తిలోఁ గూడ నిట్లే యున్నది.

(2) పెక్కుశాసనములలో 'చోఱ' శబ్దము 'ఱ'కారయుతము. కొన్ని యుదాహరణములు:—

1. Ep. Ind. Vol. XI p. 337 చోఱ.
2. Do. p. 345 చోఱ.
3. Ep. Ind. Vol. VIII p. 177 చోఱపం.
4. Ep. Ind. Vol. VI p. 223 చోఱకాలశేఖరవిక్రమచోఱదేవర.

ఇట్లు భిన్నదేశభిన్నకాలముల శాసనములలో నొకటేయక్షరము వచ్చుటయు, నందుకుఁదగిన ట్లాకాలమందు చోళశబ్దము ఱకారయుక్తముగ నఱవవారిచేతను, కర్ణాటకులచేతను నుచ్చరింపఁబడుటయు, వ్రాయఁబడుటయు నన్న హేతువులను గలిపినయెడల నీయక్షరము మామూలు డ కాదనియు భిన్నోచ్చారణగల యక్షర మనియుఁ దేటతెల్లమగును. కర్ణాటకులు 'చోళ' శబ్దము 'చోఱ' అనివ్రాయుచుండిరనుటకు దృష్టాంతము కావలయునన్న Ep. Ind. Vol. V p. 205 రాజేంద్రచోఱబ్రహ్మాశూరాయర్ మారాజవాడి ఏఱుసావిర.'

(3) ఇట్లే 'ఏఱు' (ఏడు) శబ్దము పెక్కుశాసనములలోఁ గానవచ్చు చున్నది:—

1. Ep. Ind. Vol XI p. 337 ఏఱు.

2. Ep. Ind. Vol. XI p 345 ఏఱు,

3. Ep.Rep. 333 of 1897.

ఇంద్రకీలశాసనము—పరిషత్పత్రిక VII p. 4 పరిపేటఱుకేణ్ణ.

కన్నడములో 'ఏఱు' అని వ్రాయుచుండిరని చూపుట కెన్నియో శాసనములు కలవు గాని వాని నుదాహరించుట యనావశ్యకము.

ఇట్లు భిన్నదేశములలోను, భిన్నకాలములలోను జెక్కఁబడిన శాసనములలో నొకేశబ్దమునందు 'ఱ' కారము వ్రాయఁబడుటవలన నది స్వేచ్ఛయను టకు వీలులేదు. అది 'డ' కారాభిన్నమైన స్వతంత్రోచ్చారణగల యక్షరమనక తప్పదు. పై కారణములనుబట్టి చూడఁగా రమారమి ౧౨-వ శతాబ్దమువఱకును ఱ్ఱ అనుధ్వని యఱవకర్ణాటాంధ్రమళయాళభాషలలో నుండెననియుఁ, దరువాత నది మొదట తెనుఁగుదేశమునను, పిదప గర్ణాటదేశమునను బ్రథమము ధ్వనియు, తరువాత నక్షరమును లోపించెననియుఁ దేటతెల్లమగుచున్నది

మఱియొక యుక్తి.

ధర్మయుద్ధమునందు గెలువలేమని యెఱింగి శ్రీ బ్రహ్మయ్యగారు, అసలు వాదమునకు సంబంధములేని, యఱవమందలి రూపములు మొదలా, తెలుఁగునందలి రూపములు మొదలా యన్న వాదమును గల్పించుకొని కొంత వాదించిరి. ఉద్దేశ్యమే మన, నఱవమునుండి తెలుఁగు పుట్టినదని శ్రీయుత లక్ష్మణరావుగారు చెప్పుచున్నా రని చదువరులకుఁ దోఁచునట్లు నటించి, యందువల్ల వారికిఁ గోపమువచ్చునట్లుచేసి, యా కోపమును దమ వాదమునకు సాయముగఁ దీసికొనుట. అఱవమునుండి తెనుఁగు పుట్టలేదు. తెనుఁగునుండి యఱవమును బుట్టలేదు. రెండును మఱియొక మాతృభాషనుండి పుట్టినవి. మూలమాతృభాషలోని పురాతనరూపములు కొన్ని యఱవములోను గొన్ని తెలుఁగులోను నుండిపోయినవి. కావున నా వాదమిచ్చటఁ గేవల మప్రస్తుతము.

ఇచ్చటఁ బ్రసుతవిషయ మేమన మొదలు ౧౨-వ శతాబ్దమువఱకు 'అడుపు' 'చోళ' 'ఏడు' మొదలయిన శబ్దంబులు, అఱవకన్నడదేశములలో నె ట్లుచ్చరింపఁబడుచుండెఁ? ఎట్లు లిఖింపఁబడుచుండెఁ? అట్లే తెలుఁగులిపిన (అనఁగా నప్పుడు తెలుఁగుదేశమునకుఁ, గన్నడదేశమునకు సామాన్యమైన

తెలుఁగు కన్నడ లిపిని) వ్రాయఁబడుచుండెనేని తెలుఁగుదేశమందును నా శబ్దములట్లే యాకాలమం దుచ్చరింపఁబడుచుండె నని నిశ్చయింపవలెను. ఆ శబ్దములయొక్క మూలరూప మెద్దియైన నేమి?

ఇట్లగుటచే 'చోటు' శబ్దముయొక్క మూలరూపము 'చోడ'నా? 'చోళ' నా యన్న వాద మనావశ్యకము. అయినను నమువిషయముకాని యిట్టి వ్యుత్పత్తిశాస్త్రమునందుదిగి బ్రహ్మయ్యగా రెట్లు హాస్యాస్పదులైరో చూతము. 'కుక్కుట' శబ్దములోనుండి 'కోడి' పుట్టినదఁట! ఇంకను బ్రహ్మయ్యగారు కృతయుగమునాఁటి వ్యుత్పత్తులనే పట్టుకొని పెనఁగులాడుచున్నారు. ఈ రెండుశబ్దములకును నొక్క 'క్' కారము పొల్లు దప్ప వేఱేమియు సమానము లేదు. 'కుక్కుట'మునందు మూఁ డక్షరములు 'కోడి' యందు రెండు. సంస్కృతపదము అకారాంతము, తెలుగుపదము 'ఇ'కారాంతము. కుక్కుటశబ్దము కోడి యగుటకుఁ బూర్వము 'కుట' 'కుడ' 'కుడి' ఇత్యాది వికారములను నానాకాలములందుఁ జెందియుండవలయును గదా! వానిని వీ రెచ్చటనైనఁ జూపఁగలరా? అట్లుచేయక యందొకపొల్లు, ఇందొకపొల్లు కలిసినంతమాత్రమున, నందుండి యిది పుట్టినది యని యన్నయెడల నెందుండి యేమి పుట్టనేరదు? కోడినుండియే 'కుక్కుట' మేల పుట్టియుండఁగూడదు. సమానప్రతికక్షుగల యిట్టి యుక్తులవలన నేమిప్రయోజనము?

తెనుఁగునందలి 'కోడి'శబ్ద మెందుండి పుట్టిన దని విచారింపఁగా, దీనికి సమానార్థకముగ సంస్కృతమునఁ గుక్కుటశబ్దము, అఱవమున కోழி శబ్దము కలవు. వీనిలోఁ దెనుఁగునందలి 'కోడి' శబ్దమునకు సన్నిహితమైనది యేది యని విచారించినయెడల 'కుక్కుట'కంటె 'కోழி' ఎక్కువసన్నిహితమని యేపిల్లవాఁడైనను జెప్పగలఁడు. ఎందుండి యేది పుట్టినదన్న ప్రశ్న యటుండనిండు.

తెనుఁగులోని 'కోడి' శబ్దము కోழி శబ్దమే యనుటకు మఱియొక ప్రబల ప్రమాణము గలదు. 'కోడి'శబ్దముయొక్క బహువచనము 'కోళ్లు', కోడులు కాదు. కావున నీ బహువచనమునకు మూలమైన యేకవచనము 'కోళి' లేక 'కోழி' అయి యుండవలెను. తెనుఁగున బహువచన మట్లే యుండిపోయినది, ఏకవచనోచ్చారణము మాత్రము మాఱినది. ఇఁక మూలమైన యేకవచనము, అఱవమున నిప్పుడున్నట్లును, గన్నడమున నొకప్పుడున్నట్లును, కోழி యనునదా? లేక యిప్పుడు కన్నడమున నున్నట్లు 'కోళి' యనునదా? 'ళ'కారము తెనుఁగున డకారముగా మాఱిన యుదాహరణములు కానరావు. కావున 'ఴ'కారమే సా

మాన్యనియమము ననుసరించి తెనుఁగున ‘ఴ’కారము ‘డ’గ మాఱియుండవలెను. బహువచనమునందలి ఴకారము సంయుక్తాక్షరయుతము కావున, నచ్చట ‘ళ’ కారోచ్చారణయే స్పష్టము, సుకరము. కాన నదియే నిల్చినది. కావున ‘కోఴి’శబ్దముయొక్క పూర్వచరిత్రమును జూడఁగాఁ బూర్వము తెలుఁగున నితర ద్రావిడభాషలతోఁ బాటు ‘ఴ’ అను నక్షరమున్నట్లు సిద్ధమగుచున్నది. ‘ఏఴు’ (ఏడు)శబ్దమునుగుఱించి యిట్లే యేమేమో వ్రాసి, “ఏడు (తెనుఁగులోనున్నట్లు) మొదటిరూపమో, ఏళు (కన్నడమునను న్నట్లు) ప్రథమరూపమో ఏఴ్ (అఱవమునను న్నట్లు) ఆద్యరూపమో యెవరు చెప్పఁగలరు” అని సంశయాత్ములైరి. ముప్పదినలువదిసంవత్సరములకుఁ బూర్వముగల ద్రావిడభాషాజ్ఞానముఁ బట్టి వ్రాసిన కాల్డువెల్లే శరణముగఁగలవారికి నిట్టి కింకర్తవ్యతావిమూఢత సహజమే గాని, స్వయముగ నాలోచింపఁగలవారికి నీప్రశ్నలజవాబు కనుఁగొనుట కఠినముకాదు. ‘ఏడు’శబ్దమునకు బహువచనమేమి? ‘ఏడేళ్లునలభైతొమ్మిది’అని బ్రహ్మయ్యగారెప్పుడైన నెక్కములనేర్చిరా? బహువచనము ‘ఏళ్లు’అని కనఁబడుచున్నప్పుడు ‘ఏళు’ ‘ఏడు’కంటెఁ బురాతన మనుట స్పష్టము. కన్నడ శాసనములందుఁ ‘ఏళు’కంటె ‘ఏఴు’ పురాతనము. ఇఁక సంశయ మెక్కడ నున్నది?

‘చోఴ’శబ్దమునుగుఱించియు నిట్లే. అందును కాల్డువెల్లుగారె వీరికిఁ బరమప్రమాణము. ఆ దొరగారు ‘చోడ’శబ్దము సంస్కృతమన్నారఁట. అశోక శాసనములో ‘చోడ’అని యున్నదఁట.* అందుచే చోళులు తమపేరు, తమ దేశముపేరు, నెట్లు చెప్పుకొనుచుండిరో, వ్రాసికొనుచుండిరో, వ్యవహరించుకొనుచుండిరో యది మూలశబ్దము కాదఁట. వేలమైళ్లమీఁదనున్న పరరాజు వారిపేరెట్లువ్రాసెనో యది సిసలఁట!

‘చోఴ’శబ్దము తెనుఁగున నొకప్పుడు ‘డ’యుతముగను, మఱియొకప్పుడు ‘ళ’యుతముగను, నుండుటయే యిది మొదట ఴకారయుతమని చాటుచున్నది.

ఴకారమునకు ‘డ’కారోచ్చారణము కలదు, ళకారోచ్చారణము కలదు. అందువలననే ఴకారము కన్నడమున ‘ళ’ గను తెలుఁగున ‘డ’ గను మాఱుట సంభవించెను.

---

* వీరు తమ నన్నయభట్టారకచారిత్రమునందు, అశోకుని శాసనమునందు, ఆంధ్రదేశపు పేరేలేదనిరి. ఇందువలన నిట్టివిషయములలో వీరు చెప్పుసంగతు లెంత విశ్వసనీయములో చదువరులు తెలిసికొనఁగలరు.

డకారరూపవిచారములోని వస్తువిపర్యాసములు.

శ్రీ బ్రహ్మయ్యగారు పురాతనలిపులలో 'డ'కార మెట్లుండెనన్న విచార మొకటి చేసినట్లు నటించి పూర్వశాసనములలో 'డ'కారము 'ఌ' అనురూపముతో వ్రాయఁబడుచుండెను, అని తెల్పఁ బ్రయత్నించిరి. ఈయత్నమంతయు వస్తువిపర్యాసములతో నింపిరి. శాసనములలో లేనిరూపము లున్నవనిచెప్పి మాట నిల్పుకొనిరి. చూడుఁడు.

1. నందంపూడి శాసనమందు యుద్ధమల్లుని బెజవాడశాసనమందలి ఌకారమునంటి యక్షరము 'డ'కారమునకై వాడఁబడినదని చదువరులను నమ్మింపవలెనని యిట్లు వ్రాసిరి:—"నందంపూడి శాసనములో ౬౦-వ పంక్తిలో 'చూడామణిః' అనుపదమునంగల 'డా'యనుధ్వనిని దెల్పునక్కరము 'ఌా'గా జెక్కింపఁబడియున్నది"!!! పాపము శమించుఁగాక. నందంపూడిశాసనమందలి ౬౦-వ పంక్తిలోని 'చూడామణి' శబ్దమందలి 'డా'కును యుద్ధమల్లుని శాసనమందలి 'ఌా'కును నెట్టిసంబంధము లేదనియు, నందంపూడిశాసనమందలి అన్ని 'డా'లతో పాటిదే యిదియనియు, నిది యిప్పటి యచ్చుడాను బోలియుండు ననియు నొక్కి చెప్పుచున్నాను. వలయువారు నందంపూడిశాసనముఁ జూడనగును. [ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక సంచి. ౧, సంపు. ౧] నందంపూడిశాసనమందలి ౬౦-వ పంక్తిలోని 'డ'కారమునకుఁగాని మఱియే 'డ'కారమునకుఁగాని యెడమవైపున సున్నలేదు. ఇంతియకాదు. అటునైపులైను నిలువుగనుండి దానిమీఁదనే తలకట్టుగాని, దీర్ఘముగాని, గుడిగాని యీయఁబడును. ఇప్పు డచ్చులోనున్న 'డ'కారముకూడ నిట్టిదే. ఌకు నీయక్షరమునకు నేవిధమైన సామ్యము లేనప్పు, డీరెంటికి నైక్యము కల్పించుట సాహసమని వేరుగఁ జెప్పవలెనా?

2. అట్లే "౬౮-వ పంక్తిలో 'క్రీడయా' అనుదానిలో డకారము 'ఌ'గా వ్రాయఁబడియున్నది" అనివ్రాసి యొక్కయక్కరముపటముఁ జెక్కించి వేసిరి. ఇదియు మూలములో నొకవిధముగనుండగాఁ బటములో మఱియొకవిధముగ బ్రహ్మయ్యగారివాదమునకు ననుకూలముగఁ జూపఁబడినదని జెప్పవలసివచ్చినందునకు నెంతయుఁ జింతిల్లుచున్నాను. ఇందునుగుఱించియు నందంపూడిశాసన పటమును జదువరులు చూచెదరని కోరుచున్నాను. ౬౮-వ పంక్తిలోని 'క్రీడయా' లోని 'డ'కారముమీఁది తలకట్టు, అక్షరముయొక్క యెడమవైపు నిలువుగీటుమీఁద, దానికిఁ, గలిసి కొని తగిలి మామూలు తలకట్టువలె నుండగా నీ పటములో నది యిటులేక, యటులేక మధ్యవ్రేలాడుచున్నట్టు చూపిరి. ఈ 'డ'

'కారము హెచ్చుతక్కువగ, అచ్చుక కారమును బోలియుండఁగా నీపటమున నతి వికారముగఁ జూపఁబడినది. ఇంకెన్నియో భేదములు కలవు.

3. ఈశ్వరభట్టుశాసనములోని 'గుముకూరు' అనుశబ్దమందలి 'కూ' కును, బ్రహ్మయ్యగారిచే నుదాహరింపఁబడిన యక్షరమునకును బోలికలేదు. బ్రహ్మయ్యగారు మూలమందున్న తలకట్టునెగురఁగొట్టిరి! ఉద్దేశమేమి? యుద్ధమల్లునిశాసనమందలి యక్షరమువంటి యక్షరమిచ్చుట 'జ'గనున్నదని తెల్పుట!

ఇక్లే యింకనుజూడుఁడు.—ఈశ్వరభట్టుశాసనమునం దక్షరములను యుద్ధమల్లునిశాసనాక్షరములను బోల్చుటకుఁ బూర్వము రెండుశాసనములు భిన్నకాలములవి యని తెల్పవలసియుండెను. "యుద్ధమల్లశాసనముగల జాతి మీఁదనే చెక్కఁబడియున్న యీశ్వరభట్టసోమయాజుల శాసనములో" అని వ్రాసి యీరెండుశాసనము లేకకాలపువి యన్నట్లు చదువరులకుఁ గొంతసంశయము కలుగునట్లుచేసిరి. యుద్ధమల్లునిశాసనము కాలమునుగుఱించి బ్రహ్మయ్యగారికి సంశయమున్నను నీశ్వరభట్టశాసనములోనే శకమున్నందున దాని నైనను వారు పేర్కొన నక్కఱలేదా? భట్టుశాసనము శా. శ. ౧౦౮౭ నాఁటిది. ఒకజాతిమీఁదనున్న యీరెండు శాసనములలోని యక్షరములు చూచువారికి యుద్ధమల్లునిశాసనము భట్టుశాసనముకంటె నెన్నియోవందలయేండ్లు పూర్వపుది యని తోఁపకమానదు. యుద్ధమల్లునిశాసనమునందలి యక్షరము లిప్పుడు సామాన్యజనుల కేమియుఁ దెలియవు. ఆశాసనమును బాగుగఁ జదువుటకు శ్రీరామయ్యగారివంటివారికినిగూడ ౫ - ౬ సంవత్సరములు పట్టెను. ఇఁక భట్టశాసనమో! అందలి సగముకంటె నెక్కుడక్షరములు సామాన్యజను లిప్పుడు చదువఁగలరు. కావున నీరెండుశాసనములకును ౨ - 3 వందల యంతర ముండవలయునని సహజముగ నూహింపవచ్చును.

ఇట్లు భిన్నకాలములందలి శాసనములలోని యక్షరములను, నా శాసనముల కాలముఁదెల్పక, పోల్చుట యేమిన్యాయము? భిన్నకాలములందలి యక్షరములు భిన్నముగానుండుననియు మాఱుచుండుననియు వీరెఱుంగరా? సరె యది యట్లుండె. ఇంతభిన్నకాలముల శాసనముల-వానికాలము తెల్పక—పోల్చినను యుద్ధమల్లుని శాసనమందలి టవంటియక్షర మొక్కటియైనను భట్టశాసనమందుఁ జూపఁగల్గిరా? లేదు. టఅను నక్షరమువంటి దానిమీఁదఁ దలకట్టు కల యక్షరమొకటి భట్టశాసనములో నున్నదఁట. అదియే యుద్ధమల్లుని శాసనమందలి టఅని అనుకొనవలెనఁట!

ఇఁక నీ 'ఱ' అను నక్షరచరిత్రమును జూతమా, యిది. శా. శ. ౧౨వ శతాబ్దమునఱకుఁ దెలుఁగు శాసనములలో ఴ అను నుచ్చారణములతోడనే యుండెను. అది దేశ్యశబ్దములలోను మాత్రము, అఱవమందు ఴ ధ్వనిగలశబ్దములలో మాత్రము వచ్చుటవలన మన మిట్లూహింపవచ్చును. ఇట్టియక్షరము మీఁదనే తలకట్టు లిచ్చినయెడల 'డ' కారోచ్చారణయగుట ౧౦వ శతాబ్దపు తదనంతరము గానవచ్చుచున్నది. కాని యది 'ఱ' కాదు, 'డ' కారమే. ఏలయన. ఒక్క శాసనమునందే 'ఱ' కార 'డ' కారములు భిన్నములుగాఁ గానవచ్చుచున్నవి. ఆకాలమునందలి కన్నడశాసనములలోఁగూడఁ దలకట్టుగల యక్షరము 'డ' కారముగను, తలకట్టులేని యక్షరము ఴ కారముగాను, వాడఁబడియుండుట వలన నివి రెండును భిన్నములనుట స్పష్టము. 'డ' కారమునకు నొకప్పుడు తలకట్టు కుడివైపుననుండుటయు, నొకప్పు డెడమవైపున నుండుటయుఁగూడఁ గలదు. ఎడమవైపు తలకట్టుకలది యిప్పటి యచ్చు 'డ' కారము. కుడివైపు తలకట్టు కలది యిప్పుడు నైజాము దేశమునందు వ్రాయఁబడు 'డ' కారమువంటిది. సాధారణముగ 'డ' కారమునకు నెడమవైపు గీటుపైని నున్నయుండక కేవలము నిలువుగీఁటే యుండును. ౧౩వ శతాబ్దమువఱకు నీయుచ్చారణ తెలుఁగుదేశమున లోపించినది. త్వరలోనే యీయక్షరముకూడ లోపించినది. ఈసంధి కాలములలో, ననఁగా నుచ్చారణలోపించి యక్షరము లోపింపనికాలములలో నెప్పుడైన నిది 'డ' కారమునకుఁ బదులుగ వాడఁబడిన వాడఁబడి యుండవచ్చును. రమారమి యీకాలమువఱకే కన్నడమునుండియు నీయక్షరమును, నీయుచ్చారణయు లోపించినదనుటయు మనము జ్ఞాపకముంచుకొనవలయును. కావున ౧౦వ శతాబ్దమునకుఁ బూర్వము లేనట్టిదియు, తరువాతనైనను స్వతంత్రాక్షరముగ నున్నట్టిదియునగు తలకట్టు 'డ' కారమును ౧౦వ శతాబ్దమునకుఁ బూర్వమున్న ఱతో పోల్చి చదువరులకు భ్రమ కలిగింప ప్రయత్నముచేయుట కేవలసాహసమని గట్టిగఁ జెప్పవలసియున్నది.

కానూరు వీరభద్రేశ్వరరావు.

చ. చలువలు చల్లు నీడలు నిజక్రియ మాన్పి నటించి చూచు నె
య్యలి నలరించె నెంతయు విశాలసరోజ ... ...
కలనముతో ... ... ...
లలితమరంద సేచనము లై ఘన ... చప్పుల్లై. 16

ఉ. కేకిసకొట్టి యొక్క నిలిగించున నొక్కవిలోలనేత్ర కే
[1]లాకలకంఠకూజితముల న్నగఁ జెంగట నున్నపొన్న లీ
లాకలకంఠకూజితముల న్నగుచు న్నును నౌవిజృంభితా
నేకవిలాసము న్దెలిపె నిట్టివి పో పురుషానుభావముల్. 17

ఉ. నారెకుఁ బూల గోసి తను సన్నులఁ బట్ట నొకింత పుష్పవి
ట్టూరుపు ఘూపము ల్మకరకోత్కటనాదము సంబ్రమంతయుం
గా రతిరాజు సేన ననగంధవహాకులసింధువారణా
ఖాయచిరాక్షి లోలదళికైశికయై సివమాడెఁ గంటివే. 18

క. అని పలికి కురులు బిగియం, బనుపఱిచి చెఱంగుఁ జెక్కి పయ్యెద లోడిగా
నొనరిచి యొండొరు మీఱన్, వనజాక్షులు కుసుమహరణవాంఛాపర లై.

సీ. కొమ్మ యొక్కతె చేరి కొమ్మ వంచినఁ గోసె నలరుఁ గొన్న నలోక్తయలరుఁ బోఁడి
కలికి యొక్కతె తేఁటి కలికి గొంజులు దూఱ నతిచర్యగతి నవ్వె నతివ యొక్తు
బాల యొక్కతె పూవుఁబాళకై గీలించి యాన నొక్కతె దాని నానయిడియె
ముదితయై మొగడలుముదితయొక్కతె రాల్పఁ జెలువందఁ గాఁ నేఱెఁ జెలువ యొక్తు
వెలఁదిగురి వెంనపొద లొక్కవెలఁదినూప, రామణీయకనిధి యొక్కరామపఱచె
నిట్లు వనకేళిఁ దేలుచు నిందుముఖులు, సరసవాచావిలాసంబు నెరపు వేడ్క.

రగడ. నెలఁత [2]నెమ్మి నెమ్మిఁజూపె నీరు నీకుజాలినీడ
నలయకమ్మ కమ్మఁదావి నలరు నలరుబంతులాడఁ
గలయ నీడ నీడగాదు కదలి కదలికడకు రమ్ము
వెలఁది నన్ను నన్నువిరులు వేఁడి వేఁడిమాటచిమ్ము
వనిత రాదు రా దువాళి వలదు వల దుపవనసీమ
ననలు గోర గోరఁ జీర నాన నానవెట్టి లేమ
తమ్మికంటి కంటిఁ బొదలఁ దారుదారుచుండ ముందు
కొమ్మ మావి మావిననలు గోయకోయుటంచు నిందు

1. చ - ట - లలోనిపాదమేలేదు. 2. చ - ట - నెమ్మినెమ్మిఁజూపెనీరునాకుబాలినిండ.

కొలఁది గాదు గా దురాశ కొమ్మ కొమ్మవంచుజోకఁ,
గలఁకఁదిట్ట దిట్టవైతి కన్నె కన్నెఱుంగలేక
రమణి ననకు ననకుఁ జేర రాఁగ ఱాఁగవగుచుఁ జేడె
నమరుతావి తావిదా గయాళి యాళి గొల్లలాడి
ముదిత మూలమూలఁ జాల ముడువు ముడువువగల పూలఁ
బదరనేల నే లతాంగి పట్టుపట్టు జీనువాలఁ
గనిరి లలన లలనవామ్రకలిక కలికచ గ్గడంగఁ
గనలు కలికి కలికితేల కావికావికనఁ గడంగఁ
గొఱలి వీడవీడనేల గుట్టుగుట్టు నలులమొనల
నెఱయ నింపునింపు నిచట నెలఁత నెలఁత తళుకుననలు
అతివ వట్టి వట్టివేరు నాడనాడ వైచె దేల,
సతులతరమె తరమెఱుంగ సరస సరసముడిగి బాల
సావి నిక్క నిక్కగాదు చాలుఁ జాలు [1]దఱుగువళులు
తావిదండ దండమాకుఁ దమకతమకమూనువళులు
క్రొవ్వులేమి లేమిఁజెలులు గుంద గుందరదనయులుకఁ
ద్రోవగట్టు గట్టుచాయ తోఁపుతోఁపుముక్కుచిలుక
నంగమలయ మలయపవన మానిమానిని వడదేరెఁ
జెంగునీకు నీకు ముద్దుచిలుకఁ జిలుకఁబిలువుసారె
కింక మాను మానుషంబు గెంట గెంటసంబులేల
కొంక కేల కేలఁబూని కొంబె కొంబె పూవుఁబాల
జగడ మొల్లమొల్లకెట్టు చనవు చనవు బలిమితోన
నగిన మేల మేళ యని పెనంగ సంగభవునియాన. 21

జలకేళీవర్ణనము.

క. అని చెలులు సుమాపచయం, బొనరించి మరందకణము లొలికెడులతలో
యనఁ దనువుల నునుజెమరులు, చినుకఁగ జలకేళిసక్తచిత్తాంబుజలై. 22

క. [2]వరసీధుమత్తమధుకర, దరశీర్ణనవీననళినదళమిళనకళా
చిరశీలితశరశీకర, భరశీతలసరసిఁ జఱిసి ప్రమదలు తమలోఁ. 23

క. గరువనిలాహతి సుమరజ, మిరుగడ రా నడుమ భృంగ మెసఁగె న్సరసీం
దిర దాల్చు కమ్మబంగరు, సరిపెణఁ దగు తేఁటితాళిచాడ్పున సుదతీ. 24

1. చ-దగదువళులు ట-దరుగుడిరులు. 2. ట-లో నీరెండుపద్యములు లేవు.

చ. చిఱునునుజెందొవల్ చికిలిచంద్రిక పై పఱవు, ల్వరాగముల్
పఱచినప్పైఁడిప్రాఁతవలిపంబులు, పాయని జంటజక్కవల్
కుఱుచతలాఁడబిల్లలుగఁ, గోమలి యిచ్చటఁ గానవయ్యె నె
[1]త్తఱు లలరాజ[2]హంసవనితాతతి దూఁగెడుడోలలో యనన్. 25

క. [3]బలిసద్మద్వారేంద్రో, పలఫలకకవాట మనఁగఁ బరఁగె సరసి యూ
ర్ములు గండపట్టియలుగాఁ, జెలఁగు సరోజములు బిగువుచీలలు గాఁగన్. 26

క. అలిగర్భకుముదముకుళము, వలిజక్కవమేనుసోఁకి వడఁకుచు నంత
ర్విలసితతద్ద్యుతినలరెన్, గొలంకుసిరిచంట సకినె కులికె ననంగన్. 27

క. సూనయుతనాళమానస, మాపం క్రేంకార మొక్కహంస మొనర్చెన్
మానిను లట రా జలఖగ, సేనలకెఱిఁగింప సఖిరిసేసె ననంగన్. 28

చ. అని కొనియాడి కొమ్మలు శయంబులఁ బూని సనర్మవాక్యముల్
పనుపడఁ గోక లూడ్చి [4]కరపావడ లంట బిగించి సొమ్ము లొ
య్యన సడలించి యొండొరులయంసము లూఁతలు గొంచుఁ జొచ్చి రిం
పున సరసి న్మరుం డొఱలు పుచ్చిన కత్తులఁబోలి బిత్తరుల్. 29

గీ. చెలువ లప్పుడు నెలకొన్నసిగ్గుచేత, వక్షములఁ జేర్చిరి కరస్వస్తికముల
నెగసిచనుజక్కవలఁగూడియేగుననుచుఁ,బదరిచనుజక్కవలనంటఁబట్టిరనఁగ.

ఉ. కొండొకపాయపుంగొమరుగుబ్బెత యోర్తు కొలంకు డిగ్గుచో
నండకు వచ్చినట్టి చెలియంసము చేతులఁబట్టి వ్రేలె లో
నిండినభీతి నాత్మకళ నేర్పుటకై వలరాచయొజ్జ కో
దండము వైచెనాఁ దఱుబుదార్కొనుకైవడి వేణి తూలఁగన్. 31

క. చెలువలు సరసీజలముల, నిలిచిన లోఁ గన్నుఁగవలనీడలు దోఁచెం
దెలిచెక్కుఁజందురులకై, తలఁకుచు నడుగంటు నచటితమ్ములరీతిన్. 32

గీ. చెలులు కొందఱు తమమీఁద జలముఁ జల్ల
మగువ లొకకొంద ఱవి కేల మగుడ నాని
రలఘుజఘనాభిఘాతార్తి నరుగుదెంచు
సలిలముల కిచ్చి రభయహస్తంబు లనఁగ. 33

చ. నెలఁత యొకర్తు నెమ్మొగమునీడ నవాంబుజమంచుఁ గైకొనం
దలఁచి కరంబుసాఁచుటయుఁ దక్కరముం బెఱతమ్మిరీతి నం

---

1. చ-తరగలు.　2. ట-హంసకవితానము.　3. ఇదియుఁ బైదియుఁ ట-లో లేవు,
4. క-కసెపావడలు.

దలరిన నొండు రెం డగుట యద్భుత మం చొకప్రోడ నెచ్చెలిం
బిలిచి మెఱుంగఁబల్కె నది మేలమునం దనుఁ గేరి నవ్వఁగన్. 34

సీ. కల్లోలమున నన్నుఁ గదిపి రాఁదుటకు నోయుద్వేలకచజాల యోలయోల
నూటిఁగొమ్మాని నాసాటి వ్రేయుటకు నోయుల్లోలకరనాళ యోలయోల
చేపట్టి నావెంటఁ జేరి పట్టుటకు నోయుద్దామకటిసీమ యోలయోల
దగ లేక నాతోడఁ దడవుగ్రుంకుటకు నోయుజ్జృంభకుచకుంభ యోలయోల
యోయువిద యిందు రాకున్న నోలయోల
యోచెలియ యూఱకుండిన నోలయోల
యోసకియ యెందుఁబోయిన నోలయోల
యనుచు నుద్దులు గూడి పోరాడి రపుడు. 35

చ. తరఁగల డాయుచున్ మొగడతమ్ములు గోయుచుఁ గేరి తిట్టుచుం
గరములు వట్టుచు న్మునిఁగి క్రక్కునఁ దేలుచుఁ జాల సోలుచున్
దరులకుఁ జేరుచుం దఱుముపంటల దూఱుచు నీట ఱువ్వుచున్
దొరకొని నవ్వుచుం జెలులు తోయవిహారనితాంతతాంత లై. 36

సీ. కరిహస్తసాదృశ్య మిరవుకొల్పుటఁ జేసి తొడ లార్ద్రభావంబుతోఁ జలింపఁ
గదళీచ్ఛదౌపమ్య మొదవఁ జేయుటఁ జేసి నిలువున నుదరము లిన్నిక్కఁ జూప
హైమదర్పణసామ్యము లవరించుటఁ జేసి మెఱుఁగుఁ జెక్కులు కెంపుమిసిమిఁ బూన
జలద[1]సాధర్మ్యంబు సవదరించుటఁ జేసి విప్పుగొప్పులు పయోవృష్టి నెఱప
హస్తికుంభోపమానంబు లగుటఁ జేసి
చన్నులు నఖాంకురాంకుశక్షతులఁ దెప్ప
నంబుకేళిక చాలించి యలసగతుల
సరసి వెలువడి తత్తీరధరణి నిలిచి. 37.

చ. చలువలుగట్టి తొంటి సుమసౌరభము ల్వలుచక్కిఁ గ్రమ్మఁగా
నలకలు చిక్కు[2]వుచ్చి తడియాఱిచి కొప్పులు వెట్టి పువ్వుదం
డలు గయిసేసి చాలమృగనాభి తనూలతలందుఁ బూసి సొ
మ్ములు ధరియించి లత్తుకలు మోవులఁ జేర్చి వయస్య లందఱున్. 38

క. [3]లీలావన[4]జలవిహరణ, కేళీకృత్యంబు లెట్టికేలకుఁ గలఁకం
జాలించి యుచితరచనలఁ, గూలంబున నున్నయట్టికుముదినితోడన్. 39

1. చ-సౌందర్యంబు. 2. చ-దీర్చి. 3. ఉ-లో నీపద్యము లేదు. 4. చ-విహరణజల.

కుముదిన్యాదులు మన్మథపూజఁ గావించుట.

గీ. ఓలతాతన్వి యీవసంతోత్సవమునఁ
గోరి మదనుని బూజించుకువలయాక్షి
తనకు ననుకూలుఁడైనట్టి ధవునిఁ గూడి
చెలఁగి మనుఁగాన మనము పూజింత మనుచు. 40

సీ. వలగొన్నగొజ్జంగిపొలదివెమగులున కసదుమొగ్గలు[1]పిల్లనలుగాఁగ
గొప్పకప్రపనంటిగుమురుటుప్పరిగెకుఁ జెమలునాకులు కేతనములుగాఁగఁ
బ్రబలినసురపొన్నభవనేశ్వరమునకు సుమపాంసువులు వితానములుగాఁగఁ
బొదలినగురివెందపూఁబొదచవికెకు సమదభృంగములు ఘోషములుగాఁగఁ
దనరు విరిదోఁటనగరిలోఁ దావిమావి, జగతిజారంబునెడ ఘనసారవేది
కర్ణికాసింహపీఠిపైఁ గలువఱేను, పట్టుజముకాళ మనుపంపఁ బఱచి యందు.

గీ. చిగురుపటమునఁ బూఁదేనె మొగడకణికఁ
గొలువుమెఱసిన మరు వ్రాసి కోపులందు
రతివసంతుల వ్రాసి తత్ప్రాంతసీమ
భ్రమరకీరపికాదుల వ్రాసి నిలిపి. 42

క. క్రొత్తతావిమధురాధర ల, య్యుత్తుశరాసుం బ్రసూనహేతివళితఫా
లాత్తు నుచితోపచారవి, చక్షణలై పూజసల్పి సమధికభక్తిన్. 43

ఉ. దండము నీకు సామిరచితప్రమదేశశరీర మోడ్పుఁగే
లండజరాజగామిహృదయంగమవిక్రమ వందనంబు దో
ర్దండయశస్సమాశ్రయపితామహవక్త్ర జోహారు సూనకో
దండవిలాసవీక్షణవిధానధురీణసహస్రలోచనా. 44

ఉ. సాయుధుఁడై త్రిపుండ్రధరుఁడై నిటలాక్షుఁడు గాడ్పుసోఁకులం
బోయెడు నొండురెండు[2]పురము ల్దగ నేయుటి దేమివింత యే
యేయెడ నేకపుండ్రమువహించి సమస్తజగత్ప్రపంచముల్
మాయఁగఁ జేయు నీయెదుట మన్మథ మానవతీభయంకరా. 45

గీ. చెలువమున నీకుఁ దమ్ముఁడై[3] చెలఁగువాని, ననఘవిక్రమహారిసూతి నైనవాని
గనుఁగవకుఁజంద్రభానువైతనరువానిఁ,గుముదినికిభర్తఁగాఁ జేయుకుసుమవిశిఖ

క. అని ప్రార్థించుచుఁ గుముదినిఁ, గనుఁగొని మదనునికి వినతి గావింపుమనన్
మనమున లజ్జయు నలఁతయుఁ, బెనఁగొన నొకరీతి మ్రొక్కి బిత్తరికలఁకన్.

1. చ - ట - పిల్లిపసలు. 2. ట - పురముల్పగనేయు. 3. చ - ట - యలరువాని.

కుముదినీవిరహావర్ణనము

చ. కలయఁగ మ్రోయుకోయిలల కాకలికాకలనాద మచ్చటన్
నిలిచి సహింపలేక బలునెవ్వగ నుల్లము తల్లడిల్లఁగా
నలసకటాక్షపాతముల నాళిజనంబులవంకఁ జూచుచున్
నిలయముఁ జేరి యేమియు[1] మనీషకు నింపమిఁ జింతఁ గుందుచున్. 48

చ. గొడఁగెడుపావురాలరొదఁగూడి ప్రతిధ్వను లిచ్చుకెంపుటా
గొడిగెల ప్రేలుబంగరవుగూఁడులఁ బల్కెడుచిల్కచాలుచే
నడరు పసిండియోవరులయంత్రపుబొమ్మలు మీటు కిన్నెరల్
గడుసుతిఁ గూడి గమ్మునఁగాఁ దగు సౌధముఁ జేరి యచ్చటన్ 49

చ. చికిలిపసిండిచాయపని చిత్తరువన్నియ వేల్పురాచటా
సకినెలకోళ్లతోఁ దళుకుఁజాయల గుజ్జరినేఁతపట్టెతో
రకమగు నిండుచంద్రిక ఖురాళముతో హురుమంజిపాన్పుతోఁ
జకచకలీను కప్పురపుఁ[2] జప్పరమంచమున న్వసించుచున్. 50

సీ. పలుమాఱు రాచూలిఁ దలపోసి బెడిదంపునిట్టూర్పుగాడ్పులు నిగుడఁజేయు
నిట్టూర్పుగాడ్పుల నిగుడఁజేసి మెఱుంగుకన్నుల బాష్పము ల్గ్రమ్మఁజేయుఁ
గన్నులబాష్పము ల్గ్రమ్మఁజేసి యనంతకంతురాజ్యంబేలఁ జింతసేయుఁ
గంతురాజ్యంబేలఁ జింతసేసి మనోంబుజమునఁ గోర్కులు కొనసాఁగఁజేయు
సరవిమైఁ గోరుకులు గొనసాఁగఁజేసి, కలయ వలవంతఁ నంతంతఁ గళవళించు
నిట్లు కుముదిని యానంగహేతిహాలహా, లార్చి సైరింపఁగాలేక యాత్మలోన.

ఉ. ఆయెలమావియోవరుల నానవమాధవికాలతాగృహ
చ్ఛాయల నాసితాభ్రకృతశయ్యల నాకమనీయదేవతా
నాయకరత్నకేళిసదనంబుల నా[3]విరిచప్పరంబులం
బాయక యాతనిం గదిసి భావజకేళి సుఖింపఁ గల్గునే. 52

సీ. పాదాబ్జములతోట్రుపాటు నేమనవచ్చుఁ జెఱిచె గొబ్బునఁ జెంతఁ జేరనీక
నినుపారఁ బాఱుకన్నీటి నేమనవచ్చు నొంచెఁ గన్నార వీక్షించనీక
వడఁకొందు మై పరవశత నేమనవచ్చుఁ గనలించెఁ బలుకులు వినఁగనీక
[4]యుజ్జగింపఁగరాని లజ్జ నేమనవచ్చు నడచెఁ గేలునుగేలు నంటనీక

1. ట - యునునింపులుగామిని. 2. క - మంచముపైమహోన్నతిన్. 3. ట - వలిచప్పరంబులన్. 4. ట - బుజ్జగింపఁగరాని.

మనసెఱుంగనిచెలియనేమనఁగవచ్చుఁ, బలిచెనుఁజీకొంత తత్క్షణందు నిలువనీక
యని తలంపఁగఁ జింతాలతాధిరూఢ, దర్పకదశాంకురమ్ములు దలముకొనియె.

చ. తనువున నిండి కాలుకొను[1] తాపముసోఁకు సహింపలేక జీ
వన మతిశైత్యకాంక్ష నిజవాసము వెల్వడి కర్ణకూపశీ
లనసరసప్రఫుల్లకమలద్వితయంబున విశ్రమింప వే
గనటకువచ్చెనో యనఁగఁ గన్నులఁ బ్రాణము నిల్చె[2] లేమకున్. 54

శా. ఆలజ్జావతి [3]నంత నొక్కచెలి డాయ న్వచ్చి యాశ్చర్యదో
లాలీలాలసచిత్తయై యకట యేలా వచ్చె నీ[4]వంత యీ
నాళీకాయతనేత్ర కంచు మదిఁ జింతం జెంది తద్దీనదీ
నాలాపంబులచే లతాంతశరబాహాప్రౌఢి నూహించుచున్. 55

చ. అలకలు గూడదిద్ది సరు లల్లన చిక్కెడలించి జాలుగా
నొలికెడు బాష్పము ల్దుడిచి యొయ్యనఁ బయ్యెదకొంగుఁ జేర్చి సొ
మ్ములు సవరించి ఘర్మజలము ల్దొలఁగం దడియొత్తి యెత్తి తొ
య్యలి నెదఁజేర్చి చేర్చి కరుణాకులగద్గదనిస్స్వనంబునన్. 56

చ. చెలియ యిదేమి నేఁడు గడుఁజిత్రము నీదు తెఱంగుఁ జూచినం
దలఁపఁగరాని బెట్టిదపుఁదాపము రూపము వింతకోపమున్
నెలకొనినట్లు తోఁచె నిది నిక్కము దక్కులు వల్కనేల నీ
కలఁకకు నొండు కారణముఁ గానముగా మదిఁ జింతసేసినన్. 57

సీ. దగరతేఁటులకప్పుపగఱనీటులఁ గప్పు వలుదపెన్నెఱికొప్పు వదలెనేల
మెఱుపునక్కులఁ జిక్కువఱవు టెక్కులనిక్కు లలఁతినిద్దపుఁజెక్కు లడలెనేల
చలువ[5]చాయలఁ జేర్పు కలువపూవులనేర్పుఁ దెగడుకమ్మనియూర్పు దెరలెనేల
పసిమి తీవలమించు [6]మిసిమితేవలమించు వలపుమైఁ గ్రొమ్మించు వాడెనేల
మొగడతమ్ముల జిగినేలి పొగడఁజాలి, నిగుడుచన్నులఁ జెమటలు నిండెనేల
తళుకు బేడిసకవచాయఁ దళుకుఁజేయు, నేర్పుకన్నులఁ గెంజాయ నిలిచెనేల.

ఉ. గోమగు నీమొగంబు గనుఁగొన్నను గ్రొన్ననవింటిదంటచే
బాములు నోమినట్లు గనుపట్టెడు నిట్టియెడ న్మఱుంగు లిం
కేమిటికే మిటారి తలఁ పెల్లను దెల్లమి గాఁగఁ దెల్పవే
యామకరాంకు నైనను జయంతునినైనను దెత్తు నిత్తఱిన్. 59

1. చ - తాపము సైఁపఁగ లేకయంత. 2. ట - నొయ్యనన్. 3. ట - నొక్కనాఁడు.
4. చ - ట - చింత. 5. చ - పూవుల. ట - తావుల. 6. క - ట - నుసిమి.

చ. అన మది నుబ్బు పెట్టికొని యబ్లన పయ్యెదఁ జేర్చి దీర్ఘలో
చనములఁ జాల [1]జాలుకొని జాఱెడు నశ్రులు గోర మీటుచున్
వినతముఖాబ్జయై మిగులప్రేలిన కొ ప్పొకకేలఁ జెక్కి చి
క్కనిసెగఁ జల్లు నూరుపులు గ్రమ్మఁ బదాంగుళి నేల వ్రాయుచున్. 60

ఉ. ఏమియొకో యెఱుంగఁ జెలి యే మును గేళివనంబులోనికై
యామనిసొంపుఁ[2] జూడఁ జనినప్పటినుండియు డెంద మాకులం
బై మననీని కాఁక కిర పయ్యె నటన్న నొకింత నవ్వుచుం
గోమలి యిప్పుగా మనసు కోరికి తెల్లమి యయ్యె నెంతయున్. 61

[3]చ. అని చెలి వెండియుం బలుకు నంబుజనేత్ర వనంబులోన నీ
కనుఁగొనినట్టి యాకుసుమకాండసమానుఁడు వీరసేనునిం
బెనఁగొని యుండునెచ్చెలిసుమీ యిది యేమి దురాపకృత్యమే
మనమున దీని కేల పలుమాఱును గుందెద వేనుగల్గఁగన్. 62

చ. వనిత తలంపులోని వలవంతఁ దొఱంగగదమ్మ యిప్పు డేఁ
జని మనవీరసేనుచెలి జన్మము వంశము నూరుఁ బేరు నె
ల్లను సవిశేషరీతిఁ బదిలంబుగ నారసి వత్తు నింక నీ
వనిపినఁ జాలు నంచుఁ గమలానన నూఱడఁ బల్కె నత్తఱిన్. 63

## సంధ్యాకాలవర్ణనము.

క. పగటిసెగ వదలి పడమరఁ, డిగియె న్రవిమండలము వడి న్రశ్ములు పై
నిగుడ నలవిష్ణుపదమున, దిగదిగయని [4]వ్రేలు తూఁగుదీవియ వోలెన్. 64

చ. ఇనుఁ డపరాద్రియం దొఱగ నేగెడిచోఁ బయిరాజు వచ్చుటల్
[5]గనుఁగొనుఁ డంచు నున్నతతలంబుల నంచులఁ గోపురంబుగా
నునిచినయట్టి యాత్మబలమో యన భూధరశృంగసీమలన్
వనతరుశాఖలం [6]దొగరువన్నియయెండలు నిల్చె నయ్యెడన్. 65

మ. దినలక్ష్మీజనకాత్మజాపహరణోద్వేలస్థితిం బొల్చు న
స్తనగేంద్రక్షణదాచరేశ్వరుని భాస్వన్మౌళిబృందంబు నూ
తనతారావరకాలకీశపతి యౌద్ధత్యంబుచే నుర్లినం
గినుకం బర్వతదక్షి [7]రాగములమాడ్కి న్మించె సంధ్యారుచుల్. 66

1. క - జాలుకొనఁజాలెడు. 2. ట - జూడఁగాఁ జనినయప్పటి. 3. ట - లో నీపద్యమునకు మాఱుగా "అనిన" యని వచనము గలదు. 4. చ - వ్రేలతూలదీవియ. 5. చ - తనుగొనునంచు. 6. చ - ట - దొరఁగువన్నియు, 7. ట - రాగమునుమాడ్కిన్.

[1] సీ. [2] పరిణతాసమపత్త్రపాతనపరనగంబునఁ బుట్టిన ప్రవాళపుంజ మనఁగ
[3] విరహార్తిఁ జల్లార్ప వేగ రమ్మని యినుఁ బ్రార్థింపఁ జనుచక్రపఙ్క్తి యనఁగఁ
దొవలచ్చి విభుఁడు వేశ్యానరింపరా మ్రోలఁ బన్నిన కెంపుచప్పర మనంగ
నలఘుమహాతపాత్యయమునఁ బొడసూపు తరుణసౌదామనీధామ మనఁగ
విష్ణుపదసక్తుఁడును దమోద్వేషియు నగు
హంసుఁ డలవారుణీసృష్టి నైనదోష
మడఁప నంభోధిలోఁ దాన మాడఁ జనుచు
దరినిడిన [4] ధాతుశాటినాఁ దనరె సంధ్య. 67

చ. [5] తమము లినవ్యపాయపటుదర్పము లై యళికైతవంబునం
దముఁ గదియంగవచ్చి యుచితధ్వనితో నిజకర్ణికాకలా
పమునకు మూఁగఁ బద్మినులు బద్ధదళాంబుజముష్టిఁ బట్టెఁ దే
జముగల మేటిబోటులు వెస న్నలినాత్ములు నాఁపఁజాలరే. 68

సీ. సామిదష్టాబ్జకేసర మూను మదినిండి వెలిఁ బర్వుతాపాగ్నిఁ దెలుపుకరణిఁ
దమ్మిచెంగట మ్రోయుఁ దానకాత్మజుఁ డిట్టు తూలించె మమునని దూఱుకరణి
వనజాంతరాళి ముక్కున గ్రుచ్చు మైకాఁక నానఁజాలక విస మానుకరణి
మగనిఁ జీరుచుఁ బారె మొగడదామరయెక్క వలరాజునలుఁగుపై వ్రాలుకరణి
సరసబిసినీపలాశంబు చాటుపూని, నిలుచు నానంగసాయకానీకహతికి
లోఁగి ఘనకాంతరంబున డాఁగుకరణిఁ, గాంతు నెడఁబాసియొక్కజక్కవవెలంది.

సీ. ఘనపరంపర లివి గాఁబోలుఁ గాకున్న హంసమండలము మున్నరుగు టెట్టు
గహనమాలిక లివి గాఁబోలుఁ గాకున్న ఋక్షసంఘము సంచరించు టెట్టు
గంధేభఘట లివి గాఁబోలుఁ గాకున్నఁ బేచకంబులు విజృంభించు టెట్టు
గరళకూటము లివి గాఁబోలుఁ గాకున్న నార్తిఁ జక్రములెల్ల [6] నఱచు టెట్టు
లనఁగ హరితనుహరతనుహరిహయమణి, హరితహరిగుణహరిహవిరశనసరణి
హరిణధరగళహయరిపుహాలికవసన, హసనపటురుచిఁ దిమిరములలముకొనియె.

చ. ఘనపదకాయమానమునఁ గ్రమ్మి తలిర్చు విభావరీవిను
తన [7] తరగోస్తనీలత యుదగ్రతమోమయధూమదోహదం
బున నలరారఁగాఁ బొడము భూరితరస్తబకంబులో యనం
దనరె నతిప్రశస్తరుచిధామములై తగు తారకావళుల్. 71

1. ట-లో-లేదు. 2. చ-పరిణతాసమపత్త్రపాతనగంబునఁబుట్టినట్టిప్రవాళపుంజమనఁగ.
3. చ-విరహాగ్ని. 4. చ-కావిశాటి. 5. క-తమముదినవ్యపాయ. 6. ట-నశోలు. 7. క-వరగోస్తనీ.

చ. ఇనకరతాపతప్త యగునింద్రదిశాసతి కాఁక దీఱ మో
మున నిడునూతనామృతసముజ్జ్వల మౌ పటికంపుగిండి[1]లా
గున నెలదోఁచెఁ దోఁచెఁ బయిఁగ్రొందొగ రప్పుడు నెమ్మితో [2]నిశా
వనిత మఱుంగువట్టిన రువారపుఁ జంద్రికపావడో యనన్. 72

మ. తొలుగెంప న్నలఁ గింపుమై సలఁది తోడ్తోఁ బ్రాగ్దిశాతన్వి గ్రొ
న్నెలయన్ పావని దానమూర్పు మును గన్నీ రుబ్బనా నూత్నర
శ్ములు మించెం బిదప న్విరుద్ధసలిలంబు ల్పర్వెనా వెన్నెలల్
వలువొందెం బయి దృష్టిబొ ట్టనఁగఁ జిహ్నం బొప్పె నీలద్యుతిన్. 73

సీ. విధుఁడౌట లోకైకవేద్యంబు గావింప శ్రీవత్సచిహ్నంబుఁ జేర్చెననఁగ
సోమాభిధానంబు సువ్యక్తమొనరింప నఱుతఁ గప్పుధరించి వఱలెననఁగఁ
బద్మాసనుం డౌటఁ బ్రకటంబు గావింపఁ [3]గలహంసఁ జెంగట నిలిపెననఁగ
ద్విజరాజవిఖ్యాతి నిజముగా నొనరింప హోమపావకరక్ష నూనెననఁగ
నబ్జనామంబు సార్థమై యతిశయిల్ల, మత్తమధుపంబుఁ జెంత నమర్చెననఁగ
నంకసంయుక్తుఁడై చెలువందె నవుడు, కమల[4]గర్వవిదారి రాకావిహారి. 74

చ. నెలకొని రాజు తేజములు నించుచు రాఁ గుముద[5]ప్రచారముల్
దళములు విచ్చియుం బొగడుదాల్చె దళంబులు వేయి గూర్చియున్
విలసనమొంద వయ్యె నరవిందగణంబు లినుండు నిల్వమిం
దలఁప బలప్రచారములు ధారిణి నీశ[6]గుణానురూపముల్. 75

చ. విరహులపైఁ గరాస్త్రముల వే నిగిడింపఁ గడంగి కందు చ
క్కెరవిలుకాఁడు వెక్కసపుఁగిన్క దొలంక మృగాంకబింబమున్
విరివిలుచుట్టుగాఁ దివియ వేమఱు రాలు తదీయసీధుశీ
కరములకైవడిం దొఱఁగె గాఢతుషారతుషారవారముల్. 76

సీ. కలువతొప్పెరలజక్కవయూర్పు సెగఁ గ్రాఁగునులివెచ్చ[7]పూఁదేనెజలకమాడి
తఱినిండుజాబిల్లి తళుకుబొక్కసములోపల మించువలిమంచు [8]వలువఁబూని
విరిబొండుమల్లెపూబరణులనెత్తావి జడియు పుప్పొడిగందవడి యలంది
[9]చిలుకునీరుదొలంకఁ దెలివొందు నెలచట్టుపళ్లెరంబుల మ్రోల బంతిసాఁగి
యలరుఁబొదరిండ్లముంగిళ్లవలఁపుకలన, [10]నలయుజవరాండ్రక్రొల్లన్ను చెలులఁ
పండు వెన్నెలచిలువాలపాయసంబు, లారగించెఁజకోరరాజాన్వయంబు [గూడి

1. చ-ట-బాగున. 2. క-దిశావనిత. 3. చ-నలహంస. 4. చ-గర్వాపహారి. 5. చ-ట-ప్రతానముల్. 6. ట-రణానురూపముల్. 7. చ-ట-పూనీట. 8. చ-చలువబూని. 9. ట-చినుకునీరు. 10. చ-నలరు.

[1] సీ. బలిధాము మెట్టినఁ బట్టి బంధింపఁడే చీఁకటి దళమేమి చెదరెఁగాక
యుడువులు బలసినఁ దడఁబడే నీశ ప్రకంపనాకీలప్రవృత్తిఁ గాంచెఁగాక
రాజు చేరినఁ గావరము మాన్పఁడే యంక మషిదశ్చిత్రాకృతి యయ్యెఁగాక
దుర్గేశుఁ డంటినఁ దునుమఁడే యలకష్ట మదమేది కదలక యుండెఁగాక
రోదసీపూర్ణవిధుపాదరోచమూని, విమలధారావిశేషమై వెలయు నివి [చె.
మహిమచేఁ దూలవెయ శేషములిఁ గణము, లనఁగ వెన్నెలజగమెల్లఁ బ్రాక్రమిం

## వెన్నెలవచనము.

వ. వెండియుం బుండరీకభవాండభాండంబునం దంకతండంబుగా నిండుకొండఁ వెన్నెల [2] బిరుదుకస్తూరితోడఁ జుక్కలను జొక్కపుటరవిరులు వలగొన నునిచి తావి గట్టిన నిశాకాంతుఁ డనుదంతపుఁ బరిసె నిర వగు తెల్లగండవడిఁ బగలు గగనమణి నిగిడిచిన సెగలఁ జొడమిన బడలిక నడలి బిసకుసుమరసమును జమరి పురరోదసీయువు చెలువ [3] చలువ నెలకొన మైనెల్లఁ జల్లికొనిన మొల్లం బున నుల్లసిల్లి మఱియు నార్తియ రూతచవళాసముచితంబుగా శీతలతరశీతకర శిలాతలంబులఁ బొఱి జీరుకలాడుచు మందపవమానకందళస్యందమానసం దీపరిమరందధారాసందోహంబులం దేలి యోలలాడుచు నల్లెడ వెల్లివిరియ నుల్లోలతల్లజంబులఁ [4] బిల్లదీవు లాడుచు, నుత్ఫుల్లమల్లికామతల్లికావేల్లిత పల్లకీకుడుంగంబులఁ గడంగి డాఁగిలిమ్రుచ్చు లాడుచుం బిసాళించి మ ఱియు నలుకం గలయికలకుఁ దలపడని చెలువ [5] కీలితములు గిలుబందలంచు చెలువున జాలకంబుకన్నంబులఁ బ్రవేశించి తలిరుగుమురుల నిరవగు నిరులు విరియించు వెరవున నీరములసందులు దూఱి గగనావతరణశ్రమంబు నపన యించువడువునఁ జంద్రశాలావిహారలోలబాలాకపోలఫలకంబుల నధివసిం చి, కవయెడలి యడలుజక్కవచెలువలయూర్పుసెగల నొగిలి [6] సెగమాన్పు తెఱంగునఁ బుంభావసంభావనాపరిశ్రాంత కాంతారుచాంత నిర్వాంతస్వే దంబులాని, మఱియు, నింద్రనీలమణిమయసౌధవిటంకంబులకు ధవళపారా వతవ్రజంబై పావిగల తీవగుంపులకుఁ బూవుజొంపంబై కాసారతీరంబులకు మించుగల యంచపిండై, బంగరుముంగిళ్లకు రంగవల్లికయై, మఱియుఁ గఱ కుదారతెఱంగునఁ దమ్ములనొగిలించుచు, దైప్టికునిపోలిక దెసలుగడచుచు భోగివడువునఁ గడివోనిచలువలు దాల్చుచు నారదుని [7] వడువున జగడాలు

1. ట-లో సీసపద్యము లేదు. 2. చ-గుఱుతు. 3. చలువలబముకొన. 4. చ-బిల్లదిప్పాడుచు. 5. చ-నిశితములు నిలుపుండటంచు. 6. చ-జలమాను. 7. చ-రీతిని.

షచరించుచు నెఱుకు తెఱంగున నిర్ల నుర్లఁ ద్రోయుచు నామనిగోమునఁ గొమ్మల నలరించుచు మానిని [1]యనువున నుడువుల నాఁగుచుఁ [2]గాకములకు నభిసారికానీకములకు నడలు వెంచుచుఁ దరంగవతీతీరంబులకుఁ గురంగేక్షణావారంబులకుఁ గలువసొంపులు [3]నింపుచు, మఱియు నొక్కయెడ లలితమణిమయసౌధతలంబులఁ బ్రసవశరకేళికై మల్లాడు నిజవల్లభు లల్లన పోఁకముడి [4]కేల సడలించినఁ దెగడువడి వెగ్గలంబుగ బెగ్గిలి డిగ్గనలేచి వాతాయనాయాతశీతకరకరాంకురంబులఁ దారి గనఁబడకునికి మనంబునం బెనఁగొనిన నాన నానతవదనలై కెళవులు గనుఁగొను నవోఢాంగనల మెఱుంగుకన్నులచాయఁ దుఱంగలించుచు, మఱియు నెల్లెడఁ బాలవెల్లి వెల్లివిరిసినచందంబున నందంబు చూపు బయట చిట్టకంబులకుఁ[5] బట్టునడని ముగుదలఁ దదీయాంగంబులు బయలుపఱుపఁబడనీనితరుచ్ఛాయాతలంబులకుఁ దార్చి పేర్చినతమిఁ గట్టువాడిట్టముగలు వలరాచకయ్యంబులఁ దేలించిన నెలవులఁ జెలువార నెరసిన హారమౌక్తికంబులని పొడవెన్నల లేఱంబోపునకియల వికావికనవ్వు నవ్విటవిటుల దంతకాంతి ప్రకాండంబుల దండి చూపుచు, ముచ్చు ననుపుగల మగనిచునువున ననయము ననునయించి వెండియు నొండొకతె యండనుండఁ గని చేరి సారెకు దూఱి మగిడి చనునెడ వెనుగదిసి ప్రియంబులు పలికి పదంబుల వ్రాలిన భర్తల నెగనెత్తి మొగంబులు మగిడించి చేఁబట్ట సడలించి కరంబులు విదురుచు జగజంత దగఱమగువల కంకణంబుల సంకీతంబులైన హీరంబుల కాంతిపూరంబుల నీరికలెత్తుచు ననుంగుఁజెలుల వచనంబులు విని యన్యాంగనాసంగం బారోపించి క్రించుఁదనంబు గల్పించుకొని పొలయలుకల కలఁకల నునికి నిజ ప్రాణనాయకులు మగిడి చనిన నిగిడినవెన్నగఁ బశ్చాత్తాపంబునుం బొంది జాఱు కన్నీరు సారెకు నీటునఁ బోమిూటు సారసాక్షుల గోరుల కాంతితీరు చూపుచు, నొండొరువు లుద్దులుగూడుకొని తుఱుములు విరియఁ జిలుపచెమటలు దొలఁక నలయికలు దలంపక గోడల నీడల నిజోరోజకుంభపరిమాణంబుఁ దెలుపువిధంబునఁ జెన్నగు వెన్నెలకుప్పలు వోసి యరయుటకుఁ గడువడినడరు నీషన్ముక్తశైశవ లైనకప్పురగంధుల యురఃస్థలంబులఁ బింపిల్లు గురియు ముత్తియపుఁబేరులడాలుతోఁ బొత్తు గలియుచుఁ బ్రకాశించి య

1. ట-యొడువున 2. చ-గోరకములకు నభిసారికానికరములకు. 3. చ-నింపుచు విజృంభించి. 4. చ-దొడివి. 5. చ-మట్టువడని.

మృతప్రదుం డగువిధుండు దయార్ద్రహృదయుండై యఖిలభువనంబు సత్త్వప్ర
ధానంబు గావించె నన మించి రోదసీవలయంబు కౌముదీఫలకకల్పితం
బనుశంక నంకురింపఁజేయుచు విజృంభించె నట్టిసమయంబున. 79

క. కంతునకుఁ దోడు రాకా, కాంతుఁడు కరకాండముల వెగడుపడఁజేయం
గాంతాలలామ కంపట, నంతంతకు మేనికాఁక యగ్గలమైనన్ 80



### మన్మథాద్యుపాలంభనము

క. నెచ్చెలి వెచ్చగ నూర్చుచు, విచ్చలవిడిఁ జెచ్చెరఁగి వెగడుపడుచు నా
పచ్చవిలుకానిజైత్రము, రుచ్చంద్రుల ననియె నక్కురంతుపడఁజేరన్. 81

సీ. రాజమండల మాత్మవాజిసంభరణపాత్రము చేసె రేజగత్ప్రాణమూర్తి
బహువాహినీభర్తఁ బ్రబలాత్మకేతుచయంబు మోయించె నేయసమశరుఁడు
దుర్గాధిపతిమౌళి దొరయించె నాత్మపాదవిజృంభణంబు నేకువలయాప్తుఁ
డతిగంధతరులచే నాత్మానుగశ్రేణిఁ బూనించె నేసుమనోని[1]ధానుఁ
డట్టిదాక్షిణ్యశాలియు నట్టియతనుఁ, డట్టినన్మార్గవర్తనుఁ డట్టిసురభి
కీర్తనుండును నీరీతిఁ గెరలిభీరు, హావనమొనరింపఁ గడఁగి రేమనఁగఁగలదు.

సీ. అంధకప్రియసూతి వై విషపంకసంకలితాంకము వహించుఖలుఁడ వీవ
యనయమ్ము నెత్తమ్ములనె మాఱుకొని సత్ప్రధానత ల్చెఱుచు నీమేనమామ
ధరణి నెల్లెడఁ బ్రసూతప్రసవఖ్యాతి వహియించి తిరుగు నీసహచరుండు
భాసురద్రుపదజాపాండుచ్ఛదాపకర్షణచంచలుండు నీసహజమిత్రుఁ
డకట దర్పక మీరు కృష్ణాలకావ, కారవైరస్యమున ధర్మదూరులగుట
భీమవిజయాహితగుణానభిజ్ఞవృత్తి, నవని దుష్టచతుష్టయం బగుట యరుదె.

చ. కనుగలవిల్లు నంటకయె [2]ఖంగని మ్రోయుగుణంబు గంటిలే
కనె యిరుమేనఁ గాఁడిచనుకాండములుం గలయట్టిమేటి జో
దున కతనుప్రభావున కెదుర్పడ లక్ష్యముగారు భీరువుల్
మనసిజ దోస మాఁడుకొల మానఁగదయ్య తలంచి మ్రొక్కెదన్. 84

సీ. ఒసఁగఁగాఁబోలుఁ గల్పోదగ్రహరమూర్తి పుష్పచాపము పేర భ్రుకుటిలతిక
దయసేయఁగాఁబోలు లయకాలశిఖి యలిస్తోమశింజిని పేర ధూమరేఖ
సంఘటింపఁగఁబోలు సంవర్తసమవర్తి టంకారముల పేర హుంకృతములు
కరుణింపఁగాఁభోలుఁ గల్పాంతరవి హల్లకాస్త్రసంఘము పేర నంశువితతి

---

1. చ-నిధానమట్టి.  2. చ-ఖంగుననారియగంటిలేక గ్రక్కున.

యుపథ వెట్టఁగఁబోలు మహోగ్రకాళి. వాయురథ మనుపేర నిశ్వాసపంక్తి
కాకయుండిన వాఁహరకయ వసింపఁ, నీ వెపుడు లోక మేత్తు వే భావజన్మ. 85

సీ. కోకస్తనియటంచుఁ గుందింపఁ జూచితే తరుణచకోరాక్షి యరయరాదె
యరవిందపద యంచుఁ బొరపొచ్చె మొందితే కువలయామోదగ్గైకొనఁగరాదె
తిమిరకైశిక యంచుఁ దెగువమైఁ జూచితే కౌముదీనరహాస కావరాదె
యహిరోమలత యంచు నలయింపవచ్చితే తారకానఖ దయఁదలఁపరాదె
యహితగుణశాలినియటంచు ననకయాప్త, నివహలీలాభిరామమన్నింపరాదె
చాలఁ జెప్పెడిదేమి యీచంద్రవదనఁ, బ్రోవఁగారాదె పౌర్ణమాసీవిలాసి.

సీ. జింకపేరిటఁ గందఁజేసె నింతియకాని హరుఫాలశిఖి చాల నంటవయ్యె
మించుపేరిటఁ గరఁగించె నింతియకాని బాడబశిఖి క్రిందుపఱుపదయ్యెఁ
గాంతిపేరిట నీఱు గప్పె నింతియకాని రాహుదంష్ట్రాగ్ని మైఁ బ్రాఁకదయ్యె
నుదయరాగము పేరఁ[1] బొదిగె నింతియకాని ప్రాగద్రిదవమాత్త్రఁ బఱపదయ్యె
నకట నీవోషధీశుఁడ వగుటఁ జేసి, సంతరించితివో శిఖిస్తంభనంబుఁ
గాకయుండిన నవి నిన్నుఁ గ్రాఁచకున్నె, పాంథసంతతిపుణ్యమా పాటి చంద్ర.

[2]సీ. మొదల మహాబిలంబునఁ దేజరిల్లుట కుండలాకృతిని నిండుండవగుట
విషముతోఁ గూడ నావిర్భావమందుట బహుపాదవిస్ఫూర్తిఁ బొఁదుకొనుట
సడలనీక శశంబుఁ గడిమిమైలోఁగొంట యాబాల్యకౌటిల్య మందుకొనుట
రాజితవీక్షణశ్రవణాంచితుఁడవౌట తరుణమరుద్గ్రాసతనువుఁ గొనుట
నీవు పెనుబాఁపతేఁడవై నిలిచితరయఁ, గ్రూరభావంబు నీకసాధారణంబు
భయదవిషధారి తలక్రిందుపఱుపఁజాలఁ, డతఁడు నీలీల నీలకంఠావతంస. 88

చ. ఎలమి శుకాదికద్విజసమీహితదివ్యఫలప్రదుండవై
యలరుచుఁ గాలకంఠనుతి కర్హుఁడవై సుమనోనురాగివై
యలఘుమ[3]రుత్సమాశ్రయుఁడవై తగుమాధవ నీవు నీసుదృ
క్కులనలయింతువే మధుపకోటులఁ బంచి దయావిహీనతన్. 89

చ. అలులు మధువ్రతంబులు సుమాస్త్రుఁ డనంగుఁడు పక్షపాతి చు
క్కలదొర కోకిలంబు బలుకాకుల పెంపుడుగున్న ప్రాప్తస
త్ఫలదళసం బొనర్చు శుకపంక్తి యివన్నియుఁ ద్రోఁచి పోవఁగాఁ
దలఁచిన నోసదాగతి సదాగతివీవసుమీ లతాంగికిన్ 90

సీ. ప్రత్యగ్రవక్రదంష్ట్రా[4]శిఖాచయ మనుపట్టుకాఱుల సారెఁ బట్టిపట్టి
శా! లమానవిషము లకకఱకుమంటలసారెఁ గాఁచికాఁచి

1. చ-బొదలె. 2. చ-ట-లలో లేదు. 3. చ-మరుత్సఖా. 4. క-దంష్ట్రాశుగ.

యాలోలస్ఫురత్కాన్విత లాలాస్రసం బనుసలంటిసీకుసనాకె సక్షియాద్రి
యత్యంతభయదజిహ్వాంచలం బనునాకుజాతిచే నాకెకు కాచిరాచి [సతనుఁ
త్రాఁచు వాకొల్మియుందుఁ గంజంపుఁ గొండ, యోజనిన్నాశుగముఁ జేసియొసఁగె
డేయఁగాఁబోలుఁ బవనకాదేని సకల, జీవనం బగునీవింత సేయు టెట్లు 91
చ. అని సుమబాణచైత్రపవనాబ్జుల నెచ్చెలి దూఱునంతలోఁ
దనువున హెచ్చినట్టి పరితాపము సైఁపఁగలేక యప్పు డ
వ్వనరుహపత్రనేత్ర నెఱవా డెడఁ గ్రాల్గనుదోయి ఱెప్ప లో
య్యనఁ గదియించి సంజ్వరభరాలసయై పొరలాడునంతలన్. 92
చ. చెలి కలఁకం దలోదరికిఁ జెందినతాపముఁ [1]బాపు నేర్పునం
జలువలు నింపఁగాఁ దలఁచి నాఁ టెఁ బటీరతుషారనీరముల్
తలిరులుఁ గప్రము ల్గుముదతామరసంబులు నించి మైండవో
పలకృతవేదికాతలముపై మృగలోచన నుంచి గొబ్బునన్. 93
క. విలువ యిడరాని చలువలు, చెలువకు నొనరించి [2]పయినుశీరవ్యజనో
చ్చలనజనితమందానిల, వలనంబునఁ గొంతకొంత వాడ డలింపన్. 94
క. తనుపొందిఁ యొయ్యనొయ్యన, కనుదమ్ములు విచ్చిచూచి క్రమ్మెడుకన్నీ
రనయము ఱెప్పలఁ గ్రుక్కుచు, ననియెం జెలితోడ ధైర్య మవలంబముగాన్
సీ. చెలియ నేఁ బెంచిన యెలమావిమోకకు సేవంతికకుఁ బెండ్లి సేయవమ్మ
సుదతి నేసాఁకిన శుకశారికల దేవతామందిరములకుఁ దార్పవమ్మ
మగువ నేఁ బెంచిన మరువంపుమడికట్టు లప్పటప్పటికిఁ బెం పరయవమ్మ
[3]పడఁతి నేనడపిన బాలసారంగంబు ఋషినివాసముల కర్పింపవమ్మ
యబల నాతోడఁ గెడఁగూడి యాడునట్టి, నెచ్చెలుల నెల్ల నీవు మన్నింపవమ్మ
భావిజని నైన నాతఁడె భర్తయగుట, కింతి మరునకు మే నప్పగింతుఁ గాన.
చ. అనుచు వడిం గడంగి కుముదాప్తునికై యెదు రేగునంతలో
ఘననిభవేణి ప్రీలుటయు గ్రక్కునఁ బువ్వులఁ రాలెఁ దో నురం
బునఁ జొరఁబాఱినట్టి యలపూర్ణశశాంకమయూఖపంక్తి నె
న్నున వెసదుస్సి పాఱె నన నూత్నసరోరుహపత్రనేత్రకున్. 97
క. అత్తఱి సఖి డగ్గఱి యా, బిత్తరిఁ దనబాహులతల బిగియించి కడున్
మెత్తని మేచెమటలు వడి, నొత్తుచు విధుమణివితర్ది నునిచినయంతన్. 98
చ. కలఁక తలంక నేత్రములకాఁకఁ దెరల్పఁగఁ జేరవచ్చెనో
పలుమఱు నేత్రరాజ మనఁ బయ్యెదకొంగు మెఱుంగుఁ గన్నులన్

1. చ-మాపు. 2. క-చెలులుశీర. 3. చ-వనిత.

నిలిపి లతాంగి యేడ్చె మది నెవ్వగతోఁ గురరీపరంపరా
కలితవనీనదీవతరకాకలికాకలనిస్స్వనంబునన్. 99

క. ఈరీతి నెన్నువమ్మున, గూరిన వగ నేడ్చునట్టి కుముదిని నెదపైఁ
జేరిచి చెక్కుల డిగుక, న్నీరు కరాబ్జమునఁ దుడిచి నెచ్చెలి పలికెన్. 100

చ. వదలుదురమ్మ యాత్మకులవర్తన మీలువు దూలి సారెకున్
బవరుదురమ్మ లేఁదలిరుఁ బ్రాయపు మేని నలంతురమ్మ యి
ట్లదరుదురమ్మ మండుశశికైనఁ దలంకక పండువెన్నెలన్
గదియుదురమ్మ యిత్తెఱఁగు కన్నెకుఁ జెల్లునటమ్మ నెచ్చెలీ. 101

మ. మెలఁతా నీవిఁకఁ జింతసేసెదవు సుమ్మీ వీరసేనుండు నీ
లలితోద్యానముఁ బాసి వచ్చి నిజలీలాగేహముం జేరె నా
చెలువుం డచ్చట నుండఁబోలు నిఁక నీచేకంకణం బిమ్ము నే
నల కేళీవని కేగి యీక్షణమె నీప్రాణేశుతోఁ దెల్పెదన్. 102

తరళికచంద్రభానుకడకేగుట.

క. అని తెలియఁబలికి యపుడా, వనితకుఁ గ్రమ్మఱఁగ శిశిరవస్తువు లెల్లం
బనుపఱిచి యాకెవలయము, తన చేఁ గొని కూర్మిబోటి తరళిక యంతన్.

ఉ. చెంతఁదనర్చు కేళివనిఁ జేరి నికుంజము లెల్లఁ గాంచి య
త్యంతసుగంధబంధురలతాంతనితాంతవిలోలగుచ్ఛకా
శ్రాంతసరన్మరందరససంగతభృంగతతారవావృతా
శాంతలతావితానకలికాలయ మొక్కటి డాయవచ్చినన్. 104

క. మును తావీఁశియ మీటుచుఁ, గనుఁగొన్నలతాంగి రూపు కన్నుల యెదుటన్
గనుపట్టఁ జంద్రభానుఁడు, మనసిజశరధూయమానమానసుఁ డగుచున్.

ఉ. నీపవనీధునీకమలినీమకరందమిళన్మిలిందగ
ర్జాపటుఝుంకృతుల్ సయిఁపఁజాలక నీలకచాకుచాంతరా
రోపిత మైనడెందము మరు ల్మగిడింపఁగలేక చిక్కి లీ
లాపరికల్పితైందవశిలాతలశీతలవేదికాస్థలిన్. 106

క. పవళించి చందనాచల, పవమానకిశోర [1]చలితఫలగళితరసా
సవమత్త[2]కీరశారీ, రవములు బెట్టుగ హృదంతరం బెరియింపన్. 107

క. తలపోయుఁ దలఁకు నలుకుం, దలవంచుం దత్తఱించుఁ దహతహపడు లోఁ
దిలకించుం బులకించుం, బలికించు న్బట్టబయల భామా యనుచున్. 108

1. చ-జనితఫల. 2. క-కీరశారికరవములు.

## చంద్రభానుని పరితాపము.

సీ. హృదయవాసిని యైనమదిరాక్షి చేరవచ్చి లేఁతపాంథమం బలవరింప
స్వాంతసంగత యైన కాంతచేఁజూపులు తేపవ్రనఁ జాంచల్య మనుప్రకటముఁ
జిత్తచారిణి యైనమత్తకాశినిమోవి కన్నులకెఱసంజ గడలుకొలుప
సంకల్పగత యైనపంకజాననకౌను తానవం బంతకంతకు నిగుడ్ప
మానసావాసయైనభూజానిపుత్త్రి, పిఱుఁదు కోర్కులకెంతయుఁ బెంపు నెఱపఁ
బలవరించుచు నాచంద్రభానుఁ డపుడు, నిలువరింపఁగలేక కన్నియఁ దలంచి.

చ. చుఱుకుచుఱుక్కునం దనువు సోఁకెడు వెన్నెల కాలుకొల్పుచుం
జఱవఁగఁ జొచ్చెఁ దెమ్మెరలు చక్కనిజోడు శరమ్ము లేయఁగాఁ
గఱకరియయ్యె నిట్టియెడఁ గౌఁగిట నద్దయుఁ జూడ కక్కటా
తెఱవ యెఱింగితే నెనలు దీర్పఁగదే [1]తగవే కలంపఁగన్. 110

ఉ. కన్నుల దోరచాయ లలికంబున లేఁజెమ గుబ్బగుబ్బలన్
క్రొన్నెలవంకసొమ్ము లఱక్రొమ్ముడిజాఱినపూలు వాతెఱం
జిన్నిమెఱుంగుకెంపు లెదఁజిట్లిన గందము గల్గునట్లుగాఁ
గన్నియ .... .... .... .... .... 111

ఉ. రాణమెఱుంగువెన్నెలఁ గరంగిన క్రొన్నెలఱాలమేడలం
బ్రాణసమా .... .... .... .... ....
వీణయముట్టి పంచశరవిక్రమము ల్పచరించుగీతముల్
గాణతనంబుమీఱఁ బలుకం గలభాగ్యము నాకుఁగల్గునే. 112

చ. పలుచనిమేను లేఁగొనరు[2]పల్కులు ముద్దులమోము చిన్నిగు
బ్బలు జడగూడువెండ్రుకలు బంగరుచెక్కులు చేరెఁడేసిక
న్నులు నునుముత్తెముల్ మినుమినుక్కనుకౌను మెఱుంగువెన్నెలల్
కులికెడు నవ్వునుం [3]గులుకుకోమలి ని న్మదిఁ [4]జర్చచేసెదన్. 113

క. కలువా కనుఁగవ గొఱనెల, చెలువా నెన్నొసలు కప్పుఁజిలువా జడ యో
చెలువా పదివే లైనను, విలువా నినుఁజూచి గారవిలువారలకున్. 114

క. తుహినకరవదన నీగతి, బహుభంగులఁ బలికి చంద్రభానుండు ముహు
ర్ముహురుపహితవిరహార్తిం, దహతహపడి యాత్మచర్యఁ దలఁచి కలంకన్. 115

1. ట - తగదే. 2. చ - పల్కులముద్దులమోము. 3. చ - ట - గలుగుకోమలి.
4. చ - ట - చింతసేసెదన్.

సీ. ఉన్నట్లు యుండి ప్రద్యుమ్నుతోఁ గలహించి విద్యార్థినై యేల వెడలవలసె
వలసెఁబో త్రోవ దుర్వాసుశాపంబున విజయులోలుం డేల విడిచిపోయెఁ
బోయెఁబో నేను నీ[1]పురిసొచ్చినది మొద లీ[2]కుముదినిరూపమేలవింటి
వింటిఁబో వనములో వీణవాయించుచో నేతెంచునాకన్నె నేలకంటిఁ
గంటిఁబో యంతలోనన కమ్మవింట
గొనయ మెక్కించి మరుఁ డేలకూఁత సేసె
నకట శౌరికి సత్యకు నవతరించి
నట్టినాకును దైవమీ[3]యడలు దెచ్చె. 116

సీ. తరియింతు నెటువలెఁ బరవాది విరవాది నెఱవాదితాపుల[4] మెఱయుగాడ్పు
భరియింతు నెటువలెఁ బరువంపుమరువంపుగరువంపువిలునింపుశరచయంబు
మలఁగింతు నెటువలె నెలదీవియలదీవి నలదీవియలమీఱుతలిరుడాలు[దలు
దొలఁగింతు నెటువలెఁ బలుమాఱుఁ బొలిమీఱు బలుమారుబాబాలకలికిరో
సొరిది నేత్రాబ్జములు విచ్చి చూతు నెట్లు
సాంద్రమోహాతమంబుతో సైఁతు నెట్లు
ప్రౌఢశశిమాంత్రికవికీర్ణపధికహానన
భసితసితసాంద్రచంద్రికాపాటవంబు. 117

మ. అనిపల్కన్విని యంత నాతరళికాబ్జామోద యత్యంతసం
జనితాశ్చర్యముతోడ నాత్మ నతని స్సత్యాసుతుం జంద్రభా
నునిగా నెన్నుచు నాకుమారకుపయి న్నాల్కొన్న యాత్మీయస
ఖ్యనురాగం బుచితోపయుక్త మని యత్యానందముం జెందుచున్. 118

సీ. చంద్రభానుఁడు కాన సమధికంబై మించు వెల్లఁదనంబున వెలయువాని
గృష్ణపక్షంబున నెసఁగినరాజౌట నంతకంతకుఁ గార్శ్య మడరువాని
బ్రద్యుమ్నరుచిగాన భరియింపఁగారాని గాటంపుఁగాఁకచేఁ గరఁగువాని
నిత్యానిరుద్ధసుస్నేహదీపకుఁడౌట మలయానిలమునకుఁ దలఁకువాని
నరయ సత్యాత్మసంభవుఁ డైనకతన
నతనుశరవర్ధితాంగుఁడై యలరువాని
నాకుమారవరేణ్యు డాయంగ నరిగి
వినయవినమితవదనయై వనజగంధి. 119

1. చ-ట - పురిఁజేరినది. 2. క - కుముదినిరూపంబు గుఱుతువింటి. 3. చ - యడరు.
4. చ - నొరయుగాడ్పు.

తరళిక చంద్రభానునకుఁ గంకణము నిచ్చుట.

గీ. వేడ ¹చిత్రేశు నాత్మజాతేశ   కాంత పంపుమని నిజకటకంకణంబు
ననిచె దేవర కిడెఁ గొని యవధరింపు, మనుచుఁ బ్రాంజలియైన నయ్యుపవనభర్త.

క. వితతాశ్చర్యతరంగిత, మతియై యాలేఖచేత మణిమయవలయం
బతిమోదంబునఁ గైకొని, క్షితిపుండులవాక్యసరణిచే నిట్లనియెన్. 121

శా. రాగాంకూరలతాలవాలమవొ ప్రాగ్భాగ్యకూటాక్షేపణో
ద్యోగాఢస్థితకుండలాకృతివొ ²హృత్యక్తాంగనాధైర్యసం
భాగాభాంగజసత్త్రవాగురవొ లేదా మత్తమో³హాహువుం
బ్రాగల్భ్యంబునఁ ⁴ద్రుంచుచక్రమవొ భామాకంకణగ్రామణీ. 122

క. మణిబంధబంధురస్థితి, మణిబంధనవాధివాసమహిమ మెఱయు నిం
బ్రణుతించెద ననుఁ గన్నా, మణిబంధుం జేయవే సమంచితకరుణన్. 123

క. చెలువ మతి తెలుఁగు నాతోఁ, బలికి కలఁక వడఁతు ననుచుఁ బఱతెంచితివా
వలయ ప్రకోష్ఠవాసికి, ⁵నలవడు నీమదికిఁ దెలియు నంతర్వార్తల్. 124

చ. అగణితమన్మథాశుగమహోజ్వలితానలమామకీనహృ
ద్విగుణితతాప మెంచదొ మది న్మహిభృద్వరజాత యాసమ
గ్రగుణకలాప సింధుమణి గానియెడన్ ఘనసారయుక్తిఁ జె
న్నగు విమలోర్మికం బనుచ కంపునె నిన్నొకకంకణాకృతిన్. 125

చ. తొలువబజాచకయ్యమునఁ దొయ్యలి నీవికి నెగ్గు వేఁ దమిం
దలఁచిన నడ్డగించుకరతామరసంబునఁ గూడునిన్ను నే
నలఁకువబెట్టఁ గంకణమ నమ్ము భవద్రుచిం గాంతయంగముం
దెలియఁగఁ జేయుమేలు మదినిల్పదఁ గీ లెడలింప నొక్కెడన్. 126

మ. చెలిసంతోషముఁ గాంచునే సఖులకున్ స్నేహంబు సంధిల్లునే
లలనాపోషితశారికాశుకమరాళంబు ల్సుఖం బుండునే
సిలుగు ల్మానునె పంచసాయకుఁడు రాజీవాక్షిపై రత్నభా
నిలయం బావలయంబ తెల్పు మని కన్నీరొడికల్గట్టఁగన్. 127

గీ. వివశుఁడైయున్న యమ్మహీవిభుని జేరి, శిశిరవస్తులచేఁ గొంత సేదఁదేర్చి
తలిరుకెంజాయసురటిచేనలవరించి, యొయ్యవిసరుచుఁదరళికాయువతివలికె.

---

1. చ-ట-చిత్రేశ. 2. చ-హృద్యోపాద్యధీభావముద్రా గాఢోద్యదనంగపాశమవొ. ట. హృద్యోపాద్యధీభాగముద్రా గాఢోద్యమనంగపాశమవొ. 3. చ-ట-వైఖరిన్. 4. చ-బాపుచక్రమవొ. 5. చ-ట-నలవడు నేనీకుఁ దెలియు నంతర్వార్తల్.

క. జననాథచంద్ర యేమని, వినిపించెద మున్ను నిన్ను వీణారతునిం
గనుఁగొని కుముదినియటవో, యినమొదలుం దాల్మి దూలి నొచ్చినకూర్మిన్.

సీ. మలయానిలంబు పైఁబొలసిన నీభుజాపన్నగంబుల మది నెన్నునయ్య
కమలకాండములు పైఁగ్రమ్మిన నీమోననేందుమండలము నూహించునయ్య
పవరుతుమ్మెదలు పైవ్రాల నీనాసికావికచచంపకము భావించునయ్య
రాయంచపదువు లాటడివెట్ట నీకుంతలఘనాఘనములఁ దలంచునయ్య
భ్రమసి యూరక పనిలేనిపనికిఁ గూర్మి, చెలియఁ జీరెదనని నిన్నుఁ జీరునయ్య
చిత్రఫలకంబుపై నలచిత్తజాతు, వ్రాయఁదలపోసి నీరూపు వ్రాయునయ్య.

ఉ. చక్కెరబొమ్మ కొమ్మ యెలజవ్వని యచ్చట నిట్లు గుంద నీ
విక్కడ నుందువయ్య చెలి యీలువుదూలి మనోజుగాసిచేఁ
జిక్కెఁగదయ్య యింతపని సేయుదు రయ్య యిఁకేమి సేయునో
చుక్కలరాజు వేఁడితలసూపెను రాగదవయ్య మ్రొక్కెదన్. 131

[1]మ. అని సల్కన్ విని చంద్రభానునసుధాధ్యక్షుండు సంతోషనీ
రనిధిం దేలుచు నోలతాంగి యిపుడే ప్రచ్ఛన్నవేషంబుతో
నునికిం జేసి యథేచ్ఛఁ [2]జేర నది నీవూహించి యేవేళ నీ
కనుకూలం బగు నట్టివేళ ననుడాయ న్వచ్చి పల్కించినన్. 132

క. హరి రుక్మిణిఁ బలె నేనుం, దరుణీమణిఁ గొంచు శత్రుదమనుఁడనై మా
పురికేగెద మది నీవోం, డరయక పరికింపు మట్టియవకాశంబున్. 133

చ. అని పతి వెండియుం బలుకు నంగన నాతెఱఁ గానుపూర్విగా
వనితకుఁ దెల్పు మేను దనవాఁడ సుమీ యనిపల్కు నాపయిం
దనదయ యుండనిమ్మనుము దైవికమై యితరేతరంబు పె
చ్చినతమి నెట్టులైన దరిఁజేర్చు నదృష్ట మటంచుఁ జెప్పుమీ. 134

చ. తరళిక నీవు వచ్చి కడుఁ దామసమయ్యెను పద్మకంటి లో
విరహదవానలంబు కడువెగ్గలమైన సహింప కేగతిం
బొరయుచునున్నదో మగిడిపొమ్మని యూర్మికఁ జేతికిచ్చినన్
దరుణి జోహారు దేవ యని తన్మణిముద్రికఁ గొంచు గొబ్బునన్. 135

శా. ఆలీలావనవాటిఁ బాసి తరుణీహర్మ్యంబు సొత్తెంచి యా
నాళీకాక్షికి లేమ తాఁ జనినచందం బంతయుం దన్మహీ

1. ట - లో నీసన్న[illegible] మాటుగ "అనినవిని" యని వచనముగలదు. 2. చ - రాఁజనదు.

పాలోదంతముఁ బంచనాయకునివో ఁపాంచజిత్యముం దెల్పి కెం
గేల న్రంజిలు ముద్దుటుంగర మొసంగె న్మందహాసంబునన్. 136

చ. ఒనఁగినఁ బొంగి యచ్చెలువ యొయ్యన నేత్రయుగంబుఁ జేర్చి సం
తసమునఁ గేలఁదాల్చియుఁ బునఃపునదుక్తసఖీసదర్మ వా
గ్విసరరసంబు చిప్పిలుచు వీనులవిందులు సేయఁ గొంతచిం
తనడలి యున్నయంతటఁ గనం దగియె న్నళి ధూసరచ్ఛవిన్. 137

గీ. భార్గవుఁడు గానఁ బరుసంపుఁ బన దలిర్ప
రాజజృంభణ మాత్మ నోర్వంగ లేక
తదపకర్షంబుకొఱకు నభ్యుదయమందు
చొప్పుతోఁ దూరుపున వేగుఁజుక్కతోఁచె. 138

మ. కమలాప్తుం డిట బ్రహ్మయై యఖిలముం గల్పింపఁగా నిమ్ము హూ
ర్తము బ్రాహ్మంబనఁ బొల్చు నేతదనుసంధానంబు నించు న్నితా
ర్థములంచున్ జనకోటికిం దెలుపుచందంబొప్పు ఘోషించెఁ ద
త్సమయారాధనజాతవాజ్మహిమమించం దామ్రచూడౌఘముల్. 139

చ. చెలియలి యిల్లు మందటిలఁ జేసిన దోషము సద్వసూత్కరం
బులు గిలుబాడనైనయఘముల్ బహుచక్రవిమర్దనంబునం
గలిగినదుష్కృతంబుఁ దొలఁగన్ భృగుపాతమొనర్చెనో యనన్
గలువలఱేఁడు వ్రాలెఁ దువిగట్టునయుండి కళావిహీనతన్. 140

క. అర్కుఁ డపరాద్రి కేగుచో నతనికాంతిఁ
గొల్లగొని యాతఁ డేతేరఁ గొఱలుభీతి
నప్పగింపఁగ నెదురుగా నరిగి కాచి
యున్న శిఖియనఁ బ్రాచిఁ జెన్నొందెసంధ్య. 141

[1] ఉ. కాలపయోదమూర్తి పయిఁ గ్రమ్మి మహాబిలమండలంబు త
త్పాలకుఁడైన బుకువరుబంధుయుతంబుగఁ గూల్చి తత్ప్రభు
త్వాలఘుకాంతిలక్ష్మిఁగొని యయ్యరుణద్యుతిరత్నరాజముం
జాలసముద్ధరించె హితచక్రముఖాబ్జము లుల్లసిల్లఁగన్. 142

[2] మ. మునుదానేగెడువేళఁ జీఁకటులఁ బైముక్కాఁకగాఁబంచి వె
చనుదేరం దము [3] గామినింబలె గుహాసద్మంబుల న్వానిలోఁ

1. ట - లో లేదు. 2. ట - లో లేదు. 3. చ - కానివింబలె.

గొని యుండంగని తచ్ఛిఖాగ్రహణ మహ్యం బల్కఁ గావించెనో
యనఁ బైపై నిగిడెం గరంబు లగకూటాభోగభాగంబులన్. 143

మ. సరవిం దాపురబాసవాల్మగువ భాస్వద్రామపాదాప్తి భా
గ్యరమోత్కర్షము కల్మిఁ గర్కశమహోగ్రావస్థితు లోవ్వ ముఖ
స్ఫురణల్వాల్చి సముజ్జ్వలావయవయై సొంపూనఁ దత్ప్రాప్తదు
స్తరశాపాక్షరపంక్తినా వెడలె నంతర్మగ్నరోలంబముల్. 144

గీ. అట్టియెడఁ గాల్యకృత్యంబు లలసగతులఁ
గడపి నెవ్వగఁ గుముదినీకాంతయాత్మ
నెలకొనిన తాప మొరులకుఁ దెలియనీక
విభుని వరియింప సమయంబు వెదకుచుండె. 145

మ. అలఘుజ్ఞానతరంగరంగదళికస్యందిద్రవేందుస్పృహా
చల[1]షట్కంజభుజంగ జంగమగుణాంచత్కాంచనోర్వీధరో
జ్జ్వలలక్ష్మీ[2]వశగాంగ గాంగఝుర[3]వైశద్యాస్పదాభంగని
ర్మలచిత్తోజ్ఝితసంగ సంగరజయప్రాప్తిప్రహృష్టార్జునా. 146

క. అత్రిమునిపూర్వపర్వత, మిత్ర జగన్మిత్రబల[4]సమిత్రస్తగుహా
చ్ఛాత్రోష్మపితిహోత్రధ, విత్ర యసత్తృణలవిత్ర వినయపవిత్రా. 147

[5]మాలిని. ఉదళదహరసద్మాభ్యుద్గతోన్నిద్రపద్మా
పదయుగచిదమోఘాపాతిదివ్యామృతౌఘా
విదితశయనయోగావిష్కృతోద్బోధనాగా
హృదయ[6]నిటలసీమాహిండితాఘూర్మధామా. 148

గద్య. ఇది శ్రీదత్తాత్రేయయోగీంద్రచంద్రచరణారవిందవందనసమాసాదిత సరసకవితారసోదాత్తదత్తనామాత్యసోదర్యమల్లనమంత్రివర్యప్రణీతంబైన చంద్రభానుచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

1. చ - షట్కాబ్జ. 2. చ - శుభ. 3. చ - వైపద్యాస్పదా. 4. చ - సమిద్ధ్వస్తగురుచ్ఛాత్రోష్మ. 5. ఈపద్యము ట - లో లేదు. 6. చ - నికటసీమా.

శ్రీరస్తు.

# చంద్రభానుచరిత్రము.

## పంచమాశ్వాసము.

క. శ్రీయోగ [1]స్త్రీయోగప, ణాయితరోమాంచభూషణనిరీక్షణ యా
మ్నాయమయభాషణ కృతా, ధ్యాయస్మృతనామధేయ దత్తాత్రేయా. 1
వ. అవధరింపు మాసమయంబున. 2
సీ. పరవాహినీవిజృంభణము మానుచు మేటి నిర్జిత్రశరసముత్సేకవేసి
చనుదెంచు రాజహంసముల నేలెడు జేడు కువలయామోదానుకూలవృత్తి
కమలాధివాసమై కనుపట్టుగుణశాలి మిత్రనిర్వ్యాజలక్ష్మీవిధాయి
సత్పరంపరకుఁ దేజంబు గూరుచు పెద్ద యతులవిధుప్రసాదైకపాత్ర
మఖిలభువనంబుపంకంబు లడఁచుసుకృతి, సకలఫలవైభవంబు లొసంగుదాత
చంచలారంభములు లేనిచారుమూర్తి, జగతి మించె శరత్కాలచక్రవర్తి. 3
చ. సరసవనాంతరాళవికసద్విషమచ్ఛదధూళికాపరం
పరలు మరుత్ప్రచారములఁ బైపయి నంబరవీథిఁ బర్వి పాం
డరజలదప్రకాండము లనంగఁ గనుంగొనవయ్యెఁ గానిచో
గరిమ వహించునే యవి జగజ్జనరూఢసితాభ్రసంజ్ఞలన్. 4
చ. సరసిజపాంసుసంవలితసైకతము ల్విలసిల్లునేఱులన్
శరదృతుభర్త నీరమయశాటిఁ దెరల్చినఁ జంద్రకావియ
స్తరులముసుంగులం దగునితంబములో యనఁ బ్రాంతసీమఁ ద
త్కరనఖరాంకరేఖ లనఁగాఁ దెరతాఁకుడుజాడ లింపగున్. 5
మ. అకరు ల్నిప్పులు తావిపుప్పొడి సముద్యద్ధూపచూర్ణంబు కే
ళికరాళీప్రకరంబు, ధూమము మరాళీపక్షము ల్తాలవృం
తకము ల్గాఁ దగు రాజహంసతతిచెంతం బద్మిను ల్పూనుధూ
పకరండంబులువోలె సామిదళితాబ్జంబుల్ సరోవీథులన్. 6
క. శరములు గావున మీఁద, న్నరువులు నెలకొల్ప నవఁగ నుతిఁగని హరిదం
తరములఁ బూచినకసుములు, వరఁగె న్వలరాజు జల్లిబల్లెము లనఁగన్. 7

---

1. చ-ట-శ్రీయోగ.

గీ. దగులవిచ్చినకపురంపుఁదరులపొరల, నురలుగంబూరములుఁగాలికుప్పరంబు
లెగయఁదగునేర్లుతమనీటికగుకలంక, లడఁచుమానికి నుడుగరలనిపె ననఁగ.

చ. అలయతిమాత్రవృష్టిసమయంబున నెప్పటియట్ల ధాత్రిపైఁ
గలయఁగఁ బర్వ లేక శశికాంతి నభస్థలియందపేరి యా
జలదపువేళ రూపఱిన స్వచ్ఛతనుచ్ఛట గానవయ్యె నా
నలరె శరద్ఘనంబులు సితాంబుజపారదనారదచ్ఛవిన్. 9

ఉ. బాహుల మీగతిన్ ధరణిభాగమున న్నెఱిఁ జూపుచుండ వై
వాహికలగ్నయోగ్యశుభవాసరము ల్చనుదెంచిన న్మహో
త్సాహముతోడఁ జైద్యవసుధాపతి యాత్మకుమారమౌళి కు
ద్వాహముసేయఁ బూనిక ముదంబు హృదంబుజసీమఁ దోఁపఁగన్. 10

[1]గీ. ఆప్తవర్గంబుతో రహస్యంబుగాఁగఁ, గొంతసేపు విచారించి కుండినమున
రుక్మబాహుప్రభునిపుత్రి రుక్మగాత్రి, కుముదినీకన్య యునికి భావమునఁ దెలిసి.

చ. తమకుఁ బురోహితుం డగుపితామహసన్నిభు గాలవాఖ్యసం
యమిఁ గదియంగఁ బిల్చి విమలాత్మ విదర్భధరిత్రి కేఁగి సం
భ్రమమున రుక్మబాహునరపాలశిఖామణిపుత్రి యైనయా
కుముదిని ధృష్టకేతువునకుం దగ వేఁడుము పొమ్ము గొబ్బునన్. 12

చ. అనవుడు నట్లకాక యని యమ్ముని కుండినరాజధానికిం
జని తనరాకభీమనృపచంద్రతనూభవుఁ డైనరుక్మబా
హున కెఱిఁగింప నాతఁడు సముత్సుకుఁడై యెదురేఁగి యగ్రపూ
జన మొనరించి తెచ్చి మణిసాంద్రహిరణ్మయపీఠి నుంచినన్. 13

గీ. కుశల మర్థించి యమ్మునికుంజరుండు, కువలయాధీశ నీపుత్రిఁ గుముదినీల
తాంగి శిశుపాలనృపతినిజాత్మజునకు, నడిగి రమ్మని ననుబంచె నాదరమున

[2]మ. జననాథాగ్రణి యేమిచెప్పుదు భుజాస్తంభోరుకుంభీనసా
భినవక్ష్వేళశిఖాయితాసిముఖనిర్భిన్నారియౌ నాకువా
రుని[3]యౌదార్యము రూపు రేఖయును నోర్పు న్నేర్పుఁ గారుణ్యవ
రనముం గీర్తనము న్బలంబు చలము న్రాదెట్టిరాచూలికిన్. 15

1. టలో 11–12–13 పద్యములకుబదులుగా; వ. విచారించి రుక్మబాహునిపుత్రి యున్కిఁ దెలిసి నిజపురోహితుం డగుగాలవాఖ్యునిం బంచిన నతండునుం జని భీమనృపతనూభవుం డైనరుక్మబాహునిం గని. అనువచనము గలదు. 2. ట-లో నీపద్యము లేదు. 3. చ-యౌదార్యమువార్థ ధైర్యమును.

శ్రీః

# ఆనెగొంది వెండిశాసనము.

(శివాజీనాఁటిది—శ. స. ౧౫౭౯.)

నేను ౧౯౧౭-వ సంవత్సరము బళ్లారిలో డిప్యూటీకలెక్టరుగా నున్నసమయమున నా కత్యంతమిత్త్రులును దత్కాలమం దానెగొందిసంస్థానాధిపతియు నైన శ్రీమంతు శ్రీరంగదేవరాయలవారు ప్రీతిపూర్వకముగా నాహ్వానము చేసినందున నే నానెగొందికిఁ బోయి మూఁడుదినము లుండి రాయలవారి యాతిథ్యమునకుఁ బాత్రమైతిని. ప్రసంగవశమున సంస్థానముపూర్వచరిత్రముం దెలుపు పత్రము లేవైన నున్నవా యని యడుగ నున్నవన్నియు "A never to be forgotten Empire" అనుగ్రంథమును రచించిన శ్రీ బి. సూర్యనారాయణరావుగారి కదివఱకే యీయఁబడిన వనియు, శివాజీనాఁడు పుట్టిన వెండిరేకుశాసన మొకటిమాత్త్రము గలదనియుఁ జెప్పి యాశాసనము రాయలువారు నా కిచ్చిరి. అది నేను చెన్నపురి తీసికొనివచ్చి దానికిఁ బ్రతిబింబపుదిమ్మఁ జెక్కించి మాతృకను దిరుగ రాయలువారికిఁ బంపివైచితిని. అదియే ప్రస్తుతశాసనము. ఇది ౧౨ అంగుళములపొడవును ౬ అంగుళముల వెడలుపును గలపలుచని వెండిరేకుపై నొకప్రక్క నంతయు రెండవప్రక్కను గొంతభాగమును జెక్కఁబడియున్నది. భాషయు లిపియుఁ గూడ మహారాష్ట్రము. లిపిపోలిక మహారాష్ట్రములో మోడీకత్తని చెప్పుదురఁట. బ్రహ్మశ్రీ కోమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు మూలమును దెలుఁగక్షరములలో వ్రాసి దానికి సరియైన తెలుఁగర్థము కూడ వ్రాసియిచ్చినందున వారి కనేక వందనము లర్పించుచున్నాఁడను.

కర్ణాటకప్రభు వగుశ్రీరంగరాయలు తనరాజ్య మన్యాక్రాంత మయినందునఁ బరస్థలమునకుఁ బోయి యచ్చట మృతినొందినందున వారిదేవి యగు తిమ్మాజియమ్మగారు తమకొమాళ్లు తిరుమలరాయలు, రామరాయలు ననువిద్దఱను వేంకటకృష్ణప్ప యనువకీలును సహాయమిచ్చి శ్రీశివాజీప్రభువునొద్దకుఁ బంపఁగా నాయన వారిదుస్థితికి వగచి వారిజీవనార్థమై యానెగొందికి సమీపమందలిగ్రామములు కొన్ని "జాగీరు"గా నిచ్చిన ట్లీశాసనము చెప్పుచున్నది.

క్రీ. ౧౫౬౫ సంవత్సరములో జరిగిన తాళికోట మహాయుద్ధమునందు మహమ్మదీయరాజులచేఁ గర్ణాటరాజులు పరాజితులై విజయనగరరాజధానిని విడిచి పెనుగొండ పాఱిపోయి రనియు నప్పటినుండియుఁ గర్ణాటరాజ్యము క్రమక్రమముగ క్షీణించుచు రాఁగాఁ దూర్పుభాగములు గోలకొండరాజులును బడమటిభాగములు విజయాపురపు (Bijapur) రాజులు నాక్రమించుకొని రనియు, నంతలో శివాజి విజయాపురపురాజుల నెదిరించి స్వతంత్రుండై వా రాక్రమించుకొనియున్నభూములఁ గొన్నింటిఁ దా నాక్రమించుకొనియె ననియుఁ జరిత్రజ్ఞులకుం దెలిసినవిషయమే. ప్రస్తుతశాసనమందుఁ బేర్కొనఁబడిన శ్రీరంగరాయలే కర్ణాటరాజు లని పేరుపొందినవారిలోఁ గడపటివాఁడుగాఁ దోఁచుచున్నది. ఈతఁడు వేలూరిలో రాజ్యముచేయుచుండి శత్రువులచేఁ బరాజితుఁడై చెంజీ, తంజావూరు, మధురదేశముల నేలుచుండినసామంతరాజుల యండఁ జేరి యుండఁగా, ఇక్కేరిసంస్థానాధిపతి యగువీరభద్రనాయఁకుని జంపి యతనితమ్ముఁ డగుశివప్పనాయఁకుఁడు రాజ్య మాక్రమించుకొని తన యధికారమును స్థిరపఱుచుకొనుటకై మహిసూరురా జగుచిక్కదేవరాయని సాహాయ్యము గోరి తిరస్కృతుఁడై రాయనామావశిష్టుఁ డైనశ్రీరంగరాయలఁ జేపట్టి యతనిజీవనార్థము తనసీమలోని హాసను, బేలూరు ననుపరగణాల నిచ్చి నిలువఁ బెట్టుటచే రాజభక్తుఁ డనుఖ్యాతిం బడసినందున రాజభక్తు లగుకొందఱ యితరసామంతరాజుల సాహాయ్యమును సంపాదించినట్లును పిదప నీశివప్పనాయఁకునికిని జిక్కదేవరాయలకును యుద్ధముజరగినట్లును దిరుమలార్యకృత మగు "చిక్కదేవరాయవంశావళి" యనుకన్నడవచనగ్రంథమందుఁ జెప్పఁబడియున్నది.*

ఈవిషయమై "శివతత్త్వరత్నాకర" మను సంస్కృతగ్రంథము సప్తమకల్లోలమందుఁ జతుర్దశతరంగమునఁ గూడఁ జెప్పఁబడియున్నది.†

రామరాజీయకృతిపతి యగుకోదండరామనృపతి ఆసన మనుపట్టణము సమీపమున మైసూరువారితోఁ బోరి వారిని జయించిన ట్లాగ్రంథమం దున్నది. ఇదియే చిక్కదేవరాయలకును శివప్పనాయఁకునకును జరిగినయుద్ధము. ఈ యుద్ధమునందు శ్రీరంగరాయలు, నాతనిజ్ఞాతి యగుకోదండరామరాజును శివప్పనాయఁకునిపక్షమునఁ బోరినట్లును శ్రీరంగరాయలు యుద్ధములో మృతిపొందినట్లును గనఁబడుచున్నది. ఇప్పటి కప్పుడే విజయనగరప్రాంతదేశ మంతయు

* చూ. Sources of Vijayanagar History pp, 309 & 310.

† చూ. Sources of Vijayanagar History pp. 356 & 357.

శివాజీస్వాధీన మైనది శ్రీరంగరాయలయనంతర మతనికొడుకులను శివప్పనా యఁకుఁ డాదరింపనందున నట్లే చేసి శివాజీయొద్దకుఁ బంపఁగా శివాజీ కరుణించి వారిజీవనార్థమై ప్రస్తుతశాసనములో నుదాహరింపఁబడిన గ్రామముల నిచ్చిన ట్లగపడుచున్నది. ఈగ్రామములు తుంగభద్రానదికి దక్షిణభాగమున విజయనగరమునకు సమీపమున నున్నవి. రామరాజీయమువలనఁ గోదండ రామరాజీకాలమునందు, ఆనెగొందిసంస్థాన మేలుచున్నట్లు కనుపట్టుచున్నది. శివాజీచే దత్తములైనగ్రామములు కోదండరామరాజుదేశములోఁ జేరనివై యుండవచ్చును. పిదప నీరెండుసంస్థానములును జేరి యనేకపరిణామములను బొందఁగా నిప్పటియానెగొందిసంస్థానము నిలిచినది. ఇదియంతయుఁ దుంగభద్ర కుత్తరభాగమున నిజామురాష్ట్రములోఁ జేరియున్నది.

ప్రస్తుతశాసనమువలనఁ గర్ణాటరాజ్యముయొక్క యత్యంతావసానదశ యెట్లుండినది తెలియవచ్చుచున్నది. శాసనకాలము ౧౫౭౯-వ శకసంవత్సర మునకు సరియగు హేవిళంబిసంవత్సర వైశాఖశు ౧౨. ఈసంవత్సరము క్రీ. ౧౬౫౭-వ సంవత్సరమునకు సరిపోవును.

ఈశాసనములలోఁ జేర్కొనఁబడిన శ్రీరంగరాయలు క్రీ౧౬౩౯సం వత్సరములోఁ జెన్నపట్టణప్రదేశము నింగ్లీషువారి కిచ్చిన శ్రీరంగరాయలే. ఈతఁడే కర్ణాటరాజు లనిచెప్పఁదగినవారిలోఁ గడపటివాఁడు. ఇతనిపిదపఁ గొంతకాలమువఱకుఁ గొందఱు కర్ణాటరాజుల మని పేరుపెట్టుకొని యుండిరి గాని వారిరాజ్యము నామావశిష్టము. శ్రీరంగరాయలు క్రీ౧౬౬౫సంవత్స రమువఱకు జీవించియున్నట్లు కొన్నిశాసనములవలనఁ గనఁబడుచున్నది.* మఱియు, శివాజీ కర్ణాటదేశమును క్రీ. ౧౬౭౭సంవత్సరములో నాక్రమించు కొన్నట్లు కొన్నియాధారములవలనఁ గన్పట్టుచున్నది. (చూ. History of Aurangazib, by Sarkar Vol. IV, Ch. 43.) వీనినిబట్టిచూడఁ బ్రస్తుతశాసనము కల్పితమేమోయని యనుమానము పుట్టుచున్నది. ఎట్లయినను శాసనమును బ్రకటించుట యుపయోగకరమే. సత్యాసత్యములు చర్చవలనఁ దేలును.

జయంతి రామయ్య.

* చూ. The third Vijayanagara Dynasty by Row Sahib H. Kristna Sastri.

— శాసనమూలము - మొదటిప్రక్క. —

౧ శ్రీ
౨ రాజేశ్రీ తిరుమలరావగోసా
౩ వీయాసిం
౪ శ్రీమద్రాజాధిరాజరాజపరమేశ్వరశ్రీవీరప్ర
౫ తాపశ్రీవీరసీవాజీరాజే కృతానేకవి
౬ జ్ఞాపనా తుమచే వడీల రాజేశ్రీశ్రీరంగరాజయా
౭ ణీరాజ్యఅనాక్రాంతహోఉన పరస్థలిదే
౮ వాధీనజాహాల్యాకడునపుఢేంతుమచేసంరక్షణ
౯ హ్వావే యాబదల మాతోశ్రీ తిమాజేంమాయాణితుమ్హా
౧౦ సవరామరావ ఉభవతాస వ్యంకటకృష్ణాపా
౧౧ వకీలయాససమాగమే దేఉన అమ్హాపాసీపార
౧౨ విలేత్యాజేవరూన సర్వమ॥ర అవగతహోఉనతదా
౧౩ సారతుమచే సంవరక్షణబదల తాలూక మొకరరకరు
౧౪ నదిల్హేత॥
౧౫ ౧ సంస్థానవిద్యానగర అసీగుంది
౧౬ ౧ గంగావతీ ప॥ ౧ హోసురసమత
౧౭ ౧ కపలీసమత ౧ వండసమత
౧౮ ౧ కమలాపురసమత ౧ దరోజీసమత
౧౯ ౧ తకలకోట ప॥ ౧ బాణరావీ అంతా
౨౦ సీరేకోలసమతదే.

— రెండవప్రక్క —

౨౧ వణేప్రమాణేస్థల తుమ్హాస సుపుర్దకరూనదే
౨౨ వీల అసేం తరీతుమ్హీ ఆచేంద్రార్కవంశపారంపర
౨౩ అనభవకరూన శ్రీస్వామీచేక్షేత్రీతుంగభద్రా
౨౪ స్థానదేవతా సేవాధర్మ ఇత్యాదికరూనఘేఉన
౨౫ సుఖరూప రాహతసే కరావే యాధర్మాసకోణీఅం
౨౬ తరకేలియా ఆపలే కులస్వామీ గురూచశపత
౨౭ ఆహే జాణిజే ఛ ౧౦ మాహే జమాదిలావల్ సు॥స
౨౮ మానసముసైన అలఫ హేవిలంబీసంవఛరవైశా
౨౯ ఖసు॥ ౧౨ శకే శాలివాహన ౧౫౭౯ రుజు.

— పైదానికిఁ దెనుఁగర్థము. —

శ్రీ

రాజశ్రీ తిరుమలరావుగారికి.

శ్రీమహారాజాధిరాజరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరశివాజీరాజు కృతానేకవిజ్ఞాపనము. మీతండ్రియైన రాజశ్రీ శ్రీరంగరాజు రాజ్యపన్యాక్రాంతమై పరస్థళమున మరణమునొందినందున నీకముందు మీసంరక్షణ కావలయుననునుద్దేశముతో మాతుశ్రీ తిమ్మాజిఅమ్మ మిమ్మును రామరాయని యిద్దఱను వెంకటకృష్ణప్ప వకీలును వెంటయిచ్చి మాయొద్దకుఁ బంపిరి. అందువలన సంగతులన్నియుఁ దెలిసికొని మీసంరక్షణనిమిత్తమై యీక్రింది తాలూకాలు మీకిప్పించుటయైనది. త॥ (తఫ్సీలు.)

౧ సంస్థానవిద్యానగర ఆనెగొంది

| | |
|---|---|
| ౧ గంగావతీ ప॥ (పరగణా) | ౧ హోనూర్ సమత |
| ౧ కపలీసమత | ౧ వండసమత |
| ౧ కమలాపురసమత | ౧ దరోజీసమత |
| ౧ తకల్కోట ప॥ | ౧ బాణారావిఅంతా సీరేకోలసమతదే. |

ఈప్రకారము స్థానములు మీసుఫుర్దు (స్వాధీనము) చేసియిప్పించనైనది. కనుక మీరు ఆచంద్రార్కము వంశపరంపరగా ననుభవించి శ్రీస్వామిక్షేత్రమైన తుంగభద్రాస్థానమందు దేవునిసేవ ధర్మము మొదలైనవి చేయుచు సుఖరూపముగ నుండవలసినది. ఈధర్మమున కెవ్వరైన నడ్డుపఱిచినయెడలఁ దన కులస్వామితోడు, గురునితోడని తెలిసికొనవలసినది. చందు ౧౦ జమాదిలవల్ నెల సు॥ సమానసమసైన అలఫ్ (అరబ్బీలో హిజ్రీసంఖ్య) హేవిలంబిసంవత్సర వైశాఖశు॥ ౧౨. శాలి. ౧౫౭౮ రుజు.

# ఆనేగొంది వెండిశాసనము.

## II.

బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులుగారు ౧౯౧౭లో నీశాసనము చదువుటకై నాయొద్దకుఁ బంపియుండిరి. ఇయ్యది యాంధ్రులచరిత్రకంటె మహారాష్ట్రులచరిత్రకు నెక్కుడుగ సంబంధించినదిగనుక దీనిని మహారాష్ట్రపత్రికలోఁ బ్రకటింపవలయు ననినాకుద్దేశముండెను. కాని పరిషత్ పత్రికలోఁ బ్రకటించిన తరువాతఁగాని యితరపత్రికలలో వేయుటకు వీలులే దని పంతులుగారు చెప్పినందున నాఁగవలసి వచ్చెను.

ఈశాసనమును జూచినప్పటినుండియు నాకు దీనినిగుఱించి కొన్నిసంశయములు కలిగెను. మహారాష్ట్రులచరిత్రకు సాధనముల సంపాదించుటకై జన్మమంతయు దారవోయుచు నిదివఱకు నిరువదిసంపుటములసాధనములను బ్రకటించిన నామిత్రులగు శ్రీయుత విశ్వనాథరాజవాడెగారికి దీనియచ్చొకటి పంపి నాయభిప్రాయముఁ దెలియఁజేసితిని. వారును నాయభిప్రాయముతో నేకీభవించిరి. ఈమధ్య శ్రీరామయ్యపంతులుగా రీశాసనమును నచ్చునకుఁ బంపుచు నాకుఁ జూపినందున నాసంశయములు వారికిఁ దెల్పుట ధర్మ మని తలఁచి తెలిపితిని. అందుమీఁద వారు తమయభిప్రాయమును గొంతవఱకు మార్చుకొని నాయభిప్రాయమునుగూడ వ్యాసరూపమునఁ బ్రకటింపుఁడని కోరిరి. నే నీవ్యాసము వ్రాయుట కిది హేతువు.

ఈశాసనము కల్పితమనుటకుఁ బెక్కు కారణములు కలవు. అవి యేవియనః-

౧. శాసనమునందుఁ జూపఁబడిననాఁటికి, నందు దానము చేయఁబడిన గ్రామములకును శివాజికిని సంబంధము లేదు.

౨. శ్రీరంగరాయలు క్రి. శ. ౧౬౫౭తరువాతఁగూడ బ్రతికియుండెను.

౩. తిమ్మాయమ్మ శ్రీరంగరాజుల భార్య కాదు.

౪. శాసనమందలి తురకతిథులును, హిందూతిథులును సరిపోవుట లేదు. పారసీసంవత్సరముల పేరు సరిగ లేదు.

౫. అక్షరములు శివాజికాలమునాఁటివి కావు.

౬. భాష శాహుకాలముకంటెఁ బ్రాచీనము కానేరదు.

ఈకారణముల నొక్కొక్కదాని నెత్తుకొని కొంచెము వివరముగ నాలోచింతము.

౧. శాసనము శా. శ. ౧౫౭౯ వైశాఖశుద్ధ ౧౨దినమున నిచ్చిన ట్లున్నది. ఇయ్యది క్రీ. శ. ౧౬౫౭ ఏప్రిల్ నెల యగును. ఈకాలమునకు శివాజి కిని గర్ణాటమునకును నేవిధమైనసంబంధమును గలుగలేదు. శాసనమందుఁ జెప్పఁబడిన గ్రామాదులు కర్ణాటాంధ్ర దేశములసరిహద్దున నున్నవి. శాసనము నందలి పర్గణాలును సమతును అన్నియు నప్పటి ఆనెగొందిసంస్థానమునకు సంబంధించినవి. పర్గణా యనఁగా నిప్పటి యొకతాలూకా; సముతనఁగా నిప్పటి యొకఫిర్కా. సముతునుబట్టియె సముద్దా రన్న పేరు వచ్చినది. శాసనమందలి గ్రామములు కొన్ని యిప్పుడు నైజామురాజ్యములో నున్నవి. కొన్ని బ్రిటిషు ఇండియాలో నున్నవి. గంగావతీ పరగణా యనునది యిప్పుడు నైజామురాజ్య మందలి రాయచూర్ జిల్లాలోని యొకతాలూకా. తుంగభద్రకు నుత్తరమున నున్నది. కంపలీ, కమలాపుర, సమతులు, తెకలకోటపరగణా, హోసూరు దరోజీ సమతులు బళ్లారిజిల్లాలోనివి. ౧౬౫౭లో శివాజి యిటువైపు రాలేదు. వీనిని స్వాధీనపఱుచుకొనలేదు. అట్టిస్థితిలో నీదేశభాగమునం దాతఁడు దానధర్మ ములు చేయుట యెట్లు సంభవించును? ఆతనిస్వాధీనమునందు లేనిప్రాంతపు టూళ్లనిమిత్త మాతనియొద్దకు నెవ్వరైనను బోవుదురా?

ఇదియుఁగాక యీకాలమున శివాజితండ్రి యైనశహాజి బ్రతికియుండెను. ఆతఁడు విజాపురమువారియొద్ద సరదారుఁడుగ నుండి వారిపక్షమునఁ గర్ణాట మందలి రాజ్యములను గెలుచుచుండెను. తండ్రి బ్రతికియుండఁగ శివాజి కర్ణా టకమందు నాతనిస్వాధీనమం దున్నప్రదేశముతో నేవిధ మైనజోక్యమును గలుగఁజేసికొనలేదు. తండ్రి పోయినతరువాత నతనిరాజ్యములో భాగ మడు గుటకు క్రీ. శ. ౧౬౭౭లో అనఁగా నీశాసనకాలమునకు ౨౦ఏండ్లు తరువాత శివాజి కర్ణాటాంధ్రద్రావిడదేశములకు వచ్చెను. కావునఁ దండ్రి బ్రతికియుండఁ గాఁ దనకు సంబంధము లేనట్టియుఁ, తనతండ్రికిఁ గొంతవఱకు సంబంధము కలిగియున్నట్టియు దేశములకు దానపత్ర మిచ్చె ననుట యసంభవము.

క్రీ. శ. ౧౬౫౭లో శివాజి విజాపురమువారికి సాయము చేయు నిమిత్తమై మొగలుసైన్యములతోఁ బోరాడుచున్నట్టు కానవచ్చుచున్నది. (Sarkar's History of Auragazeb Vol. IV, p. 32 & 33.) కావున విజా పురమువారి స్వాధీనమం దున్నట్టివియుఁ దనతండ్రికి సంబంధించినవియు, నగు గ్రామములు దానముచేయుట సంభవింపదు. అట్టిదానము పుచ్చుకొనినవారికి దానమువలన నేమి ప్రయోజనము?

౨. ఈశాసనము శ్రీరంగరాయల కుమారు లయినతిరుమలరాయల చేఁ జేయఁబడినది. ఈశ్రీరంగరాయలు శాసనకాలము (క్రీ. శ. ౧౬౭౮) వఱకు మరణము నొందినట్లు చెప్పఁబడినది. ఇంగ్లీషువారికి క్రి. శ. ౧౬౩౯లోఁ జెన్నపట్టణము కౌలునకిచ్చిన శ్రీరంగరాయలె యీతఁడని శ్రీజయంతిరామయ్యగారును, 'విజయనగరచరిత్రసాధనములు' అనుగ్రంథమును బ్రకటించిన శ్రీ కృష్ణస్వామిఅయ్యంగారును వ్రాసియున్నారు.[1] ఆనెగొంది కొన్నిదినములు తన స్వాధీనమం దుంచుకొని, రాజ్యచ్యుతుఁడై యన్యుల నాశ్రయించి యచ్చటచ్చట నుండి మరణమును జెందినవాఁ డీశ్రీరంగరాజె యయినందున, వీరు చెప్పిన ట్లీయిద్దఱు శ్రీరంగరాయ లొకఁడే యని తలంతము. రామరాజీయమును బట్టిచూడ నీతఁ డళియరామరాజుసంతతివాఁడు. అళియరామరాజుకుమారుఁడు శ్రీరంగరాజు, వానికుమారుఁడు చినవెంకటరాజు, వానికుమారుఁ డీశాసనపు శ్రీరంగరాజు. ఇట్లీతఁడు, అళియరామరాజునకుఁ గుమారుని మనుమఁడు. కాని యళియరామరాజుతమ్ముఁ డైనవేంకటాద్రికి మనుమఁ డైనగోపాలుఁ డితనిని బెంచుకొనెను. ఈశ్రీరంగరాజు వేలూరులో రాజ్యము చేసినట్లు చెప్పఁబడినది. ఇతఁడు క్రి. శ. ౧౬౪౨వ సంవత్సరమునందు అక్టోబరు నెలలో[2] ౨౯వ తేదిన రాజ్యాభిషిక్తుఁ డయ్యెను. ఇతఁడు క్రి. శ. ౧౬౭౮తరువాతఁగూడ జీవించియున్నట్టు కానవచ్చుచున్నది. ఒకవైపునుండి గోలకొండవారును, మఱియొకవైపునుండి విజాపురమువారును నీతనిరాజ్యమంతయు నాక్రమించుకొని యీతనిని నామమాత్రావశిష్టునిఁ జేసిరి. పోయినరాజ్యమును మరల సంపాదింపవలె నని యీతఁడు ౧౬౭౮-౭౯సం॥ లోఁ గొంతప్రయత్నము చేసెను. ౧౬౬౧లో బెదనూరువారితోఁ గలసి మైసూరురాజుతో యుద్ధము చేసెను.[3] ఈతఁడు చరమదశలో మధురనాయకులయాశ్రమముఁ జేరి యచ్చటనె మృతి నొందినట్లు కానవచ్చుచున్నవి. ఈతని పేరు నుదాహరించునట్టి శాసనములు పెక్కులు మధురనాయఁకులిచ్చినవి కానవచ్చుచున్నవి. క్రి. శ. ౧౬౬౭ వఱకుఁగూడ నీతఁడు జీవించియున్నట్లు దానినిబట్టి మన మూహింపవచ్చును.[4]

ఇట్లు ౧౬౭౮కుఁ దరువాతఁగూడ బ్రతికియున్నవాఁ డంతకుఁ బూర్వమె మరణించె నని యీశాసనమందుఁ జెప్పఁబడియున్నందున నిది నిజమైనది కా

1. Pro. S. Krishnaswami Iyengar's Sources of Vijanagar History p. XlV. 2. The founding of Fort St. George p. 25. 3. Sarkar's Aurangazeb Vol. IV, p. 251. 4. Marshall's Report 1911-12, p. 193.

దని సంశయింపవలసి యున్నది. రామరాజీయమునందు నీశ్రీరంగరాయలు కుతుబుశాహాతోఁ బోరాడిన ట్లున్నది:—

ఉదయగిరిదండ వెలుఁగొందుచుండుకుతుబ
శాహు బలదర్పదవహుతాశనుని నడఁచి
వినుతి గాంచెను సకలభూజనులచేత
రమ్యగుణహారి శ్రీరంగరాయశౌరి. ౫౬౯

కుతుబుశాహాతోఁ బోరాడినవాఁ డీ శ్రీరంగరాయఁ డని మనము చరిత్రవలన నెఱుఁగుదుముగనుక నీతఁడె యింగ్లీషువారికిఁ జెన్నపట్టన మిచ్చినవాఁ డని యనుకొనవచ్చును.

3. కాని యిందు నొకసంశయము కలుగుచున్నది. శాసనమునందు తిమ్మాయమ్మగారు తిరుమలరాయలను, రామరాయలను వెంటనిచ్చి వెంకట కృష్ణప్పనకీలును శ్రీశివాజియొద్దకుఁ బంపిన ట్లున్నది. అందువలన నీతిమ్మాజీ యమ్మ యీపిల్లలకుఁ దల్లి యని తలఁచి శ్రీరామయ్యసంతులుగా రీమె శ్రీరంగ రాజుదేవి యని వ్రాసిరి. కాని తిమ్మాయమ్మ భార్యగాఁ గలశ్రీరంగరాజే కావలయు నన్న నీతఁ డాశ్రీరంగరాయలు కాఁజాలఁడు. రామరాజీయము నందు నీతనికిఁ బాపమ్మ, రాఘవమ్మ, వెంగమ్మ, అనుముగ్గురుభార్య లుండిరని చెప్పఁబడినది (౩౬౧ - ౨) కావున శాసనమువాఁ డీశ్రీరంగరాయఁడు కాఁడే మో యని సంశయము కలుగుచున్నది. కాని రామరాజీయమునందు వర్ణింపఁ బడిన శ్రీరంగరాయలనువారిలో నొక్కనికిఁదక్క నెవరికిని దిమ్మాంబ భార్యగా లేదు. రామరాయని తమ్ముఁడు తిరుమలరాయనికుమారుఁ డగుశ్రీరంగరాయనికి తిమ్మాంబ యనుభార్య గలదు. కాని తండ్రికిఁ గుమారునకు నింపండ్లయంతర ముండఁజాలదు, కనుక, శాసనములోనివాఁ డీశ్రీరంగరాజు కాఁజాలఁడు.

ఇట్లు భార్యవిషయమై వచ్చినసంశయమున కింకొకవిధముగ సమాధా నము చెప్పవచ్చును. గోపాలరాజు దత్తపుత్త్రుఁ డైనశ్రీరంగరాజుతల్లిపేరు తిమ్మాంబ. ఈమెయే తిమ్మాజియమ్మ యనిశాసనమునందుఁ జేర్కొనఁబడినది. ఇట్లయినయెడలఁ బిల్లలను శివాజియొద్దకుఁ బంపినది వారితల్లి గాక యవ్వ యని మనము తలఁపవచ్చును.

శాసనమునందు "ఛ (చందు) ౧౦ మాహేజమాదీలావల్ సు॥ సమాన సమసైఁ అలఫ్ హేవిలంబి సంవర్ వైశాఖ శు॥ ౧౨ శకే శాలివాహన ౧౫౭౯" అనియున్నది. ఇం దుదాహరింపఁబడిన ఫారసీ తేదులను, హిందూ

తేదులను బోల్చిచూడఁగా, శా. శ. ౧౫౭౯లోని వైశాఖమాసమునందు జమాదిలావల్ నెల రాదు. శా. శ. సంవత్సరములు గతము లనుకొనినను రాదు, వర్తమాన మనుకొనినను రాదు. ఎన్నియోసంవత్సరములతరువాతఁ గృత్రిమపు సనదుల సిద్ధపఱుచువా రిట్టిపొరపాటు చేయుట సహజముగదా? ఈ రెండు తేదులలో నేదియో యొక్కటి మైన నిజమైనది కలదేమో పరీక్షించిచూతమన్న వారము పే రిచ్చియుండలేదు. కావున సరిచూచుటకు వీలు లేదు.

ఇదిగాక ఫారసిసంవత్సరము సంఖ్యగూడ సంశయముగ నున్నది. ఇందు నీయఁబడినది 'సమానసమసైక్ అలఫ్' సమాన = ౮. అలఫ్ = ౧౦౦౦ కాని నడుమనున్న 'సమసైక్' అన్నదానికి నర్థము లేదు. 'ఖమసేక్' అన్నియున్న యెడల ౫౦ అని యర్థము. అది తప్పు మనకు ౧౦౬౮-వ హిజ్రీ కావలెను. ఆయర్థము వచ్చుటకు 'సమానసిత్తైక్ అలఫ్' (౧+౬౦+౧౦౦౦) అని యుండవలెను. ఇట్లు లేక సంశయాస్పదముగ నున్నది.*

౫. అక్షరములు శివాజినాఁటివి కావని శ్రీయుత విశ్వనాథ కాశినాథ రాజవాడెగారియభిప్రాయము. వీ రాకాలమునాఁటియుత్తరములు, గ్రంథములు, శాసనములు నెన్నియో చూచినతజ్ఞులు గనుక వారియభిప్రాయము మన మంగీకరింపవలసియుండును.

౬. భాషయు శివాజినాఁటిది గాదు; శాహూకాలమునాఁటిదిగఁ గాన వచ్చుచున్నదియని రాజవాడెగారి యభిప్రాయము. శివాజినాఁటివ్రాఁతలలో తురకపదము లెక్కువగ నుండును. శాహూకాలమునఁ దక్కువగ నుండును. అదియుఁగాక భాషాసంప్రదాయముగూడఁ గొంతవఱకు మాఱినది కావున నిదియు సంశయమునకుఁ గారణమే.

ఇట్లు పెక్కుకారణములఁ బట్టిచూడ నిది క్రి. శ. ౧౬౫౭లోఁ బుట్టలేదని

* శ్రీయుత స్వామికణ్ణుపిళ్లగారికి నిందలిశకము వ్రాసి పంపి వారియభిప్రాయ మడుగఁగ వారిట్లు వ్రాసిరి. "శా. శ. ౧౫౭౯గతము హేవిలంబి యగును. అందు వైశాఖశుద్ధ ౧౨ క్రి. శ. ౧౬౫౭వ సంవత్సరము ఏప్రిల్ నెల ౧౫వ తేది బుధవార మగును. ఆయేటజమాదిలావల్ నెలలోని ౧౦వ చంద్రునాఁడు ఫిబ్రేవరి నెల ౧౮వ తేది శనివార మగును. కావున నీతేది క్రమముగ లేదు." కావున నిందలి శకసంవత్సరములు గతము లనియే తీసికొనవలెను. ఎందుకన సంవత్సరముపేరు వ్రాయుటలో నెవరును బొరపాటుపడరు. చట్టనిర్మాణసభయొక్క కార్యనిర్వాహకత్వ మనుమహాసముద్రమువంటి కార్యభారమును వహించుచును నాయుత్తరమునకు వెంటనే జవాబిచ్చినందుకు శ్రీయుతపిళ్లగారియెడ నేఁ గృతజ్ఞుఁడ.

మనము నిశ్చయింపవచ్చును. కాని యిదిశాహూకాలమునన్ యంతకుఁ గొంచెముతరువాతికాలముననో పుట్టియుండునేకాని మఱి యిటీవలఁ బుట్టియుండ దని తోఁచెడిని. ఎందుకన నిందుఁ జెప్పఁబడినసంగతులు కొన్నిస్వాభావికముగఁ గానవచ్చుచున్నవి. శ్రీరంగరాజు రాజ్యభ్రష్టుఁడై యన్యస్థలంబున మరణమందుట యొకసత్యము. అతనికి తిమ్మాంబ తల్లియుండుట యొకటి. వెంకటకృష్ణప్ప వకీలును వెంటనిచ్చి పిల్లలనిద్దఱను శివాజియొద్దకుఁ బంపినట్లున్నది. శ్రీరంగరాజు చివరదినములలో మధుర నాయఁకులయొద్దనుండుట చరిత్రవిదితమే. మధుర నాయకుఁడైనచొక్కనాథునిమంత్రియే వెంకటకృష్ణప్ప.* మధురచరిత్రలోనాతని పేరు సుప్రసిద్ధము కావున శ్రీరంగరాయలు పోయినతరువాత, ఆతనికుటుంబము, మధురలో నుండుటయు శివాజి దక్షిణమునకు వచ్చినప్పుడు, ఆతఁడు తంజావూరునకువచ్చి, మధురనాయఁకులనుగెలిచి వారియొద్దనుండి కప్పము తీసికొనుకాలమందు తిమ్మాజియమ్మగారు వెంకటకృష్ణప్పను బతిమాలికొని తన మనుములను శివాజియొద్దకుఁ బంపి, యతనికి దయపుట్టునట్టు చేసి, ఆనెగొంది సంస్థానమందలి కొన్నిగ్రామములఁ బడసియుండును. ఇందు నసంభవ మేమియు లేదు. ఈసమాచారము జరిగియున్నయెడల క్రి. శ. ౧౬౭౭లో జరిగియుండవలెను. అప్పుడు శివాజి తిరుమలరాయలకు సనదు యిచ్చెనో లేదో తెలియదు. కాని తరువాత మహారాష్ట్రులు ప్రబలులై, ఆనెగొందిప్రాంతమువైపు దాడికివచ్చుకాలమందు శాహుకాలమునకుఁ దరువాతను, మీసనదులు తెండని యానెగొందివారి నడిగినపుడు, పూర్వపుకాగితపుసనదును బట్టియో, లేక పూర్వము నుండి పరంపరగావచ్చుసమాచారమునుబట్టియో యీసనదు సిద్ధముచేయింపఁబడియుండును. ఇంతియకాని యిది కేవలము నభూతపూర్వకల్పన కాదని తోఁచుచున్నది.

కొమఱ్ఱాజు - వేంకటలక్ష్మణరావు.

---

* ఈ వేంకటకృష్ణప్పనాయకుఁడే వచనజైమినిభారతమును రచించినవాఁడు.

శ్రీరస్తు.

# శ్రీనాథుని నూతనశాసనములు.

ఈసంవత్సరము (౧౯-౧౦) ప్రభుత్వపు శాసనశాఖ (Epigraphy) వారిచేఁ బ్రకటింపఁబడిన కార్యనివేదనమునందు శ్రీనాథ మహాకవిచే రచింపఁబడిన తామ్రశాసనములు నాలు గుదాహరింపఁబడియున్నవి. ఈ నాలుగును పెదకోమటి వేమ భూపాలునిచే నీయఁబడిన దానములు. అవి యాంధ్రభాషాభిమానులచే గమనింపఁ బడఁదగినవి. ఒకశాసనమునందు (నెం-౮ రు)శకము లేదు. చివరరేకుమాత్రము కలదు. అందు నీ క్రిందిశ్లోక మున్నది.

దాతా కోమటి వేమనామ నృపతిః పాత్రం గురుశ్శంకరః
స్థానంచేత్పినపాడురత్రతు కవి శ్శ్రీనాథభట్టారకః
కాలశ్శ్శివరాత్రిపుణ్యసమయస్సాక్షీమహాన్ శ్రీగిరిః
శ్రేయఃకిన్నుతు వర్ణ్యతే సుకవిభిశ్శ్రూణ్వంతు తచ్ఛాసనమ్.

దీనినిబట్టిచూడ నీదానము శివరాత్రిపుణ్యసమయమందు శ్రీశైలముమీఁద రాజుచేఁ జేయఁబడినట్లు కానవచ్చుచున్నది. గ్రహీత గురుశంకరుఁడని చెప్పఁబడియున్నది. గురుశంకరుఁ డనఁగా దేవుఁ డైనశంకరుఁడుగావచ్చును. శంకరపీఠము నధిష్ఠించినగురువులవారు కావచ్చును.

రెండవశాసనము (నెం॥౧౩ రు) శా. శ. ౧౩౪౬. తారణనాఁటిది. క్రీ. శ. ౧౪౨౪ అగును. ఇందు వైదిక్షచూడామణి యగుపెద్దియజ్వకుఁ ద్రిలింగవిషయమందలి ఖండవాటిస్థలమున నున్న "కల్వవాములు" అనుగ్రామము దానము చేసిన ట్లున్నది. ఈబ్రాహ్మణునిది హారీతగోత్రము. ఇతఁడుగోదావరియొడ్డున నెన్నియో యూపములు పాఁతి పెక్కుయజ్ఞములఁ జేసెను. తనతాత యైన పోతయభట్టువలెనే బ్రహ్మసూర్యాది జ్యోతిషసిద్ధాంతములను జక్కఁగ నేర్చుకొనెను. పెద్దియజ్వతండ్రి గుండయార్యుఁడు, అతనితండ్రి పోతిభట్టు, ఆతనితండ్రి భీమేశ్వరసోమయాజులు, ఆతనితండ్రి నృసింహుఁడు. ఈజ్యోతిషికునకు శా. శ. ౧౩౩౬లో నవవేమరాజుగూడ నొకగ్రామము దానముచేసెను. (నెం॥ ౬రు).

పెదకోమటివేమభూపతి రమారమి క్రీ. శ. ౧౪౦౦ లనుండి రాజ్యమునకు వచ్చినట్లు శాసనములవలనఁ గానవచ్చుచున్నందున నీరాజు రాజ్యమునకువచ్చి

నదిమొదలు శ్రీనాథుఁ డీతనియొద్ద విద్యాధికారిగ నున్నట్లు కానవచ్చు చున్నది.

మూఁడవశాసనము శా. శ. ౧333 (క్రి. శ. ౧౪౧౧) ఖరసంవత్సరమున మార్గశిరశుద్ధత్రయోదశి, ధనుస్సంక్రాంతినాఁటిది. (నెం॥ ౧౪). పైశాసనమునందలి పెద్దియజ్వకే పైనిజెప్పఁబడిన నాటిలోనే నందమూరు గ్రామ మీయఁబడినది.

నాల్గవశాసనము శా. శ. ౧3౪౧ (క్రి. శ. ౧౪౧౯) వికారిసంవత్సర మార్గశిరము, ధనుస్సునాఁటిది. (నెం॥ ౭) ఇందుమూలమునఁ గొందఱు బ్రాహ్మణులకు రుద్రవర మనుగ్రామము దానము చేయఁబడినది. పెదకోమటివేమ నరపతి క్రి.శ. ౧౪౨౦ వఱకు రాజ్యముచేసెను. కావున మొదటనుండియుఁ జివరవఱకు శ్రీనాథుఁ డీరాజునొద్ద విద్యాధికారిగా నుండె ననుట స్పష్టపడుచున్నది.

ఇదివఱకు శ్రీనాథునిశాసనము లెనిమిది మనకు దొరకినవి. వానిని గాలమునననుసరించి యీక్రిందఁ బొందుపఱిచెదను.:—

౧. శా. శ. ౧3౨౬ (క్రి. శ. ౧౪౦౪) కల్వవాముల తామ్రశాసనము.
(Epigraphical Reports 1919-20 C. P. No. 13.)

౨. శా. శ. ౧330 (క్రి. శ. ౧౪౦౮) పొన్నుమల్లి శాసనము.
(Elliot's Collection p. 193.)

3. శా. శ. ౧33౧ (క్రి. శ. ౧౪౧౦) ఫిరంగిపుర శిలాశాసనము.
(Epi. Ind. Vol. XI p. 315 ఆం. సా. ప. పత్రిక సం. 3. పుట ౨౬౧.)

౪. శా. శ. ౧333 (క్రీ. శ. ౧౪౧౧) నందమూరుతామ్రశాసనము.
(Epi. Reports 1919-20 C. P. No. 14.)

౫. శా. శ. ౧33౪ (క్రీ. శ. ౧౪౧3) అలపాడు శాసనము.
(Epi. Reports 1908-09 C. P. No. 6.)

౬. శా. శ. ౧33౭ (క్రీ. శ. ౧౪౧౬) అమీనాబాదు శిలాశాసనము.
(Epi. R. 1909 No. 543. ఆం. సా. ప. పత్రిక పుట ౨౭౦.)

౭. శా. శ. ౧3౪౧ (క్రీ. శ. ౧౪౧౬) రుద్రవరము తామ్రశాసనము.
(Epi. R. 1919-20 C. P. No. 7.)

౮. శకము లేదు .... .... పినపాడు తామ్రశాసనము.
(Epi. R. 1919-20 C. P. No. 8.)

ఈశాసనములలో ఫిరంగిపురము అమీనాబాదాశిలాశాసనములు పూర్తిగ నాంధ్రసాహిత్యపరిషత్పత్రిక లోఁ బ్రకటింపఁబడినవి. (సం. 3. పు. ౨౬౧) పొన్నుమల్లి, ఫిరంగిపుర్, అలపాడు, అమీనాబాదుశాసనములు, శ్రీవీరేశలింగముగారి కవులచరిత్రయొక్క క్రొత్తకాపీలో నీయఁబడినవి.

క్రి. శ. ౧౪౦౦ మొదలు ౧౪౨౦ వఱకుఁగా పెదకోమటివేమారెడ్డి ప్రభుత్వకాలమున శ్రీనాథుఁ డేమియుఁ గావ్యములను రచింపకుండునా యని సంశయమును గలిగించుకొని శ్రీవీరేశలింగముగారీకాలములో నీతఁడు శివరాత్రి మాహాత్మ్యమును రచించియుండు నని సమాధానము చెప్పినారు. (ఆంధ్రకవుల చరిత్రము. నూతనముద్రణము. పుట ౪౭౨) శ్రీవీరేశలింగముగారి యభిప్రాయ ప్రకారము ౧౪౨౦ కు లోపల వ్రాసెనో లేక తరువాత వ్రాసెనో నిశ్చయముగఁ జెప్పఁజాలముగాని, పెదకోమటివేమరెడ్డికాలమునందు శ్రీనాథుఁ డూరక పనిలేక సోమరివలెఁ గూర్చుండె నని మాత్ర మెవ్వరును జెప్పలేరు. పైశాసనములపట్టికయే యిందుకు దృష్టాంతము. ఈకాలమున నీతఁ డారాజునొద్ద విద్యాధికారి; శాసనములకు సంబంధించినకవిత్వమును జెప్పుట యీతనిపనులలో నొక్కటి యని మన మెఱుఁగుదుము. ఆపని యీతఁ డీయిరువదిసంవత్సరములు నెడతెగక చేయుచున్నట్లు కానవచ్చుచున్నది. ఇదిగాక విద్యాధికారి కింక నేమేమి పనులుండెనో? దేశమందు విద్యాభివృద్ధిచేయుట పండితులఁ బరీక్షించుట, వారికి బహుమతుల నిప్పించుట, యితరులచే రచింపఁబడిన గ్రంథాదులను బరీక్షించుట మొదలయినపను లీతని కుండె నని మన మూహింపవచ్చును. దేశమందు విద్యాభివృద్ధిచేయుట యన నాకాలమం దేమి యర్థ మని చదువరు లడుగవచ్చును. అప్పుడు సంస్కృతపాఠశాలలు పెక్కులుండెను. అచ్చటి గురువులను శిష్యులను రాజులు పోషించుచుండిరి. ఇదియుఁగాక ప్రతి పల్లెలోను దప్పక యొకవీధిబడి యుండును. ఆబడిపంతులు విజయదశమి నవరాత్రములలోఁ బిల్లలను వెంటఁదీసికొని రాజులయొద్దకుఁ బోయి దసరాపద్యములు పాడించిరాజసత్కారమును (Grants) పొందుట యాచారమైయుండెను. 'కామినీపంచబాణావతార, దానరాధేయ' అని యిప్పటికిని మహానవమిబాణములు పట్టుపిల్ల లెట్టివానినైనను సంబోధించుట మనము చూచుచున్నారము. ఇవియన్నియుఁ బూర్వపురాజులయొద్దకుఁ బిల్లలును బంతుళ్లును వెళ్లెడినాఁడు పుట్టినమాటలే!

కావున విద్యాధికారిగ నున్నప్పుడు శ్రీనాథుఁ డెప్పుడును జేతినిండఁ బని గల్గి యుండెనేకాని గోళ్లు గిల్లుకొనుచు నూరక కూర్చుండె నని తలంప నక్కఱ లేదు. ఇట్లు రాజకార్యవ్యవహారములందుఁగూడఁ జిక్కియున్నకాలమందుఁ గావ్యములు చేయుటకుఁ గాలము దొరకకపోయిన నేమియాశ్చర్యము?

కొమర్రాజు వేంకటలక్ష్మణరావు.

# గ్రంథస్వీకారము.

౧. భీష్మమహిమ:- ఇది దేశసేవాగ్రంథమాలలో ద్వితీయపుష్పము. రచయిత పీఠికాపురమందలి బ్ర. శ్రీ. జనమంచి సీతారామస్వామిగారు. బాలురకును స్త్రీలకును దెలియునట్టి సులభశైలితో నొప్పారుచున్నది రూ. ౦ ౮ ౦.

౨. శ్రీరామచంద్రమూర్తి:—ఇదియు శ్రీసీతారామస్వామిగారిచేతనే రచింపఁబడినది. ఇందలికథ రాముఁడు రావణుని వధించి యయోధ్యానగరమునకు వచ్చినది మొదలు సీతానిర్యాణము వఱకు ను గలదు. కథ చక్కఁగ సంగ్రహింపఁబడినది. భాషాశైలి మృదులము. నడుమ నడుమ ననేక పూర్వకవులపద్యము లుదాహరింపఁబడినవి. ఇయ్యది దేశసేవాగ్రంథమాలలోఁ దృతీయపుష్పముగఁ బ్రకటింపఁబడినది. వెల రూ. ౦ ౧౨ ౦.

ఇదియు భీష్మమహిమయుఁ గావలసినవారు జనమంచి సీతారామస్వామిగారు, పిఠాపురము, గోదావరిజిల్లా; అనువిలాసమునకు వ్రాయవలయును.

౩. కాలనేమి:—శ్రీ. శిరోభూషణము వేంకటరంగాచార్యులుగారిచే రచింపఁబడిన యొకనవల. ౩౯౨ పుటలు, ఇరువదియేనధ్యాయములు. ఇందలికథ కొంతకాలమునకు మునుపు వాస్తవముగ జరిగినయదియఁట. ప్రకృతకాలమునఁ గొందఱు ధనాశాపరులై వడ్డికిఁ జక్రవడ్డిని బెంచి పేదలనుహింసించుట మొదలగుదుర్ణయము లిందు వర్ణింపఁబడినవి. తప్పుపత్రములు వ్రాసి కొంపముంచుటయే యీకథయందుఁ బ్రధానవస్తువు. అనుషంగికముగ నొకస్త్రీపాత్రము కల్పింపఁబడినది. దానివలనఁగూడ వలసినంతనీతి బోధింపఁబడినది. తఱచుగా వ్యావహారికభాష యుపయోగింపఁబడినది. అది లేకున్న లోకావస్థనము గాదని కవిగారి తలంపు. కాని మృదులమయిన తేటతెనుఁగు నుపయోగించినచో గ్రామ్యభాష కవకాశము లేదని మాయూహ. వలయువారు శిరోభూషణము వేంకటరంగాచార్యులుగారు, వుమెన్సుక్రిష్టియన్ కాలేజి, మదరాసు, అనుచిఱునామాకు వ్రాసి తెప్పించుకొనవలయును. వెల రూ. ౧ ౮ ౦

౪. తపతీసంవరణము:—ఇది యాఱంకములనాటకము. కేరళదేశమందలి మహోదయపురాధిపతి యగుకులశేఖరమహీపాలునిచే సంస్కృతభాషలో రచింపఁబడిన యీనాటకమునకు మ. కాకర్లకొండలరాయఁడుగా రాంధ్రీకరించినది.

సంస్కృతనాటకము కొన్ని విషయముల భాసనాటకములం బోలియున్నది. ఆంధ్రీకరణము చక్కఁగనే యున్నదికాని కవితాపరిపాక మింకను బాగుగఁగుదురకపోవుటచేఁ గొన్ని నెఱసు లందం దగపడుచున్నవి. పొత్తము వెల రూ. ౧-౧-౨-౦.

గీ. సహచరమునుండియలచక్రసతినిబోలెఁ,
బృథుపయోధరభారగుర్వియగుప్రియను
నృపునికెడఁజేసి రవియానసీచుఁడనయి
తొలుతవాఁడైతి జనులఁ బ్రదోషగతిని.

చ. జలముసఁ దేలు నేల దళసంతతికాదు కుజంబులలగెజం
బులుజలమందు కాదు గిరిభూమి గిరుల్జలరాశిగాదుభూ
స్థలి భువి సంక్రగాసెనమునందున మామకచిత్తవృత్తులి
ట్లొలుపునఁ బోఁచె నెక్కొనిసముద్ధరణప్రతిరోపణంబులన్.

౫. ఆంధ్రక్షత్రియులు:—శ్రీశ్రీ వత్సవాయి వేంకటనీలాద్రిరాజుకవిరాజుగారిచే రచింపఁబడినయొక వ్యాసము. ప్రకృత మాంధ్రదేశమం దున్నక్షత్రియులు మొదట శూద్రులే యనియుఁ బిదప క్షత్రియుల మని వేదవిహితకర్మముల నాచరించుచున్నారనియు నొకప్రవాదము బయలుదేఱ శ్రీకవిరాజుగారు దానిని యుక్తియుక్తముగ ఖండించి యీవ్యాసమును బ్రకటించియున్నారు. ఇందు శ్రీరాజుగా రిచ్చినప్రమాణములును యుక్తులును జాలవఱకు బాగుగనున్నయవి. దీనివెల రూ. ౦-౪-౦ వలయువారు గోదావరిజిల్లా, తునిలోనున్న గ్రంథకర్తగారికి వ్రాసి తెప్పించికొనవలసిను.

౬. రసమంజూష:—ఇది యేడంకములచిన్ననాటకము. అష్టావధానులు కందుకూరి వేంకటసుబ్బరావు; నరహరిసెట్టి అదినారాయణరావు అనువారిరువురును దీనినిరచించిరి. కథ చక్కనిది. శైలి సులభము. బాలకవులగుటదోషము లొకకొన్ని గలవు. వానినెల్ల సవరించుకొనుపాండితిని సంపాదించి యీకవు లింక ననేకోత్తమనాటకముల రచింతురుగాక. ౭ అంకము లున్నను బ్రసర్పనానుకూలముగ గ్రంథము చిన్నదిగానేయున్నది. మూలకథలో వీరు చేసినమార్పు లంతగాఁ జాలియుండలేదు. ఔచితి ననుసరించి యింకను మార్చిన బాగుగ నుండెడిది. పొత్తము వెల రూ. ౦-౬-౦ వలయువారు కె. వి. సుబ్బరావు ఏలూరు. కృష్ణాజిల్లా అని వ్రాయవలయును. శైలి.

గీ. కర్ణధారునిచాకచక్యంబదెంత, గడనఁగనునిర్జలనదంపుఁబడవవోలె
మంత్రికెంతటిబుద్ధిసామర్థ్యమున్న, నరవరుఁడులేనిరాజ్యంబునడపలేఁడు.

## గ్రంథస్వీకారము.

గీ. జనులకాపత్పరంపరల్సంఘటిల్ల, నాలిమోహంబ్రేమయే, బాంధవాళిమీఁది
    కూర్మియేఁ బుత్త్రులందలిప్రేమయే, క్షణంబులో విడువాఁడమనంబునందు

౭. ధర్మవరచరిత్రము:—ఇది యనంతపురమండలమందలి ధర్మవర మను గ్రామముయొక్క చరిత్రము. ఆయూరు కట్టఁబడిన దాదిగ నేఁటివఱకుఁ గల చరిత్ర మంతయుఁ బెద్దలవాడుకలను శాసనములను నాధారపఱచికొని వ్రాయఁబడినది. శైలి సుగమము. ఇదియు యుగాదినివేదనము ధర్మవరమాధ్యమిక పాఠశాలాంధ్రోపాధ్యాయులగు మ। రా॥ శ్రీ పి అంజనేయులు గారిచే రచింపఁబడినవి. దీనివెల ౦-౮-౦.

౮. యుగాదినివేదనము:—ఇది నూటయేఁబది గీతపద్యపాదములలో రచింపఁబడిన చిన్నపొత్తము. జంతుహింస మానుండని బోధించుటయే యిందలి పరమార్థము. అయ్యది యిందు స్ఫుటముగ వర్ణింపఁబడినది. పామరావబోధమునకై యొక వేఁటకాని కథయుఁ గూర్పఁబడినది. శైలి మిగులఁ దేటగా నున్నది. దీనివెల ౦-3-౦. శైలికి.

గీ. జీవకోటిని నరుఁడు హింసించుకతనఁ, జెందు నఘముల కిలఁ దాప మొందఁజేసి
    దొడరియతఁడాపరాత్పరు తోడనైక్య, మంది శాశ్వతసౌఖ్యముఁబొంద లేఁడు
    కానఁ నే ప్రాణికైన నేకడలనైన, నెప్పుడైనను నొక్కింత హింస లేక
    మెలఁపులో బ్రదుకుటగాదె మేల్మిమనకు, ప్రేమరసమొల్కఁబ్రాణుల బెంచుచుంట
    యీశ్వరారాధనమ్మది శాశ్వతమ్ము, ధర్మమార్గమ్ము పరమమ్ము గనుఁడు.

౯. సమత:—ఇయ్యది ధర్మవరమందలి సంఘకైంకర్యసమాజసభ్యునిచే రచింపఁబడిన చిన్నయుపన్యాసము. దీనిపేరివలననే యిందలివిషయము తెలియనగును. సర్వసామ్యమును బోధింప నెన్నియో యమూల్యము లగుప్రమాణములు చూపఁబడినవి. ఎల్లరుఁ జదువఁదగినది. వెల ౦-3-౦ పైమూఁడుపుస్తకములును వలయువారు "విజ్ఞానవల్లికా గ్రంథమాల" ధర్మవరము, అనంతపురము జిల్లా, అనువిలాసమునకు వ్రాసి కొన నగును.

# శివతత్త్వసారము.

శ్రీమల్లికార్జునపండితారాధ్యులవారిచే రచింపఁబడిన 'శివతత్త్వసారము' అను గ్రంథము మేము త్వరలోనే ప్రకటింపఁబోవుచున్నారము. ఇది ప్రాచీన గ్రంథము. నన్నయకు నూఱేండ్లు తరువాతను, తిక్కనకు నూఱేండ్లు పూర్వమును రచింపఁబడినది. మాకొక్కప్రతిమాత్రము దొరికినది. ఎవరియొద్దనైనను మఱియొకప్రతి యున్నయెడల మాకుఁ బంపుదురని కోరుచున్నాము.

మేనేజరు, ఆంధ్రసాహిత్యపరిషత్తు,
పుదుపేఁట, చెన్నపట్టణము.

Printed at the British Model Press, Choolai and published at the Telugu Academy Office, 39, Harris Road, Pudupet, Madras.

చందా సం॥ కు రూ. 3.　　　　విడిసంచిక అ. ౮.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౯. { రౌద్రిసంవత్సరము. మాఘ ఫాల్గునమాసములు. } సంచిక ౬.

## ప్రధానవ్యాసములు



చెన్నపురి. ౧౯౨౧.

# విషయసూచిక.

జెప్పఁబడిన నకారము గౌడవధమహాకావ్యమునందుఁ బలుచోట్ల ణకారము కాకుండఁ గనఁబడుచున్నది. ఉ. 241. ఆరోవేఇ నకాయరగణా ఏవచావం (ఆరోపయతి నకాతరగణన యే వచాపమ్). 245. పజ్జంతి తుహారిఊ నాహ. (పజ్జంతి తవరిపవో నాథ) ఈ నకారము ణకారము కావుటకుగుఱించి (వాదాన్యః) అనుసూత్రముచేఁ బదాదినకారము వైకల్పికముగా ణకారమగునని చెప్పెను. మూఁడవదియగు సప్తమ్యేకవచనపు - సి - భాషయందున్న రొక వైచిత్రి యని మనము గ్రహింపవచ్చును. అంతమాత్రముచే నాభాషయొక్క ప్రాచీనత సూచింపఁబడదు. జైనగ్రంథముల భాషావైచిత్రిని హేమచంద్రుఁడు తనవ్యాకరణములో ననేకస్థలములయందుఁ గనఁబఱిచియున్నాఁడు. ఇట్లు హేమచంద్రుఁడు, తక్కుజైనాచార్యులు ప్రధానభాషయగు మహారాష్ట్రమునకుఁ దక్కిన ప్రాకృతభాషలకుఁ గలభేద మత్యల్ప మని వ్రాసియున్నారు. నాటకలక్షణనిరూపకు లగుసాహిత్యదర్పణకారుఁడు మొదలగువారు నాటకములయం దీభాషల కన్నిటికిఁ బ్రత్యేకముగా వినియోగము గనఁబఱిచిరి. "పురుషాణామనీచానాం సంస్కృతం స్యాత్కృతాత్మనామ్, శౌరసేనీ ప్రయోక్తవ్యా తాదృశీనాంచ యోషితామ్, ఆసామేవతు గాథాసు మాహారాష్ట్రీం ప్రయోజయేత్, అత్రోక్తా మాగధీభాషా రాజాంతఃపురచారిణామ్, చేటానాం రాజపుత్రాణాం శ్రేష్ఠినాంచార్ధ మాగధీ, ప్రాచ్యా విదూషకాదీనాం ధూర్తానాం స్యాదవంతికా, యోధనాగరకాదీనాం దాక్షిణాత్యాహి దీవ్యతామ్, శకారాణాం శకాదీనాం శాకారీం సంప్రయోజయేత్, బాహ్లీకభాషోదీచ్యానాం ద్రావిడీ ద్రావిడాదిషు, ఆభీరేషు తథాభీరీ చాండాలీ పుల్కసాదిషు, ఆభీరీ శాబరీచాపి కాష్ఠపత్రోపజీవిషు తథైవాంగారకారాదౌ పైశాచీ స్యాత్పిశాచ వాక్, చేటీనామప్యనీచానామపి స్యాచ్ఛౌరసేనికా, బాలానాం షండకానాంచనీచగ్రహవిచారిణాం, ఉన్మత్తానామాతురాణాం సైవ స్యాత్సంస్కృతం క్వచిత్, ఐశ్వర్యేణ ప్రమత్తస్యదారిద్ర్యోపప్లుతస్యచ, భిక్షుబంధధరాదీనాం ప్రాకృతం సంప్రయోజయేత్, సంస్కృతం సంప్రయోక్తవ్యం లింగినీషూత్తమాసుచ, దేవీమంత్రిసుతావేశ్యాస్వపి కైశ్చిత్తథోదితం, యద్దేశ్యం నీచపాత్రంతు తద్దేశ్యం తస్యభాషితం, కార్యతశ్చోత్తమాదీనాం కార్యో భాషావిపర్యయః, యోషిత్సఖీబాలవేశ్యాకితవాప్సరసాం తథా, వైదగ్ధ్యార్థం ప్రదాతవ్యం సంస్కృతం చాంతరాంతరా." (సాహిత్యదర్పణము 6 పరిచ్ఛేదము) అనువా రీ ప్రాకృతవైయాకరణులకంటె నధికసంఖ్యగలభాషలను చెప్పుచున్నారు. నాటకీ [illegible] ప్రకార మీభాషలున్నియు [illegible]

మనకుఁ దెలియుడు. ఒకవేళన ట్లుపయోగింపఁబడినచో వీనికిఁ గలపరస్పర భేదము లిట్టివని విశదముగాఁ దెలియఁజేయుటకుఁ దగినసాహాయ్య మొనర్చు నాటకముల మంచిప్రతులు మనకు లేవు. అయినను బ్రాచీనులు వ్రాసినప్రాకృతవ్యాకరణసహాయమువలన నీభాషలలక్షణములను బూర్ణముగాను నిశ్చయముగాను దెలిసికొనఁ గలిగియున్నారము. హేమచంద్రుఁడు శాకుంతలము నుండి రాజభటులకు జాలరివానికి జరిగినసంవాదమును, ముద్రారాక్షసము నుండి క్షపణకునిసంభాషణమును, వేణీసంహారమునుండి రుధిరప్రియ యనురాక్షసియొక్క సంభాషణమును, మాగధీభాషాలక్షణమున కుదాహరణముగా నెత్తియున్నాఁడు. మాగధీభాష ప్రధానప్రాకృతమునుండియు, శౌరసేనీ భాష నుండియు నీదిగువవ్రాసిన విషయములలో భేదించుచున్నది. శౌరసేనీ మహారాష్ట్రభాషలలో రేఫ లకారముగాను సకారము శవర్ణముగాను సంస్కృతపదములలోని "స్థ" "ర్థ" "స్త" గాను, 'ష్ట' 'స్త'గాను మాఱును. ప్రస్ఖలతీత్యాది శబ్దములయం దున్నసకారము స్వసామ్యాపత్తి (assimilation) నొందదు. ఉ. ప్రస్ఖలతి-పస్ఖలది. పుంలింగశబ్దముల ప్రథమైకవచనము, ఓ కారాంతమై యుండుటకుబదులుగా ఏకారాంతమై యుండును. ఈయోకారము ప్రాకృతభాష లన్నింటికి సాధారణమైనప్రథమైకవచనప్రత్యయము; పుంలింగనపుంసకలింగశబ్దముల షష్ఠ్యేకవచన ప్రత్యయము ఆహ అనునది. ఉ. కమ్మాహ. అస్మచ్ఛబ్దప్రథమైకవచనము హగే. అనేకవిధము లగుభాషల మాటాడునసేకపాత్రలతోఁ గూడినమృచ్ఛకటికములోనిభాషల కీసూత్రోక్తలక్షణములను బట్టించినచోఁ జారుదత్తునురితీయుచండాలురు, శకారుఁడు, వానికింకరుఁ డగుస్థావరకుఁడు వర్ధమానకుఁడు, కుంభీరకుఁడు మొదలగువారు మాటాడుభాష మాగధి యని మనము స్పష్టముగాఁ దెలిసికొనఁగలము. కాని సాహిత్యదర్పణకారునిమతము ననుసరించి చాండాలిక చాండాలురకు శాకారి శకారునకు స్థావరవర్ధమానకకుంభీరకులకు నర్ధమాగధియు విధింపఁబడెను. ప్రబోధచంద్రోదయములో నర్ధమాగధికి విశేషముగా నుదాహరణములు దొరకును. మృచ్ఛకటికములో జూదరి యగు మాథురునిభాష యించుకంత వేఱుగానున్నది. వాఁడు మాటాడుమాటలలోఁ గొన్నిచోట్ల రేఫకు లకారము సకారమునకు శవర్ణము కనఁబడుచున్నది. ఈ మార్పు మఱికొన్నిచోట్లఁ గానరాదు. కొన్నిస్థలములయందు మాహారాష్ట్రిశౌరసేనీభాషలయందువలెఁ బ్రథమైకవచనము, ఓకారాంతముగాను మఱికొన్నిస్థలములయందు మాగధియందువలె ఏకారాంతముగాను, మఱికొన్నిస్థలముల

యం దపభ్రంశయందువలె, ఉకారాంతముగాను గానవచ్చుచున్నది. ఉ. రేఫకు లకారము "అలేసంవాహాఅ" (అరేసంవాహక) సకారమునకుశవర్ణము ఉ. ఏశేకశ్యాని, ఏషకస్యాపి. ప్రథమైకవచనము ఉకారాంతము ఉ. ధుత్తుమాధురు అహంశిఉణు (ధూర్తోమాధురః అహంనిపుణః)

దర్పణకారుఁడు చెప్పినచిల్లరప్రాకృతభాషలకు హెచ్చుభేద మేమియు లేదు. ఇవి యన్నియును మాగధీభాషలోనివి. ఇందువలన హేమచంద్రుఁడు త్రివిక్రముఁడు లక్ష్మీధరుఁడు చెప్పినయీఅభాషలే ముఖ్యమయినప్రాకృతభాష అని మనము నిశ్చయింపవచ్చును. ఇందుకు గౌడవధకావ్యములోని కొన్నివాక్యముల నుదాహరణార్థమయి యెత్తివ్రాయుచున్నాను.

౧. నిఅఆఎచిఅవాయాఇఅత్తణోగారవంనివేసెన్తా। జేయన్తిపసంసంచియజయన్తిఇహతేమహాకఇణో॥

ఛా. నిజయైవవాచయా ఆత్మనోగౌరవంనివేశయంతః। యేయాంతిప్రశంసామేవ జయంతీ హ తే మహాకవయః॥

౨. దోగచ్చంమివిశోక్ఖాఇంతాణవిహవేవిహోంతిదుక్ఖాఇం। కవ్వపరమత్థరసియాఇంజాణజాయంతిహిఅఅ॥

ఛా. దార్గత్యేపిసౌఖ్యాని తేషాం విభవేపి భవంతిదుఃఖాని। కావ్యపరమార్థరసికాని యేషాం జాయం తేహృదయాని॥

౩. సోహేఇసుహావేఇయఉవహుజ్జంతోలవోవిలచ్ఛిఎ। దేవీసరస్సఈఉణఅసమగ్గాకింపివిణడేఇ॥

ఛా. శోభయతిసుఖయతి-చోపభుజ్యమానోలవోపిలక్ష్మ్యాః। దేవీసరస్వతీపునరసమగ్రాకిమపివిడంబయతి॥

ర. అత్థినియత్తియసీసేసభువణదురియాహినందియమహిందో। సిరిజసవమ్మోత్తిదిసావడిలగ్గగుణోమహీనాహో॥

ఛా. అస్తినివర్తితనిశ్శేషభువనదురితాభినందితమహేంద్రః। శ్రీయశోవర్మేతిదిశాప్రతిలగ్నగుణోమహీనాథః॥

లోగడ మనము పరీక్షించినపాలీభాషలో కంటెఁ బై నుదాహరించిన గౌడవధప్రాకృతశ్లోకములలో నెక్కుడుగా స్వరనాశము (Phonetic decay) వృద్ధి నొందినట్లు కానవచ్చుచున్నది. పాలీభాషలోఁ గలిగినమార్పు లాకాలపుస్థితిగతులనుబట్టియు మనుష్యులయొక్క యుచ్చారణ సౌష్ఠవమునుబట్టియుఁ గలిగిన దని యూహింపవచ్చును. కాని ప్రాకృతభాషలలో శబ్దజాలము చెడిన

క్రమము విచారింపఁగా నతివిస్తృతము గా నున్నది. పాలీభాషలోవలెఁ బ్రాకృత భాషలలోఁగూడఁ గలిగిన స్వరరూపాంతరాపత్తి (phonetic transformation) యించుకంతభేద మున్నను నేకరీతిగా నున్నది. ఎట్లన; ఘృత, తృణ, మృగ మొదలగుశబ్దములలో నున్నఋకార మకారముగా మాఱి ఘఅ, తణ, మయ అని యయినది. కృపా, హృదయ, కృశ, అనుశబ్దములలో నుండుఋకారమికా రముగా మాఱి కివా, హిఅఅ. కిసఁఅని యయినది. పృథివీ, ప్రావృట్, వృద్ధ ఇత్యాదులయందు నాఋకార ముకార మయినది. ఉ పుహఈ, పాఉస, వుడ్ఢ - ఈఋకారము మఱియొకవర్ణముతోఁ గలియక స్వతంత్రముగా నున్న పుడు తఱచుగా ‘రి’ గామాఱును. ఉ. ఋద్ధి - రిద్ధి, ఋక్ష - రిచ్ఛ. పాలీలో నిట్లు మాఱదు. ఉ. ఋద్ధి - ఇద్ధి, ఋక్ష - అచ్ఛ మొదలగునవి. పాలీలోవలెనే ఐఔ లిందులోఁ గూడ ఏఓలుగా మాఱును. ఉ. కైలాస - కేలాస, వైద్య - వేజ్జ, కైటభ - కేఢవ, యౌవన - జొవ్వణ, కౌముదీ - కోముఇ, కౌస్తుభ - కోత్థుహ. కాని, యీఐఔ లనేకశబ్దములయందు “అ ఇ”, “అ ఉ”గాఁ గూడ మాఱును. ఉ. దైత్య - దఇచ్చ, భైరవ - భఇరవ, దైవత - దఇవఅ, సైన్వర - సఇర, పౌర - పఉర, కౌశల - కఉసల, సౌధ - సఉహ, మౌళి - మఉళి.

పైశబ్దములలోఁ గనఁబడినమార్పు బాగుగ నుచ్చరింపఁ జాలనిమను ష్యులు ద్విత్వాక్షరములను విడఁదీసి ప్రత్యేకముగా నుచ్చరించుటను బోలి యున్నది. ఐకారౌకారములలో మొదటిస్వర మగు “అ”కారము శీఘ్రముగా నుచ్చరింపఁబడుచున్నది. ప్రాతిశాఖ్యప్రణేతలు దానినర్ధమాత్ర యని వ్యవహ రించిరి. ప్రాకృతభాషలో నది మాత్ర యని చెప్పంబడును. పాలీభాషలో వలెనే ద్విత్వాక్షరములకు ముందుండుదీర్ఘాచ్చులు హ్రస్వము లగును. హ్రస్వము లగు ఎఒ లున్నందు కిదియే ప్రబలసాక్ష్య మయియున్నది. పాలీలో ద్విత్వా క్షరములకు ముం దున్నహ్రస్వేకారోకారములు కొన్నిస్థలములయందు “ఎఒ” లుగా మాఱును. ఇందువలన నివి హ్రస్వము లని మన మూహింపవచ్చును. ద్విత్వాక్షరమునకు ముం దుండుహ్రస్వేకారము పలుచోట్ల వైకల్పికముగా ఏ కారముగాను, హ్రస్వోకారము నిత్యముగా ఓకారముగాను మాఱును. ఉ. పిణ్డ - పేణ్డ, పిష్ట - పేట్ఠ, నిద్రా - నేద్దా, తుండ - తోండ, ముణ్డ - మోణ్డ, పుష్కర - పొక్ఖర. ద్విత్వాక్షరమునకు ముం దుండనిఏకారము కొన్నిస్థలముల యందు వైకల్పికముగా “ఇ” కార మగును. ఉ. వేదనా - విఅణా, వేఅణా. దేవర - దిఅర, దేఅర. ఈశబ్దములలో నున్నఎకారమిట్లు ముందు మన మాలో

చింపఁబోవుకొన్నియుపపత్తులవలన హ్రస్వముగా నుచ్చరింపఁబడును. అందు వలన నికారముగా మాఱుచున్నది. ఒకానొకప్పు డెకారమునకుఁ గాని, ఓకారమునకుఁగాని వెనుక నుండుహల్వర్ణమునకు ద్విత్వము వచ్చును. ఉ. తైల - తెల్ల, ప్రేమన్ - పెమ్మ, స్రోతస్ - సోత్త, యౌవన - జొవ్వణ. అయ, అవ అనునవి పాలీలోకంటె నెక్కుడుగా ఏఓలుగా మాఱును. ణిచ్చునకు నాదేశముగా వచ్చు "అయ" అనునది "ఏ"కారముగా మాఱును. ఉ. కారయతి - కారేఇ, హాసయతి - హాసేఇ, కథయతి - కహేఇ.

పాలీలో శషసలు సకార మగును. మాగధిలో శవర్ణ మగును. ఉ. సారస - శాలస, పురుష - పులిశ; ప్రాకృతభాషలోఁ బాలీభాషయందువలె మూర్ధన్యళకారము లేదు. దానికి బదులుగా లకార ముపయోగింపఁబడుచున్నది. మఱికొన్నిస్థలములయందు సాంస్కృతికడకారము కానవచ్చును.

| సంస్కృతము. | పాలీ. | ప్రాకృతము. | సంస్కృతము. | పాలీ. | ప్రాకృతము. |
|---|---|---|---|---|---|
| తటాక | తళాగ | తలాఅ. | గుడ | గుళ | గుడ, గుల. |
| గరుడ | గరుళ | గరుల. | నాడీ | నాళీ | ణాలీ, నాడీ. |

సమీపమున నున్న రేఫము నిమిత్తముగాఁ జేసికొనికాని యది లేకుండఁగాని దంత్యవర్ణములు మూర్ధన్యములుగా మాఱుటలోఁ బాలీలోకంటె నెక్కుడుదాహరణములు ప్రాకృతభాషలలోఁ గానవచ్చుచున్నవి. తథలతో సంవదించుటత లనేకస్థలములయందు డఢలుగా మాఱును. ఉ. ప్రతిమా - పడిమా, ప్రతిహార - పడిహార, ప్రభృతి - పహుడి, పతన - పడణ, విభీతక - వహేడఅ, దోలా - డోలా, దమ్భ - డంభ, దభ్ - డబ్బ, ప్రథమ - పఢమ, శిథిల - శిఢిల, ఔషధ - ఓసఢ.

పాలీలో నకారము కొన్నిచోట్ల ణకార మగును. ప్రాకృతములోఁ బ్రతిచోటఁ బదాదియం దుండనినకారము నిత్యముగాను బదాదియం దుండునది వైకల్పికముగాను ణకార మగును. ఉ. కనక - కణఅ, వదన - వఅణ, అపదాది. నర - ణర, నదీ - ణఈ, పదాది.

ఇందుకుఁ గేవలవిపరీతక్రమము పైశాచీభాషలోఁ గానవచ్చుచున్నది. ఇందులో నీమార్పు రాదు సరేకదా సాంస్కృతికపదములలో నుండునకారము గూడ ణకారముగా మాఱును. ఉ. గుణ - గున, గణ - గన.

సంయుక్తాక్షరములలోఁ గలుగుమార్పు పాలీలోను ప్రాకృతములోను నొక్కటియె. జ్ఞ, న్యఅనునవి ప్రాకృతములలో "ణ్ణ"గా మాఱును. పాజ్ఞగా

మారును. ఉ. జ్ఞాన - ణాణ, సంజ్ఞా - సణ్ణా, అన్య - అణ్ణ, శూన్య - సుణ్ణ, ర్య, జ్జ గాను, హ్య, జ్ఝగాను మారును. ఉ. ఆర్య - అజ్జ. మధ్య - మజ్ఝ.

సంయుక్తములో నుండుదంత్యవర్ణము వకారానుగత మైనచో దాని కను రూప మయినతాలవ్యము వచ్చును. ఉ. భుక్త్వా - భోచ్చా, చత్వర - చచ్చర, పృథ్వీ - పిచ్ఛి, విద్వాన్ - విజ్జం, బుధ్వా - బుజ్ఝా, ధ్వజ - ఝఅ, ధ్వని - ఝణీ, సాధ్వస - సజ్ఝస.

పాలిలోఁ జత్వరాదిశబ్దములయం దున్న "త్వ" మారదు ద్వధ్వలు యథాక్రమముగా ద్ద, ద్ధ, గా మారును. పాలిలో "ర్శ, ర్ష" అనుసంయుక్తము లచ్చు మధ్యమునఁ బ్రవేశించుటచే వే అగును. ప్రాకృతములోఁగూడ నట్లే. ఉ. ఆదర్శ - ఆఅరిస, సుదర్శన - సుదరిశన, వర్ష - వరిస, అమర్ష - అమరిస.

ఇట్లు ప్రాకృతభాషలకుఁ బాలితో సమానముగా నుండుమార్పులఁ జర్చించి ప్రాకృతశబ్దములకుఁ గలుగుమార్పుల నిటఁ బైని విమర్శింతము. ఆ కాలమందు వ్యవహారములో నున్నసంస్కృతపదములను జనులు బాగుగ నుచ్చరింపలేకపోవుటచేఁ గలిగిన వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములవలనఁ బుట్టినయీప్రాకృతభాషలోఁ బాలీభాషకంటె మార్పులకు హెచ్చుగా నవ కాశ మున్నది. పాలీభాషలో మార్పు లల్పముగా నున్నవి.

౧. సంయుక్తాక్షరములముందటియికారోకారములు హ్రస్వము లయిన "ఎకారోకారములు"గా మారును. ఈకారోకారములు "ఏకారోకార ములు"గా మారును. ఉ. పీయూష - పేఊస, ఆపీడ - ఆమేల, విభీతక - వహేడఅ, కీదృశ - కేరిస, ఈదృశ - ఏరిస.

౨. ఇఉలు కాదాచిత్కముగా అకార మగును. ఉ. హరిద్రా - అలద్దా.

౩. యకార మికార మగును. ఉ. వ్యజన - విఅణ, వ్యళీక - విఅిఅ.

౪. సంస్కృతపదముల కంతమం దున్నవిసర్గకుఁ బ్రాకృతములో "ఓ" కారము వచ్చును. ఉ. దేవః - దేవో, పురతః - పురఓ.

౫. స్వప్నాదిశబ్దములలో నాదియం దున్నఅకారమున కికార మగును. ఉ. స్వప్నః - సివిణో, మరిచం - మిరిచం, దత్తం - దిణ్ణం.

౬. శయ్యాదులయందు మొదటియకారమునకు నేత్వము వచ్చును. ఉ. శయ్యా - సేజ్జా, కందుకం - గేందుకం.

౭. పదమధ్యమం దున్నవర్ణము లోపించుట ప్రాకృతపదములకు ముఖ్య మయిన లక్షణము. పదమధ్యమం దున్నకగచజతదపయవ లచ్చునకుఁ దరు

నాత నున్నయెడల లోపించును. ఉ. క—శకటం - సఅడం, గ—నగరం - ణఅరం, చ—వచనం - వఅణం, జ—గజః - గఓ, త—వితానం - విఆణం, ద—గదా - గఆ, ప—కపిః - కఈ, య—నయనం - ణఅణం, వ—లావణ్యం - లాఅణ్ణం.

౮. పూర్వోక్తము లగు కగచజాదివర్ణములు లోపింపఁగా మిగిలిన "అ" కారస్థానమందు యకార ముచ్చరింపవలయును. ఉ. వదనం-వఅణం-వయణం,

౯. పదాదియందుండని ఖ, ఘ, థ, ధ, భలకు ముందు వచ్చున్నయెడల హకార మాదేశ మగును. ఉ. ఖ—ముఖః - ముహో, మేఖలా - మేహలా; ఘ—మేఘః-మేహో, థ—నాథః-ణాహో, ధ—సాధుః-సాహు, భ—సభా-సహా.

౧౦. పదాదియందుండని టకారము డకార మగును. ఉ. నటః - ణడో, విటపః - విడవో

౧౧. ఠకారమునకు ఢకార మగును. ఉ. శఠః-సఢో, కమఠః-కమఢో.

౧౨. పకారమునకు వకారము వచ్చును. ఉ. శాపః - సావో; కపోలః - కవోలో.

౧౩. ఫకారము భకారహకారము లగును. ఉ. శేఫాలికా - సేభాలిఆ, సేహాలిఆ.

౧౪. బకారమునకు వకారము వచ్చును. ఉ. ఆలాబూ - ఆలావూ.

౧౫ కొన్నిచోట్ల క్షకారమునకు ఖకారము మఱికొన్నిచోట్ల ఛకార ఝకారములును వచ్చును. ఉ. క్షీణం - ఖీణం, క్షయః - ఖఓ, ఖన్యతి - ఝిజ్జఇ.

౧౬. అక్ష్యాదిశబ్దములలో - నున్నక్షకారమునకు చ్ఛకారమే వచ్చును గాని "ఖ" రాదు. ఉ. అక్షి - అచ్ఛి.

౧౭. క్మ, త్మ అనుసంయుక్తములు పకారముగా మాఱును. ఉ. రుక్మం - రుప్పం, ఆత్మా - అప్పా.

౧౮. నామవాచకములయందున్న స్క, ష్క అనుసంయుక్తములకు ఖకారము వచ్చును. ఉ. పుష్కరం - పొక్ఖరం, నిష్కం-నిక్ఖం, స్కంధః-ఖంధో.

౧౯. హ్రస్వాక్షరమునకుఁ బరముగా నుండు థ్య, శ్చ, త్స, ప్స, అను వానికి "చ్ఛ" వచ్చును. ఉ. థ్య—పథ్య - పచ్ఛ, రథ్యా - రచ్ఛా, మిథ్యా - మిచ్ఛా; శ్చ—పశ్చిమం - పచ్ఛిమం, ఆశ్చర్యం - అచ్ఛేరం; త్స—ఉత్సాహః - ఉచ్ఛాహో, మత్సరః - మచ్ఛరో; ప్స—అప్సరా - అచ్ఛరా.

౨౦. ఈక్రింద వ్రాసినద్విత్వాక్షరముల కీయాదేశములు వచ్చును. ఉ. ధ్య—ధ్యానం - ఝాణం, మ్న—నిమ్నం - నిణ్ణం, జ్ఞ—ణ - ణాణం.

౨౧. ష్ప, ఫకారముగాను, శ్న ష్ణ, స్న, హ్న, హ్ణ, క్ష్ణ అనుద్విత్వాక్షరములు ణ్హాగాను మాఱును. ఉ. ష్ప, ఫ—పుష్పం - పుప్ఫం, నిష్పేశః - నిప్ఫేశో; శ్న, ణ్హా—ప్రశ్నః - పణ్హో, ష్ణ—విష్ణుః - విణ్హూ, కృష్ణః - కణ్హో; స్న—జ్యోత్స్నా - జోణ్హా, స్న—స్నాయుః - ణ్హాఊ, హ్న—వహ్నిః - వణ్హీ, క్ష్ణం—శ్లక్ష్ణం - సణ్హం.

౨౨. "హ్య"అనుదానికి ఝ అనియు, హ్ల అనుదానిస్థానమందు ల్హ అనియు నాదేశము లగును. ఉ. గుహ్యం - గుజ్ఝో, సహ్యః - సజ్ఝో, కహ్లారం - కల్హారం, ప్రహ్లాదః పల్హాఓ.

౨౩. కొన్నిస్థలములయందు త్వ, థ్వ, ద్వ, ధ్వ, అనువానికి యథాక్రమముగా చ్చ, చ్ఛ, జ్జ, జ్ఝ అనునవి యాదేశ మగును. ఉ. త్వ—జ్ఞాత్వా - ణచ్చా, శ్రుత్వా - సోచ్చా; థ్వ—పృథ్వీ - పిచ్ఛీ, ద్వ—విద్వాన్ - విజ్జం, ధ్వ—బుధ్వా - బుజ్ఝా.

౨౪. ధూర్తాదిగణపఠితములగుశబ్దములను విడిచి యితరపదములయందు "ర్త" అనుదానికి టకారము వచ్చును. ఉ. కైవర్తః - కేవట్టో, నర్తకః - ణట్టఓ. ధూర్తాదిశబ్దములకు రాదు. ఉ. కీర్తిః - కిత్తీ, ధూర్తః - ధుత్తో.

మొదట హల్లులలోఁ గలిగినపూర్ణ మగుస్వరసమీకరణమునకుఁ (assimilation) దరువాత దీనికిఁ దోడుగాఁ బదములమధ్యను సంభవించిన హల్లోపమునకుఁ దగినకారణము భాషాచరిత్రమునుబట్టి విమర్శింపఁగా నీదిగువ వ్రాయఁబడినదియే ముఖ్య కారణ మని మన మూహించుకొనవచ్చును. ఆర్యులు పాంచాలమునుండి బయలుదేఱివచ్చి బ్రహ్మావర్తము కురుక్షేత్రము మొదలగు ప్రదేశములయందు స్థిరపడినతరువాత నొకసంఘముగా నేర్పడిరి. పాలీభాషను మాటలాడెడునాదిమనివాసు లగునొకజాతివారు వీరిసంఘములోఁ గలిసిరి. ఒకటిగా నేర్పడినయీయార్యజనసంఘము తూర్పువైపు దక్షిణమువైపు వ్యాపించినపుడు విజాతీయు లయినమఱికొందఱతోఁ గలిసికొనిరి. ఈసంఘములో నధమజాతులవారు మాటాడుభాష నూతనజాతివారిచే నేర్చుకొనఁబడి పాలీభాషావస్థ నొందింపఁబడి యిపుడు మనము ప్రాకృతభాషలోఁ జూచుశబ్దరూపములుగా నపభ్రంశదశకుఁ దీసికొనిరాఁబడినది. అశోకునిశాసనములయం దున్న ప్రాకృతభాషలో నిట్టివర్ణవ్యత్యయవర్ణలోపాదులు గానరావు. అశోకునికాలము నాఁటికిఁ బ్రాకృతభాష లింతవృద్ధిఁ బడయలే దని మన మనుకొనవలెనా? అశోకునికాలమునాఁటికిఁ బ్రాకృతభాషలు వృద్ధినొందసాగినను నీ యార్య

సంఘములోనివారిలో విద్వాంసులగువారు మాటలాడుభాషలో నీశాసనములు వ్రాయఁబడియున్నవి కాని వీరిలోఁ గ్రొత్తగాఁ జేరినయధమజాతివారు సంభాషించుభాషలో వ్రాయఁబడినవి కావు. క్రీస్తునకుఁ దరువాత ద్వితీయశతకమందు నాసిక్కు (Nasik) లో నున్నపర్వతగుహాయందుఁ జెక్కఁబడిన ప్రాకృతశాసనములలో వర్ణభ్రంశాది వైచిత్రిని దెలిపెడు నుదాహరణములు కొన్ని కానవచ్చుచుండుటవలన నాకాలమునకుఁ బ్రాకృతభాష లుత్పన్నము లయినవిగాని యవి గ్రామ్యములుగాఁ బరిగణింపఁబడి యుపేక్షింపఁబడినవని తోఁచుచున్నది.

ప్రాకృతవ్యాకరణములతో సంబంధించిన నియమములు.

౧. ప్రాకృతభాషలో ఋ, ౠ, ఌ, ఐ, ఔలు తప్పఁ దక్కినయచ్చులు కలవు.

౨. ఙ, ఞ, శ, ష, స, యలు తప్పఁదక్కినహల్లు లున్నవి.

౩. భిన్నవర్గీయము లగువర్ణములకుఁ బరస్పరసంయోగము లేదు. ఉ. త్క, ష్క, క్య, క్ర, ల్క మొదలగువానికి "క్క" యనియే రూప మగును.

౪. స్వరరహిత మయినవ్యంజనము లేదు. అనఁగా క్, ర్, చ్ మొదలగు పొల్లులు లేవు.

౫. ఈభాషలో ద్వివచనమును, జతుర్థీవిభక్తియును లేవు. చతుర్థికి బదులుగా షష్ఠీవిభక్తి వాడుకొనఁబడును.

౬. సమాసమం దచ్చులదీర్ఘమునకు హ్రస్వము, హ్రస్వమునకు దీర్ఘము వైకల్పికముగా నగును. ఉ. అంతావేఇ (అంతర్వేది) సత్తావీసా (సప్తవింశతిః) కొన్నిచోట్ల దీర్ఘము రాదు. ఉ. జువఇఅణో (యువతిజనః) మఱికొన్నిచోట్ల వికల్పము. ఉ. పఈహారం పఇహారం (ప్రతిగృహం) ణఈసోత్తం (నదీస్రోతః).

సంధి.—౧. సంస్కృతవ్యాకరణోక్త సంధిశాస్త్ర మంతయు నీప్రాకృతభాషలో వికల్పము. అనఁగా రెండుపదములకు సంధి వైకల్పికము. ఉ. దహీఈసరో, దహీసరో (దధీశ్వరః) వాసేసీ, వాసఇసీ (వ్యాసర్షిః).

౨. ఇకారోకారముల కసవర్ణాచ్చులతో సంధి కలియదు. ఉ. విఅ (ఇవ) మహుఇం (మధూని) సవర్ణాచ్చులతో సంధి కలుగును. ఉ. పుహవీసః (పృథివీశః).

౩. అచ్చు పరమయి యుండఁగా ఎకార ఓకారములకు సంధిరాదు. ఉ. దేవీఏఏత్థ (దేవ్యాఅత్ర) ఎఓఏత్థ (ఏకోఽత్ర).

౪. అచ్చునకు ఉద్వృత్తాచ్చు పరమైయుండఁగా సంధి గాదు. హల్లు లోపింపఁగా మిగిలినయచ్చున కుద్వృత్త మని పేరు. ఉ. ణిసాఅరో (నిశాచరః)

ఇచ్చట "చరః" అనుదానిలోని చకారము లోపింపఁగా మిగిలిన అకారమున కుద్వృత్త మని పేరు. ఈ అకారములో 'నిశా' అనుదానిలోనున్న యంత్యా కారమునకు ణిసారో అని సంధి కావలెను. అట్లు కాలేదు.

౫. తిబాదుల యచ్చున కచ్చుపరం బగుచుండఁగా సంధి రాదు. భవతి, గచ్ఛతీత్యాదులు తిబాదులు. వీని యికారముతో మఱియొక యికారమునకు సంధి రాదు. ఉ. హోఇ + ఇహ (భవతీహ).

౬. అచ్చున కచ్చు పరంబగునపుడు లోపము వైకల్పికముగా నగును. ఉ. తిఅసీసో, తిఅసఈసో (త్రిదశేశః) రాఉలం, రాఅఉలం (రాజకులం) తుహత్థం, తుహఅత్థం (తవార్థం) అంధారో, అంధఆరో (అంధకారః).

౭. పదాంతమం దున్నహల్లు లోపించును. ఉ. జావ (యావత్) తావ (తావత్).

౮. పదాన్తమం దున్నమకారనకారముల కనుస్వార మగును. ఉ. జలమ్ - జలం, కమలమ్ - కమలం.

౯. శ్రత్, ఉత్, అనువానిలో నంతమందున్న తకారమునకు లోపము రాదు. ఉ. శ్రద్ధా - సద్ధా, ఉన్నయం - ఉణయం.

౧౦. అంతర్, నిర్, దుర్, అనువానియొక్క కొనరేఫ కచ్చు పరంబగు నపుడు లోపంబు గలుగదు. అంతరప్పా (అంతరాత్మా) ణిరంతరం (నిరంతరం) దురుత్తరం (దురుత్తరం).

౧౧. విద్యుచ్ఛబ్దంబునకుఁదక్కఁ దక్కిన స్త్రీలింగశబ్దంబుల యంత్యహల్లున కాకారాదేశం బగును. ఉ. సంపద్ - సంపఆ, వాక్ - వాఆ, సరిత్ - సరిఆ.

౧౨. జ, మ, ఞ, ణ, న అనువానికి హల్లు పరమై యుండఁగా ననుస్వా రము వచ్చును. ఉ. జ—పంత్తీ - పఙ్క్తిః, మ—సంపా - శమ్పా, ఞ—కంచుఓ - కఞ్చుకః, ణ—సంముహో - షణ్ముఖః, న—చందణో - చన్దనః.

౧౩. శషసలతోఁ గలసియున్న యరవశషసలకు లోపము రాఁగా మొదటి శషసలకు ముందున్న వర్ణముల యచ్చునకు దీర్ఘము వచ్చును. ఉ. య—పాసఇ- పశ్యతి, ర—వీసామః - విశ్రామః, వ—వీససఇ - విశ్వసితి, శ—దూసాసణో - దుశ్శాసనః, ష—సీసో - శిష్యః, స—నీసహో - నిస్సహః.

## నామవాచకములు.

పాలీభాషలోవలెనే ప్రాకృతమందు ద్వివచనమును జతుర్థవిభక్తియు లేవు. ఇందులోఁ దృతీయాబహువచనప్రత్యయము హిం అనునది. పాలీభాషలోని 'భి'

అనునది లోపించినది. ప్రాచీనప్రాకృతభాషలలో లోపించిన పంచమవిభక్తి బహువచనప్రత్యయము తృతీయాబహువచనప్రత్యయమగు 'హి' అనుదానితోను, సప్తమవిభక్తి ప్రత్యయమగు "సు" అనుదానితోను గలిపి "హింతో, సుంతో" అని చేయఁబడినది.

దో అను రూపాంతరము నొందిన 'తో' యనునది, దు యనునది నామవాచకములకుఁ బంచమవిభక్త్యేకవచనప్రత్యయముగాఁ జేర్పఁబడును. ఇది శౌరసేనీభాషాక్రమము. కాని దో, దు అనునవి శౌరసేనీప్రత్యయము లనియు, ఓ ఉ లు ప్రధానప్రాకృతభాషలోని వనియు నాచార్యహేమచంద్రుని యభిప్రాయము. అతఁడు "త్తో" అనునది ఏకవచనమునకు బహువచనమునకుఁ గూడఁ బొదుపైన ప్రత్యయ మనియు ఓ ఉలు బహువచనప్రత్యయము లనియుఁ జెప్పుచున్నాఁడు. ద్విత్వము లేని సంస్కృతభాషాశబ్దములకుఁ గూడఁ బ్రాకృతములోఁ గొన్నిచోట్ల ద్విత్వము గలుగును. కావున "త్తో" అనురూపము సిద్ధించినది. దో, దు, ఓ, ఉ, అనువానికి బహువచనబోధకత్వమును గల్పించుటయం దుపపత్తి యేమనఁగా సంస్కృతభాషలో నీ "తో" అనుప్రత్యయముతోఁ గూడిన నామవాచకము ఏకవచనమును బహువచనమును గూడఁ జెప్పును. ఉ. గ్రామతః అనునది గ్రామమునుండి గ్రామములనుండి యనికూడ యర్థమిచ్చును. సంస్కృతభాషలో షష్ఠ్యేకవచనవిభక్తి ప్రత్యయమగు "స్య" అనుదానివికృతియగు స్స అనునది పాలీలోవలెనే యకారాన్తము లగుపుంలింగ నపుంసకలింగనామవాచకముల కన్నింటికిఁ జేర్పఁబడును. సంస్కృతములో షష్ఠీవిభక్తిబహువచన ప్రత్యయమగు "నామ్" అనుదాని వికృతిరూపమగు "ణామ్" అనునది షష్ఠీవిభక్తిబహువచనప్రత్యయము, పాలీభాషలో వ్యవహరింపఁబడు స్మా, లేక మ్హా యనునది ప్రాకృతభాషలో నదృశ్య మయినది, స్మి లేక మ్హి యనునది "మ్మి" యొక్కస్థానము నాక్రమించినది. ఇదియును బుంలింగనపుంసకలింగనామవాచకములకు సప్తమీవిభక్త్యేకవచనముగా వ్యవహరింపఁబడుచున్నది. సంబోధనప్రథమావిభక్తి సంస్కృతపాలీభాషలలో నెట్లో యట్లే యీభాషయందుఁగూడనని యెఱుంగునది.

ప్రాకృతభాషలో నవర్ణాంతము లనియు, ఇవర్ణాంతము లనియు, ఉవర్ణాంతము లనియు, ఋవర్ణాంతము లనియు, హలంతము లనియు శబ్దము లయిదంతరగతులుగా విభజింపఁబడి యున్నవి.

### అకారాంతపుంలింగశబ్దములు.

౧. అకారాంతపుంలింగముల ప్రథమైకవచనప్రత్యయ మగు "సు" అను దాని స్థానమందు ఓ వచ్చును ఉ. దేవస్-దేవో.

౨. ప్రథమాబహువచనప్రత్యయ మగు "జస్", ద్వితీయాబహువచన ప్రత్యయ మగు "శస్", పంచమ్యేకవచనప్రత్యయ మగు "ఙస్", షష్ఠీబహువచనము "ఆమ్" అనునీప్రత్యయములు లోపించి యంత్యాకారమునకు దీర్ఘము వచ్చును.

3. ద్వితీయావిభక్తిప్రత్యయ మగు "అమ్" లోపించును.

౪. తృతీయైకవచనప్రత్యయ మగు టా అను దానికి, షష్ఠీబహువచన ప్ర యయ మగు "ఆమ్" అనుదానికి ణకారము వచ్చును.

౫. సప్తమ్యేకవచనమందు షష్ఠ్యేకవచనమందుఁ దప్పఁ దక్కినవిభక్తు లన్నిటియందు,అకారాంతశబ్దముల కొసనుండు అకారమున కేత్వంబుగలుగును.

౬. తృతీయాబహువచనప్రత్యయ మగు "భిస్" అనుదానికి "హి, హిమ్" అనునవి యాదేశ మగును.

౭. పంచమ్యేకవచనప్రత్యయ మగు "ఙస్" అనుదానికి బదులుగా త్తో, దో దు, హి, హిత్తో మొదలగునవి యాదేశము లగును.

౮. పంచమీబహువచనప్రత్యయ మగు భ్యస్ అనుదానిస్థానమందు త్తో, దో, దు, హి, హింతో, సుంతో అనునవి వచ్చును.

౯. ఙస్ అనెడిషష్ఠ్యేకవచనప్రత్యయమునకు 'స్స' అనునది యాదేశమగును.

౧౦. సప్తమ్యేకవచనప్రత్యయ మగు "ఙి" అనుదానికి బదులుగా ఎ, మ్మి అనునవి వచ్చును.

అకారాంతశబ్దముల ప్రథమాద్వితీయాతృతీయావిభక్తులు పాలీభాషలో వలెనే యుండును. కాని యిందులోఁ బ్రథమావిభక్తికి ద్వితీయావిభక్తికి నొక్కటియే రూపము. పాలీలోవలెనే ఆయ అనుచతుర్థీవిభక్తిప్రత్యయము కొన్నిపదములలోఁ గానవచ్చుచున్నది. పైనిఁ జెప్పఁబడిన ప్రత్యయములు గాక ప్రాచీన మగు పంచమ్యేకవచనప్రత్యయము మఱియొకటి పాలీలోవలెనే యిందులోఁ గూడఁ గానవచ్చుచున్నది. పాలీలో "ఆహి," అనుప్రత్యయము ఏకవచనమందు బహువచనమందుఁ గూడఁ జేర్పఁబడును. ఈ ఆహిప్రత్యయము సంస్కృతభాషలోఁ గూడ "ఉత్తరాహి, దక్షిణాహి, అనుశబ్దములయందుఁ బంచమ్యర్థమందుఁ గానవచ్చుచున్నది. ఇది తృతీయాబహువచనప్రత్యయమగు "భిస్"

ఈరీతిగా మాఱినదని మన మూహింపవలెను. సప్తమ్యేకవచనరూపము పాలీలో వలెనే ఎ అనునది.

అకారాంతపుంలింగ మగు -దేవశబ్దము.

| ఏకవచనము. | బహువచనము. |
|---|---|
| ప్ర. దేవో | దేవా. |
| ద్వి. దేవం | దేవే, దేవా. |
| తృ. దేవేణ | దేవేహి, దేవేహిం. |
| పం. దేవత్తో, దేవాఓ దేవాఉ, దేవా హిత్తో | దేవాహింతో, దేవాసుంతో, దేవేహింతో. |
| ష. దేవస్స | దేవాణ, దేవాణం. |
| స. దేవే, దేవమ్మి | దేవేసుం, దేవేసు. |
| సం. దేవ. దేవో | దేవా. |

౧. ఇదుదన్తముల అనఁగా ఇకారోకారాంతముల సు, జస్, భిస్, భ్యస్, సుప్, అను సుప్రత్యయములకు ముం దుండెడు నంత్యావర్ణమునకు దీర్ఘము వచ్చును.

౨. ప్రథమాబహువచనప్రత్యయ మగు జస్సునకు ఓకారముగాని ణో అనునదిగాని వచ్చును. మఱి కొన్నిచోట్ల జస్సు లోపించును.

౩. తృతీయాబహువచన ప్రత్యయ మగు శస్సునకు ణో వచ్చును. షష్ఠ్యేకవచనప్రత్యయ మగు ఙస్ అను దానికి "ణో" వైకల్పికముగా నగును.

౪. తృతీయైకవచనప్రత్యయ మగు టా అనుదానికి ణా వచ్చును. తక్కిన దంతయు అకారాంతములకువలెనే.

ఇకారాంత పుంలింగగిరిశబ్దము.

| | |
|---|---|
| ప్ర. గిరీ | గిరిఓ. గిరిణో. |
| ద్వి. గిరిం | గిరిణో. |
| తృ. గిరిణా | గిరీహిం. |
| పం. గిరిదో | గిరిహింతో, గిరిసుంతో, ఇత్యాది. |
| ష. గిరిణో, గిరిస్స | గిరిణ, గిరిణం. |
| స. గిరిమ్మి | గిరీసు, గిరీసుం. |

## ఉకారాంత పుంలింగ గురుశబ్దము.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్ర. | గురూ | గురూఓ, గురుణో. |
| ద్వి. | గురుం | గురుణో. |
| తృ. | గురుణా | గురూహిం. |
| పం. | గురుదో | గురుహింతో, ఇత్యాది. |
| ష. | గురుణో, గురుస్స | గురుణాం, గురుణ. |
| స. | గురుమ్మి | గురుసు, గురుసుం. |
| సం. | గురూ | గురూఓ. |

ఇకారాంతపుంలింగము లన్నియు గిరిశబ్దమువలెను, ఉకారాంతపుంలింగము లన్నియు గురుశబ్దమువలెను.

౧. ఋకారాంతపుం లింగశబ్దముల యంతమం దుండెడి ఋకారము సకలవిభక్తిప్రత్యయముల ముందట "ఆర" అని మాఱును. అందువలన ఋకారాన్తములకుఁ గూడ అకారాంతములకు వలెనే రూపములు.

౨. సు, అమ్, అను వానిముందటఁ దప్పఁ దక్కిన సర్వవిభక్తిప్రత్యయముల ముందట నంత్యఋకారస్థానమందు వైకల్పికముగా ఉకారము వచ్చును. అందువలన ఉకారాంతశబ్దములకువలెనే రూపము లగును.

౩. సంబోధనప్రథమావిభక్తియందు, కొనఋకారమునకు వైకల్పికముగా అకార మగును. ఉ. హేపిఅ, హేపిఅర (హేపితః.)

౪. విభక్తిప్రత్యయములముందర పితృ, భ్రాతృ, జామాతృశబ్దముల ఋకారమునకు "ఆర" అనునది వచ్చుటకు బదులుగా "అర" అని వచ్చును.

## భర్తృశబ్దము—(పుంలింగము.)

| | | |
|---|---|---|
| ప్ర. | భత్తారో | భత్తుణో, భత్తారా. |
| ద్వి. | భత్తారం | భత్తుణో, భత్తారే. |
| తృ. | భత్తుణా, భత్తారేణ | భత్తారేహిం, భత్తుహిం. |
| పం. | భత్తారాదో, భత్తుణో | భత్తారహిం, భత్తుహింతో. |
| ష. | భత్తుణో, భత్తారస్స | భత్తుణాం, భత్తారాణాం. |
| స. | భత్తారే, భత్తారమ్మి, భత్తుమ్మి | భత్తుసు, భత్తారేసు. |
| సం. | హేభత్తార | హేభత్తారాః. |

## పితృశబ్దము.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్ర. | పిఆ, పిఅరో | పిఅరా. |
| ద్వి. | పిఅరం, పిఅరో | పిఅరే, పిదుణో. |
| తృ. | పిఅరేణ, పిదుణా | పిఅరేహిం. |
| పం. | పిఅరాదో, పిదుణో | పిఅరహింతో, పిదుహింతో. |
| ష. | పిఅరస్స, పిదుణో | పిఅరాణం, పిదుణం. |
| స. | పిఅరే, పిఅరమ్మి, పిదుమ్మి | పిఅరేసు, పిదుసుం. |
| సం. | హేపిఅర, హేపిఅ | హేపిఅ, హేపిఅరా. |

ప్రాకృతప్రకాశ, కల్పలత మొదలగు ప్రాకృతవ్యాకరణములయం దీకారాంతోకారాంత పుంలింగశబ్దముల రూపనిష్పత్తిని గుఱించి వేఱుగా నియమములు విధింపఁబడియుండలేదు, గావున నట్టివానికి ఇకారోకారాంత శబ్దములకువలెనే రూపము లని గ్రహింపవలయును. ఆచార్యహేమచంద్రుఁడు క్విబంతము లగునీకారాంతోకారాంత శబ్దములకు సర్వవిభక్తులయందు హ్రస్వము కలుగు నని చెప్పెను.

## స్త్రీలింగములు.

౧. స్త్రీలింగశబ్దనిరూపణముఁ బ్రారంభింపక మునుపు స్త్రీలింగప్రత్యయములు విచారింపఁబడును. అవి తఱచుగా సంస్కృతభాషయందువలె నుండును. కొన్నిచోట్ల విశేషనియమములు విధింపఁబడినవి.

౨. పాణినిచే స్త్రీలింగములకు టిడ్ఢాణఞ్ ద్వయసచ్ దఘ్నచ్ మాత్రచ్ తయప్ ఠక్ ఠఞ్ కఞ్ క్వరపః (౪-౧-౧౫) అను సూత్రముచే విధింపఁబడిన జీప్ప్రత్యయము ప్రాకృతములో వికల్పము.

3. జాతివాచకములకుఁ దప్పఁ దక్కిన స్త్రీలింగశబ్దముల కన్నిటికి జీప్ వైకల్పికముగా నగును. ఉ. కాళీ, కాఆ ఇత్యాది, కుమార్యాదులకు నిత్యము; కుమారీ.

౪. ఛాయా, హరిద్రా శబ్దములకు జీప్ వైకల్పికము. ఉ. ఛాహా, ఛాహీ, హాలద్దా, హాలద్దీ.

౫. స్వసృ, దుహితృ, ననాంధృ మొదలగు ఋకారాంత స్త్రీలింగశబ్దములు స్వసా, దుహితా, మొదలగురూపముల నొంది సాంస్కృతికాకారాంత స్త్రీలింగశబ్దములవంటి రూపము గలిగియుండును.

౭. సర్వనామము లగు కిమ్, యత్, తత్ మొదలగువాని స్త్రీలింగ రూపములయందు జీప్, వైకల్పికము. ఉ. కీఓ, కాఓ.

౮. స్త్రీలింగమందు జస్, శస్, అనువాని స్థానమందు ఉత్, ఓత్ అనునవి వైకల్పికముగా నగును. హ్రస్వమునకు వైకల్పికముగా దీర్ఘమగును.

౯. టా, ఙస్, ఙి, అను ప్రత్యయములు అత్, యత్, ఇత్, లేక ఏత్ గా మాఱును. ఈ ప్రత్యయము లాకారాంత స్త్రీలింగములయందు 'అత్'గా మాఱవు.

౯. స్త్రీలింగశబ్దముల కంతమం దుండు హ్రస్వా చ్ఛన్నివిభక్తులయందు దీర్ఘమగును.

౧౦. ద్వితీయైకవచనప్రత్యయ మగు అమ్ అనుదానిముందఱ స్త్రీలింగ శబ్దముల కంతమందుండు దీర్ఘాచ్చుహ్రస్వ మగును.

౧౧. ఈకారాంత స్త్రీలింగములయందు సు(ప్రథమైకవచనప్రత్యయము) జస్ (ప్రథమా బహువచన ప్రత్యయము) శస్ (ద్వితీయాబహువచన ప్రత్యయము) అనువానిస్థానమం దాకారము వచ్చును.

౧౨. ఆప్ అను స్త్రీప్రత్యయముఁ జేర్చుటవలనఁ గలిగిన స్త్రీలింగశబ్ద రూపముల చివరి యాకారమునకు సంబోధనలో ఏ వచ్చును. ఉ. హేమాలే.

౧౩. అప్ప్రత్యయాంతములు కాని యాకారాంత స్త్రీలింగశబ్దముల కీ సూత్రము పట్టదు. ఉ. హేపి ఉచ్ఛా.

ఆకారాంత స్త్రీలింగము- -లతాశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | లదా | లదా, లదాఓ, లదాఉ. |
| ద్వి. | లదం | లదా, లదాఓ, లదాఉ. |
| తృ. | లదాఎ, లదాఇ, లదాఅ | లదాహి. లదాహిం. |
| పం. | లదాదో, లదాఎ | లదహింతో. లదసుంతో. |
| ష. | లదాఎ, లదాఇ, లదాఅ | లదాణం, లదాణ. |
| స. | లదాఎ, లదాఇ, లదాహ | లదాసు, లదాసుం. |
| సం. | హేలదే | లదాఓ. |

ఇకారాంత స్త్రీలింగమగు బుద్ధిశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | బుద్ధీ | బుద్ధీ, బుద్ధిఓ, బుద్ధిఉ. |
| | బుద్ధిం | బుద్ధీ, బుద్ధిఓ, బుద్ధిఉ. |
| తృ. | బుద్ధీఎ, బుద్ధీఇ, బుద్ధీఆ, బుద్ధిఅ | బుద్ధీహి. బుద్ధీహిం. |

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| పం. | బుద్ధీఏ, బుద్ధీఇ | బుద్ధీహింతో, బుద్ధీసుంతో. |
| ష. | బుద్ధీఏ, బుద్ధీఇ, బుద్ధీఆ, బుద్ధీఅ | బుద్ధీణం, బుద్ధీణ. |
| స. | బుద్ధీఏ, బుద్ధీఇ, బుద్ధీఆ, బుద్ధీఅ | బుద్ధీసు, బుద్ధీసుం. |

తక్కిన ఇకారాంత స్త్రీలింగము లన్నియు దీనివలెనే యని యెఱుంగ వలయును.

ఉకారాంత స్త్రీలింగము—ధేనుశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | ధేణు | ధేణూ, ధేణూఓ, ధేణూఉ. |
| ద్వి. | ధేణుం | ధేణూ, ధేణూఓ, ధేణూఉ. |
| తృ. | ధేణూఏ, ధేణూఇ, ధేణూఆ, ధేణూఅ | ధేణూహి, ధేణూహిం. |
| పం. | ధేణూఓ, ధేణూఇ, ఇత్యాది | ధేణూహింతో, ధేణూసుంతో. |
| ష. | ధేణూఏ, ధేణూఇ, ధేణూఆ, ధేణూఅ | ధేణూణం, ధేణూణ. |
| స. | ధేణూఏ, ధేణూఇ | ధేణూసు, ధేణూసుం. |
| సం. | ధేణు, ధేణూ. | |

తక్కిన యుకారాంతస్త్రీలింగములు నీరీతిగానే రూపము లని యెఱుంగునది.

ఈకారాంతస్త్రీలింగము—నదీశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | నఈ, నఈఆ | నఈఓ, నఈఆ. |
| ద్వి. | నఇం, నఈ | నఈఓ, నఈఆ. |
| తృ. | నఈఏ ఇత్యాది | నఈహిం, నఈహి. |
| పం. | నఈఏ, నఈఆ, నఈఓ ఇత్యాది | నఈ, నఈహింతో, నఈసుంతో. |
| ష. | నఈఏ | నఈణం, నఈణ. |
| స. | నఈఏ | నఈసు, నఈసుం. |
| సం. | నఇ, ఇత్యాది. | |

ఈకారాంత స్త్రీలింగములు అన్నియు నిట్లే.

ఊకారాన్త స్త్రీలింగము - వహూశబ్దము,

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్ర. | వహూ | వహూఉ, వహూఓ. |
| ద్వి. | వహూం | వహూ, వహూఓ ఇత్యాది. |
| తృ. | వహూఏ, వహూఇ | వహూహి, వహూహిం. |
| పం. | వహూదో, వహూఏ | వహూహింతో, వహూసుంతో. |
| ష. | వహూఏ, వహూఇ | వహూణం, వహూణ. |
| స. | వహూఏ, వహూఇ | వహూసు, వహూసుం. |
| సం. | వహూ ఇత్యాది. | |

ఋకారాంత స్త్రీలింగము—మాతృశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | మాఆ | మాఆః. |
| ద్వి. | మాఅం | మాఏ. |
| తృ. | మాఆఇ, మాఆఅ | మాఏహిం, మాఏహి. |
| పం. | మాఅదో, మాఆఏ | మాయాహింతో, మాయాసుంతో, |
| ష. | మాఆఇ, మాఆఅ | మాఆణం, మాఆణ. |
| స. | మాఆఇ, మాఆఅ | మాఆసుం, మాఆసు. |
| సం. | మాఆ, ఇత్యాది. | |

స్త్రీలింగ మగుగోశబ్దమునకు గావీ, గాఈ, అని రెండురూపములు కలవు వీని కీకారాంత స్త్రీలింగములకువలెనే రూపములు.

అకారాంతనపుంసకలింగశబ్దములు.

౧. ప్రథమవిభక్త్యేకవచనప్రత్యయ మగు "సు" అనుదానికి "మ్" వచ్చును.

౨. జస్, శస్ అనువాని స్థానమందు ఇన్, ఇమ్, లేక 'ణి' వచ్చును.

౩. నపుంసకలింగశబ్దముల కన్నిటికి సంబోధన ప్రథమవిభక్తిప్రత్యయము లోపించును.

౪. శౌరసేనీభాషయందు జశ్శసులస్థానమం దొక్క "ణి" అనునది యాదేశ మగును. అపభ్రంశభాషయందు జశ్శసులకు "ఇ" వచ్చును.

౫. సుప్రత్యయముముందు నపుంసకలింగశబ్దముల కంతమం దుండు నొకారమునకుఁగాని యుకారమునకుఁగాని దీర్ఘము గాదు.

### అకారాంతనపుంసకలింగము—కులశబ్దము.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్ర. | కులం | కులాణి, కులాఇం, కులాఇ. |
| | కులం | కులాణి, కులాఇం, కులాఇ. |
| సం. | హేకులం. | |

దీనికి శేషించినరూపము లకారాంత పుంలింగశబ్దములకువలెనే యని యెఱుంగవలయును.

### ఇకారాంతనపుంసకలింగము—దధిశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | దహిం, దహి | దహీణి, దహీఇం, దహీఇ. |
| ద్వి. | దహిం, దహి | దహీణి, దహీఇ, దహీఇం. |

శేషము పుంలింగమునవలె.

### ఉకారాంతనపుంసకలింగము—మధుశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | మహుం, మహు | మహూణి, మహూఇం, మహూఇ. |
| ద్వి. | మహుం, మహు | మహూణి, మహూఇం, మహూఇ. |
| సం. | మహు, శేషము పుంలింగమువలెనే. | |

### హలంతశబ్దములు.

రాజశబ్దమునకు నాలుగురూపములు కలవు. దీనిలో నుండుజకారము ణకారముగా మాఱును. సాంస్కృతికరూపమగురాజశబ్దము సప్తమవిభక్తియందుఁ బ్రథమబహువచనమందుఁ దప్పఁ దక్కిన యేకవచనములయం దంతట వాడుక చేయఁబడుచున్నది. ఉ. రాఆ, రాఆణో, రాఆణం, రణ్ణా, రణ్ణో; పాలీభాష లో నీరూపము సప్తమ్యేకవచనమందు షష్ఠీబహువచనమందుఁ గూడ వాడుక చేయఁబడుచున్నది. రెండవరూపము 'రాజ' అనునది. ఇది ప్రాకృతములో "రాఅ" అగును. ఈరూపము ప్రథమైకవచనమందుఁ దప్పఁ దక్కినవిభక్తుల యేకవచన బహువచనములయందు వాడఁబడుచున్నది. ప్రథమైకవచన బహువచనములయందు ద్వితీయాబహువచనము తప్పఁ దక్కిన యన్నివిభక్తులయందుఁ గూడ నీరూపమే. అకారాంతశబ్దములకువలెనే దీనికి రూపములు. రాఆ, ప్రథమా బహువచనము. రాఅం, ద్వితీయైకవచనము. రాఏ, రాఆ ద్వితీయా బహువచనము. రాఏణ తృతీయైకవచనము. రాజన్ అనునది మూఁడవరూపము. ఇది ప్రాచీనప్రాకృతభాషలో షష్ఠ్యేకవచనముగా వాడుక చేయఁబడుచున్నది. ఆధునికప్రాకృతభాషలలోఁ బ్రథమైకవచనమందుఁ దప్ప యితర

విభక్తులలోను నితర వచనములలోను ‘‘రాఇన’’ అనునది యుపయోగింపఁబడును. దీనికి ‘‘కర్మన్’’ మొదలగు నన్నంతమైన శబ్దములకువలె రూపములు. రాయిణో ప్రథమాద్వితీయా బహువచనములు. రాయిణం ద్వితీయైకవచనము. రాయిణా తృతీయైకవచనము. ‘రాజాన’ అనునది నాలవరూపము. రాఆణ అనునీరూప మన్నివిభక్తులయందు నన్నివచనములయందు వాడుకొనఁబడుచున్నది. ఈ శబ్దరూపము పాలీభాషలో లేదు. కాని అత్తాణ అని యాత్మన్ శబ్దములోఁ గానవచ్చుచున్నది. ఆభాషలో నిది తృతీయాసప్తమీ బహువచనములయందు వ్యవహరింపఁబడుచున్నది. ప్రాకృతములో నన్నివిభక్తులయందున్నది. ఆత్మన్ శబ్ద మన్నంత మయినయితరశబ్దములు ప్రాకృతములో రాజన్ శబ్దమువలె రూపములు గలవి. శౌరసేనీభాషలో రాజశబ్దమునకు ‘‘రాఅం, రాఅ’’ అని సంబోధనము. ఈ శబ్దరూపము మహారాష్ట్రభాషలో లేదు. శతృప్రత్యయముల కంతమందు ‘‘అంత’’ అనునది వచ్చును. వాని కకారాంత శబ్దములకువలెనే రూపములు. వత్, మత్ మొదలగు ప్రత్యయము లంతమందుఁ గలశబ్దములు, ‘‘వంత’’, ‘‘మంత’’ అని యగును. కొన నుండెడు తక్కిన హల్లులు లోపించును

రాజన్ శబ్దము.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్ర. | రాఆ | రాఆణో, రాఆ. |

హేమచంద్రమతానుసారముగా నకారాంత పుంలింగశబ్దములకు వికల్పముగా అణాదేశ మగును.

| | | |
|---|---|---|
| ద్వి. | రాఅం | రాఏ, రాఆణో. |
| తృ. | రణ్ణా, రాయిణా | రాఏహిం. |
| పం. | రాయాదో, రణ్ణో, రాఆదు, రాఇణో | రాఆహింతో. రాఆసుంతో. |
| ష. | రణ్ణో, రాయిణో, రాఅస్స | రాఆణం, రాఇణం, రాఇణ. |
| స. | రాఅమ్మి, రాఏ, రాఇమ్మి | రాఏసు, రాఏసుం. |
| సం. | రాఅ, రాఅం ఇత్యాది. | |

ఆత్మన్ శబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | అప్పా, అప్పాణో | అప్పాణా, అప్పాణో, అప్పా. |
| ద్వి. | అప్పాణం, అప్పం | అప్పాణే, అప్పా. |

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| తృ. | అప్పాణేణ, అప్పణా | అప్పణేహిం, అప్పేహిం. |
| పం. | అప్పాణాఓ, అప్పణో<br>అప్పాఓ, అప్పాదో | అప్పాణాహింతో.<br>అప్పా హింతో. |
| ష. | అప్పాణస్స, అప్పణో | అప్పాణాణం, అప్పాణం. |
| స. | అప్పాణమ్మి, అప్పె | అప్పాణేసు, అప్పేసు. |

యువన్, గ్రావన్, బ్రహ్మన్ ఇత్యాదిశబ్దముల కాత్మశబ్దమువలెనే రూపములు. ప్రాకృతకల్పలతికామతానుసారముగా భవత్, భగవత్, శబ్దముల యొక్క యంతమం దున్నతకారము లోపించి ప్రథమ విభక్త్యేకవచనములోను సంబోధన ప్రథమైకవచనమందు ననుస్వారము వచ్చును. ఉ. భవం (భవాన్) హేభవం (హేభవన్) భఅవం (భగవాన్) హేభఅవం (హే భగవన్.)

శౌరసేనీభాషలో నీనియమము మఘువచ్ఛబ్దమునకుఁగూడఁ జెల్లును. ప్రథమవిభక్త్యేకవచనమందు "దుర్వాసస్" శబ్దము దుర్వాసా అని యగును. ప్రాచ్యభాషలో భవచ్ఛబ్దస్త్రీలింగరూపము భోదీ అని యగును.

సర్వనామశబ్దములు.

ప్రాకృతములో సర్వనామములతో సంబంధించిన సాధారణనియమములు లేవు. నియమము లన్నియు విశేషస్వభావము గానే కానవచ్చుచున్నవి. అదన్త సర్వనామశబ్దములను సాధించుటకుఁ గొన్ని సాధారణనియమములు గలవు. అవియే యిచట వ్రాయఁబడుచున్నవి.

అదన్తసర్వనామనియమములు.

౧. పుంలింగమందు సర్వాదులజస్సునకు ఎకారము వచ్చును.

౨. సర్వాదిగణపతితము లగు సర్వనామములకుఁ బుంలింగనపుంసకములలో ఆమ్ అనుదానిస్థానమందు "ఎసిమ్" అని యగును. "ఙి" అనుదానికి, స్సిమ్, మ్మి, త్థ, అనునవి వైకల్పికముగా వచ్చును.

సర్వ, విశ్వ, ఉభ, ఉభయ, డతర, డతమ, ఇతర, అన్యతర, త్వత్, త్వ, నేమ, సమ, సిమ, త్యద్, యద్, ఏతద్, ఇదమ్, అదస్, ఏక, ద్వి, యుష్మత్, అస్మత్, భవత్, కిమ్, ఇత్యాదులు సర్వాదులు.

పుంలింగ మగుసర్వశబ్దము.

| | | |
|---|---|---|
| ప్ర. | సవ్వో | సవ్వే. |
| ద్వి. | సవ్వం | సవ్వే. |

| ఏకవచనము. | బహువచనము. |
|---|---|
| తృ. స ్ణేణ | స ేహిం. |
| పం. సవ్వదో, సవ్వత్తో | సవ్వేహింతో ఇత్యాది. |
| ష. సవ్వస్స | సవ్వేసిం, సవ్వాణం. |
| స. సవ్వస్సిం, సవ్వమ్మి, సవ్వత్థ, సవ్వహిం | సవ్వేసు, సవ్వేసుం. |

సర్వాదులకు స్త్రీలింగమం దాకారాంతస్త్రీలింగశబ్దములకు వలెను, నపుంసకముల కకారాంతనపుంసకములకువలెను రూపము లని యెఱుంగునది. విశ్వాదిశబ్దముల కీవిధముననే రూపము లగునని యూహించుకొనవలయును. అపభ్రంశభాషయందు సర్వశబ్దమునకు "సాహ" అని రూప మగును.

పుంలింగయచ్ఛబ్దము.

| | |
|---|---|
| ప్ర. జో | |
| ద్వి. జం | |
| తృ. జేణ, జిణ | జేహం. |
| పం. జత్తో, జదో, జమ్హా, జాఓ | జాహింతో, జాసుంతో |
| ష. జస్స, జాస | జాణం, జేసిం. |
| స. జస్సిం, జమ్మి, జహిం, జత్థ | జేసు. |

యచ్ఛబ్దస్త్రీలింగమందు ఆమ్ (షష్ఠీబహువచనము) తప్పఁ దక్కిన యన్నివిభక్తులయందు "జీ" వైకల్పికముగా నగును. ఉ. జీ - జీయా, ఇత్యాది.

పుంలింగతచ్ఛబ్దము.

| | |
|---|---|
| ప్ర. సో | తే, దే. |
| ద్వి. తం, ణం | తే, దే. |
| తృ. తేణ, తిణా, ణేణ | తేహిం, ణేహిం, తాహిం. |
| పం. తత్తో, తదో, తా, తమ్హా, తాఓ | తాహింతో ఇత్యాది. |
| ష. తాస, సే, తస్స | తాణం, తేసిం, సిం, దాణం. |
| ం, తమ్మి, తత్థ, తహిం | తేసు ఇత్యాది. |

తచ్ఛబ్దమునకు స్త్రీలింగప్రథమైకవచనమందు 'సా' అనియు, నపుంసకమందు "తం" అనియు నగును.

ఏతచ్ఛబ్ద పుంరూపములు.

| | |
|---|---|
| ప్ర. ఏష, ఏసో | ఏతే, ఏదే. |
| ద్వి. ఏతం | ఏతే, ఏదే. |
| తృ. ఏదిణా, ఏదేణ, ఏణం | ఏతేహిం, ఏదేహిం, ఏఏహిం. |

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| పం. | ఏత్తో, ఏత్తాహో, ఏఆహో | ఏతేహింతో, ఏతేసుంతో. |
| ష. | ఏఅస్స, ఎదస్స, సే | సిం, ఏఏసిం, ఎదాణం. |
| స. | అయమ్మి, ఏత్థ, ఇఅమ్మి, ఏఅమ్మి, ఏఅస్సిం | ఏఏసు, ఏదేసు. |

అదశ్శబ్ద పుంరూపములు.

| | | |
|---|---|---|
| ప్ర. | అమూ | అమూణో. |
| ద్వి. | అముం | అమూణే. |
| తృ. | అముణా | అమూహిం. |
| | అమూఓ, అమూఉ | అమూహింతో. |
| ష. | అముణో, అముస్స | అమూణం. |
| స. | అముస్సి, అయమ్మి, ఇఅమ్మి | అమూసు. |

ఇదంశబ్ద పుంరూపములు.

| | | |
|---|---|---|
| ప్ర. | ఇమో, అఅం | ఇమే. |
| ద్వి. | ఇమం, ణం | ఇమే. |
| తృ. | ఇమిణా, ఇమేణ, ణేణ | ఏహిం, ఇమేహిం, ణేహిం. |
| పం. | ఇదో, ఇమాదో, ఇత్తో | ఇమేహింతో. |
| ష. | అస్స, ఇమస్స, సే | ఇమాణం, సిం, |
| స. | అస్సిం, ఇమస్సిం, ఇహ, ణే | ఏసు. |

యుష్మచ్ఛబ్దరూపములు.

| | | |
|---|---|---|
| ప్ర. | తుమం, తం, తుం, తువం, తుహ | తుజ్ఝ, తుహ్మ, తుమ్హే, ఉమ్హే, తుమ్హే. |
| ద్వి. | తం, తుం, తువం, తుమం, తుహ, తుమే, తుఎ | వో, తుజ్ఝే, తుజ్ఝ, తుమ్హే, తుమ్హే. |
| తృ. | తుమం, తుమఇ, తుమఎ, తుమే, తుమాఇ, దే, తే, తఇ, తుఎ | తుమ్హేహిం, తుమ్హాహిం, ఉమ్హేహి, ఉజ్ఝేహి, తుజ్ఝేహి. |
| పం. | తత్తో, తఇత్తో, తువత్తో, తుమత్తో, తుజ్ఝత్తో, తుమ్హత్తో, తుహత్తో, తుమ్హాత్తో, తదో, తువహిసో, తుమహింతో | తుమ్హాహింతో, తుజ్ఝాహింతో, తుజ్ఝత్తో, తుమ్హత్తో, తెహింతో, దుహింతో |

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ష. | తుహ, తుజ్ఝ, తుమ్మ, తుఇ, తు, తె, తున్హ, తుహ, తుహం, తుప, తుమ, తుమే, తుమాఇ, తే, తుహ్మ | వో, భే, తుజ్ఝ, తుహ్మాణ, తువాణ, తున్హాణ, తుమాణ, తుహాణ, ఉన్హాణ, ఇత్యాది. |
| స. | తఇ, తఏ, తుమఏ, తుమే, తుమాఇ, తుమ్మి, తుమమ్మి, తువమ్మి, తుహమ్మి, తుజ్ఝమ్మి, ఇత్యాది | తుసు, తున్హేసు, తుమ్హేసు, తుఇసు, తుసుసు, తుహేసు, ఇత్యాది. |

మాగధీభాషయందు యుష్మచ్ఛబ్దమునకు తుప్పం, తున్హి అని రెండు రూపము లాదేశముగా వచ్చును.

శౌరసేనీభాషయందు యుష్మచ్ఛబ్దరూపములు.

| | | |
|---|---|---|
| ప్ర. ద్వి. | తుమం | తున్హే. |
| తృ. | తుఏ | తున్హేహిం. |
| పం. | తున్హాదో | తున్హాహింతో. |
| ష. | తే, దే | తహ, తున్హ, తున్హాణం. |
| స. | తఇ | తున్హేసుం. |

అపభ్రంశభాషయందు యుష్మచ్ఛబ్దరూపములు.

| | | |
|---|---|---|
| ప్ర. | తుహ | తున్హే, తున్హాఇం. |
| ద్వి. | తఇం, పఇం | తున్హేహిం; తుహ్మ. |
| పం. | తఉహాంత, తద్రుహాంద, (ఆమి) తున్హహం, సుపి (తున్హాసుం) | తుహ్మం. |

కింశబ్దరూపములు (పుంలింగము.)

| | | |
|---|---|---|
| ప్ర | కో | కే. |
| | కం | కే. |
| తృ. | కిణా, కేణ | కేహిం. |
| పం. | కీసో, కీస, కన్హ. కత్తో, కదో | కేహింతో ఇత్యాది. |
| ష. | కాస, కస్స | కాస, కేసిం, కాణం. |
| స. | కహిం, కస్సిం, కమ్మి, కత్థ | కేసు ఇత్యాది. |

కాహే, కాలా, కఇఆ అనురూపములు కాలార్థమునందు వాడుక చేయఁబడును.

## అస్మచ్ఛబ్దరూపములు.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్ర. | అహం, అహమ్మి, అమ్మి, అమ్హి, హం, అహఅం, మ్మి | భే, వఅం, అమ్హ, అమ్హే, అమ్హో, మే. |
| | ణేణం, మి, అమ్మి, అమ్హ, మం, మమం, మిమం, అహం | అమ్హే, అమ్హో, ణో, ణే, అమ్హ. |
| తృ. | మిమే, మమం, మమాఎ, మఎ, మమాఇ, మఇ. ఇణో, మఅ | అమ్హేహిం, అమ్హ, అమ్హాహి, ణే. |
| పం. | మఇత్తో, మమత్తో, మత్తో, మహత్తో, మహ్యత్తో, మఇదో, మమదుహి, ఇత్యాది | మమత్తో, అమ్హత్తో, మమాహింతో, మమాసుంతో, మమేసుంతో, అమ్హేహింతో. |
| ష. | మే, మమ, మఇ, మహ, మహం, మహ్య, మహ్యం, అమ్హ, అమ్హం | ణే, ణో, మహ్య, అమ్హ, అమ్హం, అమ్హే, మమ, అమ్హాణం. |
| స. | మి, మఇ, మమాఇ, మఎ, మే, అమ్హమ్మి, మమమ్మి, మహమ్మి | అమ్హేసు, మమేసు, మహేసు, మఎసు, అమ్హసు, మమసు. |

### శౌరసేనీభాషయం దస్మచ్ఛబ్దరూపములు.

| | | |
|---|---|---|
| ప్ర. | హీం, అహం | అమ్హే, వయం. |
| | మం | అమ్హే. |
| తృ. | మఎ | అమ్హేహిం. |
| పం. | మత్తో, మమాదో | అమ్హేహింతో. |
| ష. | మే, మమ, మహ | అమ్హ, అమ్హాణం. |
| స. | మఇ, మఎ | అమ్హేసు. |

మాగధీభాషయందు అహం అనుదానికి హగే - హకే అనురూపము లాదేశ మగును.

### అపభ్రంశభాషలో అస్మచ్ఛబ్దరూపములు.

| | | |
|---|---|---|
| ప్ర. | హఉ | అమ్హే, అమ్హఇ. |
| ద్వి. | మఇ | అమ్హే, అమ్హఈ. |
| తృ. | మఇ | అమ్హేహి. |
| పం. | మహు, మహ్య | అమ్హేహింతో. |

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ష. | మహు, మజ్ఝ | అమ్హహె. |
| స. | మఇ | అమ్హాసు. |

ద్విశబ్దరూపములు.

ప్ర—దో, దువే, దోణి, దేణి, దుణి, విణి. ద్వి—దో, దువే, దోణి, వేణి, దుణి, విణి. తృ—దోహిం, దోహి, విహి. పం—దోహింతో, వేహింతో. ష—దోణహం, దోణం, వేణం. స—దోసు, వేసు

త్రిశబ్దరూపములు.

ప్ర—తిణి. ద్వి—తిణి. తృ—తీహిం. పం—తీహింతో. ష—తిణం. స—తీసు.

చతుశ్శబ్దరూపములు.

ప్ర—చత్తారో, చఉరో. ద్వి—చత్తారో, చఉరో, చత్తారి. తృ—చఊహిం. పం—చఊహింతో. ష—చఉణ్హం. స—చఉరు.

సంఖ్యావాచకము లగుశబ్దము లన్నియు నకారాంతములవలెనే విభక్తిరూపములఁ గలిగియుండును. పంచశబ్దమునకు స్త్రీలింగమందు "ఆప" అని రూప మగును.

తిజన్తములు.

౧. క్యజ్, యఙ్, మొదలగుప్రత్యయములనుగుఱించి యీప్రాకృత భాషలో విశేషనియమములు లేవు. హేమచంద్రుఁడు మాత్రము "క్యఙోర్య లుక్" క్యఙ్‌లో యకారము లోపించు నని చెప్పెను. ఉ. గురూఆఇ - (అగురు ఽ).

౨. సంస్కృతభాషలో ధాతువులకు భ్వాది, అదాది, జుహోత్యాదిఅను గణభేద మున్నట్టు ప్రాకృతములో లేదు. అన్నిధాతువులు నేకరూపముగా నిష్పన్న మగును.

3. ఆత్మనేపదిపరస్మైపదిభేదము లేదు.

వర్తమానకాలప్రత్యయములు.

| | | |
|---|---|---|
| ప్ర. పురుషము | . ఇ | న్తి, న్తె, ఇరే. |
| మ. పురుషము | . సి | ఇత్థా, హ. |
| ఉ. పురుషము | . మి | మో, ము, మ. |

౪. అకారాంతము లగునాత్మనేపదిధాతువులకుఁ బ్రథమపురుషమధ్యమ పురుషంబులయందు ఇ, సి అనువానికి బదులుగా యథాసంఖ్యముగా ఏ, సే అనునవి వైకల్పికముగా నాదేశమగును. ఉ. తువరఏ - తువరసే, (త్వరతే - త్వరసే).

౫. ఉత్తమపురుషప్రత్యయ మగు "మి" అనునది పర మగునపు డకా రాంతధాతువుల యకారమునకు వైకల్పికముగా ఆకారము వచ్చును. ఉ. హ సామి, హసమి ఇత్యాదులు.

౬. మో, ము, మ అనునవి పరమయినపుడు ధాతువుయొక్క కొన యకారమునకు 'ఇ' గాని 'ఆ' గాని వచ్చును. ఉ. హసిమో, హసామో, హసిము, హసేము ఇత్యాదులు.

అకారాన్తధాతువులకు వర్తమానకాలమందు

భణధాతువు రూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పు. | భణఇ, భణఏ | భణన్తి, భణన్తే, భణిరే. |
| మ. | పు. | భణసి, భణసె | భణఇ, భణిత్థా. |
| ఉ. | పు. | భణామి, భణమి | భణామో, భణిమో, భణేమో. |

అసధాతురూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పు. | అచ్ఛఇ, అత్థి | అచ్ఛంతి, అత్థి. |
| మ. | పు. | సి, అచ్ఛసి, అత్థి | అత్థి, అచ్ఛిత్థా, అచ్ఛహ. |
| ఉ. | పు. | మ్హి, అత్థి, అచ్ఛామి | మ్హో, మ్హ ఇత్యాది. |

౭. అకారాన్తధాతువుల కన్నివచనములయందు నన్నిపురుషములయం దుఁ బ్రత్యయములకు మారుగా లజ్, లిజ్, లిట్టులయందు హీ, సి, హీఅ అనునవి వచ్చును. ఉ. కాసీ, కాహీ, కాహీఅ (అకార్షీత్, అకరోత్, చకార ఇత్యాది). ఠాసి, ఠాహీ, ఠాహీఅ (అస్థాత్, అతిష్ఠత్, తస్థౌ).

౮. హలంతధాతువులకు భూతార్థకములయం దనఁగా లజ్, లిజ్, లిట్టులయందు "ఇయ" అనునది వచ్చును. ఉ. గేణ్హీఅ (అగ్రహీత్, అగృహ్ణాత్, జగ్రాహ).

౯. అసభువి యనుధాతువునకు భూతార్థమందు "ఆసి" "అహేసి" అనునవి వచ్చును.

భవిష్యత్తులో జెప్పంబడు తిప్ మొదలగుప్రత్యయముల కీడఁగున వ్రాసిన రూపములు వచ్చును.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పు. | హిఇ | హిన్తి, హిన్తే, హిఇరే. |
| మ. | పు. | హిసి | హిత్థ, |
| ఉ. | పు. | హిమి, హామి, స్సామి, స్సమ్ | హిస్సా, హిహా. |

లృట్టులో ధాతురూపములలో భూధాతువు

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పు. | హోహిఇ, (భవిష్యతి, భవితా వా) | హోహిన్తి, (భవిష్యన్తి, భవితారో వా), |
| మ. | పు. | హోహిహి, (భవిష్యసి) | హోహిత్థా, హోహిహా, (భవిష్యథ.) |
| ఉ. | పు. | హోహిమి, హోస్సామి, హోస్సం, (భవిష్యామి) | హోహామో, హోస్సామో, (భవిష్యామః.) |

కృధాతురూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పు. | కాహిఇ, (కరిష్యతి, కర్తా అకరిష్యత్) | కాహిన్తి, (కరిష్యన్తి, కర్తారః, అకరిష్యన్త.) |
| మ. | పు. | కాహిసి, (కరిష్యసి) | కాహిత్థా, (కరిష్యథ.) |
| ఉ. | పు. | కాహం, కాహిమి | కాఇమో. |

హసధాతురూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పు. | హసిహి | హసిహిన్తి. |
| మ. | పు. | హసిహిసి | హసిహిత్థా. |
| ఉ. | పు. | హసిస్సం | హసిస్సామో, హసిహామో. |

శ్రుధాతురూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పు. | సోచ్ఛిఇ, సోచ్ఛిహిఇ, (శ్రోష్యతి) | సోచ్ఛిన్తి, సోచ్ఛిహిన్తి, (శ్రోష్యంతి.) |
| మ. | పు. | సోచ్ఛిసి, సోచ్ఛిహిసి, (శ్రోష్యసి) | సోచ్ఛిత్థా (శ్రోష్యథ.) |
| ఉ. | పు. | సోచ్ఛమ్, (శ్రోష్యామి) | సోచ్ఛిమో, సోచ్ఛిహిమో, (శ్రోష్యామః.) |

లోట్, విధిలిఙ్

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పు. | ఉ | న్తు. |
| మ. | పు. | సు, హి | హ. |
| ఉ. | పు. | ము | మో. |

హసధాతురూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | పు. | హసఉ, (హసతు, హసేత్) | హసన్తు, హసేన్తు, (హసన్తు, హసేయుః) |
| మ. | పు. | హససు, హసఇ, హస, హసేజ్జసు, హసేజ్జహి, హసేజ్జే, (హస, హసేః) | హసహ, (హసత, హసేత) |
| ఉ. | పు. | హసను, (హసాని, హసేయం) | హసామో, (హసామ, హసేమ.) |

౧. వర్తమానము, భవిష్యత్తు, విధిలిఙ్, లోట్, వీనియందు వచ్చు ప్రత్యయములకు జ్జ, జ్జా అను నాదేశములు వికల్పముగా నగును. హేమచంద్ర మతానుసారముగా నీసూత్ర మదన్తధాతువులకే చెల్లును. ఉ. హసేజ్జ-హసేజ్జా, (హసతి - హసిష్యతి, హసతు - హసేత్, ఇత్యాది)

౨. వర్తమానమందు, భవిష్యత్తునందు, విధిలిఙ్ లోట్టులయందు ధాతువునకుఁ బ్రత్యయమునకు మధ్యను జ్జ, జ్జాఅను నాదేశములు వికల్పముగా నగును. ఉ. హోజ్జఇ - హోజ్జాఇ, (భవతి - భవిష్యతి, భవతు - భూయాదిత్యాది.)

౩. శతృప్రత్యయమునకు "న్త" అనియు, శానచ్ప్రత్యయమునకు "మాణ" అనియు నాదేశ మగును. ఉ. పఢన్తో - పఢమాణో, హసన్తో - హసమానో, (పఠన్ - హసన్.)

౪. స్త్రీలింగమందు శతృశానచుల కీకారాదేశ మగును. ఉ. న్తీ - మాణాచ.

౫. వర్తమానము, విధిలిఙ్, శతృ అనువానికిఁ బరముగా నున్నయాకారమునకు వైకల్పికముగా నెకారాదేశ మగును. ఉ. హసేఇ - హసఇ, (హసతి) హసేఉ - హసఉ (హసేత్) శతృ - హసేన్తో, హసంతో (హసన్) కొన్నిచోట్ల నీయేకారము రాదు. ఉ. జఅఇ (జయతి) మఱికొన్నిస్థలములయం దాకారము వచ్చును. ఉ. సుణాఉ (శృణోతు.)

భావకర్మార్థములు.

౧. భావకర్మార్థములయందు విధింపఁబడిన "యక్", అనుదానిస్థానమందు ఇఅ ఇజ్జ అనునవి యాదేశ మగును. ఉ. హసిఅఇ-హసిజ్జఇ (హస్యతే).

౨. భావకర్మార్థములయందు "దృశ్" ధాతువునకు "దీశ" అనియు, వచ్ ధాతువునకు "వుచ్చ" అనియు నాదేశ మగును. ఉ. దీసఇ (దృశ్యతే) వుచ్చఇ (ఉచ్యతే.)

౩. క్త్వా, తుమ్, తవ్య, భవిష్యత్ వీనియందుఁ బ్రత్యయము పరమయి యుండఁగా నాకారమునకు నెకారము నికారము వచ్చును. ఉ. హసేఊణ, హసిఊణ, (హసిత్వా) హసేఉం, హసిఉం, (హసితుం) హసేఅవ్వం, హసిఅవ్వం (హసితవ్యం.)

౪. క్తప్రత్యయము పరమై యుండఁగా నాకారమునకు నికార మగును. ఉ. హసిఅం (హసితం.)

ణిజన్తము.

౧. 'ణి' యొక్క స్థానమందు ఏత్, ఆవ, ఆవె, ఆత్, అనునవి యాదేశ మగును.

౨. క్తప్రత్యయమందు, భావకర్మార్థములయందు విధింపఁబడిన ప్రత్యయము పరమయియుండఁగా "ణి"కి లోపము కలుగును. అట్లు లోపము రాని సమయమున "అవి"అను నాదేశము కలుగును. ఉ. కారిఅం, కరావిఅం, (కారితం) హాసిఅం, హసావిఅం (హాసితం) సోసిఅం, సోసవిఅం, (శోషితం) కారీఅఇ, కరావీఅఇ, కారిజ్జఇ, కరావిజ్జఇ, (కార్యతే.)

ఇట్లు ప్రాకృతభాషావ్యాసము ముగిసినది.

తేటగీతము.

విజయనగరాధినాథ శ్రీవిజయరామ, గజపతీంద్రవినిర్మితి గడన కెక్కు
నాంగ్లభాషాకళాశాల నమరభాష, బాలురకు నేర్పునేరుపుఁ బడసినాఁడ
మేడెపల్లివన్వవాయుఁడ మితమతుండ, వేంకటార్యుఁడ బుధపదవిహితనతుఁడఁ
బ్రాకృతంబున జ్ఞానంబుఁ బడయఁగోరు, వారి కీరీతి లఘురీతి వ్యాస మొకటి
వ్రాసి యర్పించితిని సుధీవ్రాత మిందుఁ, దప్పులను దిద్దవేఁడెద దయను బూని.

మేడేపల్లి వేంకటరమణాచార్యులు.

శ్రీరస్తు.

# పెదకోమటివేమారెడ్డినూతనశాసనము.

(శా: శ. 1298 లోనిది)

కొండవీటిరాజైన పెదకోమటివేమారెడ్డియొక్క శాసనము లిదివఱకుఁ బెక్కులు దొరికినవి. అవన్నియు శా. శ. 1322 (క్రీ. శ. 1400) మొదలు శా. శ. 1342 (క్రీ. శ. 1420) వఱకుఁ గలకాలములోనివి. అందుచేఁ జరిత్రకారు లందఱు నీరాజు 1400 – 1420 వఱకు రమారమి యిరువదిసంవత్సరములు రాజ్యముచేసె నని వ్రాసియున్నారు. కావున నీనూతనశాసనము ముఖ్యమైనది. దీనిని నూతన మనుటకుఁ గారణ మేమన నిదివఱకు నెచ్చటను బ్రకటింపఁబడలేదు. సుయెల్ చే నీయఁబడిన శాసనపట్టికలోఁ గాని, ప్రతిసంవత్సరమును శాసనశాఖవారిచే సంపాదింపఁబడిన శాసనములలోను గాని లేదు. ముఖ్య మనుటకుఁ గారణ మేమన నిదివఱకు మనకుఁ దెలియని చరిత్రవిషయములు కొన్ని యిది బోధించుచున్నది.

ఇయ్యది *ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు స్థానికచరిత్రలు (Local Records) అను సంపుటములలో నీయఁబడియున్నది. (48-వ సంపుటము 86-వ పుట). అనఁగా నిది 1810-వ ప్రాంతమున మెకన్జీవలన సంగ్రహింపఁబడినది. కావున నతనియొద్ద నున్నపండితులు రాతినిజూచి వ్రాసికొనిన నకలనుటకు సందేహము లేదు.

స్థలము—ఈశాసనము గుంటూరుజిల్లా, సత్తెనపల్లి తాలూకాలోని అమీనాబాదు గ్రామమందలి మూలగూరమ్మ యనుగ్రామదేవతగుడి కుత్తరమున నున్న కట్టమీఁద రాతిపైఁ జెక్కఁబడి యుండినట్లు చెప్పఁబడినది. సుయెల్ తనగ్రంథమునందు 1882 లో నిట్లువ్రాసెను. "గ్రామమునకుఁ బడమరనున్న

* ఆంధ్రవిజ్ఞానసర్వస్వముయొక్క ఆంధ్రసంపుట మనఁబడు నాల్గవసంపుటము నిమిత్తమై చేయఁబడుచున్న పరిశోధన (Research) లో నాకుఁ దోడుగా నున్న శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారు దీనిని మొదటఁ గనిపట్టి నాకుఁ జూపిరి. రెడ్డిచరిత్రకు నిది ముఖ్యమైనది గనుక నాలుగవసంపుటము వచ్చువఱకు దీనిని నాఁపియుంచక వెంటనే ప్రకటించుచున్నాను.

అమ్మవారిగుడిలోఁ బెక్కు శాసనములు కలవు. వానిలోఁ బెక్కింటిని జదువుటకు వీలులేదు. ఒకశాసనము శా. శ. 1114 (క్రీ. శ. 1192) లోనిది; మఱియొకటి శా. శ. 1502 (క్రీ. శ. 1580) లోనిది. ఈగుడిలోఁ బనితనమెక్కువగ నున్నది. ఇది చాలపురాతనమఁట. గుడికి నుత్తరమున నున్నరాతిమీఁదఁ బెక్కు శాసనము లున్నవఁట. వానిసమాచారము నాకుఁదెల్పఁబడలేదు." (Sewell's Lists of Antiquities of Madras) ఇప్పటిశాసనశాఖవారు (Department of Epigraphy) 1909 లో అమీనాబాదు వెళ్లి కొన్నిశాసనముల నకళ్లు తెచ్చిరి. కాని యందిది లేదు. ఈశాసనము 1810 కిఁ దరువాత నశిగెనో పగిలెనో లేక గ్రామస్థులు దానిని మాఱుపనికి నుపయోగించిరో తెలియదు. కావున 1810 ప్రాంతముననే దీనినకలు వ్రాసియుంచినందుకు లేఖకునియెడ నాంధ్రు లెంతయుఁ గృతజ్ఞులై యుండవలెను.

కాలము—శా. శ. 1298 అగునలసంవత్సరమాఘపూర్ణిమనాఁ డీశాసనము వేయింపఁబడియె నని శాసనమునందె చెప్పఁబడినది. శ్రీయుత స్వామికణ్ణుపిళ్లగారి జంత్రినిబట్టి లెక్క వేయఁగా దీనికి సరియైనయింగ్లీషు తేది క్రీ. శ. 1377, జనెవరినెల 25, అగుచున్నది. సంవత్సరముపేరు 'నల'యని స్పష్టముగఁ జెప్పఁబడినందున, శకసంఖ్య చెప్పుటయందుఁ బొరపాటుండు నని తలఁచుటకు వీలులేదు. శకసంఖ్యయు సంవత్సరనామమును సరిపోయినవి. ఇంతకంటెఁ బూర్వపు 'నల' సంవత్సరము తీసికొనినయెడల నది శా. శ. 1238 (క్రీ. శ. 1316) అగును. ఆకాలమువఱకు కొండవీట మొదటివేముఁడె రాజ్యమునకు రాలేదు. తరువాతి 'నల' తీసికొందమా శా. శ. 1358 (క్రీ. శ. 1436) అగును. ఆకాలమువఱకుఁ బెదకోమటివేమన మృతినొంది 16 సంవత్సరము లగును: కావునఁ బై నీయఁబడినకాలమె సరియైనది.

క్రొత్తవిషయము—ఈశాసనమునుబట్టి క్రొత్తగఁ దెలిసినవిషయ మేమనఁగా, క్రీ. శ. 1400 లకు బహుకాలముపూర్వమే, క్రీ. శ. 1377 లోనే, పెదకోమటివేమారెడ్డి, కొంతదేశమునకుఁ బ్రభువుగ నుండెను; కొండవీటి రాజ్యమునకు రాకపూర్వమే దానధర్మాదులు చేసి శాసనములు వేయించుచుండెను; కొండవీటికి వేఱురాజు లున్నను, ఈవంశమువారుకూడ 'సామ్రాజ్యసింహాసనాధ్యాసి' 'రాజాధిరాజపరమేశ్వ'రాది పదములను ధరించుచుండిరి.

శ్రీనాథునికాలమును, తద్రచితకావ్యముల రచనాకాలమును, హరివిలాసమును బట్టి నిర్ణయించుచు నేను గ్రంథాలయసర్వస్వమునందు నొకలేఖ వ్రాసి

యుంటిని. అందు నైషధము క్రి. శ. 1390 ప్రాంతమున ననఁగాఁ బెదకోమటి వేమన కొండవీటిరాజ్యమునకు రాకపూర్వమే రచియింపఁబడి, యాతనిమంత్రి కీయఁబడియె నని వ్రాసియుంటిని. పెదకోమటి వేమన కొండవీటిరాజ్యమునకు రాకపూర్వ మనామధేయుఁడుగ లేఁ డనియుఁ, గొంతరాజ్యము గలిగియుండవలె ననియు నూహించియుంటిని. అందుచే నాతనిమంత్రిని శ్రీనాథుఁ డాశ్రయించుట పొసఁగు ననియుఁ దెలిపితిని.* ఆమతమును శ్రీ కందుకూరి వీరేశలింగముగారు, శ్రీయుత నాగపూఁడి కుప్పుస్వామయ్యగారు మొదలయిన పండితు లంగీకరించిరి. కాని, శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు మాత్ర మంగీకరింపక కొన్ని యాక్షేపణములు చేసిరి. ఇప్పటియీశాసనముతో, నేను జేసినయూహలును, గాల నిర్ణయమును సిద్ధాంతము లని స్థిరపడుచున్నవి.

ఈశాసనకాలము, అనవేముని ప్రభుత్వకాలమునందుఁ (క్రి. శ. 1362–1380) బడుచున్నది. అప్పటికే పెదకోమటి మృతినొంది, యాతని పెద్దకుమారుఁడైన వేమారెడ్డి తనరాజ్యమును బాలింపఁజొచ్చెననుట స్పష్టము. ఈతనిరాజ్య మాకాలమందు మిక్కిలి పెద్దదియై యుండదు. కొండవీటిరాజులక్రింద నొకపెద్ద జమీందారి యై యుండనోపు. ఈశాసనమందుఁ దన 'కూరిమిపినతండ్రి యనవేమభూపతి సేసినధర్మ మూర్జితముగాఁగ' నని చెప్పఁబడినందున, కొండవీటి రాజులును నీతఁడును స్నేహముగ నుండి రనియు, వారికి సాయము చేయువాఁడుగానే యితఁ డుండె ననియుఁ జెప్పవచ్చును.

అమీనాబాదులోని గ్రామదేవత దేవాలయము చక్కఁగఁ గట్టఁబడి యున్నదనియు నందు శిల్పచమత్కారము గలదనియు సువెల్ మొదలయిన వారు వ్రాసియున్నారు. అధికముగ ధనవ్యయము చేసి పెదకోమటి వేముఁడె యీ దేవాలయమును క్రి. శ. 1377లోఁ గట్టించె నని మనము శాసనమందలి యీక్రింది చరణములవలనఁ దెలిసికొనవచ్చును.

> అంబికకుమూలసూరమ్మ కులజనని, కర్థిఁ గట్టించె భువనమోహనముగాఁగ
> సముధకోన్నతసన్మంటపంబులైన, గుడియుఁ బ్రాకారవలయంబుగోపురములు.

పెదకోమటి వేముఁడు తన స్వంతరాజ్యమును క్రి. శ. 1377 నుండియే పాలించుచున్నాఁ డనుకొనినను, స్వంతరాజ్యము 24 సంవత్సరములవఱకును (క్రి. శ. 1400) కొండవీటిరాజ్యము 20 సంవత్సరములును (1420) మొత్తము

* గ్రంథాలయ సర్వస్వము II. 24.

మీఁదఁ దక్కువలోఁ దక్కు 44 ఏండ్లు ప్రభుత్వము చేసినట్లు కానవచ్చుచున్నది. ప్రభుత్వమునకు వచ్చినప్పు డీతఁడు 20 ఏండ్లవాఁ డనుకొనినయెడల, మరణ సమయమునకు 64 ఏండ్లవాఁ డగును. కొంచెము హెచ్చుతక్కువగ శ్రీనాథు నితో సమవయస్కుఁ డగును.

దానమీయఁబడినగ్రామములు:—ఇందు దానమీయఁబడిన గ్రామ ములు మూఁడు చెప్పఁబడినవి. పడిదరము, మూలగూరు, అమ్మనపల్కలూరు. ఇవన్నియు గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకాలోనున్నవి. మూలగూరనునది అమీనాబాదుకుఁ బూర్వనామము. [లోకల్ రికార్డ్సు నం-48, పుట 81] ఇప్పుడు పెద్దపల్కలూ రనఁబడునది శాసనమందలి అమ్మనపల్కలూ రనుకొనవచ్చును. ఇప్పటి పడిదర్లపాడే పడిదరము కానోపు. ఇవన్నియు శాసనమునుబట్టి చూడ శ్రీ కోటభూమియందు నుండెను. కోటభూమి యనఁగా, కొండవీడుదుర్గము ముఖ్య పట్టణముగాఁగలచుట్టుపట్టుప్రదేశము, తాలూకా. కోటమీఁదినుండి గుండు వేసిన నెంతదూరము పోవునో యంతప్రదేశము కానోపు.

కోటభూమిలోని గ్రామములు దానముచేసినందునఁ బెదకోమటివేమన స్వాధీనమం దవి యుండియుండె ననుట స్పష్టము. కోటలో, అనవేముఁ డుండు టయుఁ గోటప్రదేశము కోమటివేముని చేతిలోనుండుటయుఁ జూడ వీరిద్దఱి కును మిక్కిలి స్నేహ ముండె నని తోఁచుచున్నది. అయినను కొండవీటిలో ననవేముఁ డెప్పుడు ప్రవేశించెనో మనకుఁ దెలియదు. ఆతఁడు కొండవీడు కోటను నిర్మించె నని మాత్రము మన మెఱుఁగుదుము. (Elliot's Collection p. 220 *) కాని యది 1377 కిఁ బూర్వము పూర్తియాయెనో, తరువాతఁ బూర్తి యయ్యెనో తెలియదు.

ఈపద్యములు చెప్పినకవిపేరు లేఖకుఁడు వ్రాయలేదు. మూలమునందుండి నను వ్రాయలేదో, లేనందున వ్రాయలేదో తెలియదు. శాసనములోనిపద్యము లనుపట్టుకు వ్రాసి క్రింద నున్నకవిపేరుగాని, లేఖకునిపేరుగాని వ్రాసికొనక పోవుట యాలేఖకునియభ్యాసముగఁ గానవచ్చుచున్నది. ఏలయన నీ శాసన

* "కొండవీడుం రాజధానిం సచిత్రాం పరికల్పయత్" అని యున్నది. ఈ తామ్రశాస నము శా. శ. 1304 (క్రి. శ. 1382) లోనిది. ఇదివఱకుఁ జరిత్రకారులు అనవేమునిరాజ్యము క్రి. శ. 1380తోఁ బూర్తియైనట్లు చెప్పుచున్నారు. ఈశాసనముఁ జూడ నాతఁడు 1382వఱకును రాజ్యము చేసినట్లు కనఁబడుచున్నది. ఈశాసనము నింకను శోధింపవలెను.

మునకుఁ బ్రక్కనే యీసంపుటమునందే యింకొక అమీనాబాదులోనిశాసన మీయఁబడినది. అందును క్రిందఁ గవిపేరీలేఖకుఁ డీయలేదు. అది యితరత్ర ప్రకటింపఁబడినది. (ఆంధ్రకవులచరిత్రము నూతనముద్రణము. ౧-వ భాగము) అందువలన దానిక్రింద 'శ్రీనాథకృతి' యని యున్నదని మన మెఱుఁగుదుము. కావునఁ బ్రస్తుతశాసనముక్రింద శ్రీనాథునిపేరో, మఱియొక కవిపేరో యున్నను ననావశ్యక మనుకొని లేఖకుఁ డిచ్చియుండకపోవచ్చును. క్రిందఁ బేరున్నను లేకపోయినను, ఫిరంగీపురశాసనమునందలి సీసపద్యములను, అమీనాబాదులోని మఱియొకశాసనమునందలి పద్యములను, వాని నన్నిటిలో మొదట 'శాకాబ్దములు సహస్రమును' అనియుండుటయు, ప్రస్తుతశాసనమందలి 'మాఘమాసము పూర్ణిమాదినమున' అన్నమాటలు, అమీనాబాదు శాసనమునందుంటయుఁ బోల్చిచూడ నీపద్యములు శ్రీనాథునిచే రచింపఁబడినవియని ప్రబలమైన సంశయము కలుగుచున్నది.

ఈసంశయమె నిజమైనయెడల శ్రీనాథుఁడు 1360 ప్రాంతములో జననమొందెను గనుక, నీశాసనమునాఁటికి రమారమి 17 ఏండ్లవయస్సు కలవాఁడుగ నుండవలెను. ఈకాలముననే సాధారణకవులే 16, 17 సంవత్సరముల వయస్సునఁ బద్యములు చెప్పఁగా శ్రీనాథునివంటి మహాప్రతిభాశాలి 13, 14 ఏండ్లనుండియే పద్యము లల్లుట యాశ్చర్యముకాదు.

ఈశాసనమును బట్టి చూడ శ్రీనాథుఁడు చిన్నప్పటినుండియు, పెదకోమటివేముని, ఆతనిమంత్రులు మొదలయినవారిని నాశ్రయించి, యచ్చటనే యున్నట్లు కానవచ్చుచున్నది. మొదట శ్రీనాథుఁడు బెండపూఁడి సింగన్నకు నన్నయగు ప్రెగ్గడయ్య నాశ్రయించి యుండును. తరువాత సింగయ్యకు నైషధమిచ్చినట్లు కానవచ్చుచున్నది. ఈయన్నదమ్ము లిద్దఱు నొకరితరువాత నొకరు పెదకోమటియొద్దను, పెదకోమటి వేమారెడ్డియొద్దను మంత్రులుగ నున్నట్లు తోఁచుచున్నది.

శ్రీనాథుఁడు క్రీ. శ. 1376 మొదలు 1420 వఱకును కొండవీడు రాజుల నాశ్రయించుకొనియే యున్నట్లీశాసనములవలనను, ఇతరశాసనములవలనను స్పష్టపడుచున్నది. పెదకోమటివేముని మరణానంతరముగాని కొండవీడునివాసము పూర్తిగ విడిచి వెళ్లియుండఁడు. నడుమనడుమ విజయనగరాదిసంస్థానములకుఁ బోయి తనపాండిత్యమహిమాదులఁ జూపి యుండినఁ జూపియుండును. పెదకోమటి వేముఁడు చిన్నరాజుగా నున్నంతవఱకు శ్రీనాథుఁ డచ్చటచ్చటక

వెల్లివెల్లి పరుల నప్పుడప్పు డాశ్రయించుచుండె ననియు, వేమునకుఁ గొండవీటి రాజ్యము వచ్చినతరువాత 'విద్యాధికారి' 'శాసనాధికారి' యై సంస్థానము నందు గొప్పయధికారి యై, భట్టారకుఁడై, సార్వభౌముఁడై యందలము లెక్కి తిరిగి వైభవ మనుభవించె ననియు తోఁచుచున్నది. వేమారెడ్డితరువాత నే యాతఁ డితరుల నాశ్రయింపవలసివచ్చెను. పెదకోమటి వేమునికిని, కాటయవేమాది రాజమహేంద్రమువారికిని వైర మున్నను, కవియొక్క యోగ్యతనుబట్టి వీరభద్రారెడ్డి మొదలయినవా రాతనికి నాశ్రయ మిచ్చిరి. వీరును బోయినతరువాత బ్రతికియున్నందున నీతఁడు చరమదశయందుఁ గష్టపడియుండును. ఇందును గుఱించి నిశ్చయముగఁ దెలిసికొనుటకు నింకను నెన్నియో శాసనములు బయటఁబడవలయును.

కొమర్రాజు లక్ష్మణరావు.

శాసనము.[1]

[మల్లుగూరికి ప్రతినామధేయ మైన అమీర్బాదాలో వున్న శాసనములు. మల్లుగూరమ్మ దేవాలయానికి వుత్తరం కట్టమీదను చక్కిఉన్న శాసన ప్రతిమ.[2]]

[సీ] శాకాబ్దములుసహస్రమును యిన్నూటని[3] తొం
బై[4] యెనిమిదియు నగుభవ్యసంఖ్య
గలిగి యొప్పారెడు నలవత్సరంబున
మాఘమాసము పున్నమాదినమున
విశ్వోత్తరుండైన వేమభూపాలుండు
దన[6]కులస్వామిని కమృతకిరణ
రేఖావతంసకు శ్రీమల్లుగూరమ్మ
కఖిలజగన్మాత కంగరంగ

1. శాసనము యథామూలముగ నిచ్చి, తప్పనితోఁచినచోట, ఒప్పు ఉద్దిన భాగుంటునని పులు అడుగునఁ జూపితిని. మూలశాసనప్రతిబింబము మనయొద్ద లేనందున గింసుపొరపాట్లు శాసనమందే యుండెనో, లేఖకునివో చెప్పఁజాలము. 2. ఇది ప్రతివ్రాసికొనిన లేఖకుని వరా. ప్రతి అని వ్రాయుటకు ప్రతిమ అని వ్రాసెను. 3. నిన్నూట. 4. గాఁడి. 5. స్వార్జితనా. 6. దను.

భోగసంసిద్ధికై ధారపోసి యిచ్చె,
గ్రామములు మూఁడు శ్రీకోటభూమియందు
పడిదరము మూలగూరమ్మ న[1]పల్కులూరు
దానఖచరేంద్రు డాచంద్ర తారకముగ. [1]

[సీ] క్రమపరిప్రాప్తసామ్రాజ్యసింహాసనా
ధ్యాసియై యఖిలరాజాధిరాజ
పరమేశ్వరుం డాదిపాదుండు పెదకోమ
టన్న వేమాధీశు డధిసురాఘ్యు[2]
[3]కూరిమిపినతండ్రి యన వేమభూపతి
సేసినధర్మ మూర్జితము గాగ
నీగ్రామములు మూఁటి కెల్లకాలంబు భో
గైశర్యసర్వమాన్యతలు నొసఁగి
నంబికకు మూలగూరమ్మ కఖిలజనని
కర్థి గట్టించె భువనమోహనము గాగ
సమధికోన్నతి నభ్రంకషంబు లైన
గుడియు ప్రాకారవలయంబు గోపురములు [2]

సూచన:—అమీనాబాదు నివాసులు గాని, గుంటూరుజిల్లా నివాసులును గాని, ఎవ్వరైన, చరిత్రయందును, వాఙ్మయమందును శ్రద్ధగలవారు, ఈ శాసనపుశిల యింకను, ఆ గ్రామమునం దున్నది లేనిది, ఉన్నయెడల దాని క్రింద 'శ్రీనాథు'ని నామము గలదో లేదో శోధించి యాంధ్రలోకమునకుఁ దెల్పుదురు గాక.

వా. ల.

1. రమ్మ. 2. 'డు' ప్రత్యయ మిచ్చటకావలెను. 3. ఇచ్చట యతిభంగమైనది. 'కూరిమి' కిబదులు వెనుకటి 'డు' కల్పుకొని 'మగుకీర్తి' అనియుండునేమో.

# గ్రంథస్వీకారము.

---

౧. ప్రాథమికప్రకృతిశాస్త్రము:— ఇదిపూర్వము చిత్తూరుగవర్నమెంటు ట్రయినింగుస్కూలునందును సైదాపేటగవర్నమెంటు ట్రయినింగుస్కూలునందును ఉపాధ్యాయులుగానుండిన శ్రీ. జె. విశ్వనాథయ్యగారిచే రాజకీయనిబంధనముల ననుసరించి రచింపఁబడి చెన్నపురియందలి టి. వి. చెల్లప్పశాస్త్రి అండ్ సన్సువారిచేఁ బ్రకటింపఁబడినది. ప్రకాశకులు దీని రెండుమూఁడుభాగములను బరిమత్తున కొసంగిరి. రెండవభాగము రెండవఫారమునకును మూఁడవభాగము మూఁడవఫారమునకును బఠనీయ మగునను తలంపున నుత్తరోత్తర విశేషములతో రచింపఁబడినది. దీని రెండవభాగమునందు ౭పుటలలో భారమితి ౧౮ పుటవఱకు ఖగోళమందుండు సూర్యాదిగ్రహములు వానిసంచారకాలమును ౩౬వ పుటవఱకు జలమును, పిడప జ్వాల, లవణములు, వృక్షములు, స్థలజలచరము లగుప్రాణివర్గమును గుఱించియుఁ జక్కఁగ వివరింపఁబడియున్నది. మూఁడవభాగమందు నీరీతిగనే విశేషవిషయములఁ జేర్చి వివరింపఁబడియున్నది. ఈగ్రంథములం జదువుట ప్రకృతిశాస్త్రజ్ఞానమును సులభముగ సంపాదింప మార్గము. ముద్రణ మంతచక్కఁగ లేదు. అక్షరములటనట ముద్దముద్దలుగఁ బడినవి. శైలి బాలురకు సుబోధము. వెల యొక్కొక్క భాగమునకును అ. ౧-౨. వలయువారు ప్రకాశకులకు వ్రాయవలయును.

౨. అద్వైతబ్రహ్మేశ్వరీతారావళి:— ఇయ్యది గుంటూరుజిల్లా చెఱుకుపల్లిలో సబ్‌రిజిస్ట్రారుగా నుండిన మ. శ్రీ. భువనగిరి కోదండపాణిగారిచే రచింపఁబడి మ. గుండు సూర్యానందతరహరిరావుగారిచేఁ బ్రకటింపఁబడినది. వెల అ. ౨. ఇందలి పద్యములు సంస్కృతపదజటిలములై దృఢశైలి నున్నవి.

శా. యోధాగ్రేసరఖడ్గసంజనితవిద్యున్నాట్యరంగంబునన్
సాధూత్తంసమహోపకారకరుణాస్వాంతప్రపంచంబునన్
స్వాధీనప్రతిభార్చితాద్భుతజనుః ప్రజ్ఞానకేళిన్ సమ
స్తాధారం బగునీరుచిం దెలిపెదో యద్వైతబ్రహ్మేశ్వరీ,

౧. కనినఁ గనినట్టులుండును గరుణ గదుర, వినఁగ వినినట్టులుండును వీను లలరఁ
గనఁగ వినఁగను దగుమమ్ముఁ గన్నతల్లి, కనవె వినదే విపన్నుల కల్పవల్లి.

౩. పసిపాప — ఈపుస్తకము శ్రీ కోదండపాణిగారిచేతను వారి సహధర్మచారిణి కీర్తిశేషయగు శ్రీమతి వేంకటలక్ష్మీవీరశేషమ్మగారిచేతను రచింపఁబడినది. ౮౮ పుటలగ్రంథము. ౧౦ భాగములుగ విభజింపఁబడినది. ఇందుఁ బద్యమాలిక లధికముగఁ గలవు. మొదటి ౫౦౧ పాదములు గల యుత్పలమాలిక కడుఁబ్రశస్యము. ఈపొత్తమునం దీదంపతులు తమచనిపోయిన పసిపాపనింగూర్చిన శోకము నతికరుణముగ వివరించిరి. తండ్రిగారి కవిత్వము పటుత్వమున నున్నది. తల్లిగారికవిత్వము మనను గఱఁగించుచున్నది.

ఉ. నాకనుగాంచు నీసొగసె నాచెవిగ్రోలెడు నీకథామృతం
బాఁకలి దీఱ నాహృదయ మారయు నిన్నమితో నితాంతచిం
తాకులసంభ్రమంబున నహర్నిశ లాశల రోసిరోసి యెం
తో కలఁగుం గనుంగొనవొ కో వినవో తలపోయవో కటా!

గీ. ఎందుఁబోయిన నెటఁగన్న నెందువినిన, నెందుశోయునింపమేల్గొన్నఁగందునిన్ను
గాని నీపల్కు నీకులు కేనుగానఁ, గానఁ బిలువ నిన్నెత్తికోఁ గానకుందు.

పుస్తకము వెల రూ. ౧. వెలమిగుల నధికమని తలంచుచున్నారము. వలయువారు గుంటూరిలోని జిల్లాకోర్టుప్లీడరు, బ్ర॥ గుండుసూర్యానంతనరహరిరావుగారికి వ్రాయవలయును.

౪. లక్షురూపాయలు:— ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము నను బంధగ్రంథమాలలోని ౫౧వగ్రంథ మగునీపొత్తము బ్ర॥ వేంకటపార్వతీశ్వరకవులచే నాంధ్రీకరింపఁబడినది. కథ యపరాధపరిశోధనవిషయము. ఇందు లోభము వలనఁ బాప మెట్లు సంభవించునో కథారూపమున వివరింపఁబడినది. ౧౫౮ పుటలు. శైలియాంధ్రులకుఁ జిరపరిచితమే. గ్రంథము వెల అ. ౧_౨.

౫. వీరపూజ:—ఆంధ్రప్రచారిణీగ్రంథమాలయం దిఱువదియాఱవ పుష్పముగఁ బ్రకటింపఁబడిన యీనవల వంగభాషనుండి బ్ర. శ్రీ. వేంకటపార్వతీశ్వరకవులచే నాంధ్రీకరింపఁబడినది. ఇందుఁ బితృమరణానంతరము పితృవ్యునిచే నిష్కాసితుఁడై యనేకబాధల ననుభవించి స్వసామర్థ్యమున నత్యున్నతకీర్తి నందినవీరశిఖామణి యగుప్రసాదుఁ డనునొకయువకుఁడు ప్రధానపాత్రము. పాత్రలస్వభావము యథోచితముగ వర్ణింపఁబడినది. ౩౦౬ పుటల పుస్తకము.

కాలికోబైండు. వెల రూ. ౧-౧౨-౦ లు. ఇదియు, లక్షరూపాయలను పుస్తకమును వలయువారు ప్రెసిడెంటు, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము, రాజమహేంద్రవరము, అనువిలాసమునకు వ్రాసి కొననగును.

ఆంధ్రవీరులు:—నవయుగతరంగములలో నిది మొదటియల. మ. శ్రీ. మల్లంపల్లి సోమశేఖరశర్మగారిచే రచింపఁబడినది. దీనికి శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డి ఎం, ఏ. గా రుపోద్ఘాతము రచించిరి. దానదయాధర్మయుద్ధముల కసాధారణోదాహరణము లగు ౧. గౌతమీపుత్ర శాతకర్ణి, ౨. కులోత్తుంగచోడదేవచక్రవర్తి, ౩. సిద్ధయతిక్కన, ౪. బ్రహ్మనాయఁడు, ౫. రుద్రాంబిక, ౬. ప్రతాపరుద్రదేవచక్రవర్తి. ౭. రాయనిభాస్కరమంత్రి యను నాంధ్రవీరసప్తక మిందువర్ణింపఁబడినది. ౨౬ ప్రసిద్ధచారిత్రికగ్రంథముల శోధించి వానియందలి పరమార్థములనేర్చి కూర్చిన గ్రంథమగుటచే నిది మిగులఁ బ్రమాణముగాఁ జరిత్రముం దెలుపు ననుట కేసంశయమును లేదు. అటనటఁ బ్రాచీనప్రబంధముల నుండి పద్యము లుదాహరింపఁబడినవి. శైలి సులభముగనున్నది. ౧౯౧ పుటలు. వెల రూ. ౧. వలయువారు ఎమ్. ఎస్. శర్మ, రాజమంద్రి, అనువిలాసమునకు వ్రాసికొనవలయును.

క. కావున నీపుత్త్రికి వసు, ధావలయమునందు వాఁడె తగు వరుఁ డిఁక నీ
వేవిధమును దలఁపక పృ, థ్వీవల్లభ యతని కిమ్ము వే యేమిటికిన్.

చ. అనుటయు రుక్మబాహువసుధాధిపుఁ డాప్తసుహృజ్జనంబుతోఁ
దనయవివాహకృత్య ముచితస్థితి నెంతయుఁ దెల్పి వారిచే
ననుమతుఁడై ప్రమోదమున నమ్మునినాథుని వెంటఁ జేదిరా
జునకు నిజాప్తమండలికి శోభనలేఖలు పన్ప నచ్చటన్. 17

[1]క. చేదిధరాధవుఁడును స, మ్మోదము రెట్టింప బంధుముఖ్యుల మగధే
శాదివసుధాధినాథుల, నాదరమునఁ బిలువనంపి [2]యతివేగమునన్. 18

[3]గీ. శుభముహూర్తంబునం దాత్మసుతయుతముగ
ధారిణీసురమంత్రము ల్బోరఁటాంద్ర
ధవళముల నాదములును వాద్యములరవళి
బోరు మని మ్రోయ నాత్మీయపురము వెడలి. 19

[1]సీ. పాదాతకరకుంతపటలఘూర్ణనధూతరథకేతువర్తికవ్రాతరజము
కూబరఘూర్ణనక్షుణ్ణవారణఘంటికాపద్ధరాగనికాయధూళి
నవ్యకక్ష్యాఘూర్ణనప్రోత్థహయగళార్పితధామమరకతరేణువితతి
పల్యాణఘూర్ణనప్రస్ఖలద్భటవహాళిరత్నగోమేధికవ్రజపరాగ
[4]మలమఁజిత్రాకృతిఁ దనర్చు నంబరంబు, తనకుఁ దిక్పద్మనయనలెత్తిన మెఱుంగు
లడరు మంజటివన్నెయుల్లడయనంగఁ, దనరనొయ్యనఁ గుండినమునకుఁ జనియె.

తే. అంతకు మున్న భీమవసుధాధిపసూతి చమూసమేతుఁడై
యెంతయు వేడ్కతోడ నెదురేగి రయంబునఁ దోడితెచ్చి గే
హాంతికకేళికావనమునందుఁ దగ న్విడియించి వారికిన్
సంతస ముప్పతిల్ల నుపచారవిధు ల్నవరించుచుండఁగన్. 21

ఉ. ఆవిధ మెల్లఁ బ్రాణసఖు లారసి వచ్చి యెఱుంగఁ బల్కఁ జిం
తావిలచిత్త యై కువలయాధిపునందన కూర్మిబోటిచే
నావనజాక్షుసూతికిఁ దదన్యకరగ్రహణానపేక్షయుం
గేనలసాహసైకనిజకృత్యముఁ దేటగఁ దెల్పి పంచినన్. 22

గీ. జనవరేణ్యనియత్నంబు వినినితాంత, దుఃఖితుండయ్యు నతఁడు వధూవయస్య
వచనములచేతఁ గొంతయాశ్వాసమంది, చైద్యబలసంకులారామసరణి వెడలి.

1. ట - లోనీపద్యము లేదు. 2. చ - యతిమోదమునన్. 3. ఈపద్యము ట - లో
లేదు. 4. చ - మఱలది త్రాకృతి.

క. ఆపృథ్వీరమణుండు పు, రోపాంతంబునకు వచ్చి యొకచక్కటి ల
క్ష్మపద్మముఖీసద్మము, లోపల నున్నట్టివిజయలోలుని గనియెన్. 24

చ. కనుఁగొని బాష్పపూరకలిక ల్కనుఁదమ్ముల నిండ డాయఁగాఁ
జనుటయు నాతఁడుం గదిసి చాఁగిలి మ్రొక్కిన గ్రుచ్చియెత్తి నె
మ్మనమున హర్షచిత్రములు [1]మల్లడిగొట్టుచునుండ నొక్కచో
ననితరవాస మైనవిమలావనియందు వసిం[2]చె నత్తఱిన్. 25

శా. శైనేయాత్మజుఁ డామురారిసుతు సాశంకంబుగాఁజూచి యో
యీ నిట్టూరుపు లేల వెల్లడరె మే నేలా కృశంబయ్యెఁ గన్
గోనల్ కెంజిగిఁబూనె నేమిటికి నాకుం జూడ నీతీరు విం
తై నేఁడిచ్చటఁ దోఁచె నీదువిధ మాద్యంతం బెఱింగింపుమా. 26

సీ. అనఁజంద్రభానుఁడిట్లనియె నాఁడుమయూరములఁబట్టుటకు మనముచనియడవిఁ
గవవాసి యొండొరుఁ గానంగలేక పోయిన నంతఁ జింత నే నిచటఁ జేరి
వీణారహస్యంబు వీరసేనునిగూడి తుంబురుచే విరితోఁటలోన
నభ్యసించుచునుండ నచటికిఁ గుముదిని యే తేరఁ గంటి నాయిందుముఖియు
ననువరించెద ననుచునుండఁగఁ దదీయ, జనకుఁ డాచైద్యసూతికి సంభ్రమింప
వారు నేతెంచి యావనవాటి విడియ, నేనచటువాసి వచ్చితి నిటవయస్య.

గీ. అనుచు నాద్యంత మేర్పడఁ దన తెఱంగు, దెలుప నాశ్చర్యవారిధిఁ దెప్పఁ దేలి
యామురాంతకసుతునితో న్నాత్మచర్య, విజయలోలుండు వలుకు సవిస్తరముగ.

మ. అటు లాబర్హిణము ల్బనం దదనుయాత్రారంభము ల్మాని యు
చ్చట నిన్నుం గనలేక ఖేదదళితస్వాంతంబుతోఁ గుందియు
ద్భటహార్యక్షమృగాదనంబు లగుకాంతారంబుల న్దైనసం
ఘటనం బాంధులఁగూడి యెయ్యనఁ జనంగాఁ గొంతకాలంబునన్. 29



## వర్షకాలవర్ణము

శా. హంసోచ్చాటనమంత్ర మంగభవసాహాయంబు కాదంబినీ
సంసద్వైశసనంబు భాస్కరతిరస్కారంబు ఘూర్ణచ్ఛటా
సంసారాపగమంబు పంకజతమిస్రావేళ విశ్వంభరా
పాంసుధ్వంసన మంబుదాగమము దీప్తంబయ్యె నుర్వీస్థలిన్. 30

1. చ - మల్లడిఁబెట్టుచు. 2. చ - వసింప.

చ. సముదమయూరికాగణము శంబరవైరిసితంబు లాడఁగా
సమయపుజక్కులీఁడు హరిచాపపుగోణముఁ దాల్చి మబ్బుజొం
పములను బెట్టిదంపుటురుమల్మొఱయించుచు మ్రోలనిల్పఁ బ్రా
ధమికపయఃకణార్ద్రవసుధాతలవిస్ఫురదూష్మధూపముల్. 31

[1] మ. అలజీమూతకిశోరకుండు నవవర్షాశ్రు ల్దిగంబాలఁ గ
ద్దిలుదంభంబునఁ బోరువెట్ట గగనశ్రీధాత్రి క్రొమ్మించుచే
తులచే నుగ్గిశ నొల్కి తచ్ఛకలసందోహంబు వర్షోపల
చ్ఛలన న్రాలెనొ కానిచోఁ గరఁగునే సంతప్తభూసంగతిన్. 32

మ. స్తనితంబు ల్విని భీతినభ్రతటినీచక్రాంగము ల్బెంకికిం
జనుచోఁ దద్రయవాతజాతహతపర్జన్యావళీసంధులం
గనఁగో నైన తదీయహేమమయపక్షచ్ఛాయలో నాఁగఁ బై
కొనియె న్దట్టముగాఁగ నెల్లకడలం గ్రొమ్మించు లక్కారునన్. 33

చ. తొలుకరి నంబుదాళి శరధోరణి నింపుచు రాజహంసమం
డలముల నాక్రమించిన వడంకి ధరంగలరాజహంసమం
డలములు [2]క్రౌంచగర్భమునఁ డాఁగె ఘనార్తి జనించె నేని నీ
చులకడ కేగరే నిజవిశుద్ధతఁ జూడక యెట్టివారలున్. 34

చ. హరిహయుఁ డభ్రవీధిఁ జెలువారెడు పచ్చనివిల్లు పాంథభీ
కరముగ నెత్తి తానసమకాండమహోన్నతిఁ జూప ధాత్రిపై
హరిహయహాషిఁ బూనిన యనంగుఁడు పచ్చనివిల్లు పాంథభీ
కరముగ నెత్తి తానసమకాండమహోన్నతిఁ జూపె నీసునన్. 35

క. ఎచ్చటఁ జూచినఁ దఱచై, పచ్చిక కన్పట్టె ధాత్రి బహుళాంబుదని
ర్యచ్చటులజలమయంబున, నచ్చగు శైవాలరేఖ లడరె ననంగన్. 36

[3] చ. సమధికవక్రలీలల దిశాతతిపైముఖఫేనకందళం
బుమియుచు [4]సింధుపుష్పటురవోద్ధతి మీఱి నవాగమాలికా
దమన మొనర్పఁగా నపుడు ధాత్రి వహించెఁ గదంబనూతనో
ద్గమకమనీయసూనకళికానికురుంబకశాప్రకాండముల్. 37

చ. విడువని పేలమై ఘనుల త్రేలఁగఁగట్టినరీతి వర్షముల్
జడిగొననానుచుం గుతికిలంబడి తెక్కలువిచ్చి పజ్జలన్

1. ఇదియుఁ బైమూఁడుపద్యములును "ట" లో లేవు.  2. క - క్రౌంచపుగమున
3. ట - లో నీపద్యము లేదు.  4. చ - సింధుబాలలురవోద్ధతి.

పడఁకెడు పిల్లలం బోదివి [1]వత్తులుగట్టినయట్టిమేనఁ దు
ప్పుడుగరుపాటఁ గోటరపుఁబొంతల డాఁగెఁ బతంగసంఘముల్. ౩౮

[2]సీ. అసటిలో దిగఁబడి విసికి వెల్వడలేక యెలుఁగెత్తిపాలమర్లఁ బిలుచువారుఁ
గఱియ రేవడిఁబదాగ్రములుజిఱ్ఱనజాఱఁ బ్రాంతభూజము లూఁతపట్టువారు
నెదురువానకుఁ దలయెత్తక యేగుచో ముందఱగానక మ్రొగ్గువారు
గొబ్బున జల్లు పైకొన్నఁ జెట్లను జేరి వంగుల్లు ఘనమైన వడఁకువారు
నయి ముడుగుజంబుగూడలఁ బయి ధరించి
మొక మొకించుక గానరా ముసుఁగువెట్టి
కేలనోరచ్చు [3]మడత్రాళ్లు ప్రేలుచుండ
నమ్రగతి నధ్వగులు త్రోవ నడచిరపుడు. ౩౯

## తిరుమలయాత్రావర్ణనము.

గీ. వార్షికదినంబు లిట్లు దుర్వార లీల, ధర విజృంభించు వేళఁ బాంధప్రతాన
సహితముగ నేను బెక్కు దేశములుగడచి, యంతఁ బోవంగ మార్గమధ్యంబునందు.

[4]సీ. అసశనవ్రతముచే నతులకార్శ్యంబునఁ గనుపట్టునొరిబిగములవారు
మ్రొక్కఁదీర్పుటకునై మూఁకమూఁకలుగూడి యేతెంచుతలమోపుటెంకలవారుఁ
ప్రాణముల్ పిడికిటఁబట్టుకయిట్టట్టు చెమలని [5]శిరసుకోడములవారు
దైహికాయాసంబు దలఁపక బొర్లుచు నడతెంచుపొరలుదండములవారు
నామటామటమ్రొక్కువారడుగునడుగు, దండములవారుమిగులసందడియొనర్ప
నవరి పన్నగసార్వభౌమాచలేంద్రుఁ, గొలువఁగోటానకోట్లు పెన్గూటమరుగ.

గీ. ఏను వారలతోఁ గూడి యెలమి దిగువ, తిరుపతికి నేగి యాళ్వారితీర్థవారిఁ
దానములుసల్పియుచితకృత్యములుదీర్చి, సంతసంబుననప్పురాభ్యంతరమున.

సీ. పైఁబొల్చు తోలుద్రోఁచుపడఁగయూరుపుఁ బొగల్నాభిపంకజమిళిందములు
ఘనతటగ్రావభాగంబున కాజానుఘటితహస్తం బజగరముగాఁగ [గాఁగ
మలఁచి తలాడగా నిలిపినవలకేలినఖరుచు ల్తాళికుందములుగాఁగ
నొరగాఁ గుడివంక కొఱగుకౌస్తుభరుచి శ్రీవత్సఘనతటిద్రేఖగాఁగ
ర్రాత్రిఁ బవలును జారు నేత్రద్వయంబు, పాదసంవాహనక్రియాపరవశకమ
[6]లోపతలకుముదాబ్జధీకారిగాఁగ, వేడ్కఁ బవళించియున్నగోవిందుఁగొలిచి.

---

1. చ - వత్తులఁపాత్తులఁగట్టిమేన. 2. ట - లో నీపద్యము లేదు. 3. చ - పెడవాళ్లు.
4. ట - లో నిదిమొదలు 45 - వ పద్యమువఱకు లేవు. 5. చ - సిరసుకొండెములవారు.
6. లోరుతరకుముదకీకన్యకారిగాఁగ.

క. చకచకలు గలుగు నలిమే, చకకచ లిరుగడలఁ గలుగు సౌధశిఖావీ
థికలు గనుఁగొనుచుఁ దత్పుర, నికటోర్వికి వచ్చి యుపవనీభాగమునన్.

సీ. చేమాకుతాళము ల్చెలఁగరొంములఁ జేతులుంచియందఱు వెక్కిరించికొనుచుఁ
బజ్జధూపమున దీపపుఁగోల రాఁజ హస్తముసాఁచి జేగంట చఱచికొనుచుఁ
దల యోరగిలఁ గ్రుంగి తప్పెట గతికి వాయించి గంగెద్దు నాడించుకొనుచుఁ
దిరువడిసానుల బెంసి గంటలు మ్రోయ జోడచప్పరముల నాడికొనుచుఁ
ద్రోవఁ గూర్చుండి [1]బొంతలు మ్రోలఁబఱచి
ముదురుటెండల కోరగా మునుఁగుఁ జేర్చి
పట్టెదండలు మొఱయించి పాడుకొనుచు
నలరు దాసర్ల వీక్షించి యాక్షణమున. 45

గీ. పంకజేక్షణు మురవైరి భక్తసులభు, వేంకటస్వామి వీక్షించు వేడ్క హృదయ
పద్మమునఁ దొంగలింప సంభ్రమము మెఱసి, యామహీధర మెక్కిలినట్టి వేళ.

[2]సీ. చెక్కుల మకరికా చిత్రము ల్గరఁగంగఁ గలయనూర్పుచు సారె నిలిచినిలిచి
కటులభారమున వెన్కకు వీఁగి యందంద [3]పతులయంసము లూఁతపట్టిపట్టి
తరులనీడలు చేరనరిగి నెచ్చెలి వీచు సురటి తెమ్మెరలకుఁ జొక్కిచొక్కి
పాదాబ్జములు తొట్రుపడఁగ జానువులూఁది యెక్కుడు నగ మెట్టు లెక్కి యెక్కి
వలుదగుబ్బలఁ జెమటలు వడియఁబయట
లుబ్బనొత్తుచు నుస్సని యూర్చియూర్చి
యలఁతఁ దూలుచు వ్రాలుచు నలఘుమార్గ
జలధిఁ దేలుచు సోలుచు జలజముఖులు. 47

ఉ. మందలుగూడి యెక్కి రతిమంజులవంజులకుంజమంజరీ
బృందమరందబిందులహరీబహురీతిసగీతినందదిం
దిందిరవందితుందిలనుతిప్రతికూజదళింపకందరా
మందసరజ్ఝరీఘుమఘుమధ్వనిజాలము శేషశైలమున్. 48

క. తళతళన వెలుఁగు నిందూ, పలఫలకవనీపతత్ప్రబలబహులహరీ
సలయఝరీవలయదరీ, నిలయసరీసృపఫణామణిద్యుతు లచటన్ 49

గీ. శబరకాంతాకుచాగ్రసంసక్తగైరి, కాంకనంబులు జనుల నట్టాఁచు నచట
ధాతుకృత్యంబులౌట చిత్రంబె వాని, కతనుభావార్ద్రకరశక్యప్రవృత్తి. 50

1. చ - బరౌలు. 2. ఐ - లో లేదు 3. చ - వరులయంసము.

సీ. నాళీకకాసారకేళీకలితనారనాళీకపత్త్రిరనాళికేర
మాలీనమకరందధూళీనతమిళిందకేళీనవానందశాలికుంద
మేలాలతాలోలదోలాలసమరాళబాలాలఘుముదాలవాలసాల
మాలాపయుగసంగఖేలాపరవశాంగలీలాపరవిహంగజాలరంగ
మమరవరతనుకరతనునమితసుమిత, మునితకలరవకులరవముఖరశిఖర
/ తిలకసురుచిరతరుచరగళితలలిత, మధురమధురసపాళి యాకుధరమాళి. 51

చ. ఉరుతరకందరానిపతితోత్పతదంబుఝరీలవంబులం
బరఁగు నుదగ్రఘోషమయి పాపవినాశన మానగంబు సొం
పరయఁగఁగోరి యేపతితులైన జడాకృతు లేగుదెంచినన్
సరసత నూర్ధ్వలోకము లొసంగుదు నేనని తెల్పుకైడిన్ 52

సీ. కమలాకరతఁ దామ యమరు నింతియ కాని క్రుంకువారికి సిరు ల్గూర్పఁగలవె
కువలయోద్ధతిఁ దామ కొలఁకులు నింతియ కాని చేరువారికి ధరఁ జేర్పఁగలవె
యుత్కళికలఁ దామ యొప్పు నింతియ కాని కనువారికి మువంబు లునుపఁగలవె
యమృతసంగతిఁ దామ యలరు నింతియ కాని తలఁచువారికి ముక్తిఁ దార్పఁగలవె
యితరతీర్థంబు లెందైన నీసరంబు
పగిది నని విశ్వభూజను లొగడ నన్న
గమునఁ [1]జెన్నొందు స్వామిపుష్కరిణియచటఁ
దానమొనరించి యుచితకృత్యములఁ దీర్చి. 53

క. [2]వారాహమూర్తికి నమ, స్కారం బొనరించి సంతసంబునఁ దత్కా
సారంబు వెడలి మురహరు, నారాధింపంగఁ దలఁచి యటఁ జన నెదుటన్.

సీ. ప్రాకారఖచితహీరప్రభాచయ దేవతాధునీబుద్బుదత్తారకంబు
గోపురేంద్రోపలాంకూరవిభాజాలయమునారథాంగదహాస్కరంబు
కేతుగోమేధికద్యోతసరస్వతీప్రాదినీశైవలదభ్రతలము
శిఖరాబ్జరాగరోచిఃప్రతానహిరణ్యవాహోత్పలన్నీలవారిదంబు
భక్తలోకైకభరణంబు పరమమహాని, కలుషసంతానహరణంబు ఘటితసుజన
నిచయసంసృతితరణంబు నిర్జరశర, ణంబు వేంకటపతిశరణంబు దనరె. 55

గీ. అట్టిమురవైరినగరికి నరుగుదెంచి, వితతభక్తిఁ బ్రదక్షిణవిధు లొనర్చి
యావరణదేవతలనెల్ల ననుసరించి, గర్భగృహమున కేగి యుత్కంఠ మెఱయ.

---

1. చ - చెలువొందు. 2. ట - లోనిదియుఁ బైపద్యమును లేవు.

సీ. ఇలఁజూపువలచేయి వెలిదమ్మికనుదోయిఁ జెలఁగువానిఁబయోధి మెలఁగువాని
దట్టిఁజేర్చిన వంకి గట్టుమీఁదటిజెంకిఁ దనరువానిఁ బురారి నెనరువాని
నెడమ పెందొడఁ గేలు నెడఁ జేరిచినయాలు నెసఁగువానిశుభంబులొసఁగువాని
నిండుబంగరుపట్టు కొండవంచినమెట్టు వెలయువాని శుకాత్మ నొలయువాని
చికిలిజిగిచుట్టుకత్తి జేజేలుబత్తి, నెఱపువాని సురారులఁ బఱపువాని [గీ.
వేంకటస్వామిఁగనుఁగొనివినయవినమి, తాంగవైఖరిమెఱయసాష్టాంగమెఱఁ

శా. కాల స్మత్తేగజాలు వేఁడిచలువల్ గ్రమ్మించుకన్డాలు కెం
గేలం బట్టినచుట్టువాలు నెడచక్కం గల్మిప్రాయాలు నే
వేళన్ భక్తులఁబ్రోచుమేలు తెలిదీవిం బొల్చుపెన్ప్రోలు ని
త్యేలం బాయనివేల్పుచాలు గలసామిన్ వెన్నునిం గొల్చెదన్. 58

శా. ఆర్తత్రాణపరాయణాయ భువనైకాధారభూతాయ సం
వర్తాంభోనిధిమగ్నభూభరణకృద్వారాహరూపాయ దో
ర్వార్తాభీతమహీసుతాయ శిశుతావ్యాపారనశ్యత్తృణా
వర్తక్రూరనిశాచరాయ దివిషద్వంద్యాయ తుభ్యం నమః. 59

చ. అని కొనియాడి తత్పదయుగాబ్జపవిత్రితతీర్థవారి లోఁ
గొని గతకల్మషుండనయి కోవెల వెల్వడి [1]బిల్వపాండవా
దినిఖిలతీర్థపంక్తుల క్షితిత్రిదశోదితరీతి భక్తి మ
జ్జన మొనరించి యర్ఘ్యవిధి సల్పి క్రమంబున నేగి చెంగటన్. 60

సీ. కేరిక్కరాఱాల నూరిననీ రేఱులై తూఱ నీరికలైనచోటఁ
గ్రేళ్లుబ్బి సెలలు దాఁకిననుర్లు నెత్తాల నలరుకానలఁదారు తలిరుఁగత్తి
ఱేని [2]బాబాలేఁతఱెక్కసోఁకులసారెఁ దలఁకునీరంబుల నొలుకుతెలిసి
రంబుతోఁ దనరనొరలుకన్నెక్రొన్నన తేనెసోనల నసలైన నేలఁ
దొలఁకుకొలఁకులకెలఁకులఁదళుకుగులుకు, నున్నతిన్నెలఁదరలకనూలుకొనిన
[3]కిన్నరకలకలంబుల కేకికరుతు, లూనుచుండెడు తుంబురుకోనడాసి. 61

లయగ్రాహి.
రేవగలు శీధిగల తీపసదీవిలయ కైవెఱచి పోవుటిరు లేవలసఁబ్రోవం
[4]గేవలముశీవిఁగను కావిమొలమావితలి రోవరుల సావిఁదగు లేవిరులలోసం

1. చ - ట - భిల్లపాండవాది. 2. చ - బాబాచాలు. 3. చ - ట - కిన్నరీకలకలములకేకి కురుత, కోకరతులూను తుంబురు కోనలోన. 4. చ - ట - గేవలముశీవిగను.

దావలముగావదరుపూవిలుతుమావుల విరావముల[1] తావులగుక్రోవులకుఁ గ్రేవం
దావితావబావిచలిరేవులసమీపమధుపావళివళావళులచే వెలయుత్రోవన్.
క. [2]కంజరజఃపింజరతరు, కుంజరటదళిస్వనానుకూలనిగుంజ
న్మంజీరపుంజరంజిత, మంజులసింజారవంబు మల్లడిగొనఁగన్. 63
శా. రావే యోవనమాలికా పొదలు చేరంబోకువే మల్లికా
యేవే బంతులు పద్మినీ యిచట లేదే తేనె వాసంతికా
తీవల్వ్రాఱకు చంద్రికా యఱవిరుల్దెమ్మిందిరా యంచువ
న్యావీథి న్విహరించు తొయ్యలుల వాక్యంబు ల్వినన్వచ్చెనన్. 64
శా. ఆనాదంబు హృదంబుజాతమున కాహ్లాదంబుఁ గల్పింప నే
నానాసూననికుంజపుంజములలోనం దూఱి యచ్చోటన
మ్లానామందమరందబిందురతిలీలాడోలబాలాళినీ
గానాధీననవీనసూనలతికాగారాంతరాళంబునన్. 65
శా. కర్ణాంతాయతనేత్రకోణరుచు లగ్రక్షోణిరా[3]జింప సౌ
వర్ణాంభోజముఁ గేలఁ ద్రిప్పుచు నటద్వక్షోజయై బాలికా
తూర్ణాందోళితడోలికాంతరమునం దూఁగాడు చొక్కింత సౌ
ఖ్యార్ణోరాశిఁ జెలంగఁ గంటి నని యత్యానందముం జెందుచున్. 66
క. ఏలాయతడోలాయత, లీలాయతసంబుకడ నళిభ్రమకరశో
భాలాలసఖేలాలస, బాలాలసమాన దృష్టిపథమున నిలువన్. 67
క. వనితాజనతావినుతా, ననతామరసంబు మలఁచి నను నాచెలి భా
వినితాంతావనితాంతా, వనతాంతాపాంగకోణవైఖరిఁ గనుచున్. 68
సీ. పలుచనిచెమటగుబ్బలనంటిమూఁపునఁ [4]దొలఁకుపయ్యెదఁ జక్కఁద్రోచిత్రోచి
పఱుఁడునూయెలలూఁచుతెఱవలకై మోముమలఁచినిల్వుమటంచుఁబలికిపలికి
చేరు లంటఁగఁ బట్టిచికిలిమట్టెలు మ్రోయనుర్వరమునివ్రేళ్ల నూఁదియూఁది
కౌను నిక్కఁగ నొండుకరమున వేనలిసవరించుచును దిగజాఱిజాఱి [లు
తత్తఱంబునఁబదములుతడఁబడంగఁ, బిఱుఁదువ్రేఁగునఁజిఱుదొడల్బెళుకదిశ
చెదరిచూచుచునూప్పులుచెదరడిగ్గి, యలరుటెలమావిపొదదండకరిగినిలిచి.
చ. అలరుల తేనెఁ[5] గ్రోలి తమి నాడెడు తేఁటుల ఱెక్కసోఁకుచే
నలఁతిగఁ బాయమైన తలిరాకులసందులఁ జిత్తజల్లుగాఁ -

1. చ - తావులకు. 2. కంజరజఃపింజరతర. 3. ఎ - రాజింప. 4. ట - దొలఁగు పయ్యెద. 5. చ - గ్రోలుతమి.

బాలయుఁగ నాపయిం జిగురుఁబోఁడి కటాక్షచయంబు నించెఁ బూ
విలు గొని పంచసాయకుఁడు వెంటనె క్రొవ్విరితూపులేయఁగన్. 70

క. మఱువెట్టి చూచు నేఁగ్ర, మ్మఱఁజూచినఁడాఁగుఁ జెంత[1]మగువలఁ గని నా
తెఱఁ గడుగు మగుడఁ గనున, త్తఱి నాకలకంఠి మన్మథవశాకృతి యై. 71

ఉ.[2]ఆయలివేణికి లెఱిఁగి యంతట నెచ్చెలి చేరి యక్కటా
యో యెలనాఁగ యింతతడ వొంటిమెయిం దరుణు ల్వనంబులో
నూయెలలూఁగు వేడుకల నుందురటే మనవారలెల్ల స
ల్లాయెడ నున్నవారు పదమా యని పల్కఁగ నాక్షణంబునన్ 72

గీ. సామిసందష్టశశియైనసైంహికేయు, నగ్రమునఁబూనితనరుమహాబ్దమునఁగఁ
గ్రాంతదంతనితాంతోగ్రకరముతోడఁ, గరముభీకరముగ[3]నొక్కగంధకరటి.

[4]సీ.కటనిస్సృతమదాపగావీచికణములకరణిఁ బైపైభృంగగణము లడర
గాఢఘూత్కారవే[5]గవిశీర్ణకుంభముక్తారీతి హస్తశీకరము లొలుక
సౌరధునీమధ్యసంభిన్నయమునానుకారియై రదయుక్తకరము దనర
సకలజంతుక్షోభసంధాయిధూమకేతుస్ఫూర్తితో నెత్తుతోఁక యమర
నోరనై శైలములఁ జెక్కులొరసి కొనుచుఁ
జేఁగఱచి సాఁకె నలుగుచు వేగ నరిగి
తరువు లగలించి యెత్తుచు దరివొడుచుచుఁ
గ్రూరగతిఁ దద్వనక్షోణిఁ జేరుటయును. 74

సీ. తద్ఘనాఘనఘనోద్ధత్యవిస్ఫూర్తికి హంసకప్రచయ మందంద తూల
నామహోదారసారంగంబురవళికిఁ గర్ణికాజాలంబు కంపమొందఁ
దద్దుష్టకుంభినీధవమాళిదుర్మదోగ్రతకు రత్నాకరరశన దలఁక
నామత్తమాతంగభీమవృత్తికి నగ్రహారనాయకమణు లవిసి చెదరఁ
గాను లసియాడ జఘనము ల్గదలఁ బాద
పద్మములు దొట్రువడఁ[6]గచభరము లులియ
నూరువులు సందడింపంగ నుత్పలాక్షు
[7]లెడనెడన పాఱి పఱవ నయ్యిందుముఖియు. 75

1. చ - ట - మగువఁబిలిచి. 2. చ - ఆయెలనాఁగ. 3. ట - వచ్చెగంధకరటి.
4. ట - లో నీపద్యము లేదు. 5. చ - వేగక్షురత్పుంఖ. 6. చ - గచభరములుగు-.
7. చ - ఎడనెడఁబఱవసంతె.

చ. ననుఁగని మున్ను కొంత దమినాటఁగఁ జూచుటఁజేసి లాఁతివాఁ
డనక మృణాలనాళమృదుహస్తము లెంతయుఁ జాఁచి కౌఁగిట
న్నినిచి యొకింతయుం దెలుపనేరనితత్తఱపాటుతోడఁ గో
పనమదహస్తి హస్తి యని పల్కెఁ దలంకుదొలంకుపల్కులన్. 76

ఉ. ఆపువుఁబోఁడి యీగతి భయంబునఁ గౌఁగిటఁజొచ్చి పల్క నే
నేపరిపాటినైనవగ నెంచక కేవలతన్మయానుమో
దోపచయంబుఁ గంటి మఱి యున్నదె ధాత్రి హతాదవాప్తమో
షాపరిరంభసంభ్రమజసౌఖ్యముకంటెఁ బ్రమోద మేరికిన్. 77

క. అడ లెడలఁబలికి యప్పుడు, జడియకు మని సారె వెన్నుఁజఱచి యెలమి న
ప్పడఁతుక నెత్తికొని రయం, బడరఁగ నేనొక్కకడకు నరుగుచు నెదుటన్.

ఉ. వామనతీర్థతీర మనివారణవారణవారణక్షణో
చ్చామహితప్రచార ముసారససారససారసంభ్రమో
ద్దామతరంగవారము సదానవదానవదానవర్జిత
శ్యామలమూర్త్యుదారము శుభావనభావనభావనారమున్. 79

క. కని యుత్కలికోజ్జ్వలమై, ఘనరససంభరితమై ప్రకంపనయుతమై
వనితామణిచిత్తముగతిఁ, దనరెడు నాసరసిఁదఱిసి తత్తీరమునన్. 80

సీ. పయినాడు తుమ్మెదపద్దువు క్రొంబొగలతోఁ బాటలకుసుమదీపములు వెలుఁగ
నానందనిభృతకీరాదిచిత్రములతోఁ బాయనిచిగురాకుపటము లెసఁగ
వ్రాలెడుగెలబోదెకీలుదామరలతో స్థూలరంభాతరుస్థూణ లలర
నకృదాగతార్కభాస్వర్ణశృంఖలలతో నలతెలిదీవయుయ్యెలలుదనర
నరుణకాంతాగ్నిపతితసితాభ్రధూపములు[1] వంచునొక్కపొదరింటలలనఁదార్చి
కురులెనయుదువ్వి చెమటార్చిసరులుదీర్చి,బుజ్జగించిముదంబునఁబొదలునపుడు.

ఉ.[2] ఆగజరాజ మన్యవిపినాంతవశావశచిత్తమై నిజే
చ్ఛాగతి నేగఁ దత్సఖులు చంద్రముఖి న్వెదకంగ వచ్చి త
ద్భాగమునందుఁ గన్గొని ముదంబునఁ దోడ్కొనిపోవ నావనా
భోగమునందు నిల్వ కెడఁబొక్కుచు నంగజుబారిఁ జిక్కుచున్. 82

సీ. తలిరుటాకులమీఁద నొలుకు తేనెలఁజూచి పల్లవాధరి లేఁతపలుకుఁదలఁచి
మెట్టుతమ్ములమీఁద మెలఁగు తేఁటులఁజూచి సరసిజవదన ముంగురులుదలఁచి

1. చ - నమరు. 2. చ - అగజరాజుమధ్యవిపినాంతవశావశచిత్తమై.

యసమదేవియమీఁద నలరుక్రొవ్విరిఁజూచి నతలతామధ్యమనాభిఁ దలఁచి
పువ్వుగుత్తులమీఁదఁ బొలయుపుప్పొడిఁజూచి గుచ్ఛవక్షోజపైకొంగుఁదలఁచి
తగులు నెగులును దిగులునుదత్తఱంబు, నలుకునులుకునుదలఁకును నాదరంబు
మనమునజనింపఁ దద్వనీమధ్యసీమ, నంగనామణి వెదకి కానంగలేక. 83

ఉ. వేగిరపాటుతో నపుడు వెల్వడి యొయ్యన శేషభూమిభృ
ద్భాగము డిగ్గి యాకులత దార్కొనుచిత్తముతోడఁ గుందుచున్
డోగెడఁగూడి యధ్వగులు దోడ్కొనివచ్చిననప్పుడేను ని
న్నీగుడిలోనఁ గాంచితిఁ జెలీ యని యంతయుఁ జెప్పివెండియున్ 84

సీ. గాజుకుప్పెలవంటి గబ్బిగుబ్బలుగోర నంటిన ప్రీలుఁగా యనుచుఁగొంకి
దిరిసెనపూవంటి తిన్ననిమై కేలనలమిన వాడుఁగా యనుచుఁ గొంకి
కంపచక్కెరవంటి కమ్మనివాతెఱ నానినఁగరఁగుఁగా యనుచుఁ గొంకి
చికిలియద్దమువంటి చిన్నినెమ్మోముమూర్కొ లడరినఁ గందుఁగాయనుచుఁ గొంకి
తళుకునెలకూన లునుపక తనివితీఱఁ, గౌఁగిలింపక కెంపులు గలుగ నిడక
నలరువలపులు గ్రోలక కందదకనుచు, నూరకేమోసపోయితి నోవయస్య.

క. అని యాద్యంతంబేర్పడఁ, దనవృత్తాంతంబుఁ దెలుపఁ దమ్ముఁడుఁ దానున్
జననాథవరాళి యొండొరు, ననునయమునఁ గలఁకఁదేఱునంతటి లోనన్.

## సాయంకాలవర్ణనము.

మ. కలయ న్నీడలు తూర్పుసాఁగె నళిను ల్కంజాతముల్వాసెఁ గొం
దలమందెన్, కపజక్కవ ల్తరణికాంతశ్రేణి చల్లారె మి
న్నులనేరెం బులుఁగు ల్చకోరికల అంతు ల్గాంత దీపించె ను
త్పలము ల్విచ్చె నినుండు పశ్చిమకుభృద్భాగంబున న్నిల్వఁగన్. 87

క. జలరాశి యనెడుబోయల, తలవారర చరమాద్రిపేరి తడికముఱువునన్
నిలిచి కిరణంపుటురి గో, లలఁ దిగిచెఁ బతంగమండలం బవ్వేళన్. 88

సీ. తొలుదొల్త వినవచ్చె నలఘుకోలాహలం బామీఁదఁదోఁచె వాద్యములరవళి
తమవాల నెత్తిఁజూపె దంపతీసింకారంబు నంతటఁ దులకించె సకలహంస
పిమ్మటఁ దలమయ్యెఁ బృథుకంచుకధ్వను లావెన్కఁ దనరెఁ దొయ్యలులపాట
పెద్దవ్రేసెను వారభీరునూపురరుతు లాపైనెగడె వయస్యానులాప
మప్పుడాయాదవాస్వయు లారవంబు, సారెనాలించి లగ్నమాసన్న మైస
ధరణినాథుండుతనయసింధగకుమ్రొక్క, ననిచెనోయసిభావింపనాక్షణమున.

కుముదిని లక్ష్మీమందిరమునకు వచ్చుట.

చ. ధరణితలేంద్రనందనవిధంబు గనుంగొనఁగోరి మున్ను కి
న్నరవరుఁ డిచ్చినట్టిభువనస్తుత మైనయదృశ్యవిద్య న
య్యిరువురు గుప్తమూర్తు లయి యుందుసహోదరిమందిరంబునం
దరలక యుండి రట్టియెడఁ దన్వియుఁ జేరఁగవచ్చి యచ్చటన్. 90

గీ. జనులఁ గంచుకినిచయంబు జడియ వేత్ర
ధరలతాంగులు కొంద ఱెచ్చరికఁ దెలుప
[1]బాల లిరువంకఁ గరములఁ బంజు లూనఁ
బోలఁతుకలు మ్రోలరాఁగ గోపురము సొచ్చి. 91

చ. జిలిబిలికమ్మఁదేనియలు చిల్కఁగఁ బల్కెడుపంచవన్నెరా
చిలుకలపంజరాలగమిచే నలరారెడు రంగమండపం
బలసత నెక్కి కూర్మిసఖు లందఱు వెంటనెరాఁ గరంబునన్
నిలుఁడని యడ్డగించి తరుణీమణి గర్భగృహంబులోనికిన్. 92

గీ. సారెనియమరహస్యస్ఫూర్జాచ్ఛలమున, నొంటినే తెంచి విజనమైయునికిఁ దెలిసి
రత్నమయ మగుతద్గృహద్వారముఁ జేర్చి, నళినగేహకు సాష్టాంగనతియొనర్చి.

క. ఈనళినగేహతనయుఁడు, కానను వలవంతఁ గుందఁగాఁ జేసెఁ గటా
యేసీసతి కిందులకై, ప్రాణము లర్పింతు ననుచు బద్ధోద్యమయై. 94

సీ. భవదాత్మజశిలీముఖవివర్ణితం బని తలఁపక కర్ణోత్పలము గాఁగఁ
ద్వత్తనూభవపృషత్కమలీమస మనియరయక లీలాముకురము గాఁగ
భవదపత్యశరసృష్టివిదారితం బని కనక కెంగేలిపంకజము గాఁగఁ
ద్వత్కుమారాశుగధారాత్యాకులం బని తెలియక పెంచినతీవ గాఁగ
నవధరింపఁగదమ్మ లోకైకజనని, కనుఁగవయుఁ గండతలము నాననముఁ దనువు
[2]పార్థివావయవముల పాల్పడక యుండఁ, బ్రీతి ననువులు నీకు నర్పింతుఁ గాన.

చ. అని యురిగాఁగఁ బయ్యెద నతానన యై నిజకంఠసీమఁ జే
ర్చినఁ గరుణార్ద్రచిత్త యయి చెందొవరాసయిదోడు చెల్లఁబో
నను నపకీర్తిఁ బాల్పడ నొనర్పఁగఁ జూచితి వంచుఁ గేలు కే
లునఁ గదియంగఁ బట్టి మదిలోని తలం కెడలంగ నిట్లనున్. 96

1. చ - బాలకియుడిగ్గి బతగాని పంజులూని. ట - పాలకీడిగ్గి జత గాలిపంజుపూని.

2. క - పార్థివావయవదయములుపడకయుండ.

శా. నాళీకాంబకు సారె దూఱుకొనుచు న్నాట్రొల్ల కేగెంచి[1] సీ
వీలా గేల వహింప నేఁటి కకటా యేఁజెల్ల నీసాహసం
బేలా పూనెద వమ్మ లాఁతి[2]వలె నీయిష్టంబుఁ జేకూర్చెనం
జాలుంజాలుఁ గలంక మాను మని యాశాచక్రమీక్షించినన్. 97

క. గ్రమ్మన నగ్రధరిత్రిని, దమ్మునితోఁ గూడివచ్చు తననాయకునిన్
సమ్మోదజలధిఁ దేలుచు, [3]సమ్ముద్దియ చూచి యావనతానన యైనన్. 98

ఉ. కోమలి నీదునెమ్మనము కోర్కి ఘటిల్లెఁ గదమ్మ భూవరి
గ్రామణి నీమనోఽంబుజము కాంక్షిత మబ్బెఁ గదయ్య యంచు నా
మృగనేత్ర యొండొరులచిత్తము రంజిలఁబల్కి భక్తరి
క్షామహనీయదృష్టి నలసాత్యకిపుత్రుని జూచి నెమ్మితోన్. 99

క. ఓవిజయలోల యిప్పుడ, తావకహృదయాబ్జవాంఛితము సేకుఱుఁ జిం
తావిలత వలవదని పూ, ర్వావస్థితి నుండె నంబుజాలయ యంతన్. 100

చ. చతురతరాంతరంగుఁ డయి సాత్యకిసూనుఁడు పల్కు నన్న యీ
యతివయు నీవుఁ గిన్నరవరాత్మనోజ్ఞరథంబుచేత ను
[4]ద్ధృతగతి నేగి పేరడవి రుద్రగృహంబున నుండు మేఁ దద
ర్పితనవకామరూపకళ పెంపున బిత్తరి నై శుభోన్నతిన్. 101

ఉ. పాలకి నెక్కి యేగెద నృపాలనిశాంతముఁ జేరఁ బోవుచోఁ
జాల నదృశ్యవిద్య మెయి జాఱెదఁ గ్రమ్మఱ మిమ్ముఁ జేరెదన్
శ్రీలలనాప్రసాదమునఁ జింతిలుకార్యము సంఘటించె నిం
కేల విలంబ మంచు నలయిర్వుర వీడ్కొని సంభ్రమంబునన్. 102

క. కాంతాకారముఁ గైకొని, యంతర్గేహంబు వెడలి యల్లన చెలువల్
ప్రాంతమునఁ గొల్వఁ బాలకి, యెంతయు ముదమొప్ప నెక్కి యేగెడువేళన్.

విజయలోలుఁడు పద్మినితోఁ భాషించుట.

ఉ. అంత నవంతిదేశపతి యశానుమవిందునిపుత్రి పద్మినీ
కాంత తదంబుజాననకుఁ గాదిలినెచ్చెలి గానఁ జెంగటన్
సంతసమొప్ప నేగుచుఁ బ్రసంగవిశేషంబునఁ బల్కరించి యా
కాంతమున నృపాలసుత యంచు నె[5]సాత్యకిపట్టి కెట్లనన్. 104

1. చ - ట - నీలాగార్తివహింప నేటికకటా దెసిఁగ్గు. 2. చ - వ... 3. చ - సమ్ముది
తను 4. యిరుపలసవడి. 5. చ - సాత్యకినూఁడు కిట్లనన్.

[1]చ. చెలియ వృథావిచారమునఁ జిత్తము నొంపఁగనేల యిట్టు లా
విలగతి నున్కి మేలె శుభవేళ మదిం గలవంత యేరికిన్
[2]దెలియక యుండు టొప్పదె సతీమణికి న్సఖియెవ్వ రేని యుం
గలకల నవ్వకుందురటె కామిని నీచరితంబుఁ గాంచినన్. 105

చ. సరసిజపత్రనేత్ర వెడచందము మానుము నీదుకోరికల్
తరళిక తెల్ప వింటి నిది ధర్మమె కూరిమి తల్లిదండ్రులే
వరున కొసంగిన [3]న్నుతలు వాఁడె విభుం డని [4]భక్తియుక్తవై
పరిణయ మాటగాక తమభావమునం గలవాఁడు గల్గునే. 106

ఉ. ఇన్నియుఁ బల్కనేల విన వే నిను నొక్కతె దూఱనేటికిన్
మున్ను మదీయచిత్త మొకమోహనరూపవిలాసధన్యుపైఁ
గన్నవిరాళిఁ జిక్కి రతికాంతుని బారికి సగ్గమయ్యె నో
కిన్నరకంఠి నీకు నెఱిఁగించెద సత్తెఱఁ గాలకింపుమీ. 107

సీ. ఒక్కనాఁ డే వార్షికోత్సవంబునఁ బొల్చు హరిఁ గొల్చుటకు శేషగిరికి నేగి
యుచటివినోదంబు లరయుచు నెచ్చెలుల్ గొలువఁగాఁ దుంబురుకోనఁ జేరి
[5]యొరపైన యాచెంత గురివెందపొదరిండ్ల లీల దోలాకేళిఁ దేలుచుండి
ప్రక్కన నత్తఱిఁ గమ్మవిల్తునిగెల్వఁ జాలిన యొక్కరాచూలిఁ గాంచి
పరమసమ్మోదమును జెంది మరలి యేగు
వేళ మదహస్తిఁ గనుఁగొని వెఱచి యతని
నలమికొని యుండఁగా బోటు [6]లంతవచ్చి
పిలుచుటయుఁ బాసి వచ్చితి నలరుఁబోఁడి. 108

గీ. నాఁటనుండియు నతని గానంగలేక
చింతఁ గుందెద నన మహీకాంతసుతుఁడు
బాపురే యగు నిదియ యా [7]పద్మనయన
యనుచుఁ గృతనిశ్చయుం డయి యబల కనియె. 109

క. ఆకాంతుఁ డిపుడు వచ్చినఁ, గైకొందువె యనినఁ దగుఁజె నను గనవత్రపన్
వ్యాకీర్ణముగా గద్గది, కాకులనిస్వనముతోడ నలనాలస్యన్. 110

ఉ. అక్కట చాలు నన్ను నిఁక నాఱడివెట్టకు వమ్ము యాతనిం
జిక్కని కౌఁగిటన్ బిగియఁ జేర్పఁ బురాకృతపుణ్యవాసనం

1. ట - లో నీపద్యము లేదు. 2. చ - దెలుపక. 3. చ - ట - సతులు. 4. చ - ట - భక్తియుక్తిమై. 5. చ - ట - గుబురైన. 6. చ - ట - లరయవచ్చి. 7. చ - పద్మగంధి.

దక్కు మ ఱేల కల్గు ననిన న్వని డాయఁగఁ బిల్చి మక్కువన్
గ్రక్కున భీరువేషముఁ దెరల్చి నిజాకృతిఁ[1] బూని యల్లనన్. 111

సీ. పల్లకీగాలి చెఱఁగు లోపలకుఁ దిగిచి, నెలఁత నీకనుఁగొన్నట్టి నృపసుతుండు
నేనసుమ్మని గుఱుతు లెన్నేని నొడివి, తన తెఱంగుఁ గుముదినివిధమ్ముఁ దెలిపి.

క. ఆవనితయు నచ్చటకుం, దావచ్చినవిధము దెల్పినఁ బ్రమోదమునన్
భూవల్లభుఁ డిఁక మనముం, బోవలయు నటంచుఁ బల్కెఁ బొదలినలజ్జన్.

[2]ఉ. లేనగ వొప్పఁ జేయునది లేక సతాననయైన నామహీ
జానియు నోలతాంగి మొగసాలను వెల్వడి నీవు నిల్వు మే
లోనికి నేగి యెట్లయిన లోఁగక వెల్వడి వత్తు నంచు డెం
దానఁ దొలంకు సంతసమునం జెలరేఁగుచుఁ బోయి యచ్చటన్. 114

[3]చ. మగఁటిమి మీఱ సాత్యకికుమారుఁ డదృశ్యతఁ బూని పాలకిం
డిగి మొగసాల వెల్వడి వడిం బ్రియఁ దోడ్కొని నర్మదాతటిన్
నగతనయాధినాథభవనంబునకుం జని కాంచె నందుము
న్నగ రథమెక్కి తద్వరతనూమణిఁ దెచ్చిన యన్న నయ్యెడన్. 115

మ. తరుణు ల్వెల్వడి యిట్లు పోవుటయు సంతాపంబున న్భీమభూ
వరపుత్రుం డరయించి కానక క్రుధావ్యగ్రాత్ముఁడై యుండఁ ద
త్సరణిం గన్గొని యాక్షణంబ దమఘోషక్షోణిభృత్పుత్రుఁ డున్
మరలెం బుత్త్రునితోడ సైన్యములతో మాహిష్మతిం జేరఁగన్. 116

ఉ. అప్పుడు కిన్నరార్పితశతాంగలలామమునం గుతూహలం
బొప్పఁగ నెక్కి యయ్యువతియుగ్మముతో యదువంశవల్లభుల్
చప్పుడు సేయ కేగి రతిసాంద్రవనీనిచయంబు లేర్లు బల్
తిప్పలు పక్కణంబు లవలీలల దాఁటి మనోరయంబునన్. 117

క. అత్తఱి వారల మనములఁ, దత్తఱము శమించురీతిఁ దమ మడఁగె మదిం
గ్రొత్తగ ననురాగము చిగు, రొత్తుగతిఁ బురోనురాగ ముజ్జ్వల మయ్యెన్.

చ. సకలజగన్నివాసుఁ డగు శౌరికుమారుని పెండ్లి యంచుఁ బ
క్షికులరవంబు చే నెఱుఁగఁ జేసి కరస్ఫురణా[4]ధరేశపం
క్తికి నరుణాంకురాక్షతతతిం దగ నీఁదొలుగట్టు టొజ్జ గై
రికమయపాత్ర మెత్తె నన టెక్కు లగొంగ తనర్చెఁ దూర్పునన్. 119

1. చ - దెల్పియల్లనన్. ట - బూనియిట్లనున్. 2. చ - ట - లో నీపద్యము లేదు.
3. ట - లో నీపద్యమును దీనితరువాతి పద్యమును లేవు. 4. చ - ధిగీశపంక్తికి.

గీ. అట్టియెడఁ గాల్యకృత్యంబు లర్హగతినొ, నర్చి యాయదువీరనందను లమంద
రథరయంబున నలసినరాజముఖుల, నూఱడించుచు నేగుచో నొక్కచోట.

[1]సీ. మును గురంగములఁ గోసినరచ్చచట్రాలఁ బేరిన పచ్చికస్తూరివలపుఁ
బులితోళ్లపై నారఁబోసిన రక్తార్ద్రకరిశిరోముక్తాళిఁ గదురుకంపు
పరుసతో ముంగిళ్ల గుఱుజిడ్డువెన్నలు గరఁగింపఁబొడమెడుకమ్మఁదావి
కఱివన్నె నెఱిజల్లికప్పుపందిళ్లపై నెండెడు నిప్పపూనిండుగబ్బు
[2]సమదశబరప్రణీతసంకుమదసార, చిక్కణంబై యమరు నొక్కపక్కణంబుఁ
జేరి తదధీశుఁ డొసఁగు సత్కారములకు, నలరి తగుమందిరంబున నధివసించి.

ద్వారవతికిఁ జంద్రభానుఁడు శబరుని బంపుట.

ఉ. మంతనమాడి యాదవకుమారకు లచ్చట నుండువాని న
శ్రాంతగతిప్రసిదు నొక[3]శాబరునిం బిలిపించి యాత్మవృ
త్తాంతము తేటతెల్లముగ నంతయు వ్రాసిన విన్నపత్రముల్
సంతసమొప్పఁ జేతికి నొసంగి హరిం గనఁబొమ్ము నావుడున్. 122

[4]సీ హృదయప్రమోదవారిధిబుద్బుదంబుల గతి మేనఘర్మాంబు[5]కళిక లొల్క
నతితీవ్రగతి కేన యని పెక్కె మెత్తుతెఱంగున దట్టిచెఱంగు నిగుడ
దృఢతరస్ఫీతకు ధాత్రియొసంగుకావునా నడుగునఁ బాంసువు లతిశయిల్లఁ
దనుఁగూడవచ్చు గంధవహంబు బంధించిగెలుతునన్గతి ముష్టికేలు దనరఁ
బార్శ్వముల సారెనల్లాడు పంచెకట్టు, కోకకొంగులు వేగానుకూలఘటిత
విపుల[6]పక్షద్వయస్ఫూర్తి వెలయుచుండ, రయసముద్ధతిమీఱి ద్వారవతిఁ జేరి.

మ. నడువీథి న్వడిగాలఁ దానరుగుచుండ న్విస్మయంబంది య
య్యెడఁ బౌరు లని యాడనాడఁ గుములై యేవార్త యేవార్త యం
చడుగం బల్కఱు మేలుసుద్ది యని [7]యత్యంతంబుగాఁ బల్కుచున్
వడిఁ బద్మాక్షుహజారముం గదియ నానందంబుతోఁ బోవుచున్. 124

సీ. కూచిసేయింపఁగాఁజూచె నందమొ యేల చైద్యుఁ డెఱుంగఁడే శార్ఙ్గలతిక
వెలిగుడారంబుల నిలిపెనందమొ యేల బాణుఁ డెఱుంగఁడే బంధురగద
దాడివెట్టుటకునై తలఁచె నందమొ యేల నరకుఁ డెఱుంగఁడే నందకంబు
గడిదుర్గములమీఁద విడిసె నందమొ యేల సాళ్వుఁ డెఱుంగఁడే చక్రధార

1. ట - ఈపద్యము లేదు. 2. చ - నమరశబరీప్రణీత. 3. చ - శైబకునిం. 4. ఇది మొదలుగ మూఁడుపద్యములకు ట లో "వాఁడునుంజని" యనువచనము గలదు. 5. చ - కణిక అమర. 6. చ - పక్షద్వయంబున. 7. చ - సువ్యక్తంబుగా.

యిం దొకటియైనఁ గానరాదేమొ కాని
పూనుకొని మేలు దెల్పెడు వీని తెఱఁగు
లనుచుఁ దనుఁజూచి ముదిమంత్రు లాడుకొనఁగఁ
దనరుకక్ష్యాంతరంబుల దాఁటి యేగి. 125

## కృష్ణుఁడు చంద్రభానున కెదురుచనుట

ఉ. కమలదళాయతాక్షుసముఖంబునకుం జని మ్రోల విన్నప
త్రము లిడఁ దత్కుమారలిఖితస్వశుభోత్తరవాచికంబులం
బ్రమదముగాంచి వానికి నపారధనంబు లొసంగి యారమా
రమణుఁడు పుత్రదర్శనపరత్వర నప్పుడ తేజి నెక్కినన్. 126

సీ. విడిగాల శౌరితత్తడి వెన్క నేతెంచె నగతులఁ జేఁబూని చారుచంద్రుఁ
డందంబుగాఁగ నైదాఱుగుఱ్ఱములతోఁ గదలె వేగమున సంకర్షణుండు
వడిఁ దెమ్ము తెమ్మని యడిదమ్ముఁ గైకొని పరువున నరిగె జాంబవతిపట్టి
పడివాగె హరిమ్రోలఁ బట్టి కీరపతాణి నెక్కి ముంగల నేగెఁ జక్కనయ్య
వెలుపటిహజారమున నుండి వెలినె వెలినె, చేత బెత్తంబుఁ గైకొని సేననెల్ల
వెడలుమని చెప్పి పంపుచు వెన్నునెదుట, హరిగెనీడల నడచె [1] గదానుజుండు.

మ. హరి యిట్లేగినమాట వింట తడ వార్తావాసము ల్వేల్వడం
ద్వరసాత్రమ్రాణుల సాదు లడ్డముగఁ ద్రోవం బట్టి రా నెక్కి యెం
డొరుల స్మీఱ హుటాహుటిం గదలి రత్యుత్కంఠ నల్లుండ్రు సో
దరులుం బుత్రులు చేర నచ్యుతుని గోత్రాపాంసువుల్గ్రమ్మఁగన్. 128

[2] సీ. ఎదురైనవారల నేత్రోవ హరియేగె నని సారె కడుగుచు నరుగువారు
గ్రక్కునవీథులఁగన్గొనికొలువుమ్రొక్కులుమ్రొక్కి వెనువెంట [3] వెలలువారుఁ
దమవారిఁ బొడఁగన్న దట్టికైదువులు గైకొని తెమ్మనుచుఁ గూడఁ [4] జనెడువారు
రాజేగనేమొ రారా నీవు రమ్మని యొండొరుఁ బిలుచుచు నుఱుకువారుఁ
ద్రాళ్లువైవక దంతులఁ దఱుమువారు, సిడెము లెత్తక రథముల నడపువారుఁ
బల్లణింపక హయములఁబఱపువారు, సైనబలములు తోఁకచాలగుచుఁ గదలె.

క. చనఁ జన నటఁ దోడ్తోవెను, కొని [5] కోట్లుం గొండలగుచుఁ గూడుచు నడచెన్
వనమాలి వెంట వాద్య, ధ్వనిఁ గులశైలములు వడఁక ధర యూటాడన్.

1. చ - బలానుజుండు. 2. ట - లో సీపద్యమును దీని క్రిందిపద్యమును లేవు.
3. చ - కూడువారు. 4. చ - గనుచువారు. 5. చ - కోటులుగా కొండలగుచు.

శా. శ్రీకాంతుం డిటు లేగుదెంచె నని సంప్రీతిన్ హితు ల్దోఁప ను
ల్లోకానందముతోడ నావిజయులోలుం గూడి సత్యాసుతుం
డాకంజాక్షు నెదుర్కొన [1]న్వెడలి డాయన్వచ్చెఁ దో శాబరా
నీకంబు ల్నలువంకలన్ బలసి యున్నిద్రస్థితిం గొల్వఁగన్. 131

ఉ. వచ్చి వినీతితో దనుజవైరికిఁ జాఁగిలి మ్రొక్కి సీరికిం
బచ్చనివింటివానికి నమస్కరణం బొనరించి భక్తితో
నచ్చట నున్న పెద్దలపదాంబురుహంబుల వ్రాల నందఱున్
గ్రుచ్చియుఁ గౌఁగిలించికొని కూరిమి దీవన లిచ్చి ర య్యెడన్. 132

మ. నతరత్నానిధిశౌరి పక్కణము చెంత న్వేలమున్ డించి యు
న్నతదివ్యాంబరమండపాంతరమున న్సద్బాంధవశ్రేణితో
నతులస్ఫూర్తి వసింపఁ దత్సకలవృత్తాంతంబు చారు ప్రయో
ద్ధతులై తెల్పిన రుక్మబాహుఁ డనువిందాన్వితుఁడై చెచ్చెరన్. 133

క. ప్రియబాంధవవర్గముతోఁ, బయనం బై వచ్చి దనుజభంజను బలదే
వయుతుం బొడఁగని మ్రొక్కుచు, నయమంజులఫణితి నాజనార్దనుతోడన్.

ఉ. ఏముఖలంబునుం దెలిసి యిచ్చటికిం జనుదెంచినార మిం
కేమియు నానతీవలవ దిప్పుడు మామన వాలకించి దే
వా మముఁ బ్రోవు పుత్రులవివాహ మొనర్పఁగ నేగుదెమ్ము గా
రామడర న్మదీయనగరంబున కే మిట లాఁతివారమే. 135

[2]క. అని [3]నయము నెనరు దొరలం, దనకును విన్నప మొనర్చు ధరణీశుల మ
న్ననఁ జూచి యపుడు సాత్యకిఁ, [4]గనుఁగొని యాతండునట్ల కాఁ దెలుపుటయున్.

గీ. సకలసేనలు గొలువ నాశార్ఙ్గపాణి, రాజసంబునఁ గుండినరాజధాని
డాయవచ్చినమునుమున్న పోయిరుక్మ, బాహుఁడు బిడారములును లుపాలమర్చి.

[5]సీ. అపరంజివాకిళ్ల నడఁట్టులో యిడుపుల నెసఁగుపచ్చలడాలొ యెఱుఁగరాదు
బంగారుటిండ్ల దీపంబులో గోడల వెలుఁగుకెంపులడాలొ తెలియరాదు
జాళువాలోవలజల్లులో క్రొణిగెల వలరువజ్రపుడాలొ యరయరాదు
పసిఁడిమోవరుల ధూపంబులో సోరణగండ్లనీలపుడాలొ కానరాదు
మేలిమిహజారముల వన్నెమేలుకట్లొ, చిత్రమణికాంతులో విభజింపరాదు
అనఁగఁ జనునొక్కనగరున [6]నపుడులీల, వనజనాభుని విడియించె మనుజభర్త.

1. చ-దలఁచి. 2. ట-లో నీపద్యమునకుమాఱుగ "అనిన" అను వచనము గలదు. 3. చ-ప్రియము. 4, చ-గనుఁగొనసాలండునట్లకానిమ్మనియెన్. 5, ట-లో లేదు. 6, చ-సభిపులీల.

చ. కళిగలజేవరత్నములు గండపుమ్రాఁకులు పంచవన్నెచి
ల్కలు పఱుగోవకస్తురి కళాచి పునుంగు జవాది చాఁదుప
ట్టెలు పలువన్నెకోకలు పటీరము నిండ మెఱుంగుజాళువా
పంకలు నించియున్న యులుపా పొలుపారఁగ నాదరించుచున్. 139

[1]క. వనమాలి యాంనృపులు వెను, కొనిరా మోదమునఁ గొలువుకూటంబునకుం
జని కూరుచుండి వారల, కనియె న్మందస్మితంబు లంకూరింపన్. 140

క. వైవాహికలగ్న మొకటి, యీవేళం గలుగునేమొ యిప్పుడ తెలియం
గావలయు ముహూర్తజ్ఞుల, రావింపుఁ డటన్న వారు రప్పించుటయున్. 141

క. బ్రాహ్మణులు కొంద ఱపుడా, జిహ్మగపర్యంకుని గదిసిరి "యోనైతాం
బ్రహ్మణ" యనుమంత్రమున న, జిహ్మాతమంత్రాక్షతములు శిరముననిడుచున్.

క. వారలకున్ భక్తి నమ, స్కారం బొనరించి గరుడగమనుఁడు మీరీ
చేయువ లగ్నమ్మొకటి వి, చారింపుఁ డటన్న వారు సంతసమొసఁగన్. 143

క. విని కొంతతడవు తమనె, మ్మనముల నూహించి నేఁడు మా పొకలగ్నం
బను వైనది గల దది యో, వనజేక్షణ దంపతులకు వాంఛిత మొసఁగున్.

క. అని తనకుఁ దెలుప విప్రులఁ, బనిచిన ననువిందరుక్మబాహులు హరిచే
ననుమతులై వేగమ తమ, తనయలఁ దోడ్కొనుచుఁ జనిరి తత్సమయమునన్.

## వైవాహికయత్నము.

సీ. ఈడాపునీలాలగోడలమృగనాభికోదారచర్చ సహోక్తిఁ దెలుపఁ
గలువడాల్గలకెంపుమళిగెల మాల్యరక్తోత్పలంబులు విశేషోక్తిఁ దెలుప
వరుస సూత్రపురాల[2]వలలెత్తుసౌధవీథుల కేతుపటము లత్యుక్తిఁ దెలుపఁ
బుష్యరాగపుహర్మ్యములమీఁదికలశంపుఁటుదిరిచాయలు స్వభావోక్తిఁ దెలుప
నధికృతులు రుక్మబాహుని యాజ్ఞరాజ, ధానిఁ గైసేసి రప్పు డెంతయుఁ దదీయ
లక్ష్మి మేనఁ జతుర్విధాలంకృతులను, దానుమారిఁగాంచు వేడుకఁ బూనెననఁగ.

ఉ. కంసవిరోధి యాసతిని గర్గమునిప్రముఖు "ల్తదేవల
గ్నం సుదినం తదేవ" యనఁగా శుభకాంచనపీఠనుంచి యు
త్తంసముఖాచ్ఛభూషణకదంబ మొసల్చి మృదంగకాహళీ
సంసదుదారనాదము లెసంగ సతు ల్కవగూడి పాడఁగన్. 147

1. ట-లో నీపద్యము లేదు. 2. చ - తేరలెత్తు.

మ. వలయవ్రాతము పైకిఁ ద్రోఁచి పదము ల్వాటంబుగా [1]నూఁది తే
ఱలుఁగుం బయ్యెదకొంగుఁ జెక్కి యలఁతం జేమార్చుచు న్నమ్రయై
బెళుకుంగౌను గురుల్చలింపఁగ నరుల్పింపిల్లుగూయం దమిం
దలయంటెం జెలి యోర్తు వేడ్కనఱగంటం జొక్కు రాచూలికిన్. 148

చ. కెలన నొకర్తు బంగరపు గిన్నియఁ జందన మూని నిల్వఁగాఁ
గలయఁగఁ బెన్నెఱు ల్పులిమి గంధము పైఁ జిలికించి గోరుము
క్కుల దిగదువ్వి చేఁ బిడిచి కోమలి యోర్తు కరాంబుజద్వయీ
లలితసువర్ణకంకణకలధ్వని వీనులవిందు సేయఁగన్. 149

మ. తళుకున్బయ్యెద జాఱఁ జన్నుఁగవ చెంత న్నించుడాలీను కు
చ్చెల కొంగు ల్గుదియించి తంబుగలఁ జేచేఁగొంద ఱందీ నొసల్
కలయ న్వేపథుపూన నూర్పు లడరంగా వేడ్కతో నొక్కనె
చ్చెలి కంసాంతకసూతికిన్ జలకమార్చెన్ [2]గాంగతోయంబులన్. 150

క. కడకొంగు ముడిచి తలపా, వడ యొకచెలి చుట్టె నొక్కవనిత తనువునం
దడి యొత్తెఁ జలువదుప్పటి, పడఁతి యొకతె యొసఁగె నానృపాలాగ్రణికిన్.

ఉ. ఒక్కలతాంగి కైయొసఁగె నొక్కవధూటి కిరీటిపచ్చలా
ముక్కలిపీఁటవెట్టె నొకముద్దియ కుంచియ వైచె వెండ్రుకల్
చిక్కడలించె నొక్కకలశీకుచ తొయ్యలి యోర్తు జాళువా
చక్కని బెజ్జపున్ బరణిసందుల ధూపము గొల్పె మెల్పునన్. 152

సీ. కుఱుచకచంబులు గూడఁగూడఁగదువ్వి యొఱపుగా సిగవైచె నొకవధూటి
పలుదెఱంగులకదంబపుఁబూవుబెత్తులు చుట్టెఁ జుట్టుగ నొక్కసూనగంధి
జీవరత్నంబులు చెక్కినసంపెంగ [3]మొగ్గ తాయెతు లొక్కముదిత చేర్చెఁ
బన్నీటఁ బదనైనపైగోవకస్తూరితిలక మొయ్యన నొక్కతెఱవ దీర్చెఁ
వెలఁది యొక్కతె కుంకుమకలప మలఁదెఁ
దరుణి యొక్కతె గొజ్జంగినురటి విసరె
మగువ యొక్కతె జిలుఁగుధూమ్రంబుఁ జిలికె
సుదతి యొక్కతె సుసుసోఁగయొంటు లిడియె. 153

క. చెలి యొకతె పచ్చపట్టెల్, బలసిన బిదుహేళి సెసరిగెపని పైఠానీ
చలువ యుఱచట్టఁ దొడిఁగెన్, సలలితగతి నొకతె కడకశలుఁ ముడివైచెన్. 154

1. క - మెట్టుచున్. 2. చ - గంధతోయంబు. 3. చ - తాయిత మొకతె వింతగ నమర్చె.

గీ. రమణి యొక్కతె పీతాంబరంపుఁగుళాయిఁ
బెట్టె దంతంబుదబ్బ చేఁబెట్టె నొక్క
చెలి నెఱుల్ చక్కఁగాఁ ద్రోఁచె లలన యోర్తు
కేల నవరంజిగొలుసులు గీలుకొలిపె. 155

క. నీలంపుమేను సూత్రపు, రాలకనుంగవయుఁ బుష్యరాగపుఁదేనుల్
క్రాలెడి చొక్కపుఁదుమ్మెద, తాళియ నొకతేమ పేరెద న్నెలకొలిపెన్. 156

గీ. కట్టికమృగేక్షణ ల్సముఖా యనంగ
నొకతె గొబ్బునఁ గైదండ యొసఁగ లేచి
నిలుచుటయుఁ బైఁటచెఱఁగుల జిలుఁగుచంద్ర
కావిపచ్చడ మతనికిఁ గట్టె నొకతె. 157

క. క్షితినాథుని ముంగల నొక, యతివయుఁ దా మంచినిలువుటద్దము నిలిపెన్
లతకూన యొకతె యాదవ, పతిసుతునకుఁ గప్పురంపుబాగా లొసఁగెన్.

గీ. ఈవిధమున నుచితశృంగారములు దాల్చి
యలరుసుతుని బిలువు మనుచు నపుడు
దానవారి వేడ్క నానతీ నంపంప
చెలులు సంభ్రమమునఁ బిలువఁ బిలువ. 159

చ. కులుకుమెఱుంగుక్రొంబికిలికుచ్చుల దంతపుఁ బావ లొక్కతొ
య్యలితొడిగింప మెట్టి మణిహంసకనాదము మించ నొక్కపై
దలి కయిదండఁ బూని వనిత ల్సముఖంబొనరింప నిండుచు
క్కలదొరలీలఁ బెండ్లిచవికం గదియం జని కూరుచుండినన్. 160

క. ఆరాజన్యకుమారుని, [1]కారాదభిలోలకంకణాంకురితరుచి
ద్వైరాజ్యరాజితంబుగ, నీరాజనమెత్తి రసితనీరజనయనల్. 161

ఉ. లోలవిలోచన ల్విజయులోలుని నట్టుల శౌరియానతిం
జాల నలంకరించి రతిసాంద్రశుభోన్నతి నంత నచ్చటన్
బాలికలం దదీయనరపాలు రలంకృతిసేయఁ బంచినన్
నీలకచామణు ల్కుముదినీసతిఁ గొందఱు చేరి రింపుగన్. 162

సీ. చెలువ మున్నేఁచిన యలులసంపెఁగ తేనె నానుచుగతి నొత్తునూనె యంటఁ
గలికి యొక్కతె మరుకైదువు జల్లికూఁకటిగింజ లిడుగతి నటకలిడియె

1. చ - కారాఘనమంజుకంకణాం.

గనపబంగరుశలాకను జాజునట్టించు పగిది నొక్కతె మేనఁ బసుపుఁబూసెఁ
నెలదీవెఁ బోఁదున నిలిపి నీరార్చులాగున నొక్కతె మజ్జన మొనర్చె
[1]నెలమిఁ గుముదిని నూరార్ప నలసి జిలుఁగుఁ
జంద్రికలఁ జేర్చుగతినొర్తు చలువ లొసఁగెఁ
గలికిపురి నెమ్మినిడుపోఁగ గఱులుసివురు
చెలువున నొకర్తుపెన్నెఱు ల్చిక్కువుచ్చె. 163

క. తెలిగను నెలపులుఁగుంబిలు, కలుపొవలన్ మేతఁ[2]మరపఁగా నడుమం గ్రొ
న్నెల మొలకనిలిపెనో యనఁ, దిలకము కపురమున నొకతె దీర్చెం జెలికిన్.

క. లీలావతి యొకతె శ్రుతి, శ్రీలు సుముఖవిధుని కెత్తఁ జేకొనునను ము
త్యాలారతులో యనఁగా, బాలికకు మెఱుంగుఁగమ్మపంజులు చేర్చెన్. 165

క. మెలపున నిశ్వాసమరు, త్కలమధురామృతముఁ జేఁదికొనుటకు జాళ్వా
గొలుసులఁ దీర్చిన పటికపుఁ, గలశంబన నొకతె నాసికామణి యిడియెన్.

గీ. మెఱుఁగుఁదీఁగె తళుక్కన మించు కంధ
రాంచలంబున నుండి శైలాగ్రమునకు
జాఱు నాసారములు వోనిసరులు వైచె
నువిదయుఱుతఁ గుచంబుల నొరయు నొర్తు. 167

క. చెలిమోము మనుకలువలచెలి, యలకావళి పేరి రజని నలమికొనఁ గరం
బులు సాఁచెనో యనంగాఁ, గలికి యొకతె యునిచె బాసికపుఁబూదండల్.

గీ. ముదితయొక్కతె విధుమణిముకురమెదుట, నిలుపనచ్చటఁ దొయ్యలినీడ యడరి
విమలదుగ్ధపయోనిధి వెడలునట్టి, లచ్చిరూపంబు నచటఁ దలంపఁ జేసె.

క. ఈరీతిని ననువిందుకు, మారికఁ గైసేయఁబనిచి మాహూర్తికవా
క్ప్రేరితుఁడై వైదర్భుడు, హీరమణుఁడు వచ్చి లగ్నమెఱఁగించుటయున్. 170

ఉ. అండజరాజవాహనసుతాగ్రణి పాండురవర్ణభద్రవే
దండము నెక్కి కల్పకలతాంతసరగ్రథితాతపత్త్రముల్
నిండిన తారకేందుతతి[3]నింగి ఘటింప మృదంగభేరికా
చండఘణంఘణధ్వని దిశాకుహరంబుల నాక్రమింపఁగన్. 171

సీ. గంధతైలాపూర్ణకరదీపకోటితో నరనాథమకుటరత్నములు వెలుఁగ
హైమరథోత్కీర్ణ యంత్రపుత్రికలతో వైమానికాంగనావళి నటింపఁ

1. చ - కుముదినీకాంతనలరింపఁగోరి. 2. చ - బెట్టఁగా. 3. చ - తారకేందురుచి.

ప్రసవతోరణరణద్భ్రమరగీతములతోఁ బుణ్యసాధ్వీగానములు సెలంగ
వందివైతాళికవ్రాతసన్నుతులతో యతిశ్రేష్ఠాశీర్వాదరుతు లెలర్ప
ననఘ శుభవస్తుపూరితకనకపాత్ర, పాలికలతో సువాసినుల్ స్త్రీల నడుమ
నుద్ధవాక్రూరబలముఖ్యయుక్తుఁడగుచు, యదుకులాధీశ్వరుఁడు వెంటనరుగుదేర.

క. అలఘుతరశ్రీఁ గదిసిన, నెలమి నెదుర్కొని విదర్భనృపుఁ డతని పదం
బులు గడిగి భర్మమయని, ర్మలపీఠిక నునిచి యొసఁగె మధుపర్కంబుల్. 173

చ. గవిసెనఁ బూనినట్టిరతికాంతునికార్ముకవల్లియో యనం
బవిరిముసుంగు వెట్టి నలుపజ్జఁ జెలింగులు కూడఁబట్టుచుం
గువలయలోచన ల్చవికకుం గొనితెచ్చిరి వెంట నైదువల్
ధవళముఁ బాడ భోజవసుధావరరాజతనూజ నత్తఱిన్. 174

గీ. కుముదినీచంద్రభానుమధ్యమున నపుడు, తళుకువెన్నెలపగిది బాంధవచకోర
కోటియుప్పొంగ శ్యామానిగుంభనమున, దీపితంబైన వలిపట్టు తెఱయొసంగె.

ఉ. సంవిదపారగౌరవవిచక్షణు లైనధరాసురేంద్రులే
వంవిధభద్రవేళ శుభవస్తులఁ బేర్కొనుచు "స్వధూవరా
భ్యాంవరదాభవం" తనుచు హర్షమునం బులకాంకురావళీ
సంవృతగాత్రుఁ డైననృపచంద్రున కెంతయు నెచ్చరించుడున్. 176

శా. శ్రీరామారమణాత్మజన్మునకు లక్ష్మీనందనాకారరే
ఖారమ్యోజ్జ్వలరూపధేయునకుఁ దత్కన్యాశిరోరత్నముల్
ధారాపూర్వముగా నొసంగె నలవైదర్భుండు కంసారి కం
భోరాశీంద్రుఁడు లచ్చినిచ్చుపగిదిం బూర్ణానుమోదంబునన్. 177

శా. నారీరత్నము చారుహస్తకమలాంతఃకర్ణికా కేసరా
కారంబు ల్గుడజీరకంబు లిడియంగాఁబట్టి మంజీరముల్
గేరన్ గ్రక్కున నిక్కి భర్తతలపైఁ గేల్సాఁచి నిల్పెన్ "ధ్రువం
తేరాజావరుణోధ్రువ" మ్మనుచు ధాత్రీనిర్జరు ల్పల్కఁగన్. 178

క. గాంగేయగాత్రిగళమున, మంగళసూత్రంబుఁగట్టె మాధవసుతుఁ డా
నంగాధిరాజ్యమున కెనఁ, గంగట్టిన తోరణంబు క్రమము దలిర్పన్. 179

మ. చరణంబు ల్ధరనత్తమిల్లఁగ నుదంచన్మధ్యనీవీపరి
స్ఫురణ న్నాభి యొకింతదోఁపఁ గుచము ల్పొంగార దోర్మూలభ
ర్మరుచు ల్మించులమించ నించెఁదలఁబ్రాల్ రాజాస్య తత్తన్మనో
హరతాదర్శన నమ్రుఁడైన పతిపై యత్నానపేక్షంబుగన్. 180

శా. ప్రఖ్యాతాగమ[1]మంత్రరాజములు పైపైఁ గుంభినీదేవతా
ముఖ్యు ల్విన్ప వరుండు తన్మృదుపదాంభోజాతసంస్పర్శభూ
సౌఖ్యశ్రీ నడిపించె సప్తపదము ల్సారంగశాబేక్షణ
“సఖ్యం సాప్తపదీన” మన్పలుకు డెందాన న్విచారించుచున్. 181

ఉ. రాజతనూజయుక్త యయి రంజిలి వేలిమి వేఁడివేల్పులో
లాజలు వేల్చె భోజసుత లాలితసాంధ్యగభస్తిఁ దారకా
రాజిఘటింప బాలదినరాజసమేతవిభాతలక్ష్మికిం
దాజతయై ప్రఫుల్లముఖతామరసస్ఫురణంబు మించఁగన్. 182

సీ. దివ్యసేవ్యారుంధతీవసిష్ఠాదిదంపతులు దీవన లిచ్చి రతులఘణితిఁ
బ్రార్థితసాంగవేదాఖిలక్షితిసురోత్తము లభీష్టముగాంచి రమితగరిమ
యదువిదర్భాన్వవాయవిధేయబంధువర్యులు వీళ్లుచదివించి రుచితవృత్తి
మహితోత్సవాయాతబహుదేశరాజచంద్రులు విందులుభుజించి రలఘులీలఁ
బ్రబలగాయకనర్తకపాఠకాద్య, నేకవిద్యాధురీణు లీహితముఁ బడసి
రుర్వి లక్ష్మీశ్వరుఁడు సేయునుత్సవంబు, సకలభువనాద్భుతోన్మేషశాలి గాదె.

క. ఈమాడ్కిన యనువింద, క్ష్మామండలనాథునింట సాత్యకితనయ
గ్రామణిపాణిగ్రహణ మ, హామహితోత్సవము సాంగమై విలసిల్లెన్. 184

ఉ. ఆతఁడె రుక్మబాహువిభుఁ డాత్మనుతాకరపీడనోత్సవా
యాతసమస్తదేశవసుధాధిపచంద్రుల నంచె సత్క్రియా
జాతవినూతనప్రమదసాంద్రులఁ జేసి యనూనదానవి
ద్యోతితపంచశాఖ విజయోత్సవతేజితపంచశాఖియై. 185

సీ. మణిరాజధరవంశ్యమండనంబునకునీమణులుయోగ్యములంచుఁ బ్రణుతిసేయఁ
గరివరావనవిచక్షణసత్కులేంద్రున కర్హంబులీకరు లనిగణింపఁ
హరిమహోదయనూతనాసమహారికి నీహరు లుచితంబులం చభినుతింప
నగణితకాంతాప్రియకుమారమదనున కనుఁగావలీకాంత లని తలంప
ననదృశామూల్యరత్నగంధాంధహస్తి
మల్లసామ్రాణికాశ్వరంభానిభాభి
రామరామాతతుల నిచ్చె మామ యహిమ
భానుసమభానునకుఁ జంద్రభానునకును. 186

1. చ - మంత్రనాదములు.

గీ. మఱియు బహువిధరత్నసంపద లొసంగి
యపుడు నిజకన్యఁ బ్రియునింటి కనుపఁదలఁచి
రాజమణి బుజ్జవమునఁ జేరంగఁబిలిచి
యాదరోదారమృదులవాక్యములఁ బలికె. 187

క. శ్రీభర్త మామ యలస, త్యాభినుతసమాఖ్యయత్తయఁట తత్సేవా
వైభవ మెప్పుడుఁ గలదఁట, నీభాగ్యం బేమిచెప్ప నీరజనయనా. 188

ఉ. చిన్నటనాఁట నీకరకుశేశయముంగని పెద్దలెల్ల లో
కోన్నతదివ్యజాతిమహిమోజ్జ్వలయౌ నని పల్కుపల్కు నేఁ
డెన్నికకెక్కె సర్వభువనేశ్వరుఁడైన యుపేంద్రు[1] కోడలై
కన్నియ పారిజాతకలికావహనార్హత నీవు గాంచుటన్. 189

గీ. ఇనవిముఖవృత్తి కలనైన నెనయకమ్మ, యెంచుదోషాభిముఖ్యంబుఁ జెందకమ్మ
కన్నవారికి నతిచిత్రగరిమగలుగఁ, గుముదిని హితాళులకు విందుఁగూర్పవమ్మ.

క. అని పలికి నృపతి కన్నియ, ననుపమతరవైభవమున ననుపఁ బ్రియసుహృ
ద్వినుతహృదయారవిందుం, డనువిందుఁడు నట్లయనిచె నాత్మజనంతన్. 191

మ. ప్రమదాయుక్తకుమారరత్నములతోఁ బ్రత్యగ్రగంధేభవా
హమహాస్యందనవస్తుసంపదలతో నానందసందీప్తబం
ధుసుహృద్భృన్నివహంబుతోఁ గతిపయాదూరప్రయాణంబులం
గమలానాథుఁడు వచ్చె ద్వారవతికిం గౌతూహలాన్వితుఁడై. 192

క. ఆవేళఁ జంద్రభానుని, దేవేరిం జూచువేడ్క దీపింపఁ బురీ
కేవలమధ్యలు మణిసం, భావితసౌధంబు లెక్కి పలికిరి తమలోన్. 193

చ. పొలఁతుకఁ జూడరమ్మ గడివోవనిచక్కఁదనంబు తెమ్మ చెం
గలువలకోరికాని కయికానిక ముద్దులగుమ్మ నిండుచు
క్కలదొరనిగ్గుతోఁ గరువుగట్టినపుత్తడిబొమ్మ వాసనల్
గలవిరికొమ్మ యిట్టినవలా నవలా యొకబాలపోలునే. 194

చ. తలవలచుట్టువచ్చుఁ గనుఁదమ్ములు తమ్ములు గండుమీలకుం
దళతళవొల్చు నంగములతావులు తావులుకమ్మపూలకుం
గళతులకించు పెందుఱుముకప్పులు కప్పులుమబ్బురేలకున్
మెలఁతుకగుబ్బచన్నుఁగవమించులు మించులు బొమ్మరాలకున్. 195

1. క - కోళ్లవై.

చ. కలువల నేలవే వెడఁదకన్నులు చన్నులు పైఁడికుండలం
గెలువఁగఁజాలవే చికిలికెంజిగి క్రొంజిగురాకు రేకుఁ లేఁ
దళుకులఁ దోలవే మృదుపదమ్ములు [1]దమ్ములునించుచొక్కపున్
వలపులఁబోలవే వదనవాసన లీసునయప్రచారకున్. 196

సీ. కోకముల్ శశిమ్రోలఁ గూడ లేవనుచెట్లు శశిమ్రోలనిదె కూడెఁ జక్రయుగము
చీఁకటు ల్రవిదీప్తిఁ జేరలే వనుచెట్లు రవిదీప్తినిదె చేరెఁ బ్రబలతమము
ఆళులు సంపెఁగలచెంతలఁ జేర వనుచెట్లు సంపెంగ నిదెచేరె షట్పదములు
కమలము ల్కరికేలఁ గడునొప్ప వనుచెట్లు కరికేల నిదె యొప్పె సరసిజములు
నాననము చన్నుఁగవయు సీమంతమణియుఁ
దుఱుము నాసయుఁ గనుదోయి తొడలు చరణ
పల్లవంబులు ననుపేరఁ బరిఢవిల్లెఁ
జూడరే యింతు లిదియెంత చోద్య మరయ. 197

చ. అని పొగడ న్యదుప్రవరుఁ డాత్మకుమారుల నానవాబ్జలో
చనల గృహప్రవేశశుభసంపదఁ బెంపువహింపఁజేయ వా
రును గురుదేవతాభజనరూపమహాచరణం బొనర్చి త
ద్ఘనతరభద్రసూక్తుల సుఖస్థితిఁ గైకొని రంత నొక్కెడన్. 198

సీ. [2]వరుల నెంతయుఁ జెన్నువలఁ దేల్చుప్రతిమలకురువిదూరజరుచుల్ తెరలుగాఁగఁ
జెలువలమ్రోల దేశినటించు ప్రతిమల [3]కరుణాశ్మదీప్తిదీపార్చిగాఁగ
రమణులతో వసంతములాడుప్రతిమల కలఘువజ్రమరీచి కొలనుగాఁగఁ
గాంతులనవ్యసంగతికుల్కు ప్రతిమల కింద్రనీలచ్ఛాయ లిరులుగాఁగ
నధిపుల వరించుప్రతిమల కమితహాగిత
మణిగభస్తులు దూర్వాంకమాల్యములుగ
నొనరు కేళీగృహంబున నున్నయయ్య
దూద్వహకుమారకుని యుల్ల ముల్లసిల్ల. 199

క. కడుఁ బ్రార్థింపఁగఁ దగుజను, లడుగడుగున కెత్తులిడఁగ నలఁతిదివియఁగా
వెడవిల్తు తేరు నడచిన, వడువున సతివచ్చెఁ గనకవసనావృత యై. 200

చ. వనితలచాఁటునన్ శుభనివాసముసొచ్చి మఱుంగుచేరిని
ల్చినయది గావునం దరల లేమి యధీశునిమ్రోల సిగునం

1. క - దేహమునిండుకాంతితో. 2. క - వరులచెక్కులకళల్వాలదెల్పు. 3. క-కరుణాశ్మ
దింభోళికళలుగాఁగ.

జనకుఁడటంచు నానయిడఁజాలమిఁ గన్యక కన్నుసన్నలం
బెనఁగఁగఁ గార్యగౌరవము పేరున నేగిరి బోటులయ్యెడన్. 201

సీ. రాజమండలజయప్రౌఢిఁ బెంపొందు నీవదనాబ్జ మున్నతిఁ బొదలఁదగదె
యతనుకళారూఢి నడరునీకనుదోయి నవదర్శనశ్రీ లొనర్పఁదగదె
సరససారసరాగసంపత్తి నలరు నీనునుమోవి మినుకుల నునుపఁదగదె
పటుగిరీశఖ్యాతిఁ బరఁగునీకుచయుగ్మ మపగతాంబరవృత్తి నమరఁదగదె
మృదులతాలక్ష్మి నెనఁగునీ[1]మేన్నదీయ
వాంఛితఫలార్పణంబున వఱలఁదగదె
యనుచు నతిమంజులోక్తుల ననునయించి
సమధికోత్కలికాంచితస్వాంతుఁ డగుచు. 202

చ. అనుగుణరాగసంఘటన మాఱడిచెందకయుండ శోభనాం
కనుకరప్రవాళరుచిఁ గాసిలకుండ గ్రహించి యొయ్యనో
య్యనఁగలభామినిం దిగిచి యంకముసేర్చి ప్రవీణుఁ డాతఁడిం
పున సడలించెఁ గంచుకము బోరునమించె నలంక్రియారుచుల్. 203

శా. భావోజ్జృంభణము ప్రసాదయుపరీపాకంబు నవ్యధ్వని
శ్రీవిస్ఫూర్తియు మించె నాతిదృఢసంశ్లేషైకబంధాప్తితో
నావైదర్భి ప్రసన్నవృత్తి మృదుశయ్యం గూర్చి సాహిత్యమ
ర్యావిర్భావధురీణుఁడై యలరె సత్యానందనుం డెంతయున్. 204

సీ. రత్నహర్మ్యముల జంత్రపుబొమ్మలనుఁగుచెయ్వులొనర్పఁగాఁ బుట్టునొక్కకినుక
నవవనంబులఁ దీవలివురుకేల్సాఁచి శుకోక్తిఁ బిల్వఁగఁ బుట్టు నొక్కకినుక
కేళీగిరుల నభ్రపాళీతటిద్రేఖ లొఱపుచూపఁగఁ బుట్టు నొక్కకినుక
దీర్ఘికాంతములఁ బద్మినులు తుమ్మెదచూపు లొనరింపఁగాఁ బుట్టు నొక్కకినుక
తక్కఁ దక్కినకినుకలఁ జిక్కువడని
మమతలఁదలంపు లీడేర్చుకుముదినీవి
శాలలోచనఁ దాఁగూడి చంద్రభానుఁ
డనుపమానందసామ్రాజ్య మనుభవించె. 205

శా. ఈమాడ్కిం గుముదిన్యరాళగమనాహేలామహోల్లాసియై
భామానందనుఁ డొక్కనాఁడు హరియుం బ్రద్యుమ్నుఁడు న్మెచ్చ వీ

1. చ - కుసుమదళి.

ణామానిం బచరించి తుంబురునినల్నం గన్నగాంధర్వవి
ద్యామాహాత్మ్యముఁ జూపి [1]శౌరినుతుఁడై తాల్చెం గృతార్థత్వముల్. 206

మ. వితతధ్యానమదాలసాతనయనిర్విప్రాయవిప్రాయన
ఘృతశంకాకరభక్తశోభనవిరాజన్మాయజన్మా యతి
ద్యుతికామప్రతిసంఘసంఘటితయోగోపాయ గోపాయనో
ద్యతమూర్త్యాస్మదఖండభాగ్యసముదాయచ్ఛాయ యచ్ఛాయదా. 207

క. విశ్వనుతశశ్వదణిమా, దైశ్వర్యవిశేషధుర్య యఘుపాదవపా
రశ్వధికవర్య సాఘా, ద్విశ్వంభరతాకృతార్యవిస్మయచర్యా. 208

భుజంగప్రయాతము. భవాద్యాభిగద్యాత్మపద్యానవద్యా
నవాధ్యాత్మవిద్యానిషద్యాప్తవేద్యా
యవిద్యార్తివైద్యాయవిద్యాయహృద్యా
భవోద్యాననద్యాభవద్యాంబుపద్యా.

గద్యము. ఇది శ్రీమద్దత్తాత్రేయయోగీంద్రచంద్రచరణారవిందవంవనసమాసా
దిత, సరసకవితారసోదాత్త దత్తనార్యసోదర్య మల్లనమంత్రివర్యప్రణీతం బైన
చంద్రభానుచరిత్రం బనుమహాప్రబంధంబునందు సర్వంబునుం బంచమా
శ్వాసము.

1. చ - తద్వినుతుఁడై.